# చంపకమాలిని

## (నవల)

---

తిరువళ్ళిక్కేణియందలి లేడీ వెల్లింగుడన్ ట్రెయినింగు కాలేజిలో
సంస్కృతోపాధ్యాయినియు, చంద్రమౌళి మొదలగు గీర్వాణగ్రంథములకును,
సుధానిప్రాసాదము మొదలగు తెలుగు, కన్నడగ్రంథములకును
రచయిత్రియు నగు

శ్రీమతి ఆ. రాజమ్మగారిచే

రచియింపబడినది

---

ప్రకాశకులు:

ఎ. యస్. శివ అండు కో., ఎపయూరు, మద్రాసు

1929



[వెల రూ. 1-0-0.

# అంకితము

—(౦)—

ఆంధ్రనారీమణుల

హస్తకమలములయం దీగ్రంథమును

సమర్పించుచున్నాను.

ఆ. రాజమ్మ.

# ఉపోద్ఘాతము

నా హైందవ సోదరీమణుల కంకిత మొనరించిన [illegible] పుస్తకమును వ్రాయుటలో నా మనంబునఁ గొన్ని యుద్దేశ్యములు జనించినవి. నాకుఁ దెలిసిన వినోదకథను జనులకు తెలియఁజేయుటయే కాక కథలోనిపాత్రలగుణములను మనము గ్రహించిన ట్లైన, గొప్పకుటుంబములోఁ బుట్టియుండినవారుగాని మఱియెవరుగాని స్త్రీలు వారికిఁ గల స్వాతంత్ర్యమును చతురతతో నుపయోగింపవలె నని తోఁచును. తమ యజ్ఞానము వలన తెచ్చిపెట్టుకొన్న నిర్బంధమువలన నెట్లు కష్టపడునదియును దెలిసికొనవచ్చును. గొప్పకుటుంబములలోని స్త్రీలు సేవకులకు స్వాతంత్ర్య మియ్యఁగూడ దనుట తెలియనగు. దీని నామూలాగ్రముగ చదివి చక్కఁగా పరిష్కరించిన నా చిర పరిచితులును, కడప హైస్కూలు తెలుఁగు పండితులు నగు బ్రహ్మశ్రీ, విద్వాన్, కావ్యాలంకారతీర్థ, జనమంచి సుబ్రహ్మణ్య శర్మగారికిని, ముద్రణదోషములను శ్రద్ధతో సవరించిన ఆంధ్ర

పత్రికా కార్యాలయోద్యోగి యగు మ-రా-రా-శ్రీ, బుక్క-పట్టణము రామానుజయ్యగారికిని నావందనము లర్పించెద.

మ-రా-రా-శ్రీ, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, వారు పరోపకారమునకై చేయు నానావిధ కార్యములయందు స్త్రీవిద్యాభివృద్ధికిఁగూడ సహాయము చేయవలె నను మహాశయము గలవారై వారి స్వకీయముద్రాక్షరశాలయం దీగ్రంథము నుచితముగా ముద్రింపింపక యున్న, నియ్యది జనుల నేత్రముల కగోచరమై యుండును. ఇమ్మహోపకారమునకై వారికి నా కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచునాను.

ఆ. రాజమ్మ.

# చంపకమాలిని



## ప్రథమాధ్యాయము



సంధ్యాకాలము, పశ్చిమదిగ్రమణీకొప్పునం దమరియున్న పద్మము వోలె దివాకరుఁడు గ్రుంకుచుండెను. అయ్యది సముద్రప్రాంతమగుటఁ జల్లనిగాలి వీచుచు బ్రయాణీకుల కపు డెంతయు సుఖముగా నుండెను. అది యరణ్యప్రదేశము. చుట్టు కొండలు పెట్టని ప్రహరివలె నుండెను. అట్టి ప్రదేశమున ముగ్గురు రాజపుత్రులు వారిసేవకులతోఁ బయనముఁ జేయుచుండిరి. వా రాదేశమునకుఁ గ్రొత్తవారు. అప్పుడే యోడదిగిరి. వసించుటకనువగుబస నేర్పరుచుకొని యాయూరిఁ జూచుటకై పోవువారుగా నగపడుచుండిరి. వారచటఁ గల పర్వతపంక్తుల శృంగారమును జూచుచు నగాధంబైన సముద్రమధ్యంబున నుండు నీ దీవియందుఁ గూడ సొంపుగాఁ బెరిగియున్న వృక్షవాటికలకుఁ గల యందమునుగూర్చియుఁ వా రిదివరకుఁ జేసివచ్చిన గంగా ప్రయాగ యాత్రలఁ గూర్చియు నాయాదేశజుల వేషభాషలఁ గుఱించియు, వినోదముగ మాటలాడుచు నేగుచుండిరి. ఈ మార్గస్థులలో మాలవదేశాధీశుఁ డగు లలితకుమారుఁడు మొదటివాఁడు. ఇతని వయస్సిరువదిరెం డుండును. ఆకర్ణాంతలోచనములు—అవి యందముననే గాక సకలజనాకర్షణములు. మొలచిన యౌవనాంకుర సూచకములగు నూనూగుమీసము లతని సహజసౌందర్యమునకు వన్నెఁ దెచ్చుచుండెను. చిత్రమందు లిఖించినట్టు సొగసైన కనుబొమ లెపుడుఁ జూచినను నవ్వినట్లుండు సుందరంబైన ముఖంబును, చంపక

పుష్పమువంటి నాసికయును కలిగి సర్వాంగసుందరుండగు నా రాజకుమారుఁడు తన సుకుమారంబగు శరీరసుఖంబును లెక్కింపక నిట్లు దేశంబులఁ దిరుగుచుండెను. దీనికిఁ గారణము లేకపోలేదు. ఇతనికిఁ గొన్ని దినంబుల క్రిందటఁ దల్లిదండ్రులు గతించిరి. అపు డతఁడు పసివాఁడయినందున బంధువర్గమందు జేరినవాఁడును నుదయపురిఁ నేలు మదనపాలుని వశమం దితనిఁ దండ్రి నొప్పగించియుండెను. కనుక నతని నియోగంబున నితఁడు పితృవియోగ దుఃఖమును బోఁగొట్టుకొనుటకై యిరువురు స్నేహితులఁ గూడి తీర్థయాత్రవెడలెను. ఇందు మొదటివాఁడు శోధపుర రాజపుత్రుఁడైన సుదర్శనుఁడు. రెండవవాఁడు మధుమంతుఁడు. ఇతఁడు జయపురరాజపుత్రుఁడు. వీరు మువ్వురును బాల్యమునుండి యొకస్థలమునందుఁ బెరిఁగి యొక్క గురువుచెంత విద్యలు నేర్చి, యేకోదరులవలె నొకరి నొకరు ప్రేమించువారు. వీరు కాశీయాత్ర జేసి గయాశ్రాద్ధాదులఁ జరిపి కాళీఘట్టమునకువచ్చి యారాజ్యమునంతయుఁ జూచిరి. తరువాత నౌకాయాత్రఁ జేయవలెనను నిచ్ఛ కలుగఁగ నచటఁ దగిన నావ నేర్పఱచుకొని హూగ్లీనదీముఖముగాఁ బోవుచుండిరి. అచట వారికిఁ గొన్ని వర్తకులనావలు తోడగుటజేసి యుల్లాసముగఁ బ్రయాణముఁ జేయుచు గాఁగా నావర్తకుల నావలు రత్నదీవిలో "లంగర్లు"వేసి నిలుపఁబడినవి. వానినుండి వీరును దిగి యాదీవియెట్లున్నదో చూడవలెనను కుతూహలము వారికి మెండయ్యెను. వారు తమయోడల నచట నేనిలిపి యచటమనుష్యుల నేర్పఱచుకొని యాదీవిని జూచుటకై వెడలిరి. వారుఁ పోవుమార్గంబులయందు గల సారవంతంబులగు భూములయందు సొంపుగాఁ బెరిఁగియున్న పైరుఁ జూచి యానందించుచు నాకొండలనడుమ వారు నడుచుచుండగా "మన మిదివఱకు దొంగలభయ మేమియు లేక వచ్చుచున్నాము. పాపము! ప్రయాణీకుల కిదివఱకు మేము విన్నప్రకారము, గొప్పయాపదలు మాకును గలుగునని భయపడియుంటిమి. చెలికాఁడా! ఇట్టి భ్రాంతి లేకదా రజ్జుసర్ప భ్రాంతి యందురు?" అని సుదర్శనుఁ డనెను.

మధుమంతుఁడు:—అట్టి భ్రాంతి మనకేల? అయిన నీ దీవియందలి కొండగుహలు సముద్రపు దొంగలఁ యావాసము లని యానావికులు మనకుఁ జెప్పలేదా? భూమ్యంతర్భాగమందు కోటగట్టుకొని దొంగలతోఁ డగు చండసేనుఁ డను సముద్రపుదొంగ యున్నాఁడనియు, వాఁడు దక్షిణసముద్రమునుండి హిందూదేశమునకు వచ్చు నోడలను దోచుటయేగాక, పినాంగుఁ మొదలగు భూప్రదేశంబులయందును దొంగిలించి మితిలేని ద్రవ్యముఁ జేర్చి ఈదీవిలో తా నొక రాజువలెఁ నున్నాఁడనియును, వానినిఁ బట్టుటకై ఢిల్లీశ్వరుఁ డెంత ప్రయత్నించినను దొరకఁడయ్యెడననియు వదంతి గలదు. ప్రభుత్వమువారింకను నా ప్రయత్నంబు విడువలేదు. ఆసంగతి మనము నావలో వచ్చునపుఁడనటి వారు మాటలాడుకొనిరి. నాకు నిద్రపట్టలేదు గనుక నాసంగతులను నేనుఁ వినుచుంటిని.

లలితుఁడు:—ఓహో? ఆలాగా? వాఁ డిపట నున్నాఁడా? ఉండిననేమి? అట్టి యాపద మనకు రాదు. మనము పోవుత్రోవలో భయమున్న ద్రోవఁ జూపువారు మనకుఁ జెప్పరా? వారి కధికముగ మనము ద్రవ్య మిచ్చితిమే?

సుదర్శనుఁడు:—ప్రభూ! మనకుఁ ద్రోవఁజూపువా రంత నిష్కళంక హృదయులని నేను జెప్పలేను. వా రిటునటుఁ జూచుకొనిపోవుట గూడ నాకు సందేహాస్పదముగ నున్నది.

లలితుఁడు:—(వారిని తిరిగి చూచి) వా రెవరినో యెదురుచూచుచున్నట్టున్నది. ఒకవేళ దొంగలజాడ నెఱిఁగి మనకు తెలుపుటకై యట్లు చూచుచుండవచ్చును.

మధుమంతుఁడు:—మన కిది క్రొత్తదేశమైనందున వారిని మనము నమ్మితీఱవలెను. ఇట్లు వారు మాటలాడుకొనుచు మిట్టప్రదేశము దిగి పల్లమునఁ బోవుచుండఁగా నచట నొకకాలువ యడ్డముగాఁ బాఱుచుండెను.

వారందఱు దిగినవెంటనే యచటనుండు దట్టమైనపొదలనుండి యీలవేసినశబ్దము వినవచ్చెను. ఇది యేమని తిరిగి చూచుచు వారు కాలువను దాఁటుచుండిరి. అవలి గట్టు చేరక మునుపే, చెడ్డీలుఁ దలపాగాలు ధరించుకొనిన పండ్రెండు వ్యక్తులు వచ్చి వీరిని జుట్టుకొనినవి. ఆయుధపాణులైన యాదొంగ లెంతటి దారుణకృత్యమునకైన వెనుదీయని క్రూరులని వేఱ చెప్పవలయునా?

చండసేనుఁడు:—మీ ఆయుధములఁ నుపయోగింప యత్నించితిరేని యీనిమిషమాత్రమున యమపురికేఁగఁగలరు. నామాటఁ దిరస్కరించి మీకత్తులఁ బైకెత్తితిరేని వానిని ప్రయోగించునంతలోఁ వానితోఁగూడ మీ సుకుమారము లగు గాత్రము లీ కటికనేలయందుఁ గూలఁగలవు.

ఇట్లు చెప్పుచుండ ధీరు డగు లలితకుమారుఁడు తన కత్తిపై చేయివేయు నంతలోఁ జీమలపుట్ట పగిలినట్లు పరిసరప్రదేశములనుండి దొంగలగుంపువచ్చి వీరిని జుట్టుకొని నిరాయుధులుగాఁ జేసి నిల్పిరి.

లలితుఁడు:—(దొంగలగుంపును కలయఁజూచి) తనయెదుట నిలిచి యున్నవాఁడు తా నింతవఱకు వినియున్న చండసేనుఁ డని యూహించి కొదమసింగంబువోలె గర్జించుచు "ఓరీ దొంగలతోఁడ! దేనికి మమ్ము నడ్డగించితివి? ద్రవ్యము కావలెనా? ఇదిగో! ఈవెలలేని రత్నాభరణములు. ఇంకేమి కావలయును? ఎందుకు నీ కింత దురాశ? ఏమి నీదౌర్జన్యము?"

చండసేనుఁడు:—రాజా! ఆశకంత మేఁడ? శ్రీరంగనీతులు నాకుగిట్టవు. నేను వినుచువాఁడను కాను. ఇదే మాడు మిపుడే మీ రిరువురిని విడిచిపుచ్చెద, నిన్ను విడువవలసినట్టయిన మన యిరువురిమధ్య నొకనిబంధన మేర్పడవలెను. నేను చెప్పునదంతయు నీ వొప్పుకొనవలయును. అప్పటికిని నిన్ను విడుచుట నాప్రాణమునకు ముప్పు తెచ్చుకొన్నట్టు. అదియంతయు నే నాలోచింపవలదా? యని చెప్పుచు వారికన్నులు బంధింపుమని సంజ్ఞ చేయఁగనే యొకనికి బదిమందిగ నదిమిపట్టి వారికన్నులు బంధించి యిరువురి నొక్కత్రోవ

యుండును, లలితకుమారుని మఱియొక త్రోవయందును నెత్తుకొనిపోయిరి. అప్పుడు లలితకుమారుని సేవకుఁడగు శంబరుఁడను వాఁడు తనరాజునకై హాహా కారముచేయుఁగా, వారు వానిని బాగుగ మర్దించి కన్నులుగట్టి లలితకుమారునివెంబడి నెత్తుకొనిపోయిరి.

లలితకుమారుని కన్నుల విప్పినప్పుడు తా నొక ఘోరారణ్యమధ్యమున సొరంగమునందు బోవుచున్నట్లెఱింగెను. తనవెంబడి సేవకుఁడుకూడ వచ్చుట జూచెను. ఆ దొంగలు వీరిరువురినిఁ జాలదూరమువఱకు త్రిప్పి యొక సొరంగమునందు దింపి దాని తలుపుమూసి వెళ్లిపోయిరి. అది ఖైదీలకు నియ్యఁబడినది యొకగుహ. దానితలుపులు పలకలతో నమర్పఁబడియుండెను. తలుపులలోఁ దొలిచియుండు రంధ్రములనుండి గాలిరావలయును. ఆచిన్నగదియందుఁ గూర్చుండుటకుఁ బరుండుటకును రెండుకంబళ్లు తప్ప వేఱు సామానులు లేవు. తలమీఁద గుట్టలరంధ్రములనుండి నీటిచెమ్మ కాఱుచుండుటవలనఁ జలి యధికముగానుండెను. లలితకుమారుని పనివాని నింటికి బయటఁబరుండుమని చెప్పి కావలియున్న దొంగ రాజును జూచి "ఆగుహాలో నుండుము పగటిప్రొద్దు బయట తిరుగవచ్చు" నని బహ్మాభావముతోఁ జెప్పెను. వాని చేసైఁగలచేత వాఁడు చెప్పినఁ దట్టిదని లలితకుమారుండు తెలిసికొనెను.

లలితుఁడు—అయ్యో! దైవమా! నేను పుట్టినదాదినుండియు నిట్టి స్థలమందు కాలుఁబెట్టి యెఱుఁగనే. ఇట్టి దుర్గతి ననుభవింపవలెనని నాదు మస్తకమ్మున్నదిగాబోలు! కనుక నే గాత్రము ముగించుకొని నిజనివాసముఁ జేరగలయే పయనముం దాసక్తి యొందుటకుఁ గలుగవలెనని విలపించుచుండ నా దొంగ రాజును చూచి 'ఓరీ రాజా! యెంతటి ఘనుఁడైనను మా చేతికిఁ జిక్కిన పిమ్మట యముని చేతఁ జిక్కినట్లే' యనుచు నెక్కసికోఁ జనెను.

# ద్వితీయాధ్యాయము



లలితకుమారుఁడు చండసేనుని కారాగృహమందు జిక్కి మూడు నెలలు గడచినవి. అచట దొంగ లిచ్చునాహారము సహింపక లలితకుమారుఁడు కృశగతప్రాణుఁడై వ్యాధిపీడితుఁడాయెను. రానురాను లేచుటకైన శక్తి తగ్గెను. క్రిందఁ దేమ నేలపైఁ బరుండుటవలనఁ గీళ్లుపట్టుకొని పోయెను. తనకై చెఱలోఁబడి తనస్థితికి జాలిఁజెంది కన్నీరు మున్నీరుగా గార్చుచుఁ దన్ను సేవించుచున్న శంబరునిగూడ మాటలాడించుట యరుదాయెను. శంబరుఁడు తనరాజుయొక్క విడుదలకై సర్వకాలము దేవునిఁ బ్రార్థించుట తప్ప వానికి నేపని తోఁచదయ్యె.

ఇట్లుండ నొకనాఁడు ప్రాతఃకాలమున నెవరో తలుపు తెఱచుకొని లోపలికి వచ్చిరి. అదిచూచి రాజు తన సేవకుఁడని యాదరణతోఁ జూచెను. వాఁడు సేవకుఁడు గాఁడు. తనశత్రు వగు చండసేనుఁడు. లలితకుమారుఁడు వానిని దిరస్కారభావముతో జూచియుఁ జూడనట్టు తనముఖము నటు త్రిప్పుకొనెను.

చండసేనుఁడు—లలితకుమారా! నీకు సుప్రభాత మగుఁగాక! ఏల నన్నింత తిరస్కారబుద్ధితోఁ జూచితివి?

లలితుఁడు—ఛీ దురాత్మా! నీవంటినీచునిముఖము చూచిన నాకెట్లు సుప్రభాతమగును! ఘాతుకా! నేను నీకేమిఁ యపరాధం బొనరించితిని? అమూల్యాభరణములు దోఁచుకొంటివి. ఇంకను నీ కేమి అడిగిన నిచ్చుటకు సిద్ధముగా నున్నవాఁడను. నన్ను బంధించి వా రిరువురను విడిచిపుచ్చితివి. నేఁజేసిన యపరాధ మేమి? నీవలన నెందఱు జనులు దమ ప్రాణములు గోలు

పోవుచున్నానో యోచింపఁగను. ఓరీ! చోరాధమా! నీవంటి పాపాత్ముని భూదేవి యెట్లు భరించియున్నది? నేను చావునకు భయపడను. అయినను నావంటి క్షత్రియునకు నింతటి నీచపుచావు వచ్చినందులకై వగచెద.

చండసేనుఁడు — రాజకుమారా! నన్నిట్లు మాటలాడితివేమి? కారణము లేక కార్యము జరుగదు. వారిరువురు నీవంటిధీరులుకారు. నీవు మిక్కిలి సామర్థ్యశాలివని నే నిదివఱకే వినియున్నాను. నేనుండుచోటు భరతఖండమం దెవరికినిఁ దెలియదు. నీవు నీస్నేహితు నిచటికి వచ్చుసమయమందుఁ "చండసేనుని నివాసస్థల మిది" యని మాటలాడుకొంటిరి. నిన్నిపుడు విడువ నగునే? నాసంగతి యెవరితోడను జెప్పనని నీవు ప్రమాణము చేసినట్లయిన విడిచిపెట్టెదను.

లలితుఁడు — ఓరీ! నీవు దుర్మార్గుఁడవైనను నీవొక శరీరివే. దుర్మార్గము నకు నొక మితి యున్నది. ఆ మితి మీఱినపు డీశ్వరుఁడు దాని నడంచును. అట్టి దుష్టనిగ్రహమునకే కదా మహావిష్ణువు అవతారములనెత్తెను? దుష్టనిగ్రహ శిష్టపరిపాలకుఁడగు నీశ్వరుఁడుండఁగ నేను నీకు చెఱుపుచేసెదనని యెంచుట నీయజ్ఞానము. నన్ను విడిచినను నీకు చెఱుపు చేయను. ఇకమీఁద నీవిట్లు నిరపరాధులను హింసించుట నే నెప్పుడు వినెదనో యపుడు నిన్ను తప్పక శిక్షింతును.

చండసేనుఁడు — నీవు పసివాఁడవైనను నిట్టి పుక్కిటిపురాణములు చాల నేర్చినట్లున్నది. ఇది చండసేనుని రాజ్యము. నీవు నా యధీనమందున్న వాఁడవు. నా యిచ్చచొప్పున నడువనియెడల రాఁబోవు జాతరలో నా కుల దేవతయగు భైరవునికి నిన్ను బలియిచ్చితీరుదును. నిదానముగా నాలోచించు కొమ్మని చెప్పిపోయెను.

చండసేనుఁడు చెప్పినమాటలవిని లలితకుమారునికిఁ బట్టరానియాగ్రహము కలిగెను. ఏమిచేయవచ్చును! ఆకోపము దుఃఖముగా మాఱినది. "ఓదీనబాంధవా! ఆర్తులమొఱ నాలకించి రక్షించుశక్తి నీకుఁదప్ప మఱెవ్వరికిఁ గలదు? వీర

క్షత్రియుఁడనై జన్మించి యీనీచుని కారాగారమందుఁబడి చావవలసినదేనా? నేనెట్టిపాపం బొనరించియుంటిని?" అని యిట్లు విలపించుచుఁ గాలము గడపుచుండెను. చండసేనుఁడుమాటలాడిపోయిన నాఁటనుండియు లలితునకు మంచియాహార మిచ్చుచుండిరి. ఈరీతి మూఁడునెలలు గడచెను. ఒక్కనాఁడు తెల్లవారకమునుపే గుహాద్వారము తెఱవఁబడెను. దొంగలు లోపలఁజొచ్చి లలితకుమారునిఁ దీసికొనిపోయి జలకమాడించిరి. పిండివంటలు గుడువఁ బెట్టిరి. ఎఱ్ఱనివస్త్రములు ధరింపఁజేసిరి. కొందఱెఱ్ఱనిపూలను దెచ్చి దండలు గ్రుచ్చుచుండిరి. లలితకుమారునకు నోటమాటరాలేదు. వారేమిచేయించినను గీలుబొమ్మవలెఁ జేసెను. తనయాయువుమూఁడెనని నిశ్చయించుకొనెను. ఈశ్వరధ్యానము తప్ప ప్రపంచసుఖముల నన్నిఁటిని మఱచెను.

ఆదొంగల యిలువేల్పు భైరవమూర్తి. అది సంవత్సరాంతము. ఆదినమచట గొప్పజాతర. ఆదేవస్థానమున్న స్థలము విశాలముగా నుండెను. చుట్టు వివిధవృక్షములు పెరిగియుండినవి. ఎచ్చటఁజూచినను బచ్చని యాకుల తోరణములు చెట్లకుఁ గట్టియుండిరి. స్వామిని వెలగల యాభరణముల తోడను, వస్త్రములతోడను నలంకరించి యుండిరి. ధూపమువేయుపొగ యాకాశమున కెగయుచుండెను. చోరశిఖామణులు లెక్కకు మిక్కిలిగవచ్చి గుంపులుకూడియుండిరి. ఆ కోటలో జండసేనుఁ డొకరాజు. వానికి నన్ని సౌఖ్యములొప్పియున్నవి. ఆదొంగలగుంపులో వివిధములగుపనులు నేర్చినవారున్నారు. అచట నపుడు వివిధవాద్యములు మ్రోఁగుచుండినవి. అట్టి విపద్దశయందును లలితకుమారుని చెవుల కాయింపైనస్వరములు వినఁ బడుచుండినవి. 'దేవీ! ఇట్టి క్రూరాత్ములకుఁగూడ సంగీతసౌఖ్యము కావలసియున్నదే! ఆ! మఱచితిని. రావణుఁడుండలేదా? వాఁడు సామగానలోలుఁడు గదా?' ఆరీతిగనే వీరు నున్నారనుకొనెను. అచట విశేషముగా "పాలీ, బర్మీ" ఈ భాషలే విశేషము. అంతలో పాలీభాషలో మంత్రము నుచ్చరించు చప్పుడు వినవచ్చెను. ఒహో! భైరవమూర్తికిఁ బూజ జరుగుచున్నట్టున్నది.

ఈనాఁటిపూజకు బలిసుఁడు పశువు. ఓ భైరవమూర్తీ! నీవే నాకు రక్షకుఁడవు" అని చింతించుచుండెను. వాద్యములు తనచెంగటనే వినవచ్చెను. వారిటకే వచ్చుచున్నారు! అనుచు మూర్ఛఁజెందెను. అంతలో వాద్యములతో దొంగలచటికి వచ్చిరి. వారు త్రప్పఁద్రాగియుండిరి. ఒడలెఱుఁగక తూలుచువచ్చి బలిపశువుగారు నెత్తుకొనిపోయిరి. స్వామియెదుట రాజును నిలువఁబెట్టిరి. రాజునకు మెలఁకువ కలిగెను. ఆభైరవమూర్తినిఁ జూడఁగానే భక్తితో నమస్కరించి "ఓదయాసాగరా! లోకమందుండు పాపముల మర్దించి సుగుణవృద్ధి చేయుటకై వెలసియున్న నీయందీ దుర్మార్గులు వారి దుష్టగుణముల నారోపించి నీకు నరహంతకుఁడని నామమిడి నిన్నిచట నిలిపి కొలుచుచుండిరి. భక్తవత్సలా! ఈనీపూజావ్రతము బొందుచున్న నాకు నీదర్శనము కలిగెను. మఱియు నన్ను నీకు బలియియ్యవలెనని వారికి బుద్ధి పుట్టెను. గుహలోనే వారు నన్నుఁ జంపియున్న నేనేమిచేయువాఁడను? ఇదియు నొక సుకృతమే." అని చింతించెను. ఇంతలోఁ జంపసేనుఁడు తీక్ష్ణకరవాలమును జేత ధరించి దొంగలగుంపు నొత్తిగలఁ జేయుచు రాజున్నతావునకే తెంచెను. మనరాజు కన్నులు మూసికొనెను.

చంపసేనుఁడు—ఓరీ రాజాధమా! ఇఁక నీ వీలోకమున నుండఁదగవు. నాయాజ్ఞనుల్లంఘించితివి. నాయుపదేశమును జెవిని బెట్టితివి. నిన్నిపుడే కృతాంతనిలయమున కతిథిఁగాఁ బంపెద. నీయిష్టదైవమును జక్కఁగా ధ్యానించుకొనుము.

ఇంతలో దొంగలందఱు భైరవస్వామికి ధూపదీపముల నర్పించి సురాభాండములఁ దెచ్చి నైవేద్యంబొనర్చి కర్పూరము వెలిగించి "జయ భైరవా" యని కేకలు వేయుచుండిరి. అప్పుడు నరహింసజేయుచున్న నరహంతకుల సంహరించి తనభక్తుని గాపాడుటకై ప్రత్యక్షమైన కాలభైరవియో యన నొక బాలిక నిగ్రహయముగా వారినందఱను లక్ష్యము సేయక దూరివచ్చి వారిమధ్యనిలిచెను. ఆస్త్రీరత్నమునకు బదునెనిమిది వత్సరము లుండవచ్చును. మృదుమధురశరీరము. ఆమె శరీరకాంతి చలనము లేని మెఱుపుకాంతి వంటిది.

చంద్రునివంటి విశాలమగుముఖము. ఆమె ముంగురులు చుట్టలుచుట్టలుగా చుట్టుకొని నొసటిమీఁద వ్రేలాడుచుండినవి. దీర్ఘ వినీలశిరోజయుగు నాయువతి క్రొమ్ముడి సవరించుకొనుచుండెను. దయారస మొలుకు నామెనయనంబులు లలితకుమారునికొఱకుఁ జండసేనునితోఁ దగవాడుటకై నిలిచియున్నట్లు తోఁపింపఁజేసినవి. నవకిసలయమును గేలిసేయు అధరబింబము, ముత్యపు వరుస ననుకరించు దంతపంక్తి, ఆకర్ణపులు పరివ్యాప్తలోచనద్వయము,విభ్రమ భ్రూలతాద్వంద్వము యువజనచిత్తాపహరణ క్రియాదక్ష సుతీక్ష్ణకటాక్షవీక్ష ణములు, తదితరాంగ లావణ్యాధిక్యము వీక్షించిన మన్మథు నెడఁబాసి మధ్య మలోకది దృష్టాపేక్ష నేతెంచిన రతీదేవియో యన నొప్పుచుండెను. బర్మాదే శపుస్త్రీవలె చీరగట్టుకొని ఆభామతో చండసేనునిగూర్చి మాటలాడఁబోయి నను నాచిన్నది బర్మాస్త్రీవలెఁ గనఁబడలేదు. చండసేనుఁ డులికిపడి, ఓ లతాంగి! ఎందుల కిచటికి వచ్చితివి? యని యడిగెను.

అచటి ఘోరకృత్యములుచూచి మన బాలిక భీతి జెందియున్నను గంభీర మైన మాటతో చండసేనునిఁ జూచి సరియైనసమయమునకే వచ్చితి ననెను.

చండసేనుఁడు—"బాలికా! నేనుండు గుహాద్వారము నీ కెట్లు తెలిసెను?"

ఇందిర—ఇదియొక కష్టమా? నీకోటకు నేను రాకున్నను, జిన్న తనమునుండి యిచటఁ దిరుగుచున్నదానఁ గనుక నీకోట యిచ్చటయుండునని నాయూహ. నీ మాలవరాజును దెచ్చి యీసౌరంగమందుఁ జెఱఁబెట్టి యున్నావని యీ దీవిలో నుండువారు చెప్పుకొనుచుండఁగా నే వినియుంటిని. ఇతఁడు నీకపు డాహుతి యగునో యని చింతించు చుంటిని. నేఁడు దొంగ లుల్లాసముగా మాటలాడుచు బోవుచుండఁగ వారిలో నొకఁడు, "ఈ నాఁడు గదా లలితకుమారుని భైరవునకు సమర్పింపుట?" యని చెప్పనది నేను వింటిని.

చండసేనుఁడు:—పిమ్మట?

ఇందిర—ఈమధ్యాహ్నమున నీప్రదేశమంతయు నిన్ను వెదకి వేసరి వెనుకకు మరలునపు డీగుంపును చూఁచితిని. నేను వారికిగనఁబడక వారిని వెంబ

డించితిని. పానమత్తులై మైమఱచి తలుపువేయక వారిచటికివచ్చిరి నేనప్పుడేవచ్చి నీతోటను జూచుచుంటిని. ఇపుడు నీసీతని జంపుట దెలిసి పరుగెత్తివచ్చితిని.

చండసేనుఁడు — రాక్షసీ! సింహముయొక్క గుహలో గోమాయువు దూరువందమున నీప్రదేశమునకు వచ్చిన నీధైర్య మెంతటిధైర్యమే? (యని గర్జించెను. అప్పుడు తిక్కిన దొంగలు పండ్లుకొఱుకుచుఁ దమరాజా బాలికను చంపుటకు త్తరువిచ్చునేమోయని తమకత్తుల నొరలనుండితీసి సిద్ధముగానుండిరి) ఇందిరా! మారహస్యస్థలమును నీకోటను నీవు కనుఁగొంటివి. నీవొక మగవాడవైయుండిన యెడల నిన్ను నిలువునఁగాల్చి భస్మముచేసియుందును. నీవు మారహస్యమును దెలిసికొనినది మాయిరువురకుఁ బ్రాణాపదకే. నేను నిన్ను బాల్యమునుండి యెఱింగియున్నను నీతండ్రిచేసిన మితిలేనియుపకారములఁ బడసియుండుటవలన మాయిరువురియందును నిర్దోషమగు బ్రీతిని నిలిపియుంటిని. ఇపుడు నీవు ప్రయత్నించిన కార్యముచే నీకమీఁద నాయభిప్రాయమును మార్చుకొన వలసియున్నది

ఇందిర — చండసేనా! నేను నీకేవిధమగుచెఱుపు చేయనని నీకు దెలియును. నన్ను జంపజాలవను నమ్మకము నాకున్నది. ఎన్నియోమాఱులు నిన్నుఁ బట్టుటకై ఢిల్లీశ్వరుని యోధులు వెంబడించినపుడు మాయింటిలో నీసేవకులతోఁగూడ నిన్ను నాతండ్రి కాపాడియుండలేదా? ఉప్పుతిన్నవాని మోసగింపగూడదను ధర్మము దొంగలకున్నదని చెప్పఁగా వినియున్నాను. నాయాదరణములో నుండిన యీనీచులిప్పుడు నన్నే చంపుటకు సిద్ధమైయున్నారు. అయినను నీ వట్టివాఁడవు కావని నేనెఱుఁగుదును. "ఎట్టియాపదలువచ్చినను నాతండ్రిని నన్ను గాపాడెద, మీరేమి చెప్పినను నడచుకొందును" అని ధర్మిష్ఠుడగు నాతండ్రికి వాగ్దానముచేసినావు. నీవాగ్దానము జరుపుకొను కాలమువచ్చినది. ఈమాళవరాజు వంశములోని రాజులకును నాతాతముత్తాతలకుఁ దండ్రికిని నేదో స్నేహబాంధవ్య ముండినట్లు నాతండ్రి నాకు జెప్పియుండెను. కావున నాతండ్రికి నిష్టమైనపనిని నేను నెఱవేర్చుట నావిధి. నామాట నీవద్దచెల్లునని నమ్మి ఈరాజును విడిపింపఁ బ్రయత్నించి యిచ్చటికి వచ్చితిని.

చండసేనునిమనస్సు కరగినది. తనకుఁ జెఱుపుచేసినవారి నెట్లు హింస చేయుటకు మఱవఁడో యావిధముగనే యీబాలిక తండ్రివలనఁ బొందిన మేలును మఱవఁడాయెను.

చండసేనుఁడు—ఓ స్త్రీరత్నమా! నీవు చెప్పినదంతయు నిజము. నీతండ్రివలనఁ బొందిన యుపకారము మఱచునంతటి నీచుఁడఁగాను. నీతండ్రి పరిచయము గలిగినప్పటినుండియు మిమ్ము నాభాగధేయము లనియే నమ్మియుంటిని, నమ్మియున్నాను. ఇఁకమీఁద నటులనే యుండెదను. అయినను నాప్రాణమునకు సంపదకు హానికలుగునంతటి యిట్టి విధమగు కార్యము కలుగునని నేదలఁపలేదు. ఎప్పుడు నీకిటువంటికోరిక కలిగెనో దానిని నెఱవేర్పకయుండ నాతరముకాను. ఈకార్యమువలన నాస్థానమును మార్చుకొనవలసి వచ్చును. అప్పుడిదివఱలో నీవిషయమునందుండిన నాభావమును కూడ మార్చుకొనియెదను. ఇది నీవే నాకు చూపినమార్గము. ఇట్లగునని నే నెంచియుండలేదు. ఇదియును నాభాగ్యమే యని తలఁచెద. ఓ సౌందర్యనిధీ! నీవు నామీఁదఁ గృపయుంచుటకిదియేని దర్శనమగుఁ గాక. ఓరీ సేవకా! ఈయిరువురను గండ్లుకట్టి బయటకుఁ దీసికొనిపోయి విడిచిపెట్టుము. ఈరాజు మిగుల నస్వస్థముగానున్నాఁడు. వీనిని మోసికొనిపోయి బయటవిడిచిపెట్టుము. పిమ్మట వాఁడెటుపోయిన మనకేమియని యానతిచ్చి తిరిగిచూచు నంతలో బాలిక కనఁబడలేదు. (తనలో) ఆహా ఎంతచాతుర్యము! ఏమిధైర్యము! ఎంత లావణ్యము! ఇంతలో నెట్లు తిరిగిపోయినది? ఆబాలిక ఈ గుహాయంతయు తనస్వంతముగా నెంచియున్నట్టున్నది. ఇఁకనేమి? ఆచిన్నది నాసొమ్ము. ఒకవేళ వాఁడు మిక్కిలి రోగపీడితుఁడై లోకమిత్రుఁ డగు దానితండ్రియగు మైత్రేయుని యింటిలో నుండినపక్షమున వాఁడు వెళ్లిపోవునఱకు నేను వేచియుండవలెను. లేక యారోగముచే వాఁడు చచ్చినా నాకింతటివ్యసనమే లేకయుండును. అప్పుడు నాయింతిని పిలుచుకొని నాసైన్యముతోఁ గూడి సుఖముగా నుండెద. తనపుత్రికను విడిచియుండలేక మిత్రానందుఁడుఁ దానే నాకు లోఁబడునని యాలోచించుకొనెను.

# తృతీయాధ్యాయము



బర్మాదేశమునకు నైరృతిదిక్కునను ఐరావతీముఖద్వారమునకుఁ బశ్చిమమున వజ్రదీవులున్నవి. ఆప్రదేశభూములు మిక్కిలి సారవంతములు. ఆదీవులయం దెత్తయిన కొండలు గలవు. జనసమూహము మిగుల కొంచెము. ఆకొండలమధ్య వెలగల రత్నఖనులున్నవి. అచట గ్రద్దలు పాములు మెండు. ఇట్టి దీవులలో నిరుప్రక్కలఁ గొండలును, మూఁడవప్రక్క సముద్రమును నాల్గవదిక్కున మనుష్యులు కాఁపురమున్న కొన్ని యిండ్లుగలిగి విశాలమగు నొక స్థలము గలదు. ఆప్రదేశమితరజనులు వసించుస్థలమునకు గొంచెము దూరముగా నుండును. అట్టి యొకచిన్నదీవిలో చుట్టు టెంకాయచెట్లు పెరిఁగియుండును. వానికిఁ దోడుగా నపెవిమ్రాఁకులతో నిండియున్న యాప్రదేశమొకటి యుండుననిదూరమునుండి చూచు తెరువరు లూహించుటకుఁ గూడఁ గష్టముగా నుండును. ఆప్రదేశము అతిసారవంతముగా చేయబడి అరఁటి, మామిడి, పనస, నారంజి, దానిమ్మ, ద్రాక్ష మొదలగు చెట్లతోను మల్లె, గులాబి, పాదరి మొదలగు పరిమళయుక్తములగు పూలచెట్లతోను నిండి మనోహరమై యుండెను. వీని మధ్య నొకమందిరము గట్టఁబడియుండెను. ఆటెంకాయచెట్ల సందులలో కొన్నిగృహములు నుండెను. ఈయిండ్లయం దుండు వార లీతోఁటపనివారు. ఆయిండ్ల నానుకొని కొన్ని పైర్లుపండు భూములును కలవు. ఇట్లు వేఱుగా-త్రోసినట్టుండు గ్రామమునకు అధికారి యొక పరదేశపువాఁడు. అయినను ఈదీవియందలి జనులవలె బర్మీ, చైనీ, పాలీ మున్నగు భాషలయందు మిగుల తేరినవాఁడు, సుమారు పదునైదుసంవత్సరములకు ముందు మూఁడేండ్ల చిన్నబాలికతో ఇచటికి వచ్చి యీప్రదేశమందుండిన యొక బీదకాఁపువాని యొద్ద నీస్థలమును కొని తనసామర్థ్యముపయోగించి ఇన్నిచెట్లు వేసి కాయలు,

పండ్లు మొదలగు వస్తువులఁ బరదేశమునుండి పడవలలో వచ్చుచున్న వర్తకు
లకు నెగుమతిచేసి వారు తెచ్చిన వస్తువులు తాను, మఱియు నాదీవులలో
నుండువారు కొనునట్లు వ్యాపారము వృద్ధిఁజేసి దానివలనఁ దాను సుఖముగా
జీవించుచుండెను. ఇతని దేయూరైనది యెవరికిని తెలియదు. ఇతని మాటు
లతిమనోరంజకములు. ఆకారము మిగుల గంభీరము. ఇతఁడు సాధారణముగా
నాఱడుగుల యెత్తుగలవాఁడు. వయస్సు నలువది సంవత్సరము లుండునట్లు
కనఁబడుచుండెను. అతని యందమైనముఖము శాంతమునకు ఓపికకు నివాస
స్థానమని చూచువారు చెప్పకమానరు. నల్లగ నిగనిగలాడునతని వెండ్రుకలు
మిగుల సుందరములైనవి. వానినతఁడు చుట్టగాఁజుట్టి పైకెగట్టుకొనును
గాలికి జాఱిన ముంగురులతని ఫాలభాగమందు వ్రేలాడునప్పుడు చూచువారి
కతఁడు మిక్కిలి సుందరపురుషుఁడని తెలియనగు. ఇంత సుందరపురుషుఁ
డైనను శరీరము చామనచాయ. ఆఫాలభాగ మతివిశాలము. కనుక నితనిని
చూచిన వారితఁడొక గొప్పవంశపువాఁడై యుండ నర్హుఁడనియు, పరమమేధావి
యనియు, విద్యావంతుఁడై యుండనోపుననియుఁ జెప్పవలసియుండును ఇట్టి
యధికారచిహ్నములకు నివాసస్థానమైన యితని కీయేకాంతవాసమెందులకై
యుండునని యూహించునంతటిబుద్ధి గలవా రచట నుండలేదుగాఁబోలు!
అట్లుండినయెడల నెవరైన నడిగియుండరా? ఆదీవిలోని మనుష్యుల కుత్తర
ప్రత్యుత్తరములు జరుగుచుండునేగాని ఇతని కెవరు నుత్తరములు వ్రాయు
చుండునట్లు కనబడలేదు. వర్తకులుమాత్రము వ్యాపారవిషయముగ నుత్తర
ములు వ్రాయుచుండిరి. ఇతనికి నాబాలికతప్ప వేఱేబంధువులు లేకయుం
దురు. ఇతఁడు కట్టియున్నభవనము విశాలమైనది. వంటకు శుభ్రమైనగది. దాని
యెదుట సామాను లుంచుగది, భోజనశాల వంటపాత్రలు, భోజనపానపాత్రము
వాని వాని స్థానములయం దమరికగా నుంచియుండును. ఇతనికిఁ బుస్తకా
గారము కలదు. అందనేకమతగ్రంథము లుండును. విశాలమగు పడకగదిఁ
గలదు. దానిలో సాధారణమైనవి రెండుమంచములు శుభ్రమైన పడకలు

కలవు. మిత్రానందుఁడని ప్రసిద్ధిఁజెందినయితని యింటి కనేకులు భోజనమున కని రోగమువచ్చినవారు మందులకని వచ్చుటకలదు. మిత్రానందుఁడు తన దగ్గఱనుండు సేవకులకు, బైటనుండి మందులకై వచ్చువారికి ఔషధము లిచ్చును. ఇతనికిఁకమం దొకగొప్ప వైద్యుఁడుకలఁడు. అందులకై యౌషధ శాల యేర్పరచియుండెను. మిత్రానందుఁడు మిగుల మితభాషి. వంటమొదలగు పనులకు వేర్వేఱుదాసదాసీజనులున్నను .ఇంటికార్యము లొకగృహిణివలె తానే నెఱవేర్చుచుండును. పనులు లేనపుడు గ్రంథములు చదువుచుండును. ఇతని యాజానుబాహులు చూచినవారి కితఁ డొకపరాక్రమశాలియగు యోధుఁడని తోఁపఁజేయును. ఇతనితో మాట్లాడువారంఱు మిక్కిలి వినయవిధేయతగలిగి మెలఁగుచుందురు. ఇతఁ డెట్టివానినైనను ధిక్కరించి మాటలాడియెఱుఁగఁడు.

ఆనాఁడు ప్రొద్దు గడచినది. ఎండతగ్గి సూర్యకిరణములు చెట్లసందు లలో వెన్నెలవలె తోఁపింపఁజేయుచుండెను. మిత్రానందుఁడు బైటవసా రాలో నిలిచి "ఏమి ఆశ్చర్యము! బిడ్డ కనఁబడలేదు. దానిని బైట తిరుగ వచ్చునని స్వాతంత్ర్య మిచ్చినది నాతప్పు. ఏమైన నాపద గలిగెనా?" యని చింతించుచు తనబిడ్డను వెదకుటకుగాఁ బంవదగిపోయెను. అపుడు తన యెదుట మైదానమునుండి ఇంటివంకఁ జూచుచు నొకబాలిక బిరబిర వచ్చుట గనెను. ఆయనయాందోళనము తగ్గెను. ఆచిన్నది యెవరు? ఆమెయే యాతని యేకపుత్రికారత్నము. ఆమెయే లలితకుమారుని చండసేనునిబారినుండి తప్పించిన బాలికారత్నము.

ఇందిర—నాయనా! ఇదిగో వచ్చితిని. ఆకలియగుచున్నది. ఫలాహారమువేళ అతిక్రమించెనా? (అని చెప్పుచుఁ బరుగెత్తుకొనివచ్చి తండ్రి నాలింగన మొనరించెను.)

మిత్రానందుఁడు—అమ్మా, కుమారీ! మనమిదివఱకే ఫలాహారము చేసియుండవలయును. ఇందిరా! నీకేమి ఆపద మూఁడెనోయని భయమంది తిని. నాముద్దులపట్టి నీవిఁక యేకాకినిగా బైట పోవలదు.

ఇందిర—తండ్రీ! తమయాజ్ఞనుమీఱను. (అని చెప్పుచు ఇద్దఱులోపలి కరిగిరి. వంటమనిషి తెచ్చిపెట్టిన భక్ష్యములను పండ్ల నారగించిరి.)

మనయిందిరకు హిందీ మొదలగు భాషలు తెలిసియుండెను మఱి గ్రంథములను చదివియుండెను. తండ్రి యామెకు సంగీతము నేర్పించెను. కొన్నిదినములు తండ్రితోగూడ కాశీపట్టణమందున్నపుడు వీణవాయించుటకును, హిందుస్థాని పాడుటకు నేర్చియుండెను. ఇపుడు ప్రతిదినము అభ్యసించి పాటయందు సామర్థ్యవతి యయ్యెను. ఈమెకు రాజ్యతంత్రము లన్నియుఁ దండ్రి నేర్పించుచుండును. విలువిద్యను నేర్పెను. ప్రతిదినము మిత్రానందుఁడు ప్రాంతఃకాలమున నాలుగుగంటలకే లేచి సాము మొదలగు శరీరవ్యాయామము చేయునపుడు తనబిడ్డనుగూడ లేపి తగినగుడ్డలు ధరించి సాముచేయుటకు నేర్పించును. ఇందిర విద్యావతియై తనకు పదియాఱవ సంవత్సరము ముగియుకమును పే తనయింటిపనులన్నియుఁ జూచుకొనుటకుఁ బ్రారంభించెను. తండ్రివ్యాపార విషయములయందును సహాయభూతయై యుండును. ఇందిర స్వభావముగా మంచిగుణములు గల బాలిక. దయామయి. ఆమెతండ్రికి తగిన బిడ్డగాని తీసిపోవునది కాదు. ఇఁక సౌందర్యమూ చెప్పనలవికానిది. ఈమె శరీరచ్ఛాయగూడ నలుపే. అయినను త్రిపురసుందరియని ఆదేశపువారు ఆమెను పొగడుదురు. ఆమె హృదయము మతికోమలము, వజ్రమువలె కఠినము. ఇట్టి సుగుణాలలామయగు పుత్రికను కన్నమిత్రానందుఁడు ధన్యుఁడు. ఫలాహారము చేయునపుడు ఇందిర ఒక్కొక్క ద్రాక్షపండును తండ్రి నోటిలోఁ బెట్టుచుఁ దా నొకటి తినుచు తన తండ్రితొడమీఁద తలపెట్టుకొని అతఁడేమి చెప్పునో యని యతనిముఖమునే చూచుచుండెను.

మిత్రానందుఁడు—ఓ ఎఱుకలదానా! నీ వెపుడు బైటపోయివచ్చినను అచట జరిగినసంగతులు చెప్పుచుంటివే, నేఁడేమి మౌనధారిణివలె నున్నావు? నేఁడు నీవొక ఘనకార్యమును సాధించినట్లు తోఁచుచున్నది. అది యేమి?

ఇందిర—నాయనా! తమకుఁ జెప్పని సంగతి నాకేమియున్నది? మీకు దివ్యదృష్టియున్నదని నమ్మియున్నాను. నిజముగనే నేఁడొక ఘనకార్యమును జేసివచ్చితిని. మీరు చెప్పినట్టు నే నొక యొంటరిదానివలె నీ నిర్జనస్థానమందుఁ దిరుగుచున్నాను. ఈదినము నే జేసినది చిన్నపనియైనను దమకు చెప్పకచేసిన యపరాధమును మన్నింపవేఁడెదను. ప్రాణమునకపాయము వచ్చిన సమయము గనుక తిరిగివచ్చి పోవునంతలో వారు బలియిచ్చెదరేమో యని వెళ్లి పోతిని.

మిత్రానందుఁడు—తనయా! అట్టిపనియేమి?

ఇందిర—జనకా! దొంగల రేఁడగు చండసేను నెఱుఁగరా? వానికోట యీదీవిలో నేగద యున్నది? దానికిఁ బోవుమార్గ మెవరికిని దెలియదుగద? నేఁడు ఆకోటతలుపుతీసి యుండినది కనిపెట్టి యచటికి నేను పోయియుంటిని.

మిత్రానందుడు—కుమారీ! ఏమి చెప్పితివి? నేను కల కన్నానా? నిజముగా మాటలాడుచున్నావా? తనయా! ఎంతప్రమాదం బొనరించితివి? వాఁడతిక్రూరుఁడు. సముద్రపుదొంగ. వానిని బట్టవలయునని భారతీయులగు రాజు లెంతప్రయత్నములు చేయుచున్నారు! వాఁ డిటీవల మాళవదేశపు రాజును చెఱసాలయం దుంచియున్నాఁడని నేవకులవలన వినియున్నాను. నిన్నుఁ గాపాడుటకై యీదురాత్మునిని నేను మన్నించి వానియాపత్కాలమందు నేను రక్షించితిని. అదియునుం గాక నేను దిక్కులేని వాఁడను. ఇంతయాస్తిని రక్షించుకొని యీనిర్జనారణ్యమందు జీవించియుండవలసి యున్నది. అట్టివాని గృహమునకు నిశ్చయముగా నీవు పోవచ్చునా?

ఇందిర—(ఆమాట విని ఇందిర మిక్కిలి ఖిన్నవదనయై తండ్రియడుగులకు నమస్కరించి) జనకా! మన్నింపుఁడు. నే నాపూలచెట్లయొద్దఁ దిరుగుచుండఁగ "అమ్మా! నేఁడతిఘోరకృత్యము జరుగును. ఆనీచుఁడగు చండసేనుఁడు తాను కారాగారమం దుంచియుండిన రాజును దన దేవతకు బలియిచ్చునట" యని మాతోటవారు చెప్పిరి. ఆమాట నాచెవిలో ములుకువలె

గ్రుచ్చుకొనెను. నా శోకవిధమును మనోవ్యథగలిగి తమతోఁ జెప్పుటకైనఁ దోఁపక పరుగెత్తిపోయితిని. చండసేనుఁడు నన్ను సోదరివలె ప్రేమించుచున్నాఁడు. మీకు స్నేహితుఁడని యెంచితినేగాని వానివలన నాకపాయము గలుగునను తలంపపుడు నాకుఁ గలుగలేదు. నాగుప్త చంద్రాయుధమున్నదని నిర్భయముగాఁ బోయితి. ఆసమయమునకే దొంగలను గుంపులుగూడి పోయి కోటతలుపు తీసిరి. వారు తలుపుమూయకయే వెళ్లిపోయిరి. ఆతలుపొక పొదలోనున్నది. అందు దూఱిపోయి వారి మధ్య నిలిచితిని.

మిత్రానందుఁడు—తరువాత?

ఇందిర—అచట ఘోరకృత్యములు జరుగుచుండెను. అద్భుతముగ భైరవపూజలు జరుగుచుండెను. తనదేహమే తనకుఁ దెలియక రోగపీడితుఁడై కదలుటకైన శక్తిలేకయున్న మాళవరాజును కాళ్లుచేతులుకట్టి భైరవునకు బలియిచ్చుసమయము. అట్టిసమయమున నేను పోయి వానికి హితముబోధించి యతనిని విడిపించితిని. అతని నతని స్నేహితుఁడో లేక సేవకుఁడో వారిద్దఱు కన్నులు గట్టి బైటికిఁ దీసికొనిపోయిరి. చండసేనుఁ డేమో దీర్ఘాలోచనా నిమగ్నుఁడై యుండెను. ఇదే సమయమని నేను పరుగెత్తివచ్చినాను. నన్నె వరును నడ్డగింపలేదు. కనుక నాకిప్పటి కేమియు నపాయముకలుగలేదు.

మిత్రానందుఁడు—పుత్రీ! ఇప్పటి కపాయము లేదంటివే? ఆమాట నిజము. చండసేనుని దీర్ఘాలోచన నాకుదెలియును. వాఁడు నీతోఁ జెప్పిన ట్టికమీఁద నిన్నూరక పోనిచ్చువాఁడు గాఁడు. అయినను మన కెంతకష్టము కలిగినను నీవు పరులప్రాణము రక్షించినది ఘనకార్యము. నాప్రేమైక పాత్రమా! అందులోను మాళవాధీశుని విడిపించినది నాకత్యాహ్లాదజనకము.

ఇందిర—నాయనా! భారతీయునిఁ జంపుచున్నారను మాట నాకు సహింపరానిబాధ కలుగఁజేసెను. ఒక వేగమైన బుద్ధి నన్నీడ్చుకొని పోయినది. దానికి నేనిప్పుడు వ్యసనపడలేదు.

మిత్రానందుఁడు—కుమారీ! నీవుచేసిన మహోపకారమునకు మిక్కిలి సంతసించితిని. మనకు స్థిరనివాసమగు స్థలమును విడువవలసిన కారణము వచ్చెను. నాకుఁగాను నేనెంతమాత్రము చింతింపను. చిన్నతనమునుండి సకలాపదలనుండి తప్పించి నిన్నుఁ గాపాడితిని. ఇఁక నిచ్చటనుండి నిన్నెక్కడికిఁ దీసికొనిపోవుదును? అందుకై పరితపించెద. ఇఁక నీవు బయటికిఁ జనవలదు. సకలకష్టములనుండి యొకవిధముగా రక్షించిన యీశ్వరుఁడున్నాఁడు. దానికిఁ దోడుగా మనయశ్వమును గాపాడవలసియున్నది.

ఇందిర—నాయనా! ఈ నిర్జన నివాసము మన పెద్దలకాణాచియా? మీరేల యిట్లు వగచెదరు? మనమేల హిందూదేశమునకు బోఁగూడదు?

మిత్రానందుఁడు—తల్లీ! యిందిరా! మనము హిందూదేశమునకుఁ బోవుట తగనిపని. స్వప్నావస్థయందును నది జరుగదు. ఇండియా దేశము మనకు నివాసయోగ్యమగు స్థలముకాదు. పదునేనుసంవత్సరములనుండియు నే నీభూమి నింతసారవంతమైనదానిగాఁ జేసి యిన్నివృక్షములఁ బెంచి దీనివలన సుఖముగా జీవించుచుంటిని. ఇఁక మన మిక్కడనుండి వెడల వలసినవారమే. త్రోవలో నాపదకు లోఁబడుదుమేమో యని సందేహించెద.

ఇందిర—జనకా! చండసేనుఁడు మన కేల చెఱుపు చేయును? వాఁడు మనచేత నెంతయు నాదరణ నొందినవాఁడుగాఁడా? ఎన్నిమాఱులో యాపదలనుండి మీరు వానిని దప్పించియుండలేదా? అథవా వాఁడు తమమీఁద దౌర్జన్యముచేసినట్లయిన దమరు భయపడుదురా? సింగమున కాఁబోతొక్క లెక్కయా? ఆనీచుని గుఱించి యింత వగవనేటికి?

మిత్రానందుఁడు—పుత్రీ! ఆ నీచునిమీఁద నా భుజపరాక్రమము చూపుట? పిచ్చికమీఁద నా బ్రహ్మాస్త్రము ప్రయోగించుట? అయ్యో మిత్రానందా! నీసాహస మెచటకిఁబోయె? అమ్మా నే నిట్లేకాంతినై జనుల కంటికి గనఁబడక జీవింపవలయునని నానొసట విధాత వ్రాసియుండఁగా

వానిని నే నెట్లు జయింతును? ని న్నెట్లు రక్షించుకొందును? ఈ దీవి విడిచిన పిమ్మట మనకు నివాసస్థాన మెయ్యది? నాకేమియుఁ దోఁపకయున్నది.

ఇందిర—జనకా! మీరు నా కిచ్చినచనవు వివిధప్రశ్నలకు నన్ను బురికొల్పుచున్నది. అవి యేవి యన, తమముఖశ్రీఁజూడ గొప్పవంశసంజాతులనియు, యుద్ధవీరులనియు, ఏదియో విపత్తునకు లోనైయున్నారనియు నూహించుచున్నాను. మఱియు నాతల్లి లోకాంతరగతురాలైనందున నాదుఃఖమున కోర్వక పసిబాలయగు నన్ను రక్షించుటకై యిందు నివసించి యున్నారో నే నెఱుఁగను. నాతల్లి నిగుఱించియు, మనబంధువులగుఱించియుఁ దెలియదు. తండ్రీ! నేను యుక్తవయసు గలదానను గానా? మనస్వగృహ విషయము స్వజనవిషయముల నే నెందులకు దెలిసికొనఁ గూడదు?

మిత్రానందుఁడు—అమ్మా, యిందిరా! ఇఁకమీద దానినిగుఱించి మాటలాడ వలదు. ఈ నాజీవితకాలము మర్మముగానే యుండనిమ్ము. విషము వంటి నాదుఃఖము నీ కోమల హృదయమును ప్రవేశించి నిన్నంతమొందించు నేమోయని భయపడుచున్నాను. నాముద్దుచిలుకా! నీ సుందరముఖారవింద దర్శనమువలననే కదా ఈ యనాథుఁడగు మిత్రానందుఁ డింకను జీవించి యున్నాఁడు!

అని తనూజాతను గౌఁగిలించుకొని వెక్కి వెక్కి ఏడువసాగెను. ఇంతలో బయట కాలిచప్పుడు వినవచ్చెను. ఒకపనికత్తె లోపలికివచ్చి, "స్వామీ! చండసేనుని ఖైదులో నుండిన రాజకుమారుఁడు మరణావస్థలో నున్నాడు. అతనిని ఓడ నెక్కించుటకు సాధ్యము లేక యతని పనివాఁడు మనతోటవారి సహాయముతోఁ దమయింటికిఁ దీసికొనివచ్చినాడు. ఆపని వాఁడు తమకు విన్నవింపుమని నన్ను బతిమాలుకొన్నందున తమకు తెలియఁ జేసితిని అని" చెప్పెను.

మిత్రానందుఁడు—నా ప్రియతనయా! దేనికి దుఃఖింపకుము. ఇన్ని దినములవఱకు మనల సుఖముగాఁ గాపాడిన యా యీశుఁడే మనకు దిక్కు. ఆరోగికి మన ముపచరింపవలసిన విధాయక మున్నది. అతఁ డెట్టి ప్రభువు? అతనికి వచ్చినగతియేమి? ఈశ్వరుఁ డతని నిపుడు నాసంరక్షణకుఁదెచ్చివిడిచెను. ఇదియు నతనివిలాసమే. (ఆకాశమువంక చూచి) ఓ భగవంతుఁడా! కృపానిధీ! నేను నిరపరాధిని. ఏ పాప కర్మము చే తనోఁ యిట్లు బంధితుఁడ నైయున్నా" నని యనుకొనుచుఁ బనికత్తెతో శీఘ్రముగాఁ బోయి యారోగిని నాపెద్దగదికిఁ దెమ్మని చెప్పుము"అని బయటికిఁబోయెను. ఇందిరయును నారాజపుత్రునకు సేవఁజేయుసందర్భము దొరకెఁగదాయను నుత్సాహమును తనతండ్రికిఁ గల రహస్య మేదై యుండు నని యాలోచనయును గలిగి యింటిపనులను విచారించుటకై పోయెను.



# షష్ఠాధ్యాయము



## ఆమె యెవరు?

మిత్రానందుని యాజ్ఞవలన నీతనిగృహమునం దొకశుభ్రమైన గదిలో మెత్తనిపడుక నమర్చి నమందు నమువిూఁద లలితకుమారుని పరుండఁ బెట్టిరి. అతని కీప్రపంచజ్ఞానమే లేదు. ఆహారములేక మూర్ఛపోయి యున్నాఁడు. జ్వర మతితీవ్రము. అయిదునిమిషములలో నాహారము సిద్ధమాయెను. మిత్రానందుఁడు తాను ప్రక్కను నిలిచి తనచేతినుండి కొంచెము కొంచెముగా పాలను త్రావించెను. ఇందిర తనతండ్రికిఁ బాల నందిచ్చుచుండెను. పలయుపాలను త్రావించి కంబళికప్పి కావలిగా సేవకులనుంచి పోయెను. ఇందిరయును తన పనికత్తెల నప్పుడప్పుడు చూచుచుండఁ డని నియమించి కాలమతిక్రమింప నీకయౌషధము పాలు మొదలగునవి యిప్పించుచు నుపచరించు చుండెను.

ఇట్లుకొన్ని దినములు గడచిన పిమ్మట లలితకుమారునకు జ్వరముతగ్గను. లేచునంతటిశక్తి లేకున్నను కన్నులు తెఱచుటకు, మాటలాడుటకు శక్తి కల్గి యుండెను.

ఒకనాఁడు ప్రాతఃకాలమునఁ గన్నులు దెఱచి నలుదిక్కులు పాఱఁజూచి నిట్టూర్పువిడిచి "మే ముండుస్థలమెయ్యది?" యనెను. ఎల్లప్పుడు రాజుపాదములయొద్దఁగూర్చుండి సమయమునకుఁ దగినసేవ యొనర్చుచున్న శంబరుఁడు పెన్నిధిగన్న పేదవలె "మహాప్రభూ! ఒకసుఖకరమగు స్థలమం దున్నాము. వ్యసనపడవలదు. ఈశ్వరుఁడు మనల రక్షించు నని యెంచెద. మనముండిన కారాగృహమున కిది చాలదూర" మని పలికెను.

లలితుఁడు:—నా ప్రియమిత్రమా! కారాగారమందును నన్ను విడువక నన్నికష్టముల కోర్చి రక్షించుచున్నావా? నిన్ను నే మఱవఁజాల.

ఇంతలోఁ బనికత్తె వైద్యునిఁ బిలుచుకొనివచ్చెను. వైద్యుఁడు లోపలికి వచ్చి రాజు చేయిఁబట్టిచూచి మందిచ్చి కీళ్లకు మందురాయించి "ఇకమీఁదఁ ద్వరలో మీ రారోగ్యవంతు లగుదు"రని చెప్పి నమస్కరించి వెడలిపోయెను. సేవకులువచ్చి వేఁడినీళ్లలో శరీరమంతయుఁ దుడిచిరి. రాజునకు శుభ్రవస్త్రములు ధరింపఁజేసిపోయిరి. పరిశుద్ధమైనపడకమీఁద దిండునానికొని కూర్చుండెను. తత్క్షణమే సేవకుఁ డాసమయమునకు నోటి కింపైనట్టియు, రుచియైనట్టియు నాహారము తెచ్చిపెట్టెను. లలితకుమారుఁ డిట్లు ప్రతిదినము రాజోపచారములఁ బొందుచుఁ గ్రమముగా నారోగ్యవంతుఁ డగుచుండెను.

ఒకమధ్యాహ్నము సేవకుఁడు వచ్చి "ప్రభూ! మాయజమానుఁడు మిమ్ముఁ జూడవలె నని యోంచియున్నారు. తమకు దేహస్థితి యెట్లున్నదని తెలిసికొని రమ్మన్నార"నెను.

లలితుఁడు:—సేవకా! నాభాగ్యమువలనఁ గదా నీయజమానునకు నన్నుఁజూడ బుద్ధికలిగెను. నిర్వ్యాజకరుణానిధి యగు నామహనీయుని కృపవలనఁ గద నేను జీవించియుంటిని. ఆపుణ్యచరితుని ప్రేమవలన నా కారోగ్యము కలుగకుండునే? ఆతని పాదదర్శనమునకై ప్రతిక్షణము నెదురు చూచు చుండెదను.

సేవకుఁడు:—దేవా! నాయజమానుఁడు మిగుల కష్టప్రాణి, ఎల్లప్పుడు తన పనులయందే మగ్నమై యుండును. పరుల కుపకారము చేయుటయే యతని ముఖ్యమైనపని. తమకు జ్ఞానమువచ్చువఱకుఁ దమప్రక్కనే యుండిరి. అనిచెప్పి వెలుపలికి పోవుచుండఁగనే మిత్రానందుఁడు లోపలఁ బ్రవేశించెను. గంభీరమైన యాకారము, నిగనిగలాడు వెండ్రుకలు, మనోహరంబులగు నేత్రములు, విశాలమగు ఫాలదేశము, అంతటి సుందరాకారమునకుఁ దగు దేహవర్ణముమాత్రము మాఱియుండునట్లు తోఁచెను. సాధారణమగు దుస్తులు ధరించుకొని తనసమీపమునకు వచ్చుమనుష్యునిఁ జూచి లలితకుమారుఁ డులికిప

డెను. ఇంతగొప్పవాఁడు సముద్రపుదొంగలు అనాగరికజను లుండు నీప్రదేశమందు నివసించుకారణ మేమి? ఇతఁ డీదేశమునకుఁ జేరినవాఁడు కాఁడు. ఈ గంభీరాకారము రాజ్యము లేలుటకుఁ దగియున్నది. ఇది ఏమికారణమో యీశ్వరున కెఱుక! యని తనలో నాలోచించుకొనుచు మెల్లగఁ లేచి "ఓ ప్రాణదాతా! నీ కనేకవందనములు" యనెను.

మిత్రానందుఁడు:— ప్రభూ, ఈసేవకునివిషయమై యింత బహుమాన మెందులకు? నే నొకబీదవాఁడను. తమరు నాకునమస్కరింప వచ్చునా? మీరు రాజ్యమేలు ప్రభువులరు. నా భాగ్యవశమున మీకు సేవఁజేయు సందర్భము నాకుఁ గలిగినది. మీకుఁ జక్కఁగా నారోగ్యము కలుగునంతవఱకుఁ దా మిచటనే యుండిపోవచ్చును. ఇంతశీఘ్రముగా తా మారోగ్యసంతు లైనది నాకు మిక్కిలిసంతోషము. నేను సెలవు తీసికొనెదనని చెప్పి రాజునకు మాటలాడుటకు చోటియ్యక వెళ్లిపోయెను. లలితునకును నేమియుఁ దోఁపక యుండెను.

మఱుసటి దినమునందు లలితకుమారుఁడు తనమంచమును కిటికీప్రక్కను వేయించుకొని కూర్చుండి యేదియో గ్రంథము చదువుచుండెను. అచటఁ దనయెదుట తోఁటలో నెవరోతిరుగుచున్న ట్లతనికంటఁ బడెను. తదేకదృష్టితో నిదానించిచూచి "శంబరా! ఇది యేమి? ఆవనమందు నిలిచి పూలుగోయుచున్న బాలిక వనకన్యకవోలెఁ గనఁబడుచున్నది. ఆమె యెవరు? ఆహా యెంతటి సౌందర్యరాశి? ఈదివియం దీమె యెవరై యుండ నోపు?"నని యడిగెను.

శంబరుఁడు:—దేవా! ఆనాఁడు చండసేనునికోటలో భైరవాలయమునకు వచ్చి తమ్ము విడిపించిన బాలికవలె నున్నది.

లలితుఁడు:—అయ్యో! నే నెంతమందమతిని. నాకు ప్రాణదాన మొనర్చిన నాయదృష్టదేవతనే మఱచితిని. రాజులు మదాంధులనుటకిదియే

నిదర్శనమైయున్నది. శంబరా! ఆక్షణమే నాకు స్పృహతప్పిపోయెను. అదియునుం గాక, నా కుండిన దేహబాధవలన నీమె నంతగాఁ జూడలేదు. నిన్న నీయింటి యజమానునిఁ జూచితినిగదా? ఆయనరూపమును బోలియున్న దీబాలిక. అవియే సుందరనీలకుంతలములు—కమలంబుల ధిక్కరించు నేత్రంబులు—ఆకనుబొమ్మలతీరు—అన్నియు నవియే! ఈమె సర్వాంగసుందరి. ఈసౌభాగ్యలక్ష్మి యీస్థానమం దుండఁబట్టి యీభూమి యింతసస్యసమృద్ధిచే నొప్పియున్నది. ఈమె మిత్రానందుని తనూజాతయై యుండవచ్చును. ఆమెయు నచటినుండి వెడలిపోయెను. అంతలో నొకదాసి పుష్పగుచ్ఛము దెచ్చి లలితకుమారునిచేతి కిచ్చెను. దాని నందుకొని "పద్మాక్షీ! యీగుచ్ఛమును నాకుఁ బంపినవారికిఁ బదివేల వందనము" లనియెను.

మఱియొకదినము రాత్రిభోజనము ముగించి తనప్రక్కను బల్లమీఁద వెండిపాత్రలో నీళ్లుపోసి దానిలోనుంచియున్న రోజా, పుష్ప గుచ్ఛమువంకకుఁ దనదృష్టి నిలిపి యామె యెవరై యుండునని యాలోచించుచుండఁగ గాలి చప్పుడు విని మెల్లఁగా లేచి కిటికీనుండి చూచుచుండెను.

ఇందిర "జనకా! వెలుపలికిరండు, గాలి చక్కఁగా వీచుచున్నది యని తండ్రిని బిలిచెను." ఆ సుఖకరమైన కంఠధ్వనిని విన్న లలితకుమారుని గుండె కొట్టుకొనుచుండెను. లేచి యామాటలు వినవచ్చుప్రక్కకుఁ బోయి కిటికీయొద్ద కూర్చుండి చెవి యొగ్గి వా రిరువురిసంభాషణ వినుచుండెను.

ఇందిర:—తండ్రీ! ఈకొన్ని దినములలో నింతచిక్కిపోవుటకు కారణ మేమి? ఇన్ని దినములుగా నున్నవ్యసనముగాక నూతనవ్యసన మేమైనఁ గలిగినదా? చండసేనునిగుఱించి వ్యసనమా? తెలుపఁ బ్రార్థించెద.

మిత్రానందుఁడు:—అమ్మా యిందిరా! నాకు క్రొత్తవ్యసన మేమియును లేదు. నన్నుగుఱించి నీవు చింతిల్లకుము. మన యింటికి వచ్చియుండు నీరాజును జూచి నాకేదియో జ్ఞాపకమునకు వచ్చెను. ప్రియపుత్రీ! దానిని

గుఱించి మాటలాడుటయందు ప్రయోజనము లేదు. మానవులకంటికిఁ బడక యీదీవిలోనే మరణించుట నాకు మిగులసంతోషము. అదియును నానుదుట వ్రాసియుండునట్లు కనఁబడలేదు. నాతల్లీ! నీగతి యేమి? యని యొకనిట్టూర్పు విడిచెను.

లలితుని జూచి, యేదిగో జ్ఞాపకమునకు వచ్చెనని తన తండ్రి చెప్పఁగా, ఇందిరగుండెలు జల్లుమనియె. 'ఇది యేమి యాశ్చర్యము? ఈరాజును జూచి నాతండ్రికివ్యసన మెందులకో? ఇది వింతగానున్నది. యని యాలోచన చేయుచుండఁగ, మిత్రానందుఁడు తనబిడ్డమనస్సు త్రిప్ప నెంచి, 'యిందిరా! లలితకుమారుని శరీరస్థితి నేఁ డెట్లున్నదని మలయవతిని విచారించితివా?' యనెను.

ఇందిర:—అడిగితిని. వారు బాగుగనే యున్నారు. బలహీనత తప్ప వారిదేహమందే రోగము లేదని వైద్యుఁడుచెప్పెను. అభ్యంగస్నానముచేసిరి. ఇపుడు ప్రతిదినము స్నాన మాచరించుచున్నారు. పథ్యము సరిగాఁ బంపుచున్నాను. ఇంకను బైటికిరాలేరని తోఁచుచున్నది.

లలితుఁడు "ఎంత వినయసంపద! ఏమిగౌరవము! లలితకుమారా? నీవే ధన్యుఁడవు. ఆదేవి ని న్నెంత యాదరించుచున్నదో కనుఁగొంటివా, ఈశ్వరా! ఇది నీయనుగ్రహ మని" చెప్పుకొనుచు నిద్రించెను.

లలితకుమారున కారోగ్యము గలిగినపిమ్మట బైటికివచ్చి యందఱితోఁ గూడి భుజించినదిన మొకపండుగదినముగా నెన్నఁబడెను. మిత్రానందుని గృహమందుఁ దా నొకబంధువువలె సమస్తసమాచారములను తెలిసికొనెను. ఇందిర కపటము లేని బాలిక. తనగృహకృత్యముల నన్నిటిని మిగుల నేర్పుతో నెఱవేర్చును. లలితకుమారునితో నెప్పుడును మాటాడియుండలేదు. అయినను నామెయుపచారమువలననే లలితకుమారుఁ డింతశీఘ్రముగా నారోగ్యస్థితిని బొందెనని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

ఒకసాయంకాలమందు ఇందిర తాను ప్రతిదినము ధరించుకొను తెల్ల చీరను గట్టుకొని, సుందరములగు తనవెండ్రుకలను దువ్వి, పైకెత్తి కట్టుకొని, మల్లెమొగ్గలు గుట్టి ముడుచుకొని, యష్టమినాఁటి చంద్రునిఁ బోలు నొసటి యందు కుంకుమబొట్టు నలంకరించి, సహజసౌందర్యాధిదేవతయో యన్నట్లు తోఁటలోఁ దిరుగుచుండెను. ఆమెతోఁగూడ మలయవతియును దిరుగుచుండెను. పూలనుదీసి యచటఁ గూర్చుండి "ఇది మా నాయనగారికి, ఇది మాయింటికి వచ్చియుండు రాజునకు" అని మలయవతితోఁ జెప్పుచుఁ జెండ్లను గట్టి పెట్టుచుండెను. వెనుక మనుష్యుల పచ్చుశబ్దము విని లేచి తిరిగి చూడఁగనే, లలితుఁడు నిలిచియుండెను. మనయిందిర సిగ్గుతోను, భయముతోను తల వంచి నిలువఁబడియుండ లలితకుమారుఁడు సమీపమందున్న శిలావేదికపైఁ గూర్చుండి వినయముతో "ఇందిరా! నీకృపాకటాక్షముచే నెప్పటివలె నారోగ్యవంతుఁడనైతిని. ఓ స్త్రీరత్నమా! తొలుతఁ బ్రాణదానమిచ్చితివి. పిమ్మట వ్యాధిగ్రస్తుఁడనైన నన్ను శుశ్రూషాహారములచే రక్షించితివి. అట్టినీకు నే నేమి ప్రత్యుపకారం బొనర్చువాఁడ? ఈదేహంబు నీయది. ఈనీసేవకుని నేమి చేయుటకు నీ వాజ్ఞాపించిన నది నీ మహోపకారంబునకు సాటియగునా? మహానీయుఁడగు నీతండ్రిని వర్ణింప నేరితరము? నాకు సెలవొసంగితివేని నారాజ్యమునకుఁ బోవలయునుగద? ఈమాట నిన్నడుగుటకు నానోరాడకున్నది. నావియోగమువలన నాబంధువు లెంత విలపింతురో యెఱుఁగను.

ఇందిర ఆమాటవిని స్తంభితురాలై కనురెప్పవాల్పక యతనిముఖము నే చూచెను. ఆస్థితియందున్న యిందిరను జూచి "బాలికామణీ! కోపింపకుము. నామనోనిశ్చయంబును నీ కెఱింగింపక, నీస్వభావమును దెలిసికొనక పోవునంతటి కృతఘ్నుఁడను గాను సుమా! నీవు కన్యకవని నేనెఱుంగుదును. అందువలన నీవు కాపాడినయీశరీరమును, ప్రాణములను నీ కర్పించితిని. ప్రియా! నన్ను నీసహాధరునిగా ననుగ్రహింపుము. ఇదియె నావిజ్ఞప్తి." ఇందిర మాఱుమాటాడక నిలిచెను.

లలితుఁడు:—"గుణనిధీ! నామాట నీ వంగీకరింపవా? అటులయిన, మనస్సు నీయధీనంబొనరించి భార్యయుక్తమైన యీశరీరము వహించియున్న యీయనాథుఁ డేవిధమున నీప్రపంచమందు మెలఁగఁగలఁడని నీవు యోచింపలేదా?" ఆమాటవినఁగానే, ఇందిర హృదయవిదారణ మైనట్లుండెను. కండ్లనుండి రెండశ్రుబిందువులు తనకుఁ దెలియకయే జాఱెను. గద్గదకంఠము నడంచుకొని "రాజేంద్రా! నాతండ్రికి నేనుదప్ప వేఱుబంధువులు లేరు. ప్రాణములకంటె నెక్కువగా రక్షించుచున్న నాకన్నతండ్రియాజ్ఞకు లోఁబడవలసిన యీశరీరమునకు నే నెట్లధికారిని? ఇట్టివిషయమందు మీకు నే నేమిప్రత్యుత్తర మియ్యఁగలననెను.

లలితుఁడు:—"మనోనాయికా! నిజము నే పలికితివి. నేనును నాశరీరమున కధికారిని గాను గనుక నే నాప్రాణములన్నియు నీదీవియందే యున్నను శరీరమునుమాత్ర మన్యకార్యముల కుపయోగింపవలసినదిగానున్నవి. ఉభయుల సంకల్పము లేకీభవించియున్నట్టయిన, బహిఃకార్యములు శీఘ్రముగఁ గాని యాలస్యముగఁగాని జరగును. ఆవిషయము విశదముగాఁ దెలియఁగోరి నే డిటకు వచ్చితిని."

ఇందిర:—"రాజేంద్రా! నేనొక సామాన్యగృహస్థునిబాలికను. మీరు రాజ్యము నేలు రాజులరు. మీ రిట్లు వర్తించుట అధర్మ మగునేమో."

లలితుఁడు:—"ఇందిరా! నన్నంతటిమూఢునిగా నెంచవలదు. నీతండ్రి యొక గొప్పవంశమునకుఁ జేరినవాఁడుగాని సామాన్యుఁడు గాఁడు. భూషణములచేతను, వస్త్రములచేతను నెంతమార్పుకలిగియున్నను నీ వొకమహారాజునకు భార్యవుగా నుండవలసినదానవేకాని సామాన్యురాలవు కావు. ఒకవేళ నీ వనినట్లు సామాన్యబాలికగానే యుండుము. నాప్రియమున కది గొప్పబాధకము గాదు. ప్రపంచమందు పవిత్రమైనప్రేమ, దోషరహితమైన గుణములుగల దాంపత్యము వారి సదాచారమువలన వృద్ధిఁబొందునుగాని జాతిభేదము లట్టి

సంబంధమును కలుషితముగాఁ జేయజాలవు. మానవు లంతటిగొప్ప తాత్పర్య ములనర్థముఁ జేసికొని నడచుసామర్థ్యము లేనివారు గనుక ప్రారంభదశలో నట్టి యాజ్ఞలకు లోఁబడియుండుటయే ధర్మము. నీ వట్టిదానవు కావని నాయంత రాత్మ నాకుఁ జక్కఁగాఁ బోధించుచున్నది. ఏమైనను నీవు నాజీవితేశ్వరివిగా నుండఁదగినదానవు. నేనేల? ఎన్ని సంవత్సరములు గడచినను నీకై వేచి యుండెద. నీకు నో వాంఛితం తెలుంగవలయు నని సంభాషించితి నే కాని, నిన్నుఁ గాని, నీతండ్రినిగాని బలాత్కరించుట నామతంబు కాదు.

మనయిందిర చందసేనునికోటలో ప్రవేశించినపుడు చందురునిం బోలు మోముతీరును, ఆకర్ణాయతములగు వానినేత్రద్వయమును, విశాలవక్షస్థ్సల మును, శుష్కించియున్నను గజతుండంబులం బోలియున్న వానిబాహుదం డంబులను నతనిదేహకాంతిని జూచిననిముసమందే తనహృదయపీఠమం దతనికి స్థలం బొసంగి తన్నతని కర్పించుకొన్నది. అయినను వీరాగ్రేసరుఁ డగు యోధునివంటి ధైర్యశాలిని యగునిందిర తనయభిప్రాయమును బైలుపఱచు నట్టిది గాదు. శ్రవణానందకరము లగు లలితకుమారునిమాటలు విని యుప్పొం గినసంతోషము నడంచుకొని, దేవా! మీ రింతస్థిరచిత్తము గలవారైన, నం తియ చాలును. దృఢమనస్సు గలవారు లోకములనుగూడ జయింప సమర్థులు. మీదృఢసంకల్ప మీశ్వరుఁడు నెఱవేర్చుఁగాక!” యని చెప్పి మెల్లఁగ నచట నుండి వెడలిపోయెను.

లలితుఁడు:—న న్నీదీవికిఁ దెచ్చినట్టి యీశ్వరునికి వందనంబులు. ఈయుత్తమస్త్రీలలామము నన్ను తనవానిఁగా భావించియున్నది. ఆదేవిచే దేవశబ్దంబుచేఁ బిలువఁబడిన నేను ధన్యుఁడ. కాల మన్నిటిని సమకూర్చును.

మఱుసటిదినమురాత్రి యందఱు వరుసగా కూర్చుండి భోజనము చేయు చుండిరి.

మిత్రానందుఁడు:—రాజేంద్రా! మీ రారోగ్యముగలవారైన దాదిగా మీ దేశవృత్తాంతమును వినవలయు నని కోరికగలదు. నాపనులతొందరవలన

డానిని మఱచితిని. మీరాజస్థానమందు రాజ్యస్థితు లెట్లున్నవి? ఇపు డుదయపురికి రా జెవ్వరు? అతనికి సంతతి గలదా? అతనిస్వభావ మెట్టిది? మీకుఁ బట్టాభిషేక మైనదా? మీభార్య యేదేశపురాజపుత్రి?

లలితుఁడు:—ఆర్యా! ఇపు డుదయపురిని మదనపాలుఁ డనురా జేలు చున్నాఁడు. అతనివశమందే నాతలిదండ్రులు రాజ్యమును, నన్ను నప్పగించి దివి కేగిరి. మదనపాలుఁడు సుగుణవంతుఁడు. దయాళువు. అయినను, హిందూదేశమందుఁ బ్రసిద్ధిఁ జెందిన మేవారురాజ్యము నేలి కీర్తి దెచ్చునంతటిశక్తి యతనికి లేదనియే నానమ్మకము. నేను పసివాఁడను. అనుభవము చాలనందున నాయభిప్రాయము తప్పై యుండవచ్చును. ఎటులైనను, అతనియొక్కయు, నిపు డానిపెంపుడుతల్లి యని పిలువఁబడునట్టియు మురళాదేవి చనిపోయిన ప్రతాపసింహరాజుగారి రెండవభార్య. ఈమె నతనిముందిడి తాను రాజ్య మేలుచున్నది. ఇతఁడు నామమునకు రాజు. ఆమెమిగులసాహసవతి. క్రూరురాలనికూడ జనులుచెప్పుచుందురు. ఈమె కుట్రలుపన్నుటయందు చతుర. అదియును జను లాడుకొనుమాటలే. దేశాంతరమందు గతించిన తనపెద్దకుమారుఁ డగువిక్రమసింహమహారాజుభార్య యగుహేమప్రభాదేవిని తనపెంపుడు కుమారునకుఁ బునర్వివాహము చేయవలయునని పట్టుదలతో నున్నది.

మిత్రానందుఁ డామాటవిని పిడుగుపడినమ్రాఁకువలె, తాను కూర్చుండిన యాసనమునందు మూర్ఛితునివలె, వెనుకకు జాఱెను. తనకు స్పృహ తప్పునట్లే తోఁచెను. ధైర్యశాలి గనుక నావికారము నడంచుకొని యోపికతో లలితకుమారా! పునర్వివాహమున కామె యొప్పుకొనినదా?

లలితుఁడు:—ఆర్యా! మురళాదేవి యూరకపోనిచ్చునది కాదు. గొప్ప శాస్త్రవేత్తలఁ బిలిపించి సకలశాస్త్రములను బరిశోధించి “నష్టే మృతే ప్రవ్రజితే క్లీబేచ పతితే పతౌ, పంచ స్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే”యని యున్నదిగనుక నట్టి స్త్రీలు పునర్వివాహముచేసికొనవచ్చునని

శాస్త్రమునందు చెప్పియున్నదఁట. హేమప్రభాదేవిగారిభర్త దేశాంతరగతుఁడై పదునాల్గు సంవత్సరములు గడచినవి. ఢిల్లీచక్రవర్తిగా రతనిని వెదకించుట కెంతయో శ్రద్ధ వహించియుండిరి. అతఁడు పోయినకొన్ని నెలలకే వారి బిడ్డను పులి తినినదఁట. ఇదిగాక యతని సమాచారమునుగూర్చి తెలిసినవారే లేరు. రాణికి యౌవనదశ, రతీదేవిని మించిన సౌందర్యము, సంపద మున్నగునవి గూడియుండఁగ, శాస్త్రము లనుజ్ఞ నిచ్చియుండఁగ, నేల చేసికొనఁగూడదు? ఆమె గ్వాలియర్ రాజగు రూపసింగ్ గారితనయ. ఆమెకుఁ దండ్రి కొన్ని గ్రామముల నిచ్చియుండెను. ఇపు డీమెయన్నగారును కాలగతి నొందిరి. అతనికుమారుఁడు విజయసింగు పసివాఁడు. ఆచిన్నవానితల్లి మాలతీదేవి మంత్రులసాహాయ్యంబున రాజకార్యముల జరుపుచున్నది. ఆమె తనభర్తసోదరి యగు హేమప్రభాదేవిగారిని దనసోదరికన్నను మిగుల నెక్కువగా ప్రేమించునదే గాక తనయేకపుత్రి యగు విమల నీమెయొద్దనే విడిచియున్నది. ఇంతకును ఆమె పునర్వివాహమునకు సమ్మతించిననో లేదో నాకుఁ దెలియదు. అయినను మదనపాలుఁడు పలుమా రామెయంతఃపురమునకుఁ బోవుచు భోజనాదు లొనరించుచున్నాఁడు. ఆమెకోటలో పరాక్రమశాలు లగు కొందఱుశూరు లామె నతిజాగరూకులై కాపాడుచున్నారు. వారును నితఁ డనటికి పలుమాఱు పోవుటకు సమ్మతించియే యూరకున్నారు.

మిత్రానందుఁడు:—అహా! అభయసింగ్ కూడ స్వర్గవాసియయ్యెనా? ఆరాజ్యమున కెట్టియాపద వాటిల్లె!

లలితుఁడు:—మీరు భరతఖండమును జూచినారా? వారందఱ మీ రెఱుఁగుదురు?

మిత్రానందుఁడు:—కుమారా! నే నీభూమండలము నంతయు నొకసారి ప్రదక్షిణముఁ గావించినాను.

లలితుఁడు:—ఆర్యా! అట్లయిన మీ రేటి కా దేశమున నుండఁగూడదు? ఇచ్చట నెందులకు మీనివాసము స్థిరపఱచుకొన్నారు?

మిత్రానందుఁడు:—కుమారా! నాకిదియే సుఖమైనప్రదేశము. రాజా! మీకు నిద్రవేళయైనది. మీరు శయ్యకుఁబోవచ్చునని చెప్పి వెడలిపోయెను. ఇది యంతయు శ్రద్ధగా నాలకించుచుండిన మన ఇందిరయును సనయపాంగదృష్టిని లలితకుమారునిమీఁదఁ బ్రసరింపఁజేయుచుఁ దండ్రివెంబడిఁ బోయెను.

ప్రయాణము సిద్ధమాయెను. మార్గమధ్యమునందు లలితకుమారునకు సౌఖ్యముగా నుండుటకు వలయువస్తువుల నేర్పఱచిరి. మిత్రానందుఁడు రాజుతో, రాజా! మనయోడ నేఁడే వచ్చును. నేఁటిరాత్రిప్రయాణమునకు ముహూర్తము మిగుల ప్రశస్తమైనది. యని చెప్పునంతలో నొకసేవకుఁడు జాబులకట్ట నెత్తుకొనివచ్చి మిత్రానందునిచేతికిచ్చెను. మిత్రానందుఁడు తనజాబులన్నిటిని దీసిచూచుచు నందు లలితకుమారుని పేరితో నుండినయొకజాబు నెత్తి యతని చేతి కందించెను. అతఁడును దానిని దీసి చదివి, మిక్కిలి యాశ్చర్యముతో "ఆర్యా! కార్యములు చేకూరుసమయంబున నన్నియుఁ జేకూరవచ్చును. లేనియెడల నన్నిటికిని నేదోయొకవిఘ్నము కలిగి కార్యభంగం బగుచుండును. ఈయుత్తరము నే నిచటికి వచ్చినపుడు నాతోఁగూడి వచ్చినవారు వ్రాసినది. వారిని చండసేనుఁడు విడిచిపెట్టినపిమ్మట వారును రాజ్యము చేరి రోగ మనుభవించి నన్ను వెదకుచు నిచటికి నోడలో వచ్చుచున్నారు. మీశీతలకృపవలన నా కారోగ్యము కలిగినది. స్నేహితులు దొరకినారు. అయినను నింకముందు నాజీవితసుఖమునకుఁ బ్రధానం బగు మఱియొక ముఖ్యమైనకోరిక కలిగియున్నది. మీరు నాప్రాణదాతలరు. నామానసికసౌఖ్యముగూడ మీమీఁదనే యాధారపడియున్నది. నేను బోవుటకుముందు నాయుదంతమును మీకు విన్నవింప నాసగొనియున్నాను. నామీఁద దయయుంచి యాసంగతిని తెలిసికొని దానికి ప్రత్యుత్తరం బొసగవలయు నని మిమ్ము వేఁడెదను.

మిత్రానందుఁడు:—"రాజచంద్రమా! మీరు మహారాజుగారై యుండి కృషీవలుఁడ నైన నన్నిట్లు పొగడఁదగునా? మీస్తోత్రములకు నేను పాత్రుఁ

డను గాను. స్తోత్రమునకు పాత్రుఁడు కానివానిని స్తుతించుట వాని నవమానపఱచినట్లు వానికిఁ దోఁచును. నే నన్ని దేశములును సంచరించినవాఁడను. కావున మీ ఘనత నెఱింగినవాఁడను. మీ సేవ నాకు దొరకినది నా సుకృతంబని యెంచితి. నా శక్తికొలఁది సహాయం బొనరింపవలయు నని నా సంకల్పము.

లలితుఁడు:—ఓ కుశాగ్రబుద్ధీ! నేను పూమాటలకు మోసపోవువాఁడను గాను. మీ ప్రథమదర్శనమందే మీ రొకగొప్పవంశమందు జనించినవా రని తోఁచినది. అది యటుండనిండు. మీ కుమారీరత్నమును జేపట్టు ధన్యుఁ డెవఁడు? నే నట్టి భాగ్యంబునకుఁ బాత్రుఁడ నగుదునా? కానా? యని శంకించెద.

మిత్రానందుఁడు:—రాజేంద్ర! ఇది యేమి యాశ్చర్యము? ఇట్టి యాలోచన మీకుఁ గలిగియున్న దని కలలోనైనను నేఁ దలఁచి యుండలేదు. నే నొక వ్యవసాయకుఁడను. ఇట్టి నీచకులంబునఁ బుట్టిన నా కన్యను మీరు వివాహము చేసికొనవచ్చునా? నా కుమారి యెట్లు రాజపత్నియగుట కర్హురాలు?

లలితుఁడు:—మహాశయా! నా బుద్ధి యట్లపాత్రమునందుఁ బ్రవేశింపదు. ‘సతాంహి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః’ అని చెప్పిన దుష్యంతుని మఱచితిరా? ఆమె యొకగొప్ప ప్రభుని కుమారి, మఱియొక రాజ్యలక్ష్మికి సపత్నిగా నుండునంతటి ప్రతిభాశాలిని. ఈ విషయమందు మీ మాట నమ్మఁజాలను.

మిత్రానందుఁడు:—రాజా! అది యెట్లున్నను నామె విషయమునందు మహాకళంకము సంభవించియున్నది. అది నివృత్తి యగునది కాదు. అందువలన నా యిందిర వివాహము చేసికొనునంతటి భాగ్యవతి కాదని చెప్పుట కెంతయో చింతిల్లెద.

లలితుఁడు:—మహాశయా! మా యిరువుర ప్రేమబంధముల కిట్టి కల్మషములు బంధకంబులు కాఁజాలవు. మా యిరువురకుఁ బవిత్రప్రేమ యున్నది నిజమైనచో, మీ రెంచియున్న కళంక మెట్టిదో దానిని మాకుఁ దృప్తిఁబొం

దించుటకై పరీక్షించి మే మిరువుర మాకళంకమును బోఁగొట్టి యనంతరమే నే నీయిందిరాదేవిని నా జీవితేశ్వరిగాఁ బరిగ్రహించెద. అదివఱకు కొన్నికష్టములనైన నోర్చియుండెద. ఇదియే నాసత్యప్రతిజ్ఞ. అట్టికళంకము తనకుఁ గలిగియున్నదని తెలిసి మీకుమారియే ట్లూరకయుండును?

ఈమాటలు వినుచున్న మిత్రానందుఁడు స్తంభీభూతుఁడై నిలిచెను. ఇందిరమూర్ఛచే స్తంభమున కొరగెను. గృహమంతయుఁ గొన్నినిముసములవఱకు నిశ్శబ్దముగా నుండెను. అంతలోఁ బరిచారికలు వంట సిద్ధమైన దని విన్నవించిరి.

మిత్రానందుఁడు:—రాజేంద్రా! భోజనమునకు రండు. రాజకుమారా! నీమనస్థైర్యము నే నెఱుంగుదును. ఇట్టిపవిత్రబుద్ధి గలవాఁడ వెంతటికష్టమునకును, వ్యసనమునకును లోఁబడితివి. ధర్మబుద్ధి గలవారి కెంతకష్టములు గలిగినను దైవంబు తోడుగా నుండును. మనకష్టముల నోపికతో సహించి యుండవలయు నని సంభాషించుచు నిజపుత్రికాసమేతంబుగా భోజనమునకుఁ బోయెను.

మిత్రా:—కుమారా! సేవకులు ఓడ వచ్చియున్నదని చెప్పుచున్నారు. నే నిదివఱ కాడినినిష్ఠురవాక్యంబుల మన్నింపఁ బ్రార్థించెద. ప్రభూ! నీవంటిసద్గుణనిధానం బైనవరుఁడు నాపుత్రికకు లభించు టెంతసుకృతము. నాకుమారి నిన్ను బ్రేమించి యున్నదని నే నెఱుంగుదును. అయినను నేనిట్లు కఠినచిత్తుఁడనగుటకు గొప్పకారణం బున్నయది. కనుక నీవు సదుత్తరం బిచ్చుట కసమర్థుఁడవై యున్నాఁడవు. కాలచక్ర మెట్లు పరిణమించునో, ఈశ్వరుఁ డెఱుంగును. మనయిరువురకు స్నేహబాంధవ్యము గలుగఁజేసిన పరమాత్ముఁడే రక్షించునని యోపికతో నుండుటయే నామతము. నాపుత్రియును నావలెనే ధైర్యస్థైర్యగుణములు గలబాలిక. ఇంతకన్నను నే నేమిచెప్పుటకును దోఁపలేదని గద్గదకంఠముతో నతనినాలింగనం బొనరించెను. లలితకుమారుఁడును, కన్నీటితో నతనికి నమస్కరించి మహాశయా! ఈ మీవచనమే నాకు గురూపదేశమువంటిది. దేవీయిందిరా! నేను బోయివచ్చెద. ఈ నీదా

షుని మఱవకుమని చెప్పి యామె నోరకంటితోఁ జూచుచుఁ బోయి బండి నెక్కెను.

ఇందిర తనమనోనాయకుని పోవుటను జూచి బలుకు చెప్పుటకు నోరాడక నిమేషశూన్యయై దేవతవలె నిలిచి జాలమార్గంబున నతని నే చూచుచు నిలిచెను. తనకండ్లయందు ధారాసంపాతముగాఁ గాఱుచున్న కన్నీళ్లనుగూడ గుర్తింపలేదు. ఇంద్రియంబులు తమవ్యాపారంబులఁ దమంతటఁ జేయుచుండఁగా బాహ్యప్రపంచంబును మఱచి బ్రహ్మమందు మనంబు లీనంబుఁ జేసిన యోగినివలె లలితకుమారునియందుఁ దనమనంబు నర్పించినట్లు కనఁబడెను. మిత్రానందుఁడు చింతాసాగరమగ్నుఁడై యొకచోటం గూర్చుండి యాలోచనాపరంపరలను నలలలోఁ గొట్టుకొని పోవుచుండెను.

కొంచెము సేపిట్లు గడచిన పిమ్మట మహాశూరునివంటి ధైర్యసంపన్న యగు నిందిర తనమనస్సును స్థిరపఱచుకొని ఛీ! హృదయమా, చలింపకుము? ఆపదలు సంభవించినపుడు ధైర్యము గ్రుంగుట సజ్జనులలక్షణము కాదు. 'కీర్తిశ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా' యని భగవంతుఁడు చెప్పినట్లు స్త్రీజన్మంబున నిన్నిగుణంబుల సంపాదింపని జన్మ మేటికి? నేనిట్లు చింతానిమగ్నురాలనై యున్న దిక్కులేని నాప్రియజనకునిగతి యేమి? మహాకారణం బొకటి యున్నదని నాతండ్రి నాప్రియునితోఁ జెప్పెను. అది యేమి? దానిఁ దెలిసికొని సాధించుటకై చేయఁదగినకార్యము నాలోచింపవలెను. "మేమిప్పుడు నీ కళంకమును బోఁగొట్టుటకై యత్నించెద"మని నామనోనాయకుఁడు చెప్పెను. అటులు చేసెదనని దృఢపఱచుకొని తనగదినుండి బైటికివచ్చెను.

---

# పంచమాధ్యాయము



మఱుసటిదిన మప్పుడే బాలభానుఁ డుదయించుచుండెఁ బుష్పములు తమ్మునాజగత్సాక్షి కర్పించునందమున వికసితంబులై యుండెను. అట్టిసమయంబున భృంగనినాదంబులు స్తోత్రపాఠకులగానంబై యొప్పియుండెను. అప్పుడా మిత్రానందుని గృహారామంబు మిక్కిలి సుందరముగా నుండెను. ఆ రోజాపూలమనోహరత్వము × విచ్చినమల్లెపూవులతావులు × ఫలభారంబులచే నిండినవృక్షపంక్తుః—చూచువారిమనంబుల నాకర్షించుచుండెను. మనుష్యులు టెంకాయల దించుచుండువారును, అరఁటిగెలలఁ గోసి బండ్లకెక్కించువారును పూలఁగోయువారునై, వారివారి పనులయందప్రమత్తతో వర్తించుచుండిరి. గృహపరిచారికలు వారివారిపనులఁ జేయుచుండిరి. ఇందిరయును ప్రాతఃకాలంబున లేచి స్నానాదికములఁ గావించి గృహకృత్యములఁ దీర్చి తండ్రి స్నానంబునకు సిద్ధపఱచి, యతని మేలుకొలుపుటకై వచ్చి ప్రక్కను నిలిచియున్న పుత్రిని జూచి మిత్రానందుఁడు వెఱఁ గందెను. ఆబాలికముఖమునందుఁ గొంచెమైనను నిన్నటివిషయమును గూర్చిన చిహ్నము లేవియుఁ గనఁబడలేదు. "ఆహా! యిది స్త్రీపుట్టుక కాదు. నాకంటె నూఱంతలు ధైర్యముగలది. తన్నుఁ జూచిననాకు మనోవ్యథ కలుగునేమో యని తనవ్యసనమును మఱుగుపఱచియున్నది. ధన్యుఁడవు మిత్రానందుఁడా, నీవే ధన్యుఁడవు. నామహాదుఃఖమున కూఱట కలిగించుటకిది యొకసాధన" మని తనలోఁ దానువితర్కించుకొనుచు, "అమ్మా! యిందిరా! యేమి యింతతొందరగా మేల్కొంటివి?

ఇందిర:—నాయనా, పరిచారికలు మాటలాడుశబ్దము విని మేలుకొంటిని. మీరును లేచి స్నానముచేయవచ్చును.

మిత్రానందుఁడు తన నిత్యవిధులను దీర్చికొని పుత్రికతో నల్పాహారంబును ముగించి తనపనులకు వెడలెను. ఎన్నిపనులతో నున్నను లలితకుమారునివియోగము, వతఁడు చెప్పినవిషయములు, మఱవలేదు. అవి ప్రతినిమిషమును నతనిమనస్సును వేధించుచుండెను. మధ్యాహ్నమునందు మిత్రానందుఁ డింటికి వచ్చి తనగృహమంతయుఁ గలయఁజూచి యది యొకయరణ్యమని యెంచెను. లలితకుమారుఁడు లేని తనజీవితము వ్యర్థమని తోఁచెను. ఇట్లు దిక్కుదోఁపక స్తంభితుఁడై నిలిచి తన కతని వియోగమువలన నిట్టిమనోవ్యథ గలిగి యుండఁగ నిందిర యెట్టిదుఃఖము ననుభవించుచున్నదో యని దిగులు చెందెను. పగలు తనూజాత తనకుఁ జూపినధైర్యము మనస్సునకు జ్ఞాపకము దెచ్చుకొని నాసుపుత్రి నాకు మార్గదర్శకురాలై యుండఁగ నే నిట్లు వగవనేల?" యని ధైర్యంబుఁ బూని యిందిరా యని పిలువఁగానే, ప్రసన్నముఖముతో వచ్చి "నాయనా, యేమి నేఁ డింతయాలస్యమైనది? నేఁ డెందులకో మీముఖము మిగుల వాడియున్నది. ఎండవలన నలసియున్నారు కాఁబోలు. కొంచెమలఁత దీర్చుకొని స్నానముచేయుఁ" డనెను.

మిత్రానందుఁడు సంతుష్టచిత్తుఁడై భోజనాదులఁ దీర్చుకొని విశ్రమించుటకై తనగదికిఁ బోయెను. ఎండబడలికచేతను, మనోవ్యథచేతను బీడింపఁబడినవాఁడు గనుక నిందిర వచ్చునంతలో "నిద్రించెను. ఇందిర వచ్చి తనతండ్రి నిద్రించుటను జూచి "ఓ దైవస్వరూపి వగు తండ్రీ! నీవు నాకై వ్యాకులఁ గుందుచున్నావు. లలితకుమార దేవునిష్టమునకు వ్యతిరేకముగా నడచుటకు నీకిష్టము లేదు. దానికొఱకు నిన్నింతచింతలపాలొనరించిన మహాకళంక మెట్టిదో నే నెఱుంగ. ఎటులైనను నీహృదయమర్మ మెఱింగిన నీదుఃఖము నేను పంచుకొని నీమనోభారము తగ్గించెదనని" చింతించుచు నతనినిద్రావస్థలోఁ బొడముముఖ చిహ్నముల గుర్తించుచు నిలిచియుండి, తండ్రి నిద్రించుఁగాక యని మెల్లగఁ దనగదిలోనికిఁ బోయి యేదో పుస్తకమును జేత నుంచుకొని చదువుచున్నదానివలె నన్యమనస్కురాలై యుండెను.

చండసేనుఁడు తనసహచరుల బైట నిలిపి తా నిదివఱలో మిత్రానందుని జూచుటకు వచ్చువిధంబుగవచ్చెను. అచట నుండువా రందఱు వానికిఁ బరిచితులే. కనుక నందఱు క్షేమములడిగి మిత్రానందుఁ డతనిగదియందు నిద్రించు టెఱింగి యిందిరతో మాటలాడుటకు తగు సమయము దొరకెఁగదా యని లోలోన సంతోషించుచు నిందిర యుండుగదియొద్ద నిలిచి, 'యిందిరా'! యని పిలుచుచు నెదుటకు వచ్చి నిలిచెను. రెండవ యమునివలెఁ దనయెదుట నిలిచిన దొంగలరేనిఁ జూచి యిందిర కంపితశరీర యై యప్పటితనమనస్స్థితిని గనఁబఱుపక "చండసేనా! యేమి యాశ్చర్యము! నీదర్శనము దుర్లభ మైనది. ఇన్ని దినము లెచటి కేగియుంటివి? నాయనగారుకూడ నేఁడే భోజన సమయమందు "మన కిరువురు స్నేహితు లెవరు? నామిత్రుఁ డగు చండసేనుఁ డేలకో యిచటికి వచ్చు టరుదయ్యె నని చెప్పిరి" యని నుడువుచు, గది విడిచి బైటికి వచ్చి వాని కొకపీటఁ గూర్చుండఁజూపి తానును గూర్చుండెను.

చండసేనుఁడు:—నాచేతనుండి నీవు తప్పించిన రాజకుమారుఁ డిదివఱకు మీయింటిలో నున్నాఁ డని వింటిని. ఇందిరా! యిప్పు డతఁ డిట లేఁడని తోఁచుచున్నది. అతఁ డెచటి కేగెను?

ఇందిర:—ఇదివఱకే యతనిశరీరస్థితి బాగుగా నుండలేదు. నిన్ననే యతఁడు వెడలిపోయెను.

ఆమె మాటలాడునప్పు డామెముఖవైఖరి యెట్లుండునో యని చండసేనుఁడు రెప్ప వాల్పక యామెముఖమునే చూచుచుండెను. వైపరీత్యము లేవియుఁ గనఁబడలేదు. లలితకుమారుఁ డీమెకుఁ బ్రీతిపాత్రుఁడు కాఁడని నమ్మెను. ఘనులబుద్ధి నీచు లెట్లు గ్రహింతురు? "ఇందిరా, నీతో మాటలాడి కొన్నిదినము లైనవి. ఇపుడు నేను చెప్పఁబోవుకొన్నిమాటలు శ్రద్ధతో వినుము. నీవు నాకోటకువచ్చి మారహస్యము లన్నియుఁ దెలిసికొంటివి. అట్టి వారిని సంహరించుట మాచట్టము. అట్లు చేయక నిన్ను విడిచినది మాతప్పు. అందులకై నాసేవకులే నాకు విరోధులై యున్నారు వారిని విరోధము

చేసికొనుట నా కిష్టము లేదు. నిన్నుఁ జంపుటకును నామనసొప్పలేదు. కనుక నీవు నన్ను వివాహముచేసికొనవలయును. నీతండ్రియును దన నివాసస్థాన మిచటనే యేర్పఱచుకొన్నాఁడు. నా కమితధన మున్నది. నీవు నాకోటకు రాకయున్న పక్షమున నీవిషయమునం దిట్టియభిప్రాయము కలిగి యుండను. ఎప్పుడు రాజును విడిపించుటకై వచ్చి మన్మథుని మోహనశక్తివలె నాయెదుట నిలిచితివో, యపుడే నాసౌఖ్యమునకు నీవు కారణభూతురాల వని యెంచి యున్నాను. దేవీ, నీవే నాసౌభాగ్యాధిదేవత వని నిన్నుఁ బూజించెద. నేను సుందరపురుషులయం దున్నఁదగినవాఁడను గాని కురూపిని గాను. 'దొంగ' యని పే రున్నది యని సంశయం బొందకుము. నీవు నాగృహిణి వైన నిమేషమునందే నాదుర్గుణము లేవి యున్న నన్నింటిని బరిత్యజించి నీకు దాసుఁడ నయ్యెద. నన్నుఁ దిరస్కరింపక నాయభిమతం బీడేర్చుటకై నీకు నమస్కరించెద" నని చండసేనుఁ డనెను.

ఈ సంభాషణను నంతయు వినుచున్న యిందిరకు భూమియంతయుఁ దిరుగుచున్నట్టుండెను. తనచంద్రాయుధముచేత వానితలఁ దెగవేయునంతటి క్రోధ ముప్పతిల్లినను మఱునిమేషమునందే యాక్రోధము నడంచుకొని మందహాసచంద్రికల నెఱపుచు వానిమాటల కామోదించినదానివలె "చండసేనా! నీమనోగతం బెఱింగితిని. ఇఁక నాయిష్టము నీకుఁ దెలియఁజేయవలెఁగదా ? నీవు దుర్మార్గు లందఱిలోన శ్రేష్ఠుఁడవు. జన్మమా దొంగపుట్టుక. జీవనమా పరులసొత్తపహరించి బ్రతుకుట. ఇఁక నాతండ్రిస్వభావము నీ వెఱుంగుదువు. అట్టి సత్యసంధునిపుత్రి నగునేను నిన్నుఁ గోరుటెట్లు? అదియునుం గాక వివాహము చేసికొనుతలం పే నాకు లేదు. అట్లు నేను నిన్ను వివాహముచేసికొనవలసియున్నచో నీజన్మము మాఱి పునర్జన్మము కావలెను. నీగుణావగుణములను నేను పరీక్షింపుచుండవలయును. నీవు మిగుల నోపికతో వేచియుండవలయును. ఇది యంతయు నాలోచించుకొను" మనెను.

చండసేనుఁడు మాఱుపలుకలేదు. ఇందిర కై యానిమిషమందే తాను మాఱియుండిన, వాని కిష్టముగానే యుండును. అది యెట్లు సాధ్యము? తన మార్పు దుర్గుణముల త్యజించి సద్గుణముల గ్రహించి దానిని సపర్యలయందుఁ బ్రవర్తించుట యై యున్నది. ఇపు డఖండద్రవ్యము నైన విడువవలయును. లేక సుందరి యగు నిందిర నైనఁ ద్యజింపవలయును. అది యతికష్టముగా నుండెను. ఇందిరా! "యిట్టినిగ్రంథయుక్త మగు నియమము నేర్పఱచితివి. నే నెంతదుష్టుఁడ నైనను సజ్జనుఁడ ననిపించుకొనుట కిచ్ఛయించెద. అట్టిగుణము నాకుఁ గలిగియుండుట సద్గుణరాశి యగు నీసన్నిధానమహిమ యై యుండ నోపు. అయినను జన్మ మెత్తి బుద్ధి గలిగిననాఁటినుంటియు దుర్గుణముల యందుఁ బరిచయము నొందిన నామనస్సు, వాని నన్నింటి నేకకాలమందు విడువవలసివచ్చెఁగదా! యని పరితపించుచున్నది. నీవు లేని నాయైశ్వర్య మేల? నీవు నావశవర్తినివి యైన పిమ్మట స్వర్గసుఖ మైనను నేఁ గోరను. బాలికామణీ! నీవిస్థలమునుండి యెప్పటికిని బోవుట లేదని నే నెఱుంగుదును. నే నిపుడే పోయి నావ్యవహారములఁ బరిష్కరించుకొని యెట్టిదుశ్చింతయును లేక సన్మార్గమందుఁ బ్రవేశించి నీమెప్పు వడసెద. ఇఁకఁ గొన్నిదినములలో నిచటికి వచ్చి నీతండ్రితో మాటలాడి సాధనము నంతయు నతనికి సమర్పించి నిన్నుఁ బరిగ్రహించెద. నీవును నీతండ్రి కీసమాచారము తెలియఁజేయుము. నేను బోయివచ్చెద"నని చెప్పి వెడలిపోయెను. ఇందిర వాఁడు పోవువఱకుఁ గదలకయుండి మెల్లఁగా లేచి తండ్రి నిదురించుగదికి వచ్చి యతనిని మేలుకొల్పెను. అతఁడు లేచి తనబిడ్డను చేరఁదీసి ముద్దిడి, "నాతల్లీ! ఇది యేమి ఇప్పు డొకవిధముగా నున్నావు. నే నలసటచేతను మనోవ్యథచేతను నిన్నుఁ బిలువ మఱచి నిద్రించితిని. నాయన పిలువలేదని యాయాస మొందితివా? పట్టీ! యే మిట్లు దీర్ఘాలోచనము చేయుచున్నావు?" అని యడిగెను.

ఇందిర:—జనకా, మనకు స్థానభ్రష్ట మగు కాలము సమీపించెను. 'గోరుచుట్టుమీఁద రోఁకటిపోటన్నట్లు మీకుఁ గష్టము వచ్చెఁగదా

యని చింతించెన. మీరు నిద్రించుచున్న సమయమందుఁ జంపసేనుఁడు వచ్చెను. వాఁడు నన్ను వివాహమాడ యత్నించి యున్నాఁడు. వాని దుర్గుణములు పోఁగొట్టుకొనవలయు ననియుఁ గొన్నిదినము లోపికతో నుండుమని యుక్తిచేసి వానియుపద్రవము లేకుండఁజేసియున్నాను. ఇఁక మన కీస్థలము శ్రేయస్కరము కాదు. ఈ విషయము మీకుఁ దెలియఁజేయుటకే వచ్చితిని."

మిత్రానందుఁడు:—పుత్రీ, నీవు చేసినయుక్తి మిగుల యుపయోగకరము. నా ప్రాణపదమా! నిన్ను రక్షించుటకై ఈజగత్తును విడువు మన్నను విడిచిపెట్టెద. ఈయల్పగృహమునకై చింతించెదవా? తల్లి, నీదాసీజనములుండు గృహము దీనికన్నను నూఱుమడుంగు లధికముగా నుండునుగదా? దైవమా! నీవిలాసము నే నేమని వర్ణింతును! "దుర్జనః ప్రియవాదీతి నైతద్విశ్వాసకారణ" మ్మని నాఁ డిపుడు నీమాటలను నమ్మి మంచితనముగాఁ బోయియున్నను వానిని నమ్మరాదు. పరమవిశ్వాసఘాతుకుఁడు. వాఁ డెందులకో యీ నక్క-వినయమును జూపి పోయినాఁడు. లేక, మనపాలిటిభగవంతుఁడే వాని కట్టిబుద్ధి పుట్టించి మన ప్రయాణమునకుఁ గష్టములే నట్లు చేసెనో తెలియదు. ఎటులైనను వానిగుంపు నంతయుఁ జేర్చుకొని తిరిగి వచ్చునంతలో మనత్రోవ మన మాలోచించుకొనవలయును.

ఇందిర:—నాయనా, అట్లయిన ఇపుడు మన మెచటికిఁ బోవలయును?

మిత్రా:—అమ్మా! ఇపు డీదీనిని విడిచి పడవ నెక్కి కాళీఘట్టము (కలకత్తా)నకుఁ బోవలెను. అచ్చట నా ప్రాణమిత్రుఁ డగు నీశ్వరదాసనునొక కాయస్థుఁ డున్నాఁడు. ఆ కుటుంబము మిగులఁ బవిత్రమైనది. అతనిగృహిణి నిన్నుఁ బెంచి తనబిడ్డలకంటె నతిశయముగాఁ జూచుకొనుచుండెను. నీవు రెండేండ్లబిడ్డవుగా నుండునపు డామె కప్పగించితిని. మరల నేడేండ్లబాలికగా నుండునపుడు తెచ్చితిని. అపుడు నే ననుభవించినకష్టము లేమని చెప్పుదును! అది యటుండనిమ్ము. ప్రకృత మచట కొన్నిదినములు రహస్యముగా నుండి పిమ్మట నాలోచింపవలయును.

ఇందిర:—జనకా, మన మేల మేవారుసమీపప్రదేశములం దుండఁ గూడదు?

మిత్రానందుఁడు:—అయ్యో! అమ్మా, ఆయభిప్రాయము స్వప్నమందైనను దలంపకుము. నే నచటికిఁ బోవుట కొఱవిచేతఁ దల గోఁకుకొన్నట్టే. నీతండ్రిని నీవు పోఁగొట్టుకొనియెదవు. అచట నే ననుభవించు ఘోరకష్టములఁ జూచి నీవు జీవింపలేవు. అట్టికష్టమునకు నిన్ను పాలుచేయ నామన మొప్పక యిట్లు రహస్యముగా నీకై జీవించియున్నాను. నా యిష్టములేకయే విధి నన్నిట్లు తీసుకొనిపోవుచున్నది. ఇది విపత్తునకో, సంపత్తునకో నే నెఱుంగ. ఎట్టికష్టము వచ్చినను మంచికొఱకే యని పెద్దలు చెప్పుచున్నారు. ఆపదలయందు ధైర్యము విడుచుట కాపురుషలక్షణము. కుమారీ, ముఖ్యమైనవస్తువు లన్నియుఁ దీసికొనిపోవుటకై సిద్ధపడుము. రేపు రాత్రికే ప్రయాణముచేయు మని దైవము చెప్పినట్లు మనయోడ నిన్ననే వచ్చియున్నది. అది రేపురాత్రికి నిచటనుండి బయలుదేఱును. నే నిచటఁ జేయవలసినకార్యము లున్నవి. నేను బోయెద. ఓడయందు మన కాహారము మొదలగు వస్తువుల నన్నిటిని సిద్ధపఱచియుంచు" మని చెప్పిపోయెను. ఇందిర తనతండ్రి చెప్పినమాట లన్నియుఁ వదేకబుద్ధితో వినెను. "నీదాసీజనము వసించుగృహము నింతకంటె నూఱురెట్లతిశయముగా నుండును" "మేవారును పోవుట కొఱవితోఁ దల గోఁకుకొన్నట్లు" అను రెండుమాటలు నాతండ్రినోటినుండి వెడలినవి. వీని కర్థ మేమి? నా జనకునకు సంభవించిన కష్ట మెట్టిదై యుండును? అంతటి క్రూరకార్యము నా మహానుభావుఁడు చేయునా? నా ప్రియజనకా నీకా యిట్టియవస్థ? సకలాపదలు మిమ్మావరించియుండ నే నిట్లు ఆలోచించుచుఁ గాలము వ్యర్థముగాఁ గడపఁగూడదు. నా ప్రాణము నిచ్చి నాతండ్రిని గాపాడెద. ఇదియే నా ప్రతిజ్ఞ. ఎట్లైనను నారహస్యమును దెలిసికొని యతని దుఃఖమునకు సహభాగిని నై కార్యము సాధించెద నని స్థిరచిత్తయై వస్తువు లన్నియు సిద్ధపఱచి తండ్రిరాక కెదురుచూచుచుండెను.

మిత్రానందుఁడీ దీవికి వచ్చి తనగృహమును కట్టినప్పటినుండియు నిందిరకు సేవచేయుచు, మిత్రానందునికి సోదరీసోదరులవలె నన్నికార్యములయందు సహాయభూతులై తోడునీడగా నుండువా రిరువురు గలరు. వారు మలయావతి, సుందరవీరుఁ డనుదంపతులు. సుందరవీరుఁడు మిత్రానందునియం దవ్యాజప్రేమ గలవాఁడు. వీఁ డెట్టిపనినైన నెఱవేర్చుసామర్థ్యము గలవాఁడు. మిత్రానందుఁడు తనవ్యాపారవ్యవహారముల నన్నింటి నతని కప్పగించెను. తాను దీర్ఘయాత్ర వెడలవలయు ననియు, బిడ్డకు స్వామిసన్నిధానమందు ప్రార్థనము చెల్లింపవలసియున్న దనియు, విషయమును రహస్యముగా నుంపుమనియు వానితోఁ జెప్పి తనకు వలయువస్తువుల నోడయందుఁ జేర్చుట కేర్పా టొనరించెను. రేపురాత్రికిఁ బ్రయాణ మని చెప్పి, తనసేవకులు సుఖముగా జీవించుటకుఁ దగినయేర్పాటు లొనర్చి, తా నతిశీఘ్రకాలమునందే వచ్చెద నని చెప్పెను. మఱునాఁ డుదయము పదిగంటల కొక యాశ్చర్యకరమైన వృత్తాంతమును మిత్రానందునకు సేవకులు చెప్పిరి. అదే దనఁగా, మాదీవికి యుద్ధనావ యొకటి వచ్చుచున్న దనియు, దానియందు యోధులు దొంగలఁ బట్టుటకై వచ్చి యిచటఁ గొంతకాల ముండెద రనునదియే. అంతలో జాబు నొకటి సేవకుఁడు తెచ్చి యిచ్చెను. దానిని జూడఁగనే మిత్రానందుఁ డానందమును బొందెను. అది లలితకుమారుఁడు తనకుఁ బంపిన దని యతఁ డెఱింగెను. జాబును విప్పి చూడసాగెను.

"పూజ్యులకు నమస్కారములు. తమసేవకుఁ డగు లలితుఁడు క్షేమము. నేను పోవుమార్గమందొకయుద్ధనావ వచ్చుచుండెను. విచారింపఁగా నది ఢిల్లీశ్వరుఁడు నన్నుఁ గారాగృహబంధితునిగాఁ జేసినయపరాధమునకై చండసేనునిఁ బట్టుటకుఁ బంపఁబడినది. ఆనావలో గొప్పయుద్ధవీరు లున్నారు. ఈసారి వాఁడు పట్టుపడుట నిశ్చయము. ఈయోధు లచటనే కొంతకాలము నివసింతురు. మీ క్షేమమును మనయిరువురకుఁ బ్రాణతుల్య యగు నిందిరాదేవి క్షేమమును దెలుపవలయు నని ప్రార్థించెద.

ఇట్లు: తమ జామాత యగు

లలితుఁడు.

జాబును సాంతముగాఁ జదివెను. తనపనుల నెఱవేర్చి భోజనసమయమున కిల్లుచేరెను. చేరుటతోడనే యిందిర యెదురుగా వచ్చెను.

ఇందిర:—నాయనా, వార్త లేమైనఁ గలవా? అన్నికార్యములు సిద్ధమై యున్న వని తలంచెద.

మిత్రానందుఁడు—ఇందిరా, యంతయు సిద్ధమైనది. దైవప్రేరణ నేమని చెప్పుదు! యుద్ధనావ వచ్చియున్నది. అందు యుద్ధవీరులు చంప సేనునిఁ బట్టుటకుఁ గృతనిశ్చయులై యున్నారు. వా రిచట నాఁడు పట్టు వడునఱకు నివసింతురఁట. లలితుని వాఁడు హింసించినందులకు ఢిల్లీశ్వరుఁడు కుపితుఁడై యిట్లు యుద్ధవీరులను బంపియున్నాఁడట. ఇపు డీవార్త విని చండసేనుఁడు మాఱువేషంబునఁ బరుగెత్తిపోయినచో, త్రోవలో మనకుఁ బ్రయాణభంగము గలుగునేమో యని చింతించెద. కనుక వానిని గొన్నిదినములు బైటికి రాకుండ వానికోటలోనే దాఁగియుండుమని జాబు వ్రాసెద. మనము సుఖముగాఁ బోయి గమ్యస్థానమును చేరిన పిమ్మట నాలోచింతమని చెప్పి లలితుఁ డీసమాచారమును నాకు వ్రాసె" నని చెప్పెను. జాబును మాత్రము చూపలేదు. ఇందిరయును దాని నంతయు వినెనే కాని జాబుని మ్మని యడుగుధైర్య మామెకుఁ గలుగలేదు.

మిత్రానందుఁడు:—అమ్మా, యిందిరా! యింకను నీమనోవ్యథ తీఱకయున్నది. నేను బ్రతికియుండువఱకు నీ కొకకొదవయును లేకుండఁ గాపాడెదను. మనప్రయాణముకూడ సుఖముగా నడచుటకై దైవము సహాయము చేసెను.

ఇందిర:—జనకా, యెచటస్థిరముగా నుండ నిర్దేశించియున్నారు?

మిత్రానందుఁడు—అమ్మా, నా కేమియుఁ దోఁపకయున్నది. ప్రకృతము కాళీఘట్టము స్థిరము. అచటికిఁ జేరునంతలో నేమియాపద గలుగునో యెవ రెఱుంగుదురు? నావలో నేదేని యాపద గలిగిన, తత్క్షణమే మన మొకరి నొక రెడఁబాయక గంగకు శరీరము లర్పింతము. నీటియందుఁ గ్రుళ్లిన

శరీరములు మనుష్యులకు దొరకినను నిట్టివా రని జనులు గుర్తెఱుంగక యుండవలయు నని నాయిష్టము. అమ్మా, నీయిష్ట మేమి?"

ఇందిర—"నాప్రియజనకా, మీకష్టసుఖంబుల నే నెఱుంగను. మీదుఃఖ మెట్టిదో నా కెట్లు తెలియును? మీ రేమి చేయుమన్న నది చేసెద. మీవాక్యము నాకు వేదవాక్యము."

సేవకులు వచ్చి పెట్టెలను నావకుఁ దీసికొనిపోయిరి. మిత్రానందుఁడు నావయందు దాయుధములు కొన్ని యుంపు మని చెప్పెను. ఇరువురును స్నానాదికములు దీర్చుకొనిరి. "ఇందిరా! నీవు పురుషవేషము ధరింపవలె" నని తండ్రి యాజ్ఞ యొసంగెను. ఇందిరయు నట్లే సమ్మతించి లోపలఁ బ్రవేశించి యిల్లంతయుఁ జూచి విలపించెను. దుఃఖము తీఱున ట్లేడ్చుటకైనఁ బ్రొద్దుచాలదు. 'దైవమా, నీవే గతి' యని కన్నీరు తుడుచుకొని లలితకుమారుని సుందరరూపమును మనస్సునందు ధ్యానించి తండ్రి పిలుచునంతలో వైటికి వచ్చి చెట్లకుఁ దీఁగెలకుఁ గొండలకుఁ 'బోయివచ్చెద' నని నమస్కరించి చెప్పెను. 'పోయి ర' మ్మని చెప్పుచున్నవో యన్నట్లపుడు కూయుచున్న చిలుకల కోయిలలధ్వని లోకశుభసూచకంబు లని యిందిర సంతసమొందెను. 'ఓ గృహదేవతలారా! పోయివచ్చెద' నని చెప్పి తిరిగెను. తన తండ్రి తాను చేయుచున్న కార్యముల నన్నిటిని జూచుచున్నట్లు తెలిసికొనెను. మిత్రానందుఁడు తనపుత్రిక నాలింగనం బొనరించి, "కుమారీ, నీవంటిధర్మబుద్ధి గలదాని కెపుడును కెఱుపు కలుగదు. ధైర్యముగా నుండు" మని చెప్పి యిల్లు విడిచి వెడలెను.

ఆకస మంతయు మేఘావృతం బై యుండెను. అచ్చటచ్చట మినుకు మినుకు మని యొకటి రెండు నక్షత్రములు కనిపించుచుండెను. "ఈనాఁడు చంద్రుఁడు పండ్రెండు గంటలమీఁద నుదయించును. మన మంతలో నావ యొద్ద చేరవలయు" నని యిందిరచెవిలో మిత్రానందుఁ డనెను. అపుడు తోఁట యంతయు నిశ్శబ్దముగా నుండెను. ఒకరితో నొకరు మాటాడలేదు.

అట్లు పోవుచుండ నేదో చప్పుడు కాఁగానే, మిత్రానందుఁ డిందిగను తన ప్రక్క కీచ్చులోని యాశబ్దము వచ్చు దిశను జూచుచు నడచుచుండెను. అది గాలివలనఁ గదలినట్టి యాకులశబ్ద మని తెలిసి తోఁటను దాఁటి బైటికి వచ్చెను. కర్మాధిదేవతలు దయలేక యిల్లు విడిపించి తఱుముచున్నారని మిత్రానందుఁడు తలంచెను. మఱియొక నిమిషమునందే తా నట్లు తలంచుట తప్పని దైవమును మన్నింపఁ వేఁడెను. ఇందిర తనప్రియుఁడు తనకై మరల వచ్చి తన్నచటఁ జూడక యెంతవ్యసనఁ జెందునో యని తలఁచెను. ఇంకొక నిమిషమందు చిన్నతనమునుండి తనజీవితకాలమును సుఖముగాఁ గడపినట్టి యాతోఁటను తన కతిప్రియమైనందున దాని విడఁబాయఁజాలక దుఃఖితురాలయ్యెను. అప్పుడు తనవెంట వచ్చుచున్న మలయవతి సుందరవీరుని చెవిలో నేదియో మిత్రానందుఁడు చెప్పెను. వా రాశ్చర్యముతో మిత్రానందునికిని నిందిరకును నమస్కరించి వెనుకకు మఱలిరి.

ఇందిర—నాయనా! చూచితిరా! మన కెట్టిదుర్దశ కలిగెను?

మిత్రానందుఁడు—అమ్మా! పలుకవల దని చెప్పి యచట నుండు వృక్షపంక్తిలోఁ దూఱి పోవుచుండిరి. మిత్రానందుఁ డున్నట్టుండి మెల్లఁగ నడచిపోయి యచటనుండు పెద్దవృక్షపుఁదొఱ్ఱలోఁ దనచేతికఱ్ఱని దూర్చి చూచెను. పిమ్మటఁ దనబిడ్డ నందు దింపి తాను వృక్షము నానుకొని నిలిచెను. ఇందిర భ్రమించి కొయ్యఁబాఱి యాతొఱ్ఱలోనుండి యంతయుఁ జూచుచుండెను. వీ గున్నస్థలమునకు బదిబారలదూరమునందు మనుష్యులు వచ్చి కూర్చున్నట్టు తెలిసెను. వారు చండసేనుఁడు వానిసహచరులని మిత్రానందుఁడు గుర్తించెను.

చండసేనుఁడు—మిత్రులారా! చూచితిరా! మనమిత్రానందుఁడు జాబు వ్రాసి యెట్టి మహోపకారముఁ గావించెను. అతనిమాట నమ్మక మన మిచ్చటికి వచ్చి విచారింపఁగ నది నిజ మాయెను. మన మిపు డేమి చేయుదము?

సేవకుఁడు—ప్రభూ! యుద్ధనావ రేపిచటికి వచ్చును. అంతలో మనము కోటకుఁ బోదము. యుద్ధభటు లీ దీవి విడిచిపోవునఱకు మనతలలు

దాఁచుకొని యుందము. వారు పోయిన పిమ్మట నన్ని సమాచారములును మాటాడుకొందము.

చండసేనుఁడు—మన మిప్పుడు మిత్రానందునింటికిఁ బోయి యన్ని సమాచారములఁ దెలిసికొని పోవచ్చునుగద?

సేవకుఁడు—మహాప్రభూ! తమకు వేయిదండములు. ఇప్పుడచ్చటికి మనము పోఁగూడదు. అచట నెవఁడైన రాజభటుఁడు ముందుగా వచ్చియున్న మన కపాయము కదా? మిత్రానందుని యిల్లొక సత్రమువంటిది. వచ్చిన వారు వచ్చినట్టే, పోయినవారు పోయినట్టే. నిన్ననే యొకనావ వచ్చియున్నది. దానిలో వారు రాఁగూడదా?

ఈమాట విని చండసేనుఁడు భయము చెందెను. "మిత్రులారా! మీ మాట నిజము. పోదము రండ"ని చెప్పి మౌనముగ నెడలెను. వారందఱు వీరు నిలిచియున్న వృక్షము ప్రక్కగా వెడలిపోయిరి.

మిత్రానందుఁడు—ఇందిరా! మనపాలిటిదైవ మెట్లు మనలఁగాపాడెనో చూచితివా! ధైర్యమునకుఁ దోడు, దైవము దిక్కు గమ్మ. ఇఁక భయము లేదని చెప్పి యచటనుండి సురక్షితముగా నోడను జేరిరి. నావికులు సిద్ధముగా నుండి యాయిరువురిని నావలోపలికిఁ బిలుచుకొనిపోయి వారికి నేర్పఱచి యున్న మూఁడుగదులను జూపిరి. పడకగదిలో వీరిసామానుల నమర్చి పెట్టి రెండుపడకలను వేసియుండిరి. ఆగది మిగుల శుభ్రముగా నుండెను. ఇందిర తనవస్తువులను జూచుకొని తండ్రికిఁ బడక వైచి తనపడుకను దండ్రి ప్రక్కను వైచెను.

మిత్రానందుఁడు—అమ్మా, భయమా? ఇచట నేమిభయము?

ఇందిర—నాయనా, భయ మేమియు లేదు. తమసమీపమందుఁ బండుకొనవలయు నని యిచ్ఛ కలిగెను.

మిత్రానందుఁడు— "తల్లీ, నిజము. బిడ్డ లెంత పెద్దవారైనను తమ తలిదండ్రులకు బిడ్డలే కద! అదియునుం గాక నీవు తల్లిప్రేమ నెఱుంగని దానవు. నా కన్నతల్లీ, యందువలన నేకదా నీ కణుమాత్రము కష్టమైనను నేను సహింపఁజాలను. నీవలనఁగదా నేను జీవించియుండుట?" యని తన బిడ్డను దొడయం దిడుకొని భోరున నేడువసాగెను.

ఇందిర మెల్లఁగ లేచి తండ్రికన్నులఁ దుడిచి "తండ్రీ! తమ రిట్లు దుఃఖించుట తగదు. చండమారుతంబునకుఁ బర్వతంబులు చలించునా? "వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి లోకోత్తరాణాం చేతాంసి కోహి విజ్ఞాతు మర్హతి" యని తమ రెన్నిసార్లు చెప్పియున్నారు. తమరే యిట్లు ధైర్యము చెడి దుఃఖించుటకుఁ బ్రారంభించిన నూఱడించువా రెవరు? నే నిట్లు మీయెదుట ధైర్యముగా మాటలాడుటకు క్షమింప వేఁడెద. జనకా, ఇంతకుముందే మీరు "నీ కణుమాత్రము కష్టమైనను నేను సహింపఁజాల" నని చెప్పితిరి. అందువలన నే నిపుడు ధైర్యంబుఁ బూని మాటలాడుచున్నాను. నాయనా, లలితకుమారుఁడు మనయింటికి వచ్చిన నాఁటినుండి మీరు మిగుల దుఃఖితులై యున్నారు. అతఁ డడిగిన ప్రశ్నకుఁ దమ రిచ్చిన ప్రత్యుత్తరంబును నే నతిశ్రద్ధగా వినుచుంటిని. నాకుఁ గలిగి యున్న కళంక మెట్టిదో నీ వెఱుంగవలదా? నే నిపుడు తాము తలంచు నంతటి పసిబాలను కాను. నాకుఁ దాము గఱపినవిద్యామహిమవలన మంచి చెడుగులు తెలియునంతటిశక్తి గలిగియున్నది. నేను గళంకిత ననుమాట విన్న దాదిగా రేయుంబవళ్లు దుఃఖించుచున్నాను. నా ప్రియజనకా, యిచట మీకు నాకన్నను బ్రీతిపాత్రు లెవ రున్నారు? మీహృదయమం దున్న రహస్యమును నా కెఱింగించినయెడ నా రహస్యమునకు సహభాగిని నై యా వ్యసనమును బోఁగొట్టుటకు నా చిన్నమనస్సునకుఁ దోఁచినయుక్తిని నా తండ్రి వగుమీకుఁ జెప్పి తోడ్పడెద నని నానమ్మకము. మీబిడ్డయందు దయయుంచి యది యెట్టిరహస్యమైనను నాకుఁ జెప్పవలయును. అదియునుం

గాక యిన్నిదినములనుండి యొకనాఁడైనను నాతల్లి సమాచారమును గుఱించి మీరు ప్రస్తావించుట లేదు. అందువలన నాతల్లి కళంకినిగా నెంచుదును. కనుక నే యామె దుష్ప్రవర్తనము నన్నుఁ గళంకినిగా నొనర్చెనేమో నాకుఁ దెలియ వలదా? అట్టి దుష్టయగు నాతల్లిని బరిత్యజించి పుత్రీమోహమువలన నన్ను విడువఁజాలక మీ రిట్లు దేశములపాలై యుండవలయు, లేదా యెవరో గొప్ప యపరాధము మీమీఁద మోపియుండవలయు. అందువలన నేమీ రిట్లేకాంగిగా నుండఁగోరియున్నా రని తోఁచుచున్నది. ఆ విషయము మీరు నాకుఁ జెప్పనియెడల నాదుఃఖము నన్నుఁ దీవ్రముగా బాధింపక విడువదు.

మిత్రానందుఁడు:—ఆహా! నాబిడ్డకు నే నెంతదుఃఖముఁ గలుగఁ జేసితి! నిజమే! నారహస్యము నామెకుఁ జెప్పక మఱియెవరికిఁ జెప్పుదును? ఇన్నిదినములు నాకు సహాయకర్తలు లేరు. ఇప్పుడీబాలికయే నాకు సహాయకర్త్రి. నేనొకపాప మెఱుంగనివాఁడను "యతో ధర్మ స్తతో జయః" అన్నట్టు దైవ మిన్నిదినముల కీబాలికమూలమున నన్ను నిరపరాధిగాఁ జేయనెంచి యుండును. లేనియెడల నిది సింహపుఁబిల్ల యనునది మఱచి దీనియెదుట నాబిడ్డ కొక కళంక మున్నదని నేను లలితునితోఁ జెప్పుదునా? వీరక్షత్రియ కన్య యపుడె విని యూరకయుండునా యని యెంచకయుండునది నాతప్పు. ఇఁకమీఁద నాబిడ్డతో నావృత్తాంతము చెప్పకుండుట ధర్మము గాదు. అది నాయంతటిమోధురాలు. కుశాగ్రబుద్ధి పరులతో నే నిట్లు చెప్పుట తప్పు. విధి లేక చెప్పితిని. అని చింతించుచు "అమ్మా, నీయట్టిసత్పుత్రిని గన్నతల్లి యెట్టిదై యుండునో యూహింపకపోతివా? అది యొక దేవత. గొప్పవంశమునఁ బుట్టినది. సద్గుణంబుల కునికిపట్టు; రూపరాశి. అట్టిదేవిని—నాయర్ధాంగలక్ష్మిని—నీకన్నతల్లి నంతనీచముగాఁ దలంపఁగూడదని గద్గదకంఠముతోఁ జెప్పఁగా, నిందిర భయము నొంది తండ్రిపాదంబులపై వ్రాలి "జనకా, క్షమింపుఁ" డని వేఁడెను.

మిత్రానందుఁడు:—కుమారీ, నీ కేమియును దెలియదు. కనుక నీ వట్లూహించుట తప్పుకాదు. నాకథ మిగులఁ జిత్రమైనది. నీతండ్రి నీకు మహాపరాధము గావించియున్నాఁడు. కడచినదాని కిపుడు వగవఁ బనిలేదు. తలుపులు భద్రముగా మూసి నాసమీపమందుఁ గూర్చుండుము. నాహృదయవేదనను నీకుఁ బంచియిచ్చెద.

# షష్ఠాధ్యాయము



ఇందిర తలుపు బిగించి వచ్చి తండ్రిపడకమీఁదనే కూర్చుండెను. మిత్రానందుఁడు లేచి నావ పోవుమార్గమును కిటికీలనుండి చూచెను. సముద్రము, ఆకసము, నక్షత్రములు శుభ్రముగా కనఁబడుచుండెను. చంద్రుఁడుదయించెను. సాధుజనుల మానసంబువలె నిష్కళంకముగా వెన్నెల చల్లఁదనము నిచ్చుచుండెను. ఆచంద్రకిరణంబులు ప్రసరించియుండుటవలన వెండినీరు పోసినట్లు సముద్రజలము తళతళ లాడుచుండెను. అతఁ డట్లు కొంచె మచట నిలిచియుండి యచటనుండి వచ్చి తనబిడ్డప్రక్కను గూర్చుండి యామెతల వెండ్రుకలను సరిగా దిద్దుచు "బిడ్డా, వినుము. మేవారు లేక ఉదయపూరను ప్రసిద్ధిఁ జెందిన యొకగొప్పపట్టణమునుగురించి నీ కిదివరకే చెప్పియున్నాను. అచటిరాజులకుఁ బూర్వము చిత్తూరు రాజధానిగా నుండెను. ఆరాజులు రాజధానిని మరల నుదయపూరునకు మార్చుకొనిరి. అట్లు చేయుటకు ఎన్నియో కారణంబులు గలవు. ఇపుడు పదునాఱుసంవత్సరములకు ముందు ప్రతాపసింహుఁ డను నొకరాజుండెను. అతఁడు మిగులసద్గుణశాలి గావునఁ బ్రజ లతనిని ప్రతాపసింహదేవుఁ డని పిలుచుచుండిరి. అతనిభార్య పేరు రత్నాదేవి. ఆమెసద్గుణముల కామెయే సాటి యని చెప్పు టతిశయోక్తి గాదు. ఆరాజు తన కేఁబదిసంవత్సరము లగువఱకు భార్యతో నఖండసుఖ మనుభవించెను. వారు పుత్రులు లేక యెన్నియో జప, తప, దానంబు లొనర్చిన పిదప నొకపుత్రుఁ డుదయించెను. అతని పేరు విక్రమసింహదేవుఁడు. ఆరాజకుమారుఁడు తన యాఱవసంవత్సరమునందే భావిభాగ్యమును గోలుపోవు చందంబునఁ దల్లిని గోలుపోయెను. అయిన నతనితండ్రి తల్లి లేనికొఱంత తెలియనట్లు కడుగారాబముగాఁ బెంచుచుండెను. కొన్నిదినములు గడచిన

పిమ్మట మంత్రులు రాజును పునర్వివాహముఁ జేసికొనుటకై బోధనలు చేయు చుండిరి. ఢిల్లీశ్వరుఁ డగు ననంగపాలునకును నీప్రతాపసింహునకును మైత్రి మెండు. వారిరువు రేకోదరులవలెఁ బరస్పరము ప్రేమించువారు. అపు డనంగ పాలుఁడు ప్రతాపసింహుని ఢిల్లీకి రప్పించి బలాత్కారంబుగనో లేక యిష్టముమీఁదనో యతనికిఁ బెండ్లిఁ జేయించెను. పెండ్లికుమార్తె పేరు మురళా దేవి. ఆశ్వారుదేశపురాజపుత్రి. అనంగపాలుఁ డా దంపతుల బహుమానం బులచే సత్కరించి రాజ్యమున కంపెను. ప్రతాపసింహున కీవివాహమువలనఁ దనపుత్రునియందలిప్రేమ మిగుల నతిశయించెనే కాని తగ్గలేదు. ఆబాలుని మాఱుతల్లియును బ్రీతిగానే పెంచుచుండెను. రాకుమారుఁడు దినదిన మభి వృద్ధి నొందుచు నన్నిభాషలయందును ధనుర్విద్యయందును బ్రవీణుఁ డని ఖ్యాతి గాంచెను. వినయశీలుఁ డగు నాయువరాజును బ్రజలు రాజుకంటె నెక్కువగా బ్రేమించుచుండిరి. మురళాదేవిభర్త యింటికి వచ్చినపు డామె తమ్ముఁ డగు మదనపాలుఁ డనుబాలునిఁ బిలుచుకొనివచ్చెను. ఆబాలుఁడును యువరాజవయస్కుఁడే, వాఁడును వీనివలె తల్లి లేనివాఁడే. వీ రిరువురు నొక చోటఁ జదువుచు ధనుర్విద్య తురగారోహణ, గజారోహణాదికళల నభ్యసించి నను మదనపాలున కీవిద్యలయం దంతపట్టుదల లేదు. అందులకై యువరాజునకు మదనపాలునియం దసూయాబుద్ధి గలిగియున్న దని యొకవదంతి యంతఃపుర మందుఁ గలిగెను. దానినిగుఱించి యువరాజు నతనిపినతల్లి మందలించినది. అతఁడు దానిని దండ్రికిఁ జెప్పలేదు. అప్పటినుండి విక్రమసింహునకు మనోవ్యథ కలుగుటకుఁ బ్రారంభ మాయెను. అయినను నతఁడు దానిని లెక్కింపక తలిదండ్రులయందు మిగుల భక్తితో మెలఁగుచుండెను. ఇంతలో గ్వాలియరురాజపుత్రి యగు హేమప్రభ నారాజకుమారున కిచ్చిరి. పాణి గ్రహణమహోత్సవ మతివిభవముగా జరిగెను. హేమప్రభవంటిరూప మే రాజపుత్రికలకును గలిగియుండదు. సద్గుణంబులును దానికిఁ దోడై యారాజ బాలిక ప్రకాశించుచుండెను. తండ్రి తనకుమారున కీయువరాజపట్టంబుఁ గట్టి

రాజకార్యము లన్నియుఁ గుమారున కప్పగించి యాతఁడు నిశ్చింతుఁడై యుండెను. ఈకార్యము మురళాదేవికిఁ గిట్టలేదని జను లనుకొనుచుండిరి. యువరాజుభార్య మిక్కిలి యణఁకువతో నత్తమామలసేవ లొనరించుచు వారి మెప్పుపడయఁ బాత్రురాలై యుండెను. ఆచిన్నదానిసవతియత్త యేమిబాధ పెట్టుచుండెనో యది యువరాజెఱుఁగఁడు. అయిన నప్పుడప్పుడు తనభార్య ముఖవైఖరిని జూచి కొంచెము గ్రహించియున్నను నిది యిట్టి దని యాతఁ డెఱుఁగఁడు. సద్బోధలచే వ్యసనమును బోఁగొట్టి సంతస మొందించును. ఇట్టి గుణవతి యగుభార్యతో యువరాజు కొన్నిదినములు సకలసుఖంబు లనుభవించుచుండఁగా, ఆదేవి యొకయాఁడునిసుంగును గనెను. ఆనాఁటిపుత్రికా మహోత్సవమును బ్రజ లింకను మఱచియుండరు. శుభముహూర్తమున మహారాజగు ప్రతాపసింహుఁడు తనమనుమరాలికి చంపకమాలిని యను నామకరణంబుఁ జేసెను. బిడ్డ దినదినాభివృద్ధి నొందుచుండెను. రాజుగారు తనభార్య యైనరత్నాదేవిరూపమును బోలి యున్న దని యాబిడ్డను సర్వదా తా మెత్తుకొనుచుండురు. సభయందుఁగూడ దాదు లాబిడ్డ నెత్తుకొని యాతనియొద్ద నుండవలెను. పలుమాఱు తనభార్యదగ్గఱఁ గూర్చున్నపుడు మురళా, చూచితివా నాచిన్నమనుమరాలివెండ్రుకలు, కన్నులం జూడఁగ నాముద్దుల కుమారుఁడు జ్ఞాపకమునకు వచ్చుచున్నవాఁడు. మిగిలినయంగములు నాపట్టపుదేవి యగురత్నాదేవిని స్మరింపఁజేయుచున్నవి. ఈబాలిక యౌవనవతి యగునేని దానితలిదండ్రులరూపమును మించియుండును. నాకుమారుని మిగులఁ బ్రేమించినదాని కనుగుణముగ నీనాపౌత్రి, నాపుత్రునియనంతరము నాసింహాసనమున కుత్తరాధికారిణియై యుండవలె నని నాప్రజలందఱకు నియమించెద" నని చెప్పెను. "నాథా, మీ రట్లు సేయుట నా కిష్టమే. అయినను మీ పౌత్రిని నాతమ్ముఁ డగు మదనపాలున కిచ్చెద నని నాకు మీరు వాగ్దానం బొనర్పవలయు నని వేఁడెద" ననెను. ఆమాట విని తోఁకఁ ద్రొక్కిన భుజంగమువలె నామెమీఁద మండిపడి యోసీ! నేను దశరథుఁ డనుకొని

నీవు కైకేయిగా నుండ దలఁచితివా! నీ వట్టిదాన వైనను నేను దశరథుఁడఁ గాను. నా సుపుత్రుని వనవాసపాలు గావింపకుము. భువనసుందరి నొక ధూర్తన కనుచు నిప్పటినుండి నన్ను హింసించుట కారంభించితివా? నిన్ను వివాహము చేసికొనుటయే నాకిష్టము లేదు. ఢిల్లీశ్వరుఁడు నన్ను చెఱిచెను. అయినఁ బిమ్మట ననిష్టముఁ జూపక నిన్నుఁ బ్రేమించుచుంటిని, ప్రేమించుచున్నాను. నేను పరుల నొప్పించువాఁడను గాను. నా కుమారుని యం దనిష్టము చూపితివా, ఈక్షణమునందే నిన్నుఁ బరిత్యజించెద" ననియెను. ఇట్లుగ్రరూపి యగురాజును జూచి మురళాదేవి భయముఁ జెంది యతనికి నమస్కరించి క్షమింప వేఁడె. యతనిమన్ననకుఁ బాత్రురా లయ్యెను. రాజు నిష్కపటి గనుక తనభార్య యజ్ఞానమువలన నట్లు చేసె నని తలంచెను. అది యట్లు గాక నాసంభాషణ మాకుటుంబమును కష్టములపా లొనర్చుటకు బీజముగా నేర్పడెను.

సామంతరాజు లందఱు రాణానకుఁ బ్రీతిపాత్రులై స్నేహితులవలె పలుమాఱు మేవారురాజాంతఃపురమం దుండువారు. ఆరాజగృహమం దెప్పుడును విందులు నాటపాటలును జరుగుచుండెను. వచ్చియుండువారు వారిరాజ్యములను మరలునప్పుడొకవిందు జరిగెను. ఆసమయమందు రాజబంధువులతో మహారాజు వినోదముగ ముచ్చట లాడుచుండెను. రాజు మిగుల సౌందర్యవంతుఁడు; సద్గుణశాలి. అట్టివానికుమారుఁ డెట్లుండునో యూహించుకొనుము. కందర్పునిఁ బోలుయువరాజు తనయందమునకుఁ దగినభూషణాంబరముల ధరించి తండ్రియొద్దకు రాఁగా, రాజుగా రందఱియెదుట తనపుత్రుని నాలింగనం బొనర్చి తనప్రక్కనుఁ గూర్చుండఁ బెట్టుకొనెను. అప్పుడే మదనపాలుఁ డచటికి వచ్చెను. అతనిని గన్నెత్తియైనఁ జూడలేదు. ఇదియంతయు మురళాదేవికి హృదయశల్యమై వేధించుట కారంభించెను. తనయంతఃపురమునకు వచ్చినసామంతరాజుల భార్యలు తనకంటె కోడలిని నెక్కువగా గౌరవించుచుండిరి. ఇట్టిదంపతులను జూచి మురళాదేవిముఖము నల్లఁబాఱియున్నను

పైకిఁ దానుగాఁ దెచ్చిపెట్టుకొన్న చిఱునవ్వులతోను వినయవాక్యములతోను వ్యవహరించుచుండెను. ఇట్లు రాజు లందఱు మరలిపోయి యొకవారము గడచెను.

ఒకనాఁడు మహారాజుగారికిఁ గొంచెముజ్వరము వచ్చియున్నదని తెలిసెను. తత్క్షణమే యువరాజు తండ్రికి శుశ్రూషలు జరుపుచుండెను. రాజవైద్యులు మందు లిచ్చిరి. రెండుసార్లు వమన మైనది. కుమారుఁడు సమీపమం దుండి తానే తండ్రికి సేవ గావించుచుండెను. రాత్రికి జ్వరము తగ్గినది. మహారాజుగారు నిద్రించుచుండిరి. యువరాజచటనే కూర్చుండియుండెను. సేవకులు బయట పంకా వేయుచుండిరి. రాత్రి రెండు గంటలవేళ రాజుగారు లేచిరి. తనకుమారుఁడు పాదము లొత్తుచుండెను. కుమారుని నపుడే దగ్గఱకుఁ బిలిచి యొకము ద్దిచ్చి "నాతండ్రీ, నాకు జ్వరము తగ్గినది. నీవు భయముఁ జెందకుము. నీకు నిద్రలేకయున్న దేహ మస్వస్థ మగును. అది నాకు బాధ కలుగఁజేయును. పొమ్ము నిద్రింపుము. కావలసియున్న, తత్క్షణమే పిలిపించెద" నని చెప్పి పుత్రునిఁ బంపివైచెను. అదియే తండ్రితో నంత్యసంభాషణము.

యువరాజు పోయి పడుకయందుఁ బండుకొనెనే కాని నిద్రపట్టలేదు. నాలుగుగంటల కొకతూరి వచ్చిచూచెను. సేవకు లందఱు బైటనుండిరి. విచారించెను. తండ్రి నిద్రించుచున్నారనియును, పినతల్లి యచట నున్నదనియును యువరాజునకుఁ దెలిసి తనగృహంబునకుపోయెను. నిద్రలేనివాఁడు గనుక నిద్రించెను. ఏడుగంటలవఱకు మెలఁకువ రాలేదు. అపు డంతఃపురమం దొకరోదనధ్వని వినవచ్చెను. యువరాజులికిపడి లేచి విచారింపఁగ, మహారాజుగారి నెవరో చంపినట్టు వార్త తెలిసెను. ఆ వర్తమానము విని యువరాజు మూర్ఛితుఁడై పడెను. లేవఁగానే యువరాజుచేతికి సంకెలలు తగిలింపఁబడి కారాగృహముఁ జేరెను. ఇందిరా, నీ వింతకుముందు విన్న సంతోషవార్తకు మించినదుఃఖ మనుభవించుమాట వినుచుండలేదా?

ఇందిర:—తండ్రీ, జరిగినదాని కేమి చేయఁగలము? ఇఁకముం దేమి చేయవలయునో యదిగదా చేయవలయును?

మిత్రానందుఁడు:—పిమ్మట జరిగినవిషయములు యువరాజునకుఁ దెలియవు. ఉదయపూరులో డిల్లీశ్వరుని ప్రతినిధి యున్నవాఁడు. మేవారు రాజుమీఁద నతనికి నధికారము గలదు. మహారాజుగారు రాత్రి యైదుగంట లకు చనిపోయినట్లును, ఆనిమిషముందే తనభర్తను యువరాజే చంపినాఁడనియు, నిట్టిక్రోధము మహారాజుగారు ద్వితీయవివాహ మైనప్పటినుండి యువరాజు పగసాధించుచుండి యిప్పటికిఁ దనమత్సరముఁ దీర్చుకొనెననియు రాజపత్ని యగుమురళాదేవి రాజప్రతినిధికి వ్రాసిపంపెను. కనుక తత్క్షణమే యువరాజు బంధితుఁ డాయె నని యతనికిఁ దెలిసెను. పిమ్మట విచారణ జరిగెను. ఆసమయమున నొకకత్తిని దెచ్చిచూపిరి. అతఁడాకత్తిని తనదని యొప్పుకొనెను. ఆకత్తి రక్తసిక్తమై యుండెనఁట. అది యతఁ డెఱుఁగఁడు. ఒకచేతిగుడ్డ నెత్తుటిచే తడిసియుండెనఁట. ఆగుడ్డకూడ యువరాజుదనియే నిశ్చయింపఁబడెను. కడచినదానితోఁ బని యేమి? బిడ్డా, యువరాజు పితృహంతకుఁ డని నిశ్చయింపఁబడి శిరచ్ఛేదనమునకు డిల్లీశ్వరునివలనఁ గ్రూరమగునాజ్ఞ వచ్చు నని స్థిరమైనది. మఱియొకనాఁడు రాత్రి యుత్తరువు ప్రతినిధిచేతి కందినది. మఱునాఁ డురిశిక్ష యొసఁగఁబడు నని జనులు తహతహపడుచుండిరి. అప్పటి కాఱునెలలనుండి యువరాజు కారాగృహమందు నరకబాధ ననుభవించుచుండెను. ఆరాత్రి రెండుగంటలసమయమందు కటికనేలలోఁ బడియున్న యువరాజు నెవరో తట్టిలేపిరి. చావునకు సిద్ధమైయున్న రాజకుమారుఁడు పిచ్చివానివలె నూరకయుండెను. తండ్రీ, నేను లేపినది నీకుఁ దెలియలేదా! హాకుమారా లెమ్ము" అని చెప్పుచు, నాచీఁకటియందే సంకెలను దీసి వస్త్రములను కట్టనిచ్చి కొంచెముద్రవ్య మిచ్చి యతనిచేతిని బట్టుకొని బయటికిఁ దెచ్చి "బ్రతికియుండి సుఖమును బడయుము" మని చెప్పి వెడలిపోయెను. అతఁ డెవరో యతఁ డెఱుంగఁడు. కంఠముమా

త్రము చిరపరిచిత మైనదే. అపుడు యువరాజు స్తబ్ధుఁడై నిలిచి, "నాకుఁ జావే మేలు. మరల నే నెందులకుఁ గారాగృహమునకుఁ బోఁగూడ" దని యాలోచించెను. "వెంటనే వలదు, వలదు, పుత్రకా! పోయి భూగృహమందుఁ జేరు" మని యెవరో యతనిచెవియందుఁ జెప్పినట్లు వినిపించెను. తత్క్షణమే యువరాజు భూగృహముఁ జేరెను. యువరాజచట జేరినకొన్నిదినములకు నాలోచనాశక్తి కలిగెను. పిమ్మట నతఁడు రాత్రులయందు బయటకు వచ్చి తనకుఁ గావలసిన యాహారవస్తువులఁ దెప్పించుకొనును. తా నొకకాఁపువానివలె వేషముఁ బూనెను. కొందఱు బీదలతోఁ జేరి మాటలాడుచు వారికిఁ గావలసినసహాయముఁ జేయుచు, వారివలనఁ దాను సహాయము నొందుచునుండెను. మదనపాలుఁడు మురళాదేవికి దత్తపుత్రుఁడై రాజ్యమున కభిషిక్తుఁడయ్యెను. ఇపుడు యువరాజునకు రాజ్యము విడిచినచింత లేదు. భార్యమీఁద మమత కలుగలేదు. అయినను తనబిడ్డకై విలపింపసాగెను. ఎచటికిఁ బోవుటకును గాళ్లాడవు. ఇట్లు దిక్కుమాలి యువరాజు దుఃఖించుచుండఁగ నీతనిస్నేహితుఁ డొకసందేశము దెచ్చెను. అది యేమనఁగా, యువరాజుభార్యతోఁగూడ తనబిడ్డ మేవారువందే బాననదీసమీపమం దున్నరాజభవనముఁ జేరె ననియు, నచటికి మదనపాలుఁడు పలుమాఱు పోవుచున్నాఁ డను నదియే. దానికి యువరా జేమిచేయఁగలఁడు? లోలోనఁ గుందుచు సమయమునకై వేచియుండెను. ఒకవెన్నెలరాత్రియందు బిడ్డ యచట నున్నయిసుకలో నాడుకొనుచుండఁగ, దాసీజనులుగూడ నచటనే యుండిరి. అరగంటలో బిడ్డ నెవరో యెత్తుకొని పోయి రని యొకకోలాహలము గలిగెను. తెల్లవాఱిన పిమ్మట నాయేటిగట్టున రాజకుమారియొక్క యాభరణము లన్నియు దొరకినవి. ఆస్థలమందు నెత్తురు చెదరి యుండెను. అందువలనఁ జిఱుతపులి యేటికి నీళ్లు ద్రావుటకై వచ్చి యుండి యచట నాడుచున్న బిడ్డను దినిపోయిన దని యేర్పడినది. కుమారీ! యీ యువరాజు తన బిడ్డకుఁ జేసిన మహోపకార మిదియే. అతఁడు బిడ్డను తల్లిదగ్గఱ

నుంచియున్న నాబాలిక తల్లియైశ్వర్యమున కధికారిణి యై తన కిష్టమైనవరుని పెండ్లియాడి యుండును. దానిని దప్పించి సుకుమారశరీరిణి యగు తనబిడ్డ నడవులపాలుఁ జేసినవాఁ డొకతండ్రి యగునా? వాఁ డెంతబుద్ధిగలవాఁ డైన నేమి? అట్టిసమయమం దతనికి దిక్కు దోఁపలేదు. మదనపాలుఁడు రాజాంతఃపురమునకుఁ బలుమాఱు పోవుట తప్పని భావించియు నీకుఁ దన బిడ్డ నచట విడువఁగూడ దని రాజు ఇట్టిపనిఁ జేసెను. అతనికోపము శాంతిఁ బొందినపిమ్మట తాను జేసినపని చెడ్డ దని గ్రహించెను. ఉపయోగ మేమి? కార్యము జరిగిపోయినది. తనయా, యది యేమిచిత్రమో యాబిడ్డయుఁ దన తల్లిని స్మరింపలేదు. అతఁ డాబిడ్డతోఁ గూడఁ గొన్నిదినములు గుహయందే యుండెను. అట్టికాలమం దాకొండలయందలి యొకకోయవాఁడు గొప్పయాపదయందుండఁగ, నీయువరాజు వానికిఁ గావలసినంత ద్రవ్యమిచ్చి రక్షించెను. వాఁడు సంతసించి కొన్ని మూలికలను జూపించి వానిమహిమను జెప్పెను. ఒకమూలికరసము తీసి దేహమునకుఁ బట్టించి స్నానముచేసిన, మనుష్యునకుఁ గల సహజచ్ఛాయ మాఱి వేఱొకవర్ణము కలుగును. మఱియొకటి స్వభావచ్ఛాయను గలిగించును. ఇంక ననేకమూలికలు వానియొద్ద గ్రహించెను. ఆనాఁడే యువరాజు తనశరీరమునకు నారసమును రాచుకొని స్నానము చేయఁగ నాశరీరచ్ఛాయ మాఱిపోయెను. తత్క్షణము తనబిడ్డకును రాచెను. ఇప్పటికిని ఆబిడ్డ తనదేహకాంతి యిట్టి దని యెఱుఁగదు. చూచితివా? ఆపద్బాంధవుఁ డగుభగవంతుఁ డేరీతి నాసమయమందు వారి నిరువురను రక్షించెనో! అతఁడు తనపేరు మార్చుకొని కాళిఘట్టమును చేరి యచట నొకకాయస్థునింటఁ బ్రవేశించెను. దైవానుగ్రహమువలన నది యొకబీదకుటుంబము. అయినను వారు ముందు మహైశ్వర్య మనుభవించి వ్యాపారమందు నష్టముఁ బొంది బీద లైనవారు. ఆగృహస్థుని పేరీశ్వరదాసు, గృహిణిపేరు ముక్తాబాయి. వారికిద్ద ఱాఁడుబిడ్డలు. రాజకుమారుఁ డాకుటుంబమును జేరినకొన్నిదినములకే యాయింటివారికి విశ్వాసపాత్రుఁ డాయెను.

ఈశ్వరదాసితనిని తననిజసోదరునికంటె నధికముగాఁ బ్రేమించుచుండెను. బిడ్డను కడుగారాబముగాఁ బెంచుచుండిరి. ఆగృహిణి తనకు ముగ్గురుబిడ్డ లని భావించి యీబిడ్డను గూడఁ బెంచుచుండెను. యువరాజాకుటుంబమునకు జీవనము సుఖముగా జరుగునట్లు ద్రవ్య మిచ్చుచుండెను. క్రమముగా బిడ్డకు విద్యాభ్యాసముఁ జేయించెను. ఆబిడ్డ యయిదు సంవత్సరములకే తనబుద్ధి ప్రకాశమును దనతండ్రికిఁ దెలియునట్లు చేసెను. ఏడు సంవత్సరములపుడే బడిచదువు పూర్తిఁజేసెను. ఇంతలో నాయువరాజొక నిర్మానుష్యదీవిని వెదకి యక్కడఁ జేరెను. ఇందిరా! యఖండైశ్వర్యము ననుభవించు రాజపుత్రి నడవులపాలొనర్చి జనులముఖములఁ జూచుటకైన నాశ లేక కష్టపెట్టిన తండ్రి క్రూరుఁడు గాఁడా? ఒకవేళ నాతఁడు మరణించిన నాబాలికగతి యేమి?

ఇందిర:—జనకా, యిన్నియనర్థము లొకస్త్రీవలన నా యువరాజు గారికి సంభవించినవి! వారియాకారమే వారు ధర్మస్వరూపు లని వెల్లడిఁ జేయుచున్నది. తనభర్త కట్టిమహావిపత్తు కలిగియుండ నంతశీఘ్రకాలమందుఁ దనభర్తకు శత్రుస్థానమందుండి రాజ్య మేలుచున్న మదనపాలుఁడు రాణిగారి యింటికిఁ దఱచుగాఁ బోవుచున్నాఁడని విన్నపు డెట్టివారికిని గోపము రాక యుండును? యువరాజు ధర్మస్వరూపి యైనందువలన భార్యను జంపక తమబిడ్డ నెత్తుకొని పోయిరి. బిడ్డకుఁ దండ్రి సర్వాధికారి. ఒకవేళఁ దనభార్య కళంకినియైన నట్టిస్త్రీయొద్దనుండి యాచిన్నది చెడిపోవుటకంటె పవిత్రుఁడు దైవస్వరూపి యగు తనతండ్రిసమీపమందు మరణించిన శ్రేయమని నామతము. నేను గలయందైన నాతండ్రి యపరాధి యని యెంచను.

మిత్రానందుఁ డాపలుకులు విని యిందిరను జూచి దుఃఖించుటకుఁ బ్రారంభించెను. బిడ్డ నెత్తి ప్రక్క నిడుకొని యిందిరా, నే నిదివరకుఁ జెప్పి కథకుఁ జేరినవారెవ రనెను.

ఇందిర:—"తండ్రీ! యాయువరాళే మీరు. నేనే మీయనుంగుబిడ్డ" నని చెప్పుచు నిశ్శబ్దముగాఁ గన్నీళ్లు కార్చుచున్నతండ్రి నోదార్చి "జనకా, సర్వజ్ఞుల రగు మీ రిట్లు దుఃఖితు లైన, పామరులగతి యేమి? దైవగతి తప్పింప నేరితరము? ఏకాలమునం దేది జరుగు నది మానవుల మేలుకొఱ కని మీరు చెప్పియుండలేదా? మాళవదేశాధీశ్వరునిగ్రహచారవశంబున నతఁడు దొంగలకుఁ జిక్కె. అతఁడు పరుల దైవవశంబున మనపాలం బడె. దేవా, రావణుఁ డెన్ని వేలసంవత్సరములు గడచినపిమ్మట వానిపాపకృత్యంబులకుఁ దగుఫలం బనుభవించె? అట్లే మురళాదేవి యొనరించినఘోరకృత్యమునకుఁ దగుఫలం బనుభవించుకాలము సమీపించియుండవచ్చును. కనుకనే లలిత కుమారునిఁ జూచి మీకు దుఃఖ మతిశయిల్లె. నే నిపుడు యుక్తవయస్సు గలిగి యున్నందున మీదుఃఖకారణంబుఁ దెలియ సమర్థించి యడిగితిని. లేకున్న మీ రిదివఱ కెన్నిసార్లు నన్నుఁ జూచి దుఃఖించియుండిరో నా కేమి తెలియును? మీకు వ్రజదీవియం దేమిబాధ కలుగకుండిన మీ రచటనే యుండియుందురు. మమ్ము స్థానభ్రష్టులఁ జేయుటకుఁ జండసేనుఁ డేర్పడెను. నే నింతకుముం దాస్థలమును విడిచినందుల కెంతయో మనంబునందుఁ గుందుచుంటిని. ఇపుడు సంతోషించుచున్నాను. తొల్లి రాముఁడు జనస్థానమందు వసింపక యున్నసీతను రావణుఁ డపహరించు టెట్లు? ఆదురాత్ముఁడు చచ్చు టెట్లు? కనుకనే వా రచట వసించుట, సీత నపహరించుట, అతనిని రాములు సంహరించుట, ఇవియన్నియు దైవకృత్యములు. రాముల కపు డతికష్టముగఁ దోఁచినను నతఁ డవతరించినకార్యము ముగించి లోకము నుద్ధరించెను. తండ్రీ, మనము మానవులమైనను వీరక్షత్రియకులంబునందుఁ బుట్టియుండి సమయము గలిగినపుడు యుక్తిచేతను సాహసంబుచేతను మనశక్తికొలఁదిని పాపాత్ముల నడంపవలదా? మనము చేయఁదగినకార్యము మఱియెవరు చేయఁగలరు?

మిత్రానందుఁడు:—తనయా, తత్కాలోచితబుద్ధి నీయట్టి ధీరురాలికే తగును. నీవు నన్ను భరించుటకే పుట్టియున్నావని యిపుడు నిజమాయెను. అమ్మా, నీ వేమి చెప్పినను నది చేసెద.

ఇందిర:—జనకా, మీరు చేయునట్టికార్య మేమి గను లేదు. పాపఫల మనుభవించువారికాలము సమీపించినది. మీరు లోపలనుండి యాలోచన చెప్పుచుండవలెను. నామీఁద నధికమగుకార్యభారము పడియున్నది. ఇఁక నాలస్యము చేయఁగూడదు. ఇపుడే నేనుదయపురమునకుఁ బోవలెను. తమ యనుజ్ఞకై వేచియున్నాను.

మిత్రానందుఁడు:—ఇది యేమి విపరీతబుద్ధి? ఇందిరా, నీ వచటికిఁ బోయి సాధించుపని యేది?

ఇందిర:—జనకా, యీవ్యవహారమును మరల విచారణకుఁ దెచ్చునట్లు చేసి యీకృత్యము నెవరు చేసిరో వారిని వెదకి నాతండ్రిని సభలో నిరపరాధి యనిపించి యతని సింహాసనారూఢునిగాఁ జేసి దుష్టనిగ్రహం బొనర్చుటకై ధర్మదేవతను నమ్మి వెడలుచున్నాను. నాప్రయాణమున కెట్టిభంగము గలిగినను నాప్రాణమునకు హానిఁ జేసినట్టే. తండ్రీ, నే నంతటికృతనిశ్చయురాలనై యున్నాను. నేను పసిబిడ్డను గాను. వీరక్షత్రియకన్యను. ఇది విచారాలోచించి యనుజ్ఞ నియ్యఁగోరెద.

మిత్రానందుఁడు:—పుత్రీ, మదనపాలుఁడు రాజును చంపె నని యెంచియున్నావా? అయ్యో, యతఁ డంతటివాఁడు కాఁడే. పదునాలు సంవత్సరంబులు గడచిపోయెను. ఇపుడు నీవు సాధించుపని యేమి? రాజగృహంబున నీకుఁ గావలసినచిహ్నము లేవి దొరకును? అట్టిపనికిఁ బూని నీవు పనిచేయుటకు ప్రారంభించినదైన నచట నీ కేదైనఁ గష్టము సంభవించిన ని న్నెవరు రక్షించువారు? నే నెట్లు రాఁగలను? నీ వీపంతముఁ బూనుట మనయిరువురప్రాణములకు హాని దెచ్చుకొనుట కని నీకుఁ దోఁపలేదా?

ఇందిర:—జనకా, యిట్లు దొంగతనంబున జీవించుటకంటె మన మిరువురము మరణముఁ బొందుట సుఖము. అన్యులు రక్షింపఁ బనిలేదు. ధర్మ దేవత నాకుఁ దోడు. యుద్ధకాలమందు మన రాజకుటుంబమువారు దాఁగి యుండు భూగృహ మున్న దని మీ రిదివఱకు నాకు నొకసారి చెప్పియున్నారు గదా? కార్యములు నెఱవేఱునవఱకు మీ రందు దాఁగియుండుఁడు. అచట నుండి నాకు తగు నాలోచనలు చెప్పుఁడు. ఒకవేళ నే నట్టాపదకుఁ జిక్కిన యెడల మాళవదేశాధీశుఁడు కాపాడలేఁడా? కనుక నిఁక నే నూరకయుండను. "యతో ధర్మ స్తతో జయః" అను భగవద్వాక్యము మఱచితిరే. తమరు నాకై భయముఁ జెందవలదు. నేను పోవుటకుముందుఁ గొన్ని సంగతులు తెలిసి కొనవలయును. తమ రచట నుండునపుడు మురళాదేవికిని మదనపాలునకును మిగుల నాప్తు లెవరు? వారినడత యెట్టిది.?

అపుడు తనబిడ్డ చెప్పిన యాలోచన తగినదని మిత్రానందునికిఁ దోఁచెను. ఇఁకఁ జేయునది లేదు. ఏకాంతస్థలమం దుండుటకుఁ జందసేనుఁడు విరోధి యయ్యె. నిర్భయముగాఁ దిరుగుటకు సాధ్యము లేదు. ఇట్లు తనస్థితి విపద్యుక్తమై యుండుటవలనఁ దనకుమారి చెప్పినట్లు ధర్మమునకై పోరాడి చూచెద. ధైర్యశాలినియగు బిడ్డ సహాయకురాలై యున్న" దని యాలోచించుకొని, యిందిరా, మురళాదేవి తనభర్తయింటికి వచ్చునపు డాదేశమునుండి కొందఱు దాసదాసీజనంబులు నామెవెంట నిచటికి వచ్చిరి. వారిలో ఫల్గునుఁ డను వాఁడు మదనపాలుని సేవకుఁడు. ఇతఁడు రాజైనపిమ్మట నా సేవకుఁ డున్నత దశయం దున్నాఁ డని లలితకుమారుఁడు చెప్పెను. ఒకానొక దాసి మురళా దేవికి మిక్కిలి ప్రియురాలై నది. మఱియెవరిని నే నెఱుంగను.

ఇందిర:—తండ్రీ, వ్యవహారమునకై యన్ని విషయముల నెఱింగియుండుట మంచిదని యడుగుచున్నాను. తండ్రీ, నే నడుగఁబోవు విషయమునుగుఱించి మీరు చింతింపకయుండవలె నని వేఁడెద. నిశ్చయమైన యుదంతము దైవ మెఱుంగును. హేమప్రభాదేవి తనభర్త కిట్టియాపద సంభవించియుండఁగాఁ

దనతండ్రియంతఃపురమం దుండక, యత్తగా రిట్టిక్రూరాలని తెలిసియున్నను మేవారులో నుండుకారణమేమి? ఉండెఁబో, తనశత్రువగు మదనపాలుఁడు తనగృహంబునకు వచ్చుట కెట్లు సమ్మతించియున్నది, యని యిందిర తండ్రిని ప్రశ్నించెను.

మిత్రానందుఁడు:—పుత్రీ, నా కెట్లు తెలియును? లలితునినోటనుండి యాపిడుగువంటిమాటవిని యతనిని మరల నే నేమియు నడుగలేదు. ఓపికతో నాలోచింపఁగా రాజ్యమున కధికారి మదనపాలుఁడు. అనాథ యగు స్త్రీకి రాజవిరోధము క్షేమకరము కాదు. హేమప్రభకుఁ దండ్రి లేఁడు. సోదరులు లేరు. అదియునుం గాక యామెతండ్రి మేవారునం దామెకుఁ గట్టియిచ్చి యున్న రాజభవనము చిన్నదిగా నున్నను రాజ్యము నేలు రాజుగృహమునకుఁ దీసిపోవునది కాదు. ఆకోటవిభవము, నాయుద్యానవనసౌందర్యము మిగులఁ బ్రఖ్యాతిఁ జెందినది. హేమప్రభకు నధిక ద్రవ్యమున్నది. ఆమెకోటలోఁ గొందఱుయోధు లున్నారు. ఇంతవైభవమును విడిచి యెచటికిఁ బోవును? కనుక వా రేదియో యుక్తిచేసి యామదనపాలుని నాకోటలోనికి రానిచ్చుచున్నారని నాయూహ. అట్లు లేనియెడలఁ బదియాఱు సంవత్సరములనుండి యా పునర్వివాహము చేసికొనుట? నాకర్థముకాలేదు. కుమారీ, నన్ను కారాగారమునుండి విడిపించినది యామెయై యుండును. అప్పటఁ జీఁకటియందు నన్ను లేచి పొమ్మని చెప్పినకంఠధ్వని నాకుఁ బరిచితంబైనదే. అది యెవరై యుండునది నాకు జ్ఞాపకములేదు. అట్లు గాదేని మురళాదేవి తనసవతికుమారునిఁ జెఱిచినదే కాక వానిభార్యను భగ్నవ్రత నొనరింప యత్నించి యుండవచ్చును. తనకుట్ర ఫలించినను లేకపోయినను నీయపవాదము ప్రసరించి యువరాజు బ్రతికియుండిన నీపిడుగువంటివార్త విని చచ్చినను చచ్చుఁగాక! యని యాలోచనముఁ జేసియుండవచ్చును. ఏదియును దెలియక నాదేవిమీఁద దోషారోపణము చేయుటకు నామనస్సొప్పలేదు.

ఇందిర:—తండ్రీ, మన్నింపుఁడు. నే నిపుడే వెడలిపోవలయును. నాయందు దయయుంచి త్వరగా నా ప్రయాణసన్నాహం బొనర్పవలెను. జనకా, నాతల్లి వీరపతివ్రత యని ప్రచురపఱుపవలయును. లేదా, యొక వేళ దుష్టురాలైనఁ దగినఫల మామె యనుభవింపవలయును

మిత్రానందుఁడు తల నూఁచెను. ఇందిరను బంపు టవశ్యకర్తవ్య మని నిశ్చయించుకొనెను. అమ్మా, నీ వితరుల నమ్మకుము. స్వబుద్ధి నుపయోగింపుము. నీకార్యము సఫలం బగువఱకు నన్నుగుఱించి చింతింపవలదు. నే నిచట నిరపాయం బగు నొక స్థలమునందుండి యుత్తరప్రత్యుత్తరంబులు జరపుచుండి నీకు సహాయం బొనరించెద. దైవము నిన్ను రక్షించుంగాక! ఈకాలమున కిది యుక్తం బగుత్రోవ. మన మీరాత్రి కాళీఘట్టముఁ జేరవచ్చును. అచ్చట నాస్నేహితునితో నాలోచించి నిన్నుఁ బంపెద.



# సప్తమాధ్యాయము



అది యొక కాయస్థ కుటుంబము. ఇంటి యజమానుఁ డీశ్వరదాసు. భార్య ముక్తాబాయి. ఆమె పేరు తగియుండెను. వారికి హీర, తారయని యిద్దఱు బిడ్డలుండిరి. వారు భాగ్యవంతులై యుండి వ్యాపారమునందు నష్టమొంది బీదవారయినను గౌరవముగా బ్రదుకుచుండిరి. ఈశ్వరదాసు దానొక యంగడిఁ బెట్టుకొని తనకుటుంబము నొకవిధముగా రక్షించుచుండెను. హీర తారకన్నను పెద్దది. మంచివిద్యావతి. తార యిందిరకు సమానవయస్కురాలు. ఆమె యింకను జదువుచుండెను. హీర కుట్టుపనిచేతను చిత్రము వ్రాయుటచేతను ద్రవ్యము సంపాదించుటకుఁ బ్రారంభించి యుండెను. ముక్తాబాయి మిక్కిలి యుత్తమురాలగు గృహిణి; యథాలాభసంతుష్టురాలు. పరగృహంబున కరుగదు. వ్యర్థపుమాట లాడదు. సదా గృహకృత్యంబుల నిర్వర్తించి పిమ్మట సద్గ్రంథములు చదువుచుఁ గాలము గడపును. ఇఁక నీశ్వరదాసొక చిన్నకార్యమైనను దనభార్య నడుగక చేయఁడు. సద్వర్తన గలవాఁడు. ఆదంపతు లత్యంతమైత్రితో మెలఁగుచుండిరి. తాము బీదవారన్నమాట నైనఁ దలఁపక సంతుష్టమనస్కులై కాలము గడపుచుండిరి. రాత్రి యేడుగంటలకుఁ దాసు భాగవతముఁ జదువుచుఁ గూర్చుండెను. ఇంటివాకిటఁ బండి నిలిచెను. కొంచెము సేపటికి సామానులు బండివాఁడు దెచ్చిపెట్టెను. వెంటనే మిత్రానందుఁడు నిందిరయును లోపలి కరిగిరి. దాసు దిగ్గున లేచి "యో నాప్రాణమిత్రమా!" యని యఱచుచుఁ బోయి మిత్రానందుని నాలింగన మొనరించెను. ఇది యేమోశబ్దమని ముక్తాబాయి యచటికివచ్చి యచటనిలిచియున్న యిందిరను జూచి గుర్తించి "అమ్మా, నాముద్దులపట్టీ, యిప్పటికిఁగద నిన్నుఁ జూడఁగలిగితి"

నని యిందిర నింటిలోపలికిఁ దోడ్కొనిపోయెను. అచట నామెయిద్దఱు బిడ్డ లుండిరి. ఇందిర వారిని గుర్తించి యందఱను నమస్కరించి యాలింగనముచేసి తృప్తిపఱచెను. ఒకరితో నొకరు క్షేమసమాచారంబులు మాటాడుకొనుచుండిరి. ఆనాఁడు వారియానందమునకు మేర యుండలేదు. వారిరువురు నచట నాలుగైదుదినములు గడపిరి.

ఈశ్వరదాసు:—మిత్రమా, నా కిహలోకమందు నిన్ను మించిన బంధువులుగాని స్నేహితులుగాని లేరు. ఇఁకమీఁదనైన నీవే గురు వని నమ్మియున్న నన్ను విడిచియుండవల దని నిన్ను వేఁడెద. ఇందిర కిది యుక్తవయస్సు. ఇఁక నామెకుఁ దగునరుని వెదకవలదా?

మిత్రానందుఁడు:—మిత్రమా, నీ వనునది నిజము. ఈభూమండలమందు నీకంటె నాకు మఱియొకస్నేహితుఁడు లేఁడు. నిన్ను విడిచియుండఁగూడ దనియే నానిశ్చయము. అయిన నొకఘనకార్యమును సాధించితీరవలె నని తీర్మానించితిని. అది జయించిన ట్లయిన నావలన ననేకులు మేలు పడయుదురు. ఈ విషయమునుగుఱించి యిందిర మిక్కిలిపట్టుదలతో నున్నది. ఆమెయిష్టముప్రకార మామెను విడిచిపెట్టుట స్థిరమైనది. ఆమె పురుషవేషము ధరించి పోవుట మంచిది.

ఈశ్వరదాసు:—నీవు మహానుభావుఁడవు, కించిజ్ఞుఁడ నగునేను నీ కేమియాలోచనఁ జెప్పఁగలను? నాయందు నీ వింతవిశ్వాసము గలిగియుండుట నాభాగ్యవిశేషము. ఇపుడు బిడ్డ యేదేశమునకుఁ బోవలయును?

మిత్రానందుఁడు:—మిత్రమా, మేవారునకుఁ బోవలయును.

ఈశ్వరదాసు:—అబ్బా, చాలదూరమే! బిడ్డ వయస్సున చిన్నది. రూపవతి. అన్నా, ఈమాట విని మన స్సేలాగో తల్లడిల్లుచున్నది.

మిత్రానందుఁడు:—ఇంతమాత్రంబునకే భయపడువాఁడవు ముందు గొప్పకార్యము నెట్లు సాధింపఁగలవు?

ఈశ్వరదాసు:—అన్నా, యీమె యాఁడుబిడ్డ గదా? మానసంరక్షణము స్త్రీలకు విధాయకము గదా? అంగులకై వగచెద.

మిత్రానందుఁడు:—ఆవిషయము నాకుమాత్రము దెలియదా? ఇందిరను సామాన్యస్త్రీ యని యెంచవలదు. ఆమెసామర్థ్యము ముందు తెలియునని చెప్పి యొకగదియందుఁ గూర్చుండి తలుపులు బంధించుకొని చాలసేపు మాటలాడుకొనిరి.

ఉదయపూరు మాళ్వ మొదలగు సంస్థానములయందు రత్నవ్యాపారముఁ జేయు నొకగొప్పమార్వాడివర్తకుఁ డుండెను. అతఁడును కాళీఘట్టమం దుండువాఁడు. అతని పేరు హుకుంచంద్. ఆదేశమం దతఁడు రెండవకుబేరునివలె నష్టైశ్వర్యములతో మెఱయుచుండెను. అతనికి లెక్కలేని దాసదాసీజనము లుందురు. వారిలో నొకక్రొత్తసేవకుఁ డుండెను. అతఁ డచటఁ జేరినకొన్నిదినముల కావర్తకునిగృహమం దతనిగృహిణి యాదిగాఁ గలవారం దఱిమనస్సులకుఁ దృప్తికరముగా వర్తించుచుండెను. ముఖ్యముగా యజమానునియెద్ద మిగుల విధేయతతో మెలఁగుచు నతఁడు కన్నెత్తి చూడఁగానే యాతనిమన స్సెఱింగి యతనికిఁ గావలసినపనిఁ జేయుచుండెను. కనుక నతఁడును తనపనులనుమాత్రము చేసి సుఖముగా నుండుమని నా సేవకునకు నియమించెను. ఇట్లు భయభక్తులతో నుండుపిల్లవాఁడు మనయిందిరయే. ఆమె యిట్టివర్తకుని దగ్గఱ సేవకుఁడుగాఁ గుదిరి యజమానుఁడు ప్రయాణము చేయఁగానే యతనివెంబడి తాను వెడలిపోయెను. ఉదయపూరు చేరగానే తన కొక చెల్లెలు సమీపగ్రామమం దున్నదనియు నది యస్వస్థముగా నున్నందున దానిని తాను జూడవలెనని చెప్పి, యతనియాజ్ఞఁ గైకొని వెడలిపోయి యాయూరిలో నందందు వెదకి యొకయిల్లు చేరెను. ఆయింటిలో నొకవృద్ధురాలు తప్ప మఱియొకరు గన్పింపలేదు. విచారింపఁగా నాయవ్వ కొకమనుమఁ డుండెనని తెలిసెను. వాఁ డాఱేఁడ్లవాఁడు. ఇందిర యాయవ్వతో,

"అవ్వా, నేనొక బీదపిల్లను. నాకెవరును లేరు. మానసంరక్షణ కిట్లు మగవేషమున నిప్పటికి వచ్చి చేరితి"నని చెప్పెను.

వృద్ధురాలు:—అమ్మా, యటులా? స్త్రీలకు మానముకంటె మించిన దేమి యున్నది! ఈకాలపుస్త్రీలు మానమునే మఱచిపోయిరి. నిన్నుఁ జూచుట కెంతియో ముచ్చటగా నున్నది. బిడ్డా, నాకుమాత్ర మెవరున్నారు? ఈచిన్నవానిని గాపాడుచు నీప్రపంచమందుఁ గాలము గడపుచున్నాను. తల్లీ, నీవు మిగుల బడలియున్నావు. లెమ్మా. స్నానముచేసి భోజనమునకు రమ్మా. మే మెవరమో యని సంశయముఁ జెందకుము. మేము రాచవారము.

ఇందిర:—అవ్వా, నీయింటిని నిన్నునుఁ జూడఁగనే నీవు పరిశుద్ధమైనస్త్రీ యని నేను దెలిసికొంటిని. నీయిల్లు చొచ్చినది నామనస్సునకుఁ బరమాహ్లాదకరముగా నున్నది. అవ్వా, నీవు నన్నింత యుపచరించినందులకు నీకు నావందనంబు లర్పించెద" నని చెప్పి స్నానం బొనర్చి భుజించి యలఁతచే నిదురించెను. ఇందిర ద్రవ్యముచేతను తనమంచిగుణములచేతను నింటిపనులు చేయుటయందు నావృద్ధురాలికి సహాయముగా నుండుటచేతను సంపూర్ణముగా నామెను దనస్వాధీనముఁ జేసికొనెను. అవ్వ తన సొంతమనుమనికి సమానముగా, నిందిరనుఁ బ్రేమించుట కారంభించెను. ఒకనాఁ డిందిర యవ్వ ప్రక్కను కూర్చుండి "యవ్వా, యీపిల్లవాఁడు నీ కేమి కావలయు"నని యడిగెను.

వృద్ధురాలు:—(కన్నులనీళ్లు గ్రుక్కుచు) నాతల్లీ, నాదుఃఖమేమని చెప్పుదును. నా కొకకూఁతురుండెను. చిన్న యంతఃపురమందు దాదులకంతటికి నధికారిణియై యుండెను. ఎంతగుణవతి—యెంత రూపవతి—యనుకొంటివి? అట్టిచిన్నది నాయట్టి నిర్భాగ్యురాలికిఁ దక్కునా? అమ్మా, పిల్లవానిఁ బ్రసవించి మరణించెను. వీనితండ్రియుఁ దనభార్య ననుసరించి పోయెను. ఆనాఁటి నుండియుఁ గన్నీరు మున్నీరుగాఁ గార్చుచు నీపిల్లవానిని గాపాడుచున్నాను.

హేమప్రభాదేవి నాపుత్రియం దునిచినప్రీతిచే నిప్పటికిని మాకు సుఖముగా జీవనము జరుగుచున్నది.

ఇందిర:—ఆలాగా? మీరాణి యెంతఘన మైనగుణము గలది! తన దాసి చనిపోయినను దానితల్లి బిడ్డలను బోషించు టెంత ధర్మమైన పని! అవ్వా, మీరాణీగారి కెంతవయస్సు?

వృద్ధురాలు:—బిడ్డా, నాయజమానురాలు ముప్పదిరెండేండ్లవయస్సు గలది. దేవతలు నాగకన్య లతిరూపవతు లని పురాణములలోఁ జెప్పుదురు. అది కల్లయో నిజమో మానవు లెఱుఁగరు. ఇపుడు ప్రత్యక్షముగ మానవులలో నామెను జూచుచున్నాము. ఆమెకుఁ బదియాఱవసంవత్సరము ముగియు చుండఁగానే యీరాజ్య మేలుచున్న రాజకుమారున కిచ్చి మహావిభవముగాఁ బెండ్లి చేసిరి. అమ్మాయి, యాయుత్సవములు నాదానధర్మములు నిపుడు కల లైనవి. యువరాజు భార్య మఱుసంవత్సరమునకే యొక యాఁడుబిడ్డం గనెను. ఆబిడ్డకు రెండుసంవత్సరంబులు గడచినవో లేవో పెనుభూతము ప్రవేశించినట్లు రాజ్యమునకు మహావిపత్తొకటి ప్రాప్తించినది. అంతటితో నన్నియుత్సవము లడుగంటిపోయినవి. ఇపుడు నారాణి తన భర్తను బిడ్డనుఁ బోఁగొట్టుకొని యింతవఱకును వ్యసనముచేఁ గృశించుచున్నది. అయినను నామెసౌందర్యము వర్ణింప నశక్యము. ఆమె యీదుఃఖ మనుభవించునట్లు నొసట వ్రాయఁబడి యున్నది. ఎంతసౌందర్యమున్న నేమి? ఎంతభాగ్యమున్న నేమి?—ఆమాట విని నిందిరమనస్సు తల్లడిల్లెను. మాటాడుటకు నోరాడలేదు. పొరలిపొరలి వచ్చు దుఃఖము నణంచుకొని, "యవ్వా! ఇచట గాలిలేక మిగులఁ గష్టముగా నున్నది. దొడ్డిలోఁ గూర్చుండి మాటలాడుదముర"మ్మని లేచిపోయి తన మనస్సును గొంచెము నెమ్మదిపఱచుకొనెను. దొడ్డి చిన్నదైనను మిక్కిలి రమ్యముగా నుండెను. అది యొక చిన్న పూలతోఁట యని చెప్పవచ్చును. చుట్టును ప్రహరిగోడ కట్టఁబడియున్నది. మల్లెచెట్లు మొగ్గలచేఁ గ్రిక్కి-

జేసియున్నవి. గులాబీపూ లప్పుడే వికసించుచు నిందిరమనస్సున కాహ్లాదము గలుగఁజేయుచుండెను. అప్పు డామెకు వ్రజదీవిలో నుండు తనగృహము జ్ఞాపకమునకు వచ్చెను. ఆయిల్లు విడిచివచ్చినవ్యసనము తన తండ్రిని విడిచి యున్న దుఃఖము నిఁకముం దెట్లు కార్యసాధనముఁ జేయుటకుఁ దోఁపక యున్నవ్యాకులత యివియన్నియు నేకకాలమున నామెను ముంచివైచెను. ధీరబుద్ధిగల యిందిర వీని నన్నిటి సహించుకొని "అవ్వా, యీపూల నేమి చేయుదు" వనెను.

అవ్వ:—బిడ్డా, ప్రతిదినము దండలు కట్టి తీసికొనిపోయి మహారాణి కిచ్చెదను.

ఇందిర:—ఇంటిపను లన్నియుఁ దీరినవిగదా! నేఁడు నేను పూలు కట్టి యిచ్చెద.

అవ్వ:—ఇందిరా, మిగులఁ జక్కఁగాఁ గట్టవలెను. మాయజమానురాలెంతచక్కఁగాఁ గట్టినను నిష్టపడదు. దండలు బాగుగ లేనియెడల నామెకుఁ గోపము వచ్చును.

ఇందిర:—అవ్వా, రాణి మగనిఁ గోలుపోయి, బిడ్డను బోఁగొట్టుకొని యెల్లప్పుడు దుఃఖపడుచున్న దని యింతకు ముందుగాఁ జెప్పితివే. అట్టి యామెకుఁ బూలదండల చక్కఁదన మేమి కావలసియుండును?

అవ్వ:—పిచ్చిదానా, నీవు చెప్పినది నిజమే! అయిన నన్ని దినములు దుఃఖించును? ఆమె కిది మంచి యౌవనదశ. అధికసంపద గలది. ఆమెకుఁ బునర్వివాహముఁ జేయుటకై రాజమాతయగు మురళాదేవి విశ్వప్రయత్నము చేయుచున్నది. అట్టివివాహమునకు శాస్త్రములుకూడ ననుజ్ఞనొసంగియున్నవఁట. ఇపుడు రాజ్యమేలు మదనపాలుఁడు యౌవనపురుషుఁడే. అతనికి హేమప్రభ లోఁబడవలయు నని యామురళాదేవియుద్దేశము. మహారాణి కీదేశము విడిచిపోవ నిష్టములేదు. కనుక నిచటనే యున్నది. రాజు బల

నంతుఁడు. అతనితో విరోధ మామెకు శ్రేయస్కరము గాదు. మదనపాలుఁడు తఱుచుగా హేమప్రభయంతఃపురమునకు వచ్చుచుండును. ఆమె దానికి సమ్మతించియున్నది. మఱియును నామె తనయన్నకూఁతురగు విమలాదేవి యనుచిన్నదాని నిచటఁ బెంచుచున్నది. ఆపిల్లను మదనపాలునికిచ్చి పెండ్లి చేయ వలయునని యామెయిష్టము. అందులకై రాజు పలుమాఱు అంటికిఁ బోవు చున్నాఁడని కొందఱనుచున్నారు. రహస్యసమాచార మేమనఁగా, మదన పాలుఁ డెన్నిదినంబులకైనను హేమప్రభను పెండ్లియాడుటకే నిశ్చయించు కొనియున్నాఁడఁట. ఆ రహస్యము రాణికినిఁ దెలియునఁట. అటులైన నట్టి వివాహమున కామోదించిన దని చెప్పవలయునుగదా? ఎటులైన నిపుడు మారాణి పూర్వమునకంటె నెక్కుడుగ పుష్పములు ధరించుకొనుటయు నగ లలంకరించుకొనుటయుఁ గలదు.

ఇందిర యిది యంతయును విని స్తంభితురాలాయెను. ఆహా! కాల మెట్లు మాఱును! దైవమా, నీగతి యతివిచిత్రము. ధీరుఁడును సత్యశీలుఁడు నగు విక్రమసింహమహారాజు నెన్నియిడుమలఁ గుడిపించుచున్నావు? ఈ ముస లిది చెప్పినవిషయమునం దేది సత్యమో యేది యసత్యమో నీకే తెలియును. నిజమైనసంగతిని దెలియుటకు బలమైనయుక్తి నిచ్చి నన్ను రక్షింపుమని దైవ మును ప్రార్థించెను.

ఉదయపూరు రాజగృహము ఉదయపూరునగరమునం దున్నది. అది మిగులఁ బ్రసిద్ధిజెందినకోట. శత్రువుల కభేద్యము. ఈకోటకు సుమారు నాలుగైదు మైళ్లదూరమందు బాణనది ప్రవహించుచున్నది. ఆనదీతీరమందు మన హేమప్రభాదేవిరాజభవనము మిక్కిలి రమ్యముగాఁ గట్టఁబడి యున్నది. అది యొక చిన్నకోట యైనను సౌందర్యము లగుభవనములచేతను, శృంగారవ నములచేతను వివిధము లగువృక్షవితతులచేతను జూపఱుల కాహ్లాదకరమై యొప్పారుచుండెను. ఆకోటలో నుండురాజగృహము లన్నిటికంటె హేమ ప్రభ నివసించుప్రాసాదము మిక్కిలిపెద్దది. ఆభవన మొకగుట్టమీఁదఁ గట్టఁ

బడియుండెను. బాణనది యలలు పొంగి యాగుట్టపై మోదుచుండఁగా నంచులు పాఁచిగట్టి యొకప్రక్కను జనులు సంచరించుటకు జాఱుడువలన సాధ్యము లేక యుండెను. మఱియొకప్రక్క నాగుట్టలోనే సోపానములు చెక్కఁబడి యేటిలో రాజస్త్రీలు దిగి విహరించుటకు సానుప్రదేశమువలె నానందకరమై యుండెను. దానికి సమీపమునందు వలలువైచి జెస్తలు రాత్రులయందుఁ గూడఁ జేపలఁ బట్టుట గలదు. ఏటిసమీపమున నున్నభవనములనడుమ నొకపాతాళగృహ మున్నదనియు నచటనుండి మదనపాలుఁ డుండునగరునకు లోపలనే సొరంగ మున్నదనియు, యుద్ధసమయమున నంతఃపురస్త్రీ లందు దాఁగియుండుటకై కట్టఁబడియున్న దనియు జనులు చెప్పుట వాడుక. అయిన నది యెచట నుండునది, దానిముఖద్వార మెట్టిదనది యెవరికిని దెలియదు.

మనయిందిర యచట నుండునరుఁగుమీఁద నెక్కి కోటనంతయు సారి కలయఁజూచెను. తనకుఁ దెలియకయే కన్నీరుగాఱుచుండెను. ఆదివ్యభవనము తనసొంతమైనదైనను తన కిపుడు నిలువ నీడ లేకయు, తనతల్లి పరులచేతఁ జిక్కియుండి యామెనడత తనకు సందేహాస్పదమై యుండుటయు, రాజాధిరాజగు తనతండ్రిదీనస్థితియు నొకటేసారి మనస్సునకుఁ దోఁప నపరిమితమయినసంతాపముగలిగెనుగాని దుఃఖమును ధైర్యముచే నణఁగద్రొక్కి యవ్వ పూలుదెచ్చి యచటఁ బోసి తనపనికిఁ బోయిన దని తెలిసి పుష్పములఁ బెట్టియుండుచోటికి వచ్చి కూర్చుండి, ఆ, యట్టిమోహనరూపము గలభర్త యారీతిని గష్టములపాలై నవయుచుండ, దాని కీపుష్పము లెందులకు? ఒక వేళ నతఁడు వచ్చె నని యెంచుకొన్నను, నట్టిస్త్రీకి నలంకార మెందులకు? ఈవృద్ధురాలు చెప్పువిషయమునందు రహస్య మేదియో యొకటి యున్నది. నేను లోపలఁ బ్రవేశించి యీఘనరహస్యమును భేదించినఁగాని వదల నని తనలో నాలోచించుకొనుచు నందముగ మాలలఁ గట్టి యుంచెను. ఆముసలి యవ్వయును బను లన్నియుఁ దీర్చుకొని రాజగృహమునకుఁ బోవుటకు

సంసిద్ధయై బయటకువచ్చి యిందిర కట్టియుంచినపూలమాలికలఁ జూచి భ్రమించి నిలిచెను. "ఇందిరా! నీవతిశీఘ్రముగ మారాణికిఁ బ్రియసఖి వగుదువు. మాదేవి చాలరసికురాలు. నిన్నుఁ జూచిన దాదిగా నామెదగ్గఱ నిన్నుఁ జేర్పవలయు నని యోచించియున్నా" నని చెప్పి వెడలిపోయెను.

రాజగృహము మిగులనైభవము గలదని యిదివఱకే చెప్పఁబడియున్నది. ఒకరాజెట్లు జీవింపవలయునో యంతగౌరవముగా జీవించుసంపద హేమప్రభకుఁ గలదు. ఆమె జమీనుకార్యములను మదనపాలుఁడే జరపి రావలసిన ద్రవ్యము రాణి కప్పగించును. మదనపాలుఁడు స్వభావముచే నుత్తముఁడని హేమప్రభకుఁ దెలియును. అయిన నతఁడు మురళాదేవి చేతిబొమ్మ. వీనికి నేకాలమున కట్టిబుద్ధి పుట్టునో యని యామె కొకప్రక్క నపనమ్మకము. హేమప్రభ యన్ననో యధికధైర్యశాలిని. తనకార్యములఁ దానే నిర్వహించుశక్తియును మారాలోచనయును గలస్త్రీ. జరిగిపోయినకార్యమునకై మదనపాలునిమీఁదఁ బగ సాధించుట కామె కిష్టములేదు. తనకుఁ గలయవమానమును బయలుపఱుపదు. ఇఁక మదనపాలుఁ డన్ననో హేమప్రభ నొక దేవతగా భావించియున్నాఁడు. ఎట్టిపనులనైనఁ జేసి యామెదయకుఁ దాను పాత్రుఁడుగా నుండవలయునని యతనికోరిక. ఆమె తనపై నిష్టపడి వివాహమాడినట్లైన, బ్రహ్మపదవి దొరకినను తనకంతసంతోషము గలుగదు. ప్రతి నిమిషము నిట్టిగొంతెమ్మకోరికల నాలోచించుచుండును. అయిన నామె భర్త యుండు కాలమునందు వదినెను గౌరవించినట్లు నడుచుకొనువాఁడు. ఇప్పు డామెయొద్దకుఁ బోయి నన్ను పునర్వివాహముఁ జేసికొమ్మని యడుగుట కతనికి ధైర్యము లేదు. హేమప్రభ తనతోఁ గొంచెము నవ్వి మాటలాడిన నాఁడు తన్ను స్వర్గసుఖ మనుభవించినవానిఁగాఁ దలంచును. తనపెంపుడుతల్లి యగు మురళ పుత్రునిఁ జూచి వత్సా, మన హేమవృత్తాంత మేమాయె" నని యడిగిన, "అమ్మా, నే ననుదినమా ప్రయత్నమందే యున్నాను. హేమ యంత సులభముగా వశపడునది గాదు. మనచేయి విడిచి యెక్కడకుఁ బోవును.

సమాధానమువిూఁదఁ గార్యసాధనముఁ జేసికొనుట మంచిది" యని యామెకుఁ జెప్పును. రాణియొద్దకు వచ్చినపుడీమెమనస్సు ననుసరించి మాటలాడి పోవును. అయిన నామెకుఁ బ్రియురాలగుడగు సఖులమూలమున తనమనోగతం బెఱింగించును. హేమప్రభ యీయుదంతము లన్నియుఁ దెలిసియున్నను తన కేమియుఁ దెలియనట్లు నటించును. అప్పుడప్పుడు "మదనపాలా, నీవు నా మేనఁగోడ లగువిమలను పెండ్లిగాడితివేని నాకు స్వంతబంధు వగుదువు. అపుడు నేను నామనోగతకార్యంబులు జరపుకొనవచ్చు నని యెంచి యా పిల్లను బెంచుచున్నా" నని చెప్పెను. అపు డామాటకు మదనపాలుని యర్ధాంగీకారమును గూడ గ్రహించినను బగులు చెప్పదు.

హేమప్రభ కొన్నిదినము లలంకరించుకొనుటయుఁ గలదు. దానిని గుఱించి లోకులు భిన్నాభిప్రాయులై యెన్నటఁ జూచినను నామెనుగుఱించి పలువిధములుగా మాటాడుకొందురు. కాని రాణి తన కీయాపద సంభవించి నప్పటినుండి యలంకార మనుమాటఁ గూడ నెఱుఁగదు. తాను సువాసిని యని యెంచియున్నది. కనుక రంగులు గల పట్టువస్త్రములఁ గట్టునుగాని సరిగ వేసిన చీరను గట్టదు. వివాహమంగళసూత్రము దప్ప వేఱుభూషణము లేమియు ధరింపదు. సువర్ణాంగుళీయకము తప్ప రత్నాంగుళీయకము నేయదు. ఆమె ప్రతి దినము స్నానముచేసి సాధారణముగు పట్టువస్త్రము ధరించి తలవెండ్రుకలు పైకెత్తి కట్టుకొని కుంకుమ ధరించి బైటికి రాఁగానే సర్వాలంకారభూషితురాలని యందఱు భ్రమింతురు. ఆసువర్ణాంగుళీయక మాత్రవేలియాం దత్యంతకాంతి యుక్తంబై యుండును. (1) "ఇదము మధికమనోజ్ఞావల్కలేనాపి తన్వీ" యను కాళిదాసువచనము సత్యము గదా? ఇఁక మదనపాలుఁ డామెను జూచి నపుడెల్లఁ దనకొఱకే యలంకరించుకొనియున్నదని యెంచును. (2) "కామీ

1. "నారచీర గట్టియున్నను ఈమె మిగుల రమ్యముగాను న్నన్న" దని దుష్యంతవచనము.

2. కాముకుఁడు బయట నుండున దంతయుఁ దన్ను గుఱించియే యనియెంచును.

స్వతాం పశ్యతి" యను దుష్యంతవచనముఁ దెలియదా? ఆనాఁడు గోజారంగు పట్టుచీర ధరించి నల్లపట్టురవిక తొడిగి వెండ్రుకలు పైకెత్తి కట్టుకొని, దిండు నానుకొని కూర్చుండి దేవి యేదియో యాలోచించుచుండెను. అపుడు మదనపాలుఁడు లోపలఁ బ్రవేశించెను.

తిరిగి చూచి 'మదనపాలా' యని యర్ధోక్తితో 'మహారాజా కూర్చుండుమని' యొకయాసనముఁ జూపెను.

మదనపాలుఁడు:— దేవీ! నీవు ముందు పిలిచిన 'మదనపాలా' యను సంబోధన నాకుఁ జాలియున్నది. ఆ నా పేరు నీదయచేఁ బాత్రం బైనచో నాకీమహారాజశబ్ద మంతవెల గలిగియుండదు.

హేమ:— రాజేంద్రా, నీ విట్లు చెప్పవచ్చునా? ఈశ్వరుఁ డిపుడు నీయందు దయ గలిగియున్నాఁడు. ఇపుడు నేను నీప్రజలలోఁ జేరినదాననే కద. ఆత్మహత్యం జేసికొనుట దోషము. ఇంతటియపరాధమును కష్టమును ననుభవించి బ్రతికి యుండవలసియున్నది.

మదన:— దేవీ, నీ విట్లు చింతించుట తగదు. నీ విష్టపడిన నీరాజ్ఞీపట్టము నీకు దొరకదా? శాస్త్రసమ్మతమైనను నీ సమ్మతమునుగద యెదురు చూచుచున్నా నని (మెల్లఁగఁ దల వంచుకొని) నుడివెను.

హేమప్రభ పలుకలేదు. కొంచెముసే పుండి "రాజా, నా దేహస్థితి చక్కఁగా లేదు. విశ్రమించుట కనుజ్ఞ నిమ్ము" అనుచు లేచి తనగదికి వెడలిపోయెను. మదనుఁడు భీతచిత్తుఁడై మెల్లఁగా నడుగు లిడుచు "ఆహా! యిట్టిమాట కింతకాలమున కీనాఁడే నానోరు జాఱివచ్చెను. ఏమి చేయుదును? ఎన్నిదినము లీమెమనోవైఖరిని కనుపెట్టియుందును? నాతల్లిప్రతిన నెఱవేఱు టెట్లు? ఆమె ప్రోత్సాహముమాత్రము గాదు. నాకును నీమెయం దిట్టిసంకల్పము గలిగి యున్నది. ఇపుడు నేను చేయుకార్య మధర్మమైనది గాదు. ఎట్లనఁగా? విక్రమసింహునకు నే నెట్టి యపకారముఁ జేయలేదు. నా పెంపుడుతల్లి

కతఁడు సపత్నీకుమారుఁడు. కనుక వారిరువుర కట్టిమనఃస్పర్ధ లున్నవో యది యును నాకుఁ దెలియదు. ఏవిధంబుననో యతఁ డపరాధియై దేశభ్రష్టుఁ డాయెను. మరణంబుఁ జెందినాఁ డనియు నొకవదంతి కలదు. ఎటులైన నతఁ డిచటికి వచ్చుట కలలోనివార్త. ఇపుడు హేమప్రభను ననాథ యనియే చెప్పవలయును. ఇపుడు నే నామెకు సుఱఁది యగుచున్నాను. కనుక దేవర న్యాయముగా నామెను నేను వివాహముఁ జేసికొనుట ధర్మమే యగును. నే నిపుడు మహారాజను. అదియునుం గాక యామె నాకన్న వయస్సునందుఁ జిన్నది. నే నిట్టితరుణము నెందులకు విడిచిపెట్టవలయు? అయిన నామె మనంబు నొప్పింపక యెన్నిదినములైన వేచియుండి కార్యము సాధించెద. ఆమెమీఁద నాతల్లి మిగులనిర్దయఁ బూనియున్నది. పెండ్లి చేసికొనెద నని నమ్మించి యామెద్రవ్య మంతయు నావశం బొనరించుకొనుటయే కాక యామె సంపుడుగత్తెగా నుంచి వేఱువివాహముఁ జేసికొనవలయు నని యామెయిష్టము. అయ్యో, అట్టికర్మము నే నొడిగట్టుకొనను. దైవమా, ఆసుందరాంగి, యానవనీతకోమలహృదయ కిట్టియపవాదమా! నేఁ జచ్చినను నట్టికష్టమున కామెను బాలు సేయను. నన్ను విడిచి యెచటికిఁ బోవును? ఇట్టి కపటప్రీతియా యామెకు నేఁ జూపుట? ఛీ! నే నట్టివాఁడను గాను. నాతల్లిని దిరస్కరింపఁగూడదు. ఆమె యెల్లకాలము నావృద్ధికై పాటుపడుచున్నది. నన్ను మిగులఁ బ్రేమించి సపత్నీకుమారునితో విరోధంబుఁ బెంచుకొని ధీరుఁ డగుభర్తను బోఁగొట్టుకొన్నది. ఆమెను నేను నొప్పింపఁగూడదు. కనుక వీరిరువురిని నొప్పింపక కార్యము నెఱవేర్చుకొనునది నాసామర్థ్య"మని తల పోయుచు వెడలిపోయెను.

---

# అష్టమాధ్యాయము



రాణి తనగదిలోఁ గూర్చుండెను. ఆమె యిప్పు డాలోచనాక్రాన్త యై భూమిని జూచుచు ప్రతిమవలె నుండెను. పూలదానిని జూడఁగనే తనదృష్టి యామెపైపునకు మరల్చి, "అంబుజాక్షీ, ఇటు రమ్మ" అనెను. అవ్వ భయముతో నమస్కరించి బద్ధాంజలి యై పూలచెండ్ల నందిచ్చెను.

హేమ పూలను దీసికొని చక్కఁగాఁ దిలకించి "అంబుజాక్షీ! యీనాఁడు పూలఁ గట్టినవా రెవరు? మిక్కిలి చక్కఁగా నున్నవి.

అవ్వ:—తల్లీ! పదిదినములకు ముం దొక దిక్కు లేని చిన్నది, పదు నాఱువత్సరములప్రాయము గలది నాయింటికి వచ్చియున్నది. ఆమె నపెటెఁ జూచిన నొకగొప్పకుటుంబమున జనించినది యని తోఁచుచున్నది. అన్ని విద్యలయందు నేర్పరి. ఆచిన్నది తమసమ్ముఖమందు సేవఁజేయవలయు నని యిష్టము గలిగియున్న దని యెంచెద. ఆమెయే యీపూలదండలను గట్టినది.

హేమ:—ముసలిదానా, యాచిన్నది యట్లు కోరుట నీసుహేతువై యుండనోపు. దానియెదుట నాబోఁటిది ప్రపంచమందు లే దని నీ గను కొని యుందువు.

అవ్వ—తల్లీ, యాచిన్నది దిక్కు లేక నన్ను వెదకికొని వచ్చి చేరినది. ఆబాలిక నాస్థితిగతుల విచారించినది. అపుడు తమసమాచారము నెల్లఁ జెప్పితిని. నాఁటనుండి తమయొద్ద సేవ కుండవలె నని కోరియున్నది.

రాణి—అంబుజాక్షీ, యాచిన్నదానిని నేను జూడవలెను. రేపు నీ విచటికి వచ్చునపుడు పిలుచుకొనిరమ్ము.

వృద్ధురాలింటికక్కై మనయిందిర వీథిప్రక్కను జూచుచుండెను. కాలి చప్పుడు విని యవ్వవచ్చెనని యెంచి తలుపుc దీసెను. అవ్వయును విశ్రాంతిగా కూర్చుండి "అమ్మా, యిందిరా, రాణి నిన్నుc జూడవలె నని చెప్పెను. నీ పూలచెండ్లను జూచి మెచ్చుకొనెను. బిడ్డా, నీవు గొప్పయాశ్రయమును బొంది సుఖించునపుడు నన్ను మఱవకు" మనెను.

ఇందిర—అవ్వా! నే న ట్లుపకారముc జేసినవారిని మఱచుదానc గాను. నేడచట రాజుగారిని జూచితివా?

అవ్వ—అవును. ఇందిరా! వయసు ముదిరిపోయిన, మఱపధికము. నేcడు మా రాణి దేవతవలె నలంకరించుకొని రాజుతో మాటలాడుచుండెను. నే నచటికిc బోవుటయు, రాజుగారు పైటకు వచ్చుటయు, సరిగా నుండెను.

ఇందిరగుండెలు జల్లుమనెను. 'అలాగా' యని యామాట నంతటితోc బూర్తిచేసి నిదురించెను. తెల్లవాఱినది. నాలుగుగంటలకు రాజగృహమందు నౌబత్తు వాయించుధ్వనిని విని యూరకుండక, అవ్వా! యాధ్వనిని వింటివా? అది యేమి? " యనెను.

అవ్వ:—ఇందిరా! యది యుదయకాలమున రాజగృహమందు వాయించువాద్యముల శబ్దము. ఇపుడు నిశ్శబ్దముగా నుండుకాలము గనుక చక్కcగా వినcబడుచున్నది.

ఇందిర:—అవ్వా, యిపు డారాజగృహమం దెవ రున్నారు?

అవ్వ:—రాజును రాజమాతయును ముఖ్యులు. ఇంకను రాజబంధువు లనేకు లున్నారు.

ఇందిర:—అవ్వా, మీ రాణి యాయంతఃపురమునకుc బోయి యామె చిన్నత్తగారిని దర్శించుటలేదా?

అవ్వ:—ఆమాటయే లేదు. అందుచేకే యామెకు మారాణిమీcద నంతయసూయ. తనసపత్నీకుమారునివలె నతనిభార్య యగు నీమెయును పేరు

లేకపోవలయు నని యామెయిష్టము. అయిన తనతమ్మునికి హేమప్రభవిషయమునం దతిప్రేమ గనుక నేమి చేయుటకు సాధ్యము లేక, యామె వ్రతభంగంబైన నొనరించిపోయినకుమారున కీవిధంబుగ నవమానము కలుగఁజేయనున్నది. అది యెట్లు జరుగునో దైవం బెఱుంగును.

ఇందిర—అవ్వా, ఈసమాచారము వినవలయునని యడుగుచున్నాను. ఆకాలమునం దున్న సేవకు లిపుడును నున్నారా?

అవ్వ:—ఎందులకు లేరు? మురళా దేవితో వచ్చిన సేవకులలో ముఖ్యుఁడు ఫల్గునుఁడు. చిన్నతనమునుండి మదనపాలుని వెంట నుండువాఁడు. వాఁ డిపుడు రాజునకు సమానముగా సుఖించుచున్నాఁడు. మాటకుమాత్రము సేవకుఁడు గాని రాజమందిరమునం దంతటను వానియధికారమే. రాజమాతకు వాఁ డాంతరంగిక సేవకుఁడు. కొడుకునకుఁ జెప్పనిసమాచార మంతయు వానితోఁ జెప్పును. ఇంకొకదాసి యున్నది. అదియు నామెమర్మమునకు లోఁబడినదే. చనిపోయినరాజు కాలమునం దున్నవారందఱు నున్నారు. రాజునకుఁ రాజకుమారున కీయష్టయిశ్వర్యముల ననుభవించుటకుఁ బ్రాప్తి లేకపోయినదిగాని, తక్కిన వారికేమి కొదవ?

ఇందిర—అవ్వా, తండ్రిని పుత్రుఁడు సంహరించెనని జను లాడుకొనుచున్నారే, యది నిజమేనా? ఇపు డంతఃపురమునం దాయుదంతమును నిజముగాఁ దెలిసినవా రెవరైన నున్నారా?

అవ్వ:—ఇందిరా, గట్టిగా మాటాడకుము. ఇది మిగుల రహస్యము. మాయువరాజుగారిని బ్రజలు తండ్రికంటె నధికముగాఁ బ్రేమించుచుండిరి. కుమారునకుఁ దండ్రిమీఁదఁ బరమప్రేమ. అయ్యో! మాయువరాజు శ్రీరామునివలెఁ దండ్రియాజ్ఞను మీఱువాఁడు కాఁడు. ఆమురళి వారియువురను జూచి లోలోనఁ గుందుచుండెను. ఆఫల్గునుఁ డతికపటి. మిగులఁ దంత్రగాఁడు. వీనిసహాయమువలన మదనపాలుఁ డిట్టియకృత్యమును జరపెనని యనే

కజను లాడుకొందురు. ఆమాటఁ బైటఁ జెప్పుటకు ఎవరికి సామర్థ్యము గలదు ? ఢిల్లీశ్వరుఁడే కద యీమురళను చనిపోయినరాజునకు వివాహముఁ జేసినది. అందువలన నీరాజకుటుంబముమీఁద నతనికి నధికప్రీతి. ఆపార్వభౌముని బలమువలననే యీమురళాదేవి సపత్నీకుమారున కిన్నికష్టములఁ దెచ్చిపెట్టెను.

ఇందిర:—ఈకథ చాల వింతగా నున్నది. రాజభార్యయగు మురళాదేవి తనమగనిఁ జంపించునంతటి పాపాత్మురాలా ?

అవ్వ:—"అట్లు గాదు. రాజమాత సపత్నీకుమారునియభివృద్ధిఁ జూచి యోర్వదే కాని తనమగని కిట్టియాపద గలుగు నని యామెకుఁ దెలియదఁట, తమ్ముని మాట యామెకు వేదవాక్యము. అతఁ డెట్లు చెప్పిన నట్లు నడచును. అందఱుఁ జేరి యువరాజుమీఁద నీనింద మోపి యతనిని వెడలించిరి. ప్రజలదురదృష్టమునకుఁ దోడుగా, యువరాజు లేఁడని, కొందఱు బ్రతికియున్నాఁడని కొందఱుఁ జెప్పుకొనుచున్నారు. మారాణిబిడ్డను పులి తినెను. దిక్కులేని యారాణి యేమి చేయును ? మదనపాలునికే దైవము తోడయ్యెను. ఇందిరా ఈరహస్యమును బైటఁ జెప్పకుము. ఫల్గునుఁడు పరమద్రోహి. జాగ్రత్త సుమా" యని చెప్పి తనపనికిఁ బోయెను.

ఇంతలో బైట తుతూరశబ్దము వినవచ్చెను. అది విని యిందిర యవ్వ దగ్గఱకుఁ బోయి, "అవ్వా, యాశబ్ద మేమి" యని యడిగెను.

అవ్వ:—బిడ్డా, యది మాళవదేశపురాజు వచ్చుచున్నాఁడని, సూచించు తుతూరశబ్దము. ఈదేశపురాజు బైటికి పోవునపుడు తుతూర మొకవిధమైనశబ్దము గలది. ఇందిర యామాట విని యత్యాతురతతో దొడ్డిలోనికిం బోయి ప్రహరిగోడ నానియుండు నరుఁగుపై నెక్కి వీథిప్రక్కఁ జూచుచుండెను. ఆశబ్దముతోఁగూడ గుఱ్ఱములగిట్టలధ్వని వినవచ్చెను. రాజార్హంబగు రథమందు శుభ్రవస్త్రములు ధరించి యతిసుందరాకారుఁ డగు లలిత

కుమారునిఁ జూచెను. దేహ మంతయు చెమటలు గ్రమ్మెను. పట్టరాని దుఃఖము తన్నావరించుకొనెను. ముగ్ధ యేమి చేయఁగలదు? హా, నే నెంతనిర్భాగ్యురాలను! నామనస్సాక్షిగా ప్రేమించిననాపతి యిట్లు పోవుచుండఁగా నొక మాటయైన నాడుటకు యోగ్యత లేని యనద నై దిక్కుమాలి యిచట నున్నాను. మాయిరువురికి నడుమ నొక యగాధకూప మడ్డముగా నున్నట్టున్నది. హృదయమా, నీ వెందుల కిట్లు పలుమాఱు తల్లడిల్లుచున్నావు? "ధైర్యం సర్వత్ర సాధన" మ్మనునార్యోక్తిని మఱవకు మని యతఁడు తనదృష్టికి మఱుఁగుగాఁ బోవువఱకుఁ జూచుచుండి యవ్వాయింటిపనులు చూచుటకై పోయెను.

మఱునాఁడు భోజనం బొనర్చి పుష్పంబులఁ దీసికొని యొకబండిలో నవ్వయు నిందిరయును రాజగృహమునకుఁ బోయిరి.

హేమప్రభాదేవి భోజనానంతరము విశ్రామశాలలోఁ గూర్చుండి యుండెను. ఇరుప్రక్కలయందు సకియలు విసరుచుండిరి. చల్లనిగాలి వీచుచుండఁగ రాణి యఱకన్ను మోడ్చి నిదురించెను. దేవి నిద్రించుటఁ గని సకియలు బైటికిఁ బోయిరి. దేవి యెంతసేపు నిద్రించెనో తెలియదు. బెదరినట్లు లేచెను. "ఏమి యీకల! ఎవరో నాసన్నిధానమందుఁ గూర్చుండి మాటలాడుచుండిరి. వా రెవరో నే నెఱుఁగను. ఆసాన్నిధ్యము నాకు మిగుల నాహ్లాదజనకమై యుండినది. ఇది యేమి నాయెడమకన్నదురుచున్నది! స్త్రీల కిది శుభమందురు. నాశుభమంతయు నడవులపాలై పదునాఱుసంవత్సరము లాయెను. దైవమా, బ్రతికియున్న సంతసించువారు లేరు. నేఁ జచ్చిన దుఃఖించువారు లేరు. ఆత్మహత్య దోషం బని యీమొండిప్రాణము నిలుపుకొని యున్నాను. నావంటిపాపాత్మురాలికి శుభంబు లెక్కడివి?" యని తనచరిత్ర మంతయుఁ దలంపునకు రాఁగఁ జింతానిమగ్న యై యుండెను. అపు డొకదాసి వచ్చి "దేవీ, యంబుజాక్షి యొకబాలికతోఁ గూడ వచ్చి దర్శనార్థమై కాచియున్నది" యనెను.

దేవి:—సరోజనీ, వారి నిటు రమ్మనుము.

ఇందిర యిదివఱ కెన్నఁడు రాజాంతఃపురంబు లెఱుఁగదు. అయినను రాజద్వారము ప్రవేశించుచుండఁగనే తన కాస్థలము పరిచితముగా నుండిన విధంబున నామెస్మృతిపథంబునకు గోచరం బగుచుండెను. దేహ మంతయుఁ గంప మెత్తెను. అన్నచేయి పట్టుకొని నడచుచుండెను. విశ్రమశాలకుఁ బోవు నపుడే తనమనస్సును స్థిరపఱచుకొనెను. లోపలఁ బ్రవేశించి యెదుటఁగూర్చుండియున్న దేవిని జూచి స్తబ్ధురాలై నిలిచెను. నిమిషమందే తనస్థితిం దలంచి తప్పు టడుగు లిడుచుఁ బోయి సాష్టాంగనమస్కారముఁ జేసి నిలిచెను. దేవి యాబాలికను జూచి యాశ్చర్యం బంది దానినే చూచుచు బహిర్వ్యాపారమును మాని నిలిచెను. తన్నచట గుర్తించునో యని యిందిర భయముఁ జెందెను. ఆహా! ఎంతచక్కనిబాలిక! ఇది యున్నతవంశసంజాత యై యుండవలెను. లేకున్న నిట్టిసౌందర్యరాశి సామాన్యులగృహమం దెట్లు జనించును? కాలవైపరీత్య మెవ రెఱుఁగుదురు? అని యాలోచించునంతలో విలోచన యనుదాసి యొకజాబును దట్టలోఁ దెచ్చి రాణి సన్నిధానమం దుంచెను. దేవి యాజా బందుకొని చదువుచుండెను.

"ఆహా! యేమి యీసౌందర్యము! ఏమి యీకన్నులప్రకాశము! ఏమి యీముక్కుయొక్క యందము." "కమలముకుళమృద్వీ ఫుల్లరాజీవనేత్రీ" యని నాతండ్రి చదువుచున్న గ్రంథమందు వర్ణించియున్న పద్మినీజాతిస్త్రీ లక్షణములన్నియు నీదేవియందుఁ గనంబడుచున్నవి. ఈదేవికి గుణమునఁ గళంకమా? ఇది తగనిమాట. ఈమె మిగులఁ జిక్కియున్నట్టున్నది. మనస్సునందు గొప్పవ్యసన మున్నదని యీమెముఖంబున స్పష్టముగాఁ దెలియుచున్నది. ఇట్టియర్ధాంగి నెడఁబాసి నాజనకుఁ డెట్లు బ్రతికియున్నాఁడో, యట్టిసుందరమూర్తి యగుభర్తను విడిచి యీమె యెట్లున్నదో యదియును గొప్పయాశ్చర్యమే. ఈదంపతుల నొకచోఁ జేర్చి యెపుడు వారియంకమునఁ బరుండుదునో యపుడే నాజన్మము సార్థకం బగును. అయిన నేపుట్టయం

దెట్టిపాపమున్నదో యెవరెఱుంగుదురు? ఒకవేళ జను లాడుకొనున ట్లీమె తప్పుమార్గమందు దిగినయెడల నాతండ్రికిని, నాకును, నధఃపతనంబేకదా, ఛీఁ! పాపాత్ముల కధఃపతనంబు. మన కేల? పరీక్షించి చూడక కన్నతల్లిని నిందింపగూడ" దని యట్లు తనలో వితర్కించుకొనుచుండెను.

రాణి జాబునకుఁ బ్రత్యుత్తరంబు వ్రాసి దాసిచేత నంపివుచ్చి, యాయిందిర ప్రక్కకుఁ దిరిగి "యో చిన్నదానా, నీ వెవరవు? ఏదేశము నుండి వచ్చినా" వని యడిగెను.

ఇందిర:—మహారాజ్ఞీ; నే నొక కృషీవలునిబిడ్డను, మానివాసము రత్నదీవి.

దేవి:—రత్నదీవియా? అది సముద్రపుదొంగలకు నివాసస్థానముగదా? అట్టిదీవు లేల మీకు నివాసస్థానంబు లయ్యె? అచట బ్రహ్మాండముగ నివసించి యున్నారు! నీవు హిందూస్త్రీవలె నున్నావే. నీవృత్తాంతము నే నడుగవచ్చునా? నీబంధువు లెవ్వరైన నిచట నున్నారా?

ఇందిర:—వా రెందులకచటనివాస మేర్పఱచుకొనిరో నే నెఱుఁగను. అచట మాకు ద్రాక్షతోఁటలు, టెంకాయతోఁపులు, పూలతోఁటలు నున్నవి. మాతండ్రి యాఫలము లితరదేశములకుఁ బంపుచుండును. అదియే మావృత్తి.

దేవి:—అంతదూరదేశమునుండి యింతపసిదాన వెట్లు ప్రయాణంబుఁ జేసి యిచ్చటికి వచ్చితివి?

ఇందిర:—దేవీ, కొన్నిదినముల క్రిందట నాజనకుఁడు తీర్థయాత్రచేయుటకై యచటనుండి వెడలి కాళీఘట్టమునకు వచ్చిరి. అచట నాతండ్రికిఁ బ్రాణస్నేహితు లున్నారు. వారిసహాయమువలన నే నిచటికి వచ్చితిని. దైవప్రేరణచే నీయాశ్రయము నాకు దొరకినది. ఈమెకలఁ దను గుణాతిశయముల విని మీదర్శనంబునకు వచ్చితిని. నాతండ్రి దేశాటనఁజేసి వచ్చువఱకు మీసన్నిధానమం దుండవలయు నని యిచ్చ గలిగియున్నది.

దేవి:— మంచిది. నీవు నాయొద్ద నుండుట నాకును మిగుల నిష్టముగానే యున్నది. నీతల్లిదండ్రులతో నీ వెందులకు తీర్థయాత్ర పోలేదు?

ఇందిర:— దేవీ, నాకుఁ దల్లి లేదు. నాతండ్రి యొక్కరే తీర్థయాత్రకుఁ బోయియున్నారు.

రాణి:— అయ్యో! నీవు తల్లి లేనిబిడ్డవా? నీతల్లి పుణ్యాత్మురాలు. భర్తచేఁ బోషింపఁబడి తనబిడ్డ యౌనుటఁ జచ్చెను. బిడ్డను భర్తనుఁ బోఁగొట్టుకొన్ననాఁడు జీవచ్ఛవముగదా? చిన్నదానా! నీపే రేమి?

ఇందిర:— దేవీ, నాపే రిందిర యందురు.

రాణి:— నిజముగా నీ విందిరవలెనే యున్నావు. అది నీకుఁ దగిన పేరు. బాలా, నీకుఁ జదువు వచ్చునా?

ఇందిర:— అమ్మా, బంగాళభాష, పార్సీ, హిందీ, యింకను జిల్లర భాషలును వచ్చును. వీణ వాయింపఁగలను. కొంచెము పాడుదును.

రాణి:— ఇందిరా, మిగుల సంతోషము. నీయట్టి విద్యావతి యగు బాలిక నాయొద్ద నుండవలసినదే. నాకున్న కుమార్తెయును నాయొద్ద నున్నది. దానితోఁ గూడ నీవును సుఖముగా నుండుము.

ఇందిర:— చిత్తము.

ఇందిర మఱునాటిదినమున రాణియంతఃపురమునఁ జేరెను. హేమప్రభ యిందిరను మిగులఁ బ్రేమించుచుండెను. ఈవృత్తాంత మంతయుఁ దండ్రికి జాబు వ్రాసెను. పిదప జాబులు హేమప్రభ యంతఃపురంబునకుఁ బంపునటులు వ్రాసెను.



# నవమాధ్యాయము



ఏమి దానిముంగురులకాంతి! ఆనగుమోము! నామనోనాయకునికన్నులీలాగుననే మెఱయుచుండెను. అట్టికన్నులీచిన్నదానికి నమరియున్నవి. బ్రహ్మసృష్టి యెంతచిత్రంబైనది! నాయెడ నెంతభక్తి! ఎంతవినయము! నా కేపని చేసినను దనసొంతమనుష్యులకుఁ జేసినట్లుఁ జేయుచున్నది. హా! నాప్రాణాధారంబైనపుత్రీ, చంపకమాలినీ, తల్లీ, నిన్ను విడిచి నే నింకను జీవించియున్నాను. నాయపరాధము మన్నింపుము. నీవు స్వర్గస్థురాలై యున్నను నీజన్మమందు నేను నిన్నుఁ గన్నతల్లినిగాన నన్నిట్లు దిక్కుమాలినదానిఁగాఁ జేసితివే. నే నెందులకు జీవించియుండవలె నని యున్నదో నాకే యర్థము కాకయున్నది. నాముద్దులబిడ్డ బ్రతికియున్న నీచిన్నదానివయస్సే యుండును. అంతయు నదేరూపమే. అయిన దీనికి నాబిడ్డదేహకాంతి లేదు. ఇది చామని చాయ గలది. ఈచిన్నది నాప్రేమను జూఱగొన్నది. అదియును నావలెనే నన్నుం బ్రేమించుచున్నది. దాని కోసం దేహము లే" దని యొకనాఁడు హేమప్రభాదేవి యాలోచించుచుండెను.

ఇందిర దువ్వెనయు సుగంధతైలంబునుఁ దెచ్చి యామెసమీపంబున నుంచి "అమ్మా"యనెను. హేమప్రభ తిరిగి "యిందిరా యిదియేమి"యనెను.

ఇందిర:—దేవీ, వనభోజనమునకుఁ బోవలయు నని చెప్పితిరఁటకదా? ప్రొద్దగుచున్నది. తమకుఁ దల దువ్వుటకై వచ్చినాను.

దేవి:—ఇందిరా, నేను నూనె రాచి తలదువ్వుకొనునలవాటు లేదు. నావెంట నీవు రావలయు. ఇటు రమ్మా నేను నీతల దువ్వెద.

ఇందిర:—అమ్మా, యెంతమాటఁ జెప్పితిరి. నేను తమసేవ కేర్పడి యున్నదానను. మీరు రాణిగా నుండి యిట్లు చెప్పఁదగునా?

దేవి:— బాలా, చిన్న పెద్ద యనుపదము లీమాయాప్రపంచమందు వారి యంతస్తులనుబట్టించి మూఢు లనుకొనుమాట. మనస్సునకు నెమ్మదిగలిగి యున్న, నే నొక సేవకురాలివలె నుండి సుఖముగా జీవించి యుందును. అది యటుండనిమ్ము. నిన్నాలింగనం బొనర్చుటకు నామనంబు త్వరపడుచున్నది. నీశరీరకాంతివల్ల నీవే నాబిడ్డవని చెప్పవచ్చును. అయ్యో! నేనేమి చేయుదును. నాతనయ నాస్మృతికి వచ్చి యిట్లు నన్ను తపింపఁజేయుచున్నది. యని దేవి కన్నీరు కార్చుచుండఁగా, నిందిర తనతల్లి దుఃఖముఁ జూచి సహింపని దాయెను. "అమ్మా, మీ రేల యిట్లు దుఃఖించెదరు! కర్మ నతిక్రమించువా రెవరు! దుఃఖపడువారే సుఖము ననుభవింపఁగలరు. దేవీ, యన్నియుఁ దెలిసిన వారికి నే నేమి పన్నవింతు?" అని నుడివెను.

హేమ:— ఇందిరా, నేను ధైర్యము వహింపకయుండిన నెప్పుడో మరణము బొందియుందును. నీవు చెప్పినట్లు దైవమే నాకుఁ దోడని చెప్పి తనవెంట్రుకల విప్పెను. ఇందిర యామెసమీపమునకుఁ బోయి మృదువగు వ్రేళ్లతోఁ జిక్కుదీసెను. "నాయిందిరా! నీ వేపనిఁ జేసినను నెంతో ముచ్చటగాఁ జేయుచున్నావు. ఇఁకఁ జాలు. నే నెత్తి కట్టుకొనెద" నని తానే వెంట్రుకల నెత్తి కట్టుకొనెను. "యథాప్రసిద్ధైర్మధురం శిరోరుహైః జటాభిరప్యేవ మభూత్తదాననం" అని కాళిదాసు చెప్పినట్లు ఎట్లు పార్వతిముఖ మందమై వెంట్రుకలచే ప్రకాశించుచుండెనో, అట్లే జడలచేతను ప్రకాశించియుండెను. అదియు నామెముఖంబున కొక క్రొత్తయందము నిచ్చెను. ఇందిరయుఁ గురులు దువ్వి మఱియొక విధముగాఁ గట్టుకొని ఫాలభాగంబునఁ దిలకంబు దిద్దికొని రాణిసమీపమునందు వచ్చినిలిచెను. హేమప్రభ చిన్నదానిఁ జూచి, "యిందిరా, నీయందమునకు నీవు గట్టియున్నచీర చాలదు ఎన్నియో చీరలు పడియున్నవి. వానిలో నొకచీరఁ గట్టుకొని రమ్ము. నేను చూడవలయు నని యాశగా నున్నది" యనెను.

ఇందిర:—కన్నతల్లివలె గారాబముగా రక్షించుటకు సిద్ధముగానున్న మీమాటకుఁ బ్రత్యుత్తరం బియ్యను. జననీ, నాతండ్రి దేశాంతరమునుండి వచ్చువఱకు మంచివస్త్రములు ధరింపనని ప్రతిజ్ఞఁ జేసితిని గనక నన్ను మన్నింప వేఁడెదను.

హేమప్రభ:—ఇంత పితృభక్తి గలబిడ్డను గన్నతండ్రియే ధన్యుఁడు. నీయిష్టప్రకారమే జరగనిమ్ము.

దేవి ముఖప్రక్షాళనాదికములకుఁ బోయెను. ఇందిర వైటికి వచ్చెను. అచట విలోచనగూడఁ గాచియుండెను.

ఇందిర:—విలోచనా, ఈనాఁడు వనభోజన మెచట జరుగుచున్నది? దానిని జేయించువా రెవరు? విమలాదేవిగూడ సిద్ధముగా నున్నదిగద?

విలోచన:—ఇందిరా, నీ వెంతముగ్ధురాలవు. ఈరాజ్యము నేలు మదనపాలమహారాజుగారు వనభోజనముఁ జేయించువారు. అచటికి సామంతరాజులు రాజభార్యలు రాజబంధువులు నికనెందఱో వత్తురు. ఇపుడు హేమప్రభాదేవిగారు రాకున్న నాసంరంభ మంతయు వ్యర్థమగును. ఈమె విమలను ముందుఁ బెట్టుకొని తాను బోవుచున్నది. ఇట్లు వారిరువురికి స్నేహము వృద్ధియగుచున్నది. పిమ్మట రాజు విమలాదేవిని బెండ్లాడునో, లేక హేమప్రభాదేవినే పునర్వివాహముఁ జేసికొనునో యెవ రెఱుంగుదురు? నాకేమో దేవిని వివాహమాడుటయే నిజ మని తోఁచుచున్నది. అటుపిమ్మట నెట్లు జరుగునో యెఱుఁగను.

ఇందిరకను లెఱ్ఱఁబాఱెను. ఏమి మాటాడుటకును దోఁపలేదు. "విలోచన చెప్పినది నిజమే. ఈమె యిపు డెందులకై వనభోజనంబునకుఁ బోవలయు? ఇట్లు చేయించుట రాజన్యభావము కలిగియుండుటకుఁ దానుగఁ ద్రోవఁ జూపినట్లు గదా? కానిమ్ము. తొందరపడు టెందులకు? నిజము నిలుకడమీఁదఁ గాని దెలియదు.

బాణనదీతీరమునం దెచటం జూచినను, గట్టియున్న పతాకలు వచ్చువారిని బిలుచుచున్నట్లు మందమారుతంబుచేఁ బ్రేరేపింపఁబడినవై చలించుచుండినవి. ఒకచోట రాజస్త్రీలు విహరించుటకుఁ దగువసతు లేర్పఱచియుండినవి. ఇంకొక స్థలమందు రాజుల కుచితాసనము లమర్పఁబడియుండినవి. మఱియొకచోఁ జదరంగము మొదలగు నాటవస్తువు లలంకారముగాఁ జూచువారి మనంబులు వాని నాడుట కుత్సాహయుక్తంబు లగునట్లుంచియుండిరి. ఇంకొకస్థలమందు వివిధము లగు వంటలు సిద్ధం బగుచుండినవి. లెక్కలేని దాసీజను లలంకృతలై చేయునది యెఱుఁగక నిటు నటు తిరుగుచుండిరి. సేవకులు వారివారియంతస్తులకుఁ దగినట్లు మంచివస్త్రములను ధరించి నడుములయందుఁ గత్తియొఱలు వ్రేలాడుచుండ జనులు సంభ్రమముగాఁ బనులఁ జూచుచుండిరి. కొంతసేపటికి మేనాలు రథములు వచ్చుటకుఁ బ్రారంభమాయెను. ఒకగంటలో నా వనమంతయు సువర్ణకలశంబులచే నలంకృతంబు లగురథంబులచేతను మేనాలచేతను ప్రకాశవంతంబై యుండెను. మహారాజు ముందుగనే వచ్చి యచట నిలిచి వచ్చువారి కందఱకు మిక్కిలి వినయముతో స్వాగతం బొసఁగుచుండెను. వచ్చువారు రాజుగారు చూపు నిరహంకారత్వమునకు బ్రజలకుఁ జూపు ప్రేమకుఁ బరమానందభరితులై యుండిరి. అనుచు వారివారియంతస్తులకు దగినస్థలంబుల నలంకరించిరి. రాజింకను నిలిచినస్థలమును విడువక యెవరినో యెదురుచూచుచుండెను. ఫల్గునుఁడు వెలగలవస్త్రముల ధరించి రాజుగారియాజ్ఞప్రకారము బైటిద్వారమందుఁ గాచియుండెను. ఫల్గునుఁడు రాజునకు నాంతరంగికసేవకుఁడని రాజ్యమున నెల్లరకుఁ దెలియును. ఏసమయమం దేమి తమ్ముగుఱించి రాజునకుఁ జెప్పునో యని సామంతరాజుల కందఱకు ఫల్గునుఁ డన్నఁ గొంచెము భయమే. ఇంతలో నిద్దఱు గుఱ్ఱపురౌతులు ముందు పరుగెత్తుకొనివచ్చి గుఱ్ఱముల మీఁదనుండియే రాజునకు వంగి నమస్కారములఁ జేయుచుఁ లోపలికిఁ బోయిరి. ఆ గుఱ్ఱపురౌతులవస్త్రములు ధరించియుండు రాజచిహ్నములఁ జూడఁగా వారు గ్వాలియర్ రాజుగారియోధులు. హేమప్రభాదేవికి నామె తండ్రిగా

రరణముగాఁ బంపినవారు. ఆమె బైటవచ్చినపుడు ముందు వారంగరక్షకులుగా వచ్చుట మర్యాద. ఆగట్టుపురోహితులను జూడఁగనే యామె వచ్చునని యందఱు దెలిసికొనిరి. వెంటనే సువర్ణకలశములచే నలంకృతమై రెండరబ్బీగుఱ్ఱములు గట్టినబండి వచ్చి యుద్యానవనమును ప్రవేశించెను. ఆబండి నిలువఁగనే రాజు స్వయముగాఁ బోయి తలుపుఁదీసెను. విమల ముందు దిగెను. ఇదివఱకెన్నఁడును మదనపాలుఁడు విమలను జూచియుండలేదు. "విమల మిగులఁజక్కనిది. కొంచెము దానిమేనత్తను బోలి యున్నది. దర్శనమాత్రంబున మనంబు నాకర్షించుశక్తి దీని కున్నది." యని తలఁచెను. రాజిట్లనుకొనుచుండఁగనే యిందిర దిగెను. "ఆహా! ఇది యేమియాశ్చర్యము! నలుపులో నింతచక్కఁదనమా! ఇది రాజులగృహమునఁ బుట్టినది. సామాన్యస్త్రీవలె నున్నది. హేమ యంతఃపురంబున నొకనూతనదాసి వచ్చెనని వింటిని. అదియే యిది యై యుండనోపు" నని యోచించుకొనునంతలో నిందిర చేయూఁత నివ్వఁగా హేమప్రభయును బండి దిగెను. రాజు వికసితముఖారవిందము గలవాఁడై, "దేవీ, నన్ను విముఖునిఁ జేయక వచ్చినందులకు వందనంబు లాచరించెద" నని చెప్పుచు విమలవైపు తిరుగఁగనే విమల సిగ్గుచేఁ దల వంచెను. "విమలా, నీకు స్వాగతంబు. నీ విచటికి వచ్చినది నాకు మిగుల సంతోషదాయక" మనెను. విమల ముగ్ధ, శాంతస్వభావముఁ గలది. ఎక్కుడుసిగ్గు తన్నావరించియుండ బదు లెట్లు చెప్పును? ఏమియుఁ జెప్పకయే ముందునకు జరిగెను. పిమ్మట రాజుదృష్టి యిందిరమీఁద మఱలెను. హేమప్రభ యది గ్రహించి "రాజేంద్రా, యీచిన్నది నాచెలి. ఈమె బర్మాప్రాంతములనుండి వచ్చినదఁట. ఆమెతలిదండ్రులు తీర్థయాత్రకుఁ బోయినారు. వారిచటికి వచ్చువఱకు నాప్రాలదాని యింటిలో విడిచిపోయినారు. నే నీచిన్నదానిఁ జూచి నాసమీపమం దుంచుకొంటిని."

మదనపాలుఁ డామాట నమ్మెను. "దేవీ, అంతఃపురస్త్రీలకే యతి సౌందర్యముండు ననుట వట్టిభ్రాంతి" యని మాటలాడుచు నామెను రాజస్త్రీ

లంకాస్థానమునకుఁ బోవనిచ్చి, దానుఁ దనస్థలంబునకు వెడలెను. అచట రాజస్త్రీలందఱు దేవిని మిగుల మర్యాదతో గౌరవించిరి. ఆవనము దంతటను ననేక వినోదములు జరుగుచుండెను. ఇందిర తనవీణాగానముచే నచట నుండు స్త్రీపురుషుల నానందాబ్ధిలో ముంచెను. ఫల్గునుఁడు కొందఱితో నెన్నిపనులఁ జేయుచున్నను వానిదృష్టి యిందిరమీఁదనే యుండెను. ఇందిరకు మంచిసందర్భము దొరకియున్నందున రాజుముఖలక్షణములను ఫల్గునుని ముఖలక్షణముల నతి జాగరూకతతో గమనించుచుండెను. తనతల్లికి నచట జరిగిన మర్యాదనుఁ జూచెను. తానేమియుఁ దెలియనిదానివలె నుండెను. అచటఁ గొందఱు రాజస్త్రీలు “హేమప్రభనడతలు సరిగా లే” వనిరి. “ఆత్మహత్య చెడ్డది. అంతకన్న నామె చేయవలసిన దేమున్నది? ఆమె కష్టైశ్వర్యములు గూడి యున్నవి. యౌవనవతి. రూపమందు రతిని బోలియున్నది. శాస్త్రసమ్మతంబై యున్న పుషశ్లేల చేసికొనఁగూడ” దని కొందఱును, “మీ రెంతపిచ్చివారు! ఆమెను జూడఁగనే పాతివ్రత్య మాకారము దాల్చియున్న దని తెలియలేదా? మీ రనుకొన్నట్లెన్నఁటికిని జరుగదు. ముందేమి జరుగనున్నదో నిదానించి కనుఁగొందము. తెలియనిమాటలాడఁదగ” దని మఱికొందఱును నిట్లు పలుదెఱంగుల సంభాషణములను జరుపుచుండ, ఇందిర వినుచుండెను. భోజనములు మొదలగునన్ని వినోదములు ముగిసినవెంటనే యందఱు వారివారి స్థలములకుఁ బోయిరి. హేమప్రభయును వెడలుటకై రాజు నడిగెను.

రాజు:—దేవీ, యీదీనుని మన్నింపుము. నీవు నాయందు మిగులదయయుంచి కొంచెము సేపిచటనుండి వెడలవచ్చును. పదునాలుసంవత్సరములనుండి నామనోగుహాయం దిమిడియున్న యిచ్ఛను నీకుఁ దెలుప నిచ్ఛగొనియున్నాను.

రాణి కీమాట వినఁగానే హృదయము కంపింపఁ దొడంగెను. అతని మన స్వామెకుఁ దెలియును. ఏమి చేయఁగలదు? దైవము తన్ను రక్షించునన్నధైర్యము తప్ప వేఱొకయాధార మేమియు నింతకాలము హేమప్రభకు దొరకలేదు. మదనపాలుఁడు మిగుల సాధువు, ఓపిక గలవాఁడు, దాని నాధార

ముగ నేర్పఱచుకొని హేమప్రభ క్షత్రియకులోచితంబులగు సామభేదోపాయంబుల నుపయోగించుచుఁ గాలము గడపుచుండెను. రాజమాత ఫల్గునుఁడు వీరిగువురిప్రోత్సాహంబువలన నీ కార్యంబు సాధింపవలె నని నిశ్చయించియున్నాఁడు. *"ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే" యని హేమప్రభను బెండ్లియాడుసంకల్పమే యధికముగా మదనపాలుని హృదయంబున నాటియున్నది. అది యెట్టులైనను సాధింపవలెను. ఇతఁడామెను బలాత్కారము చేయక వేచియుండుట కింకొక కారణ మున్నది. అది యేది యన, హేమప్రభకోటలోఁ గొందఱు యుద్ధవీరులున్నారు. వారిని విరోధము చేసికొనుట రాజమాతకుఁగూడ నిష్టము లేదు. వా రసాధ్యు లని యామెకుఁ దెలియును. వారిని జూడఁగనే మదనపాలుని యొడలు కంపమెత్తును. కనుక నందఱకును నిష్టముగా నుండి తనకోరిక నెఱవేర్చుకొనవలెనని యామదనపాలుఁడు గాచియుండెను. ఇఁక "ఆలస్యా దమృతం విష" మ్మని చెప్పఁబడియున్నది. కావున కొంచెము శీఘ్రప్రయత్నము చేయుద మని యామె నింటికిఁ బిలిపించుయత్నమే వన ప్రోజనము.

రా జిట్లు తనయెదుటనే యడుగుపెట్టుటకుఁ బ్రయత్నించుట క్షేమకరంబుగా దనియును, తన్ను నీశ్వరుఁడు పరీక్షించుకాలంబు సమీపించెననియు, నిట్టిసమయమం దట్టియుక్తిచేఁ దాను గడదేఱవలయు నని యాలోచించుచుండెను. ఇందిరాసులోచనలు దూరముగాఁ గూర్చుండి మాటలాడుకొనుచుండిరి. అయిన నిందిరమనస్సంతయు నచటనే యుండెను. అపుడు మదనపాలుఁడు మిగులవినయముతో, "దేవీ! నీవు పదునాఱువత్సరములనుండి యిట్లొకాంగివై వ్యథలఁ గుందుచు, నీమనోహరయౌవనము నడవిఁగాచిన వెన్నెలఁ జేయుచుఁ గాలము గడపు టెందులకు? పునర్వివాహము గొప్పశాస్త్రముల యందు విధింపఁబడియున్న దని నీకుఁ దెలియును. ఈ నీదాసుఁడు నీయను

*పురుషుఁడు విషయాదుల నెల్లప్పుడుఁ దలంచుచుండుట యందే యతని మనస్సు దగిలియుండు నని యర్థము.

హంబునకుఁ బాత్రుఁడు కాఁదలంచి యిన్ని దినములనుండి నీసన్నిధానమునకు వచ్చుచుఁబోవుచున్నను, నీయిష్టం బిట్టిదని యెఱుంగఁజాలకున్నాఁడు. మనోహరం బగు నివ్వనవిహారంబు నీ మనస్సున కుల్లాసము గలిగించును. నే నట్టి సమయమందు నీయిష్ట మెఱుంగఁ గోరితి" ననెను.

హేమ:—రాజేంద్రా, జీవచ్ఛవముగానుండు నా కొక యిష్టమున్నదా? నేను మీయక్కకు శత్రువర్గమందుఁ జేరినదాన నైతిని. ముందు నా కేమిబాధ రానున్నదో యని కుందుచుంటిని. దైవానుగ్రహంబున నీవు నిర్మలహృదయంబుతో వచ్చి నా క్షేమసమాచారంబులు విచారించియు, నాజమీనుల పనులను విచారించియు నాకు సహాయం బొనరించి, నీయుదారభావంబుఁ జూపి నాజీవితాశాంకురమును మొలక లెత్తించితివి. దానికిఁ బ్రత్యుపకారంబుగ నాయన్న తనూజాత యగువిమలను నీ కర్పించి మీసుఖంబు లరయుచు, నే నొకవిధంబుగా నాజీవనమును గడప నిచ్ఛించియున్నాను.

మదనుఁడు హాసము వహించెను. ఆహా! దేవి యెంతపవిత్రహృదయ! ఆమెయుదారగుణంబునకుఁ దగినయాలోచనఁ జేసియున్నది. నాతల్లి కీయాలోచన గిట్టదు. నేనస్వతంత్రుఁడను. మంచిదైనను, చెడ్డదైనను, తల్లియాజ్ఞ గొప్పది." యని చింతించి మనస్సును దృఢపఱచుకొని "దేవీ! క్రొక్కాఱుమెఱుంగుతెఱఁగున దేదీప్యమానం బగునీదివ్యమంగళవిగ్రహంబు, నాహృదయపీఠంబునం దెల్లప్పుడు నధిష్ఠించియుండఁగ నితరస్త్రీల పేరైనఁ దలంచుట కిష్టముందునా? అది కానిపని. నీవు చెప్పినట్టే మాయక్కగారి కిట్టివిపత్తు సంభవించి నప్పటినుండియు, నిన్నీరాజ్యమం దుంచుట కామె కిష్టమే లేదు. పిమ్మట నా మనోగతం బెఱింగి, మిగుల సంతసించి, యెట్లయినను నిన్నే పునర్వివాహంబుఁ జేసికొనవలయు నని పట్టుదలతో నున్నది. రాజ్ఞీ, నీ కెందుల కింతచింత? ఈకార్యమువలన నీకుఁ గలుగునష్ట మేమి?

దేవి:—రాజా, నాప్రాణనాథుఁ డగు విక్రమసింహమహారాజును నీ వెఱిఁగినవాఁడవేకద? ఆధర్మస్వరూపుఁ డట్టి ఘోరకృత్యం బొనర్చువాఁడు

కాఁ బని లోకవిశదంబు. తనప్రాణాధారుఁడగు నిజజనకుని నేల చంపవలె? భావిరాజ్యాధిపతి తానని యతఁడెఱుంగఁడా? అతఁడు పితృభక్తి గ-మాన్యుఁడు. తనపినతల్లి నెంతభక్తితో సేవించుచుండెను. అంతచిన్నవయస్సునందే రాజ్యసుఖంబులఁ దుచ్ఛముగా నెంచి ధర్మమాచరించి రాజర్షుల మార్గం బనుసరించి నడచుకొనవలయు నని నిశ్చయించియున్నవాఁడు. సకల శాస్త్రంబులఁ జదివిన మేధావి. ఒకపుష్పంబునైన వృంతమునుండి త్రుంపని దయామయుఁడు. అట్టి సుగుణంబులఖని యగు నామహనీయుఁ డట్లు పరులు చేసినద్రోహంబునకుఁ బాత్రుఁడై యడవులయందు నశియించుచుండునో, లేక యేమాయెనో. జారిణివలె మఱియొక పురుషుని వివాహమాడిన నాపాతివ్రత్యంబు నష్టంబు గాదా? అతని కట్టిమహోపకారం బొనరించిన రాజద్రోహి యెవఁడో యట్టివానినిఁ గనిపట్టి, శిక్షించుభారము నాపై నుండలేదా? రాజా, మన్నింపుము. నే నెప్పుడును నింతధైర్యముగా మాటలాడియుండలేదు.

రాజు:—వినయశాలిని వగునో దేవీ, యిప్పుడవి స్పష్టంబుగా నీ మనోగతం బెఱింగితిని. దానికి సదుత్తరంబు లిచ్చి నీసంశయంబుఁ దీర్చెద. ప్రపంచ మెట్లున్నదియు నీకుఁ దెలియదు. లోకమందుఁ దల్లి లేనిబాలకునితండ్రి మరల వివాహముఁ జేసికొన్న నా బాలునికి నాపినతల్లిమీఁద మహాక్రోధంబు గల్గునఁట. అటులే విక్రమసింహునకు మాయక్కను నతనితండ్రి పెండ్లాడినపిమ్మట నతిమత్సరముతో నుండెనఁట. మఱియు నేనీరాజ్యమందు నాయక్కసమీపమునుండుండునది మిక్కిలి యాగ్రహమునకుఁ గారణంబయ్యెనఁట. నా యగ్రజాతను జంపించుటకుఁ గూడ నెన్నియో ప్రయత్నంబులఁ జేసియుండెనఁట. అది యెఱింగినవా రందఱు నతఁ డిట్టియపరాధముఁ జేయ వెనుదీయఁ డని సాక్ష్యంబు లిచ్చిరి. అతఁడు తండ్రినిఁ జంపిపోవుచున్నపుడు నాయక్కగారే చూచినారఁట. అతఁ డట్లు చేసి చనఁగా నాయక్కగారు లోపలికిఁ బోయి చూడ, నతనిచేతికత్తి రక్తసిక్తమై పడుకమీఁదఁ బడియుండెనఁట. ఇంతకంటె నెక్కువ నిదర్శన మేమి గలదు? ఈపిచ్చిభ్రాంతిని విడిచిపెట్టుము. నీవు పుణ్యవతివి.

కనుకనే యిట్టిక్రూరునిబారినుండి దైవము నిన్నుఁ దప్పించెను. ధర్మదేవత పాపాత్ముల నూరక పోనిచ్చునా? ఇదియునుం గాక యతఁ డీభూలోకమందు లేఁడు. చెఱసాలనుండి తప్పించుకొని పోయి యేదీవిలోనో పనిఁజేయుచుండి చనిపోయినాఁడని యచట నుండుమనుష్యు లిచటనుండి యతనిని వెదకుచున్న రాజభటులతోఁ జెప్పి యతనిలక్షణము లన్నియుఁ దెల్పిరఁట. నీ విపుడు వివాహంబుఁ జేసికొన్న నేదోషంబు నిన్నంటదు. ఇంతటితో నాతలంపులు మాని ముందు నీవు సుఖ మనుభవించుమార్గం బాలోచించుకొనుము.

దేవి మాఱుపలుకలేదు. మురళీదేవి మంత్రము తలకెక్కినవానితో నిఁక మాటలాడినఁ బ్రయోజనంబు లే దని గ్రహించెను. ఆసమయమందుఁ దనకుఁ గలిగినదుఃఖము నంతయు నడంచుకొనెను. "రాజేంద్రా, నీవు చెప్పినవిషయము లన్నియు మిగులఁజిత్రములైనవి. వీని నెన్నఁడును నేను విని యెఱుంగను. ఇఁకమీఁద నీవు చెప్పినట్లు నేను నడచుటకును గొన్నిదినములు జరుగు నని యెంచెద. ఇపుడు నామనస్సు మిగులఁ గలఁతఁ జెందియున్నది. నీవు చెప్పిన సమాచారమును మిగులశ్రద్ధతో నాలోచించెద. మే మందఱము నీయాజ్ఞకు లోఁబడి నడచువారము గాని నిన్నతిక్రమించి పోవుటకు స్వర్గముదప్ప వేఱు స్థలంబు లే దని యెఱుంగవా?" యనెను.

రాజు:—దేవీ, నీ కనేకవందనంబులు. నీమనంబు నొప్పించిన యీ పాపాత్ముని మన్నింపుము. నీవు మిగుల సత్యవంతురాలవు. ప్రపంచమందు జరుగువర్తమానములు నీ కెట్లు తెలియును? కనుక చెప్పవలసివచ్చెను. నా వివాహ మింకొకసంవత్సరం బాఁపియుంచెద. ఇంతలో నీమనఃస్థితిని జక్కఁబఱచుకొనుము. ఇదియే నేను నీకుఁ జెప్పుమాట. ఇఁక నేను పోయివచ్చెద నని ప్రయాణోన్ముఖుఁ డాయెను. దేవియు నిందిర చేయిఁ బట్టుకొని రథము నెక్కెను. విమలయును రథారూఢ యయ్యెను. రాజు నిలిచియుండఁగనే రథము వెడలిపోయెను.

---

# దశమో౽ధ్యాయము



పడుకటింటియందు మెల్లఁగా వెక్కి వెక్కి యేడ్పుశబ్దము వినవచ్చెను. ఇందిర దిగ్గున లేచి మెల్లఁగా గూర్చుండి నలుదిశలఁ బరికించి చూచెను. అంతఃపురమం దెల్లవా రలసి నిద్రించుచుండిరి. ఇందిర తనముందుండుమహలులోఁ బ్రవేశించెను. ఏడ్పు తనకు సమీపమునందే వినఁబడుచుండెను. అచట విలోచనాదిదాసీజను లొడ లెఱుంగక నిదురించుచుండిరి. వారి నందఱను దాఁటి రాణి నిదురించుగదియొద్ద నిలిచెను. ఆశబ్దము, లోపల నుండి కలిగిన దని గ్రహించి మెల్లఁగాఁ దలుపుఁ ద్రోసెను. గడియ వేయలేదు లోపలికిఁ బోయి తలుపు మూసి గడియ వైచికొని దేవివద్దను నిలిచెను. దేవి యాపరిమితంబుగ నేడ్చుచున్న దని తెలిసి తనచేతి నామె వీఁపుమీఁద నుంచి, "తల్లీ, యిది యేమి వైపరీత్యము! ఏల యిట్లు దుఃఖించెదరు? దుఃఖము గలిగినపుడు గదా సజ్జనులు ధైర్యముం బూనియుందురు; అమ్మా, మాటలాడరా?" యని తనకు వచ్చుచున్నదుఃఖము లోలోన నడంచుచు నిందిర దేవి నడిగెను.

రాణి—అమ్మా, యిందిరా, దిక్కులేక యనపస్నై యీరీతి దుఃఖించుచున్న నన్నూఱడించుటకై వచ్చితివా? అటు చూడుము. ఎందఱు నిదురించుచున్నారు. వీరియం దొకతెయైనను నాదుఃఖమును గ్రహించెనా? ఇందిరా! కంటిమీఁద రెప్పవాల్పక యెన్ని రాత్రు లిట్లు గడపియుందును? ఈపదియాఱు సంవత్సరంబులు సరియైననిదుర యేది? మిగుల దుఃఖించి నిదురించిననాఁడు నాకలలో నాయత్తగారు కనఁబడి నన్ను సమాధానపఱతురు. ఆనాఁడు మాత్రము నామనస్సు నెమ్మదిగా నుండును. ఇందిరా! ఈవిధంబుగా నేను దినంబులఁ గడపుచున్నాను. ఇన్నిదినములకు నాదుఃఖమున భాగస్థురాలవై పరితపించుటకై నిన్నొకతెను దేవుఁడు నాచెంతఁ జేర్చెను.

ఇందిర — దేవీ, యింతటి కుసుమకోమలం బగు శరీరము నీకటిక నేల యందుఁ బడవైచియున్నారే, యీపడుకమీఁద శయనింపఁగూడదా?

రాణి — "ఇందిరా, నాపడుకటింటికిఁ బరులను రానియ్యను. నే నెచ్చటఁ బరుండునది యెవరికిని దెలియదు. నాజీవితేశుఁడు కష్టనష్టములపాలై యెచట నున్నాఁడో! ఈపరుపు, యీగృహము నాకెందులకు? ఆపదల యందుఁ జిక్కియున్న నా నాథున కీప్రపంచము సహాయంబుగానుండునేమో యని ధనపిశాచివలె నీద్రవ్యమును గడించుచు, నా నాథుఁ డెప్పుడు వచ్చునో, యని గంపెఁడాశతోఁ గాలము గడపుచుంటిని. నేఁటిసంభాషణము నీవును వినియుందువుగదా! ఆరాక్షసి, గూఢచారుఁడు, అతని నేలుకొను, మఱియు నింకనెవఁడు చేరియున్నాఁడో నే నెఱుంగను. ఈ దుష్టచతుష్టయంబు చేరి యిట్లు కుట్రలం బన్నుచుండఁగనే నా నాథునకు సరియైన న్యాయంబు దొరకక దేశభ్రష్టుఁ డాయెను. ఆముగ్గురు నన్నిట్టికష్టములపాలు చేసినదియుఁ జాలక యామదాంధుని నన్నుఁ బునర్వివాహంబుఁ జేయించి నాపాతివ్రత్యమును జెఱుప యత్నించియున్నది. ఆదుష్టాత్ముఁడును నావైప్రోత్సాహంబునకు లోనై యాప్రయత్నంబు నడుపుటకు మిగులఁ బట్టుదలతో నున్నాఁడు. అయ్యో! నాకాంతుఁ డిహలోకమునందే లేఁడని యొక కింవదంతిఁ గల్పించి యున్నాఁడు. ఒకవేళ నది నిజమైన, నా కీజన్మ మెందులకు? ఈద్రవ్యం బెటు పోయిన నా కేమి? ఇంకొకసంవత్సరంబులోపల వానికి నేను లోఁబడ వలయును, లేదా ప్రాణహత్య గావించుకొనవలయును. ఆత్మహత్య నాకు మిగుల సౌఖ్యము గూర్చును. స్వర్గంబుఁ జేరి నాభర్తతో నాబిడ్డతో సుఖం బనుభవించుటకంటె సుఖం బేమి కలదు? ఆత్మహత్య దోషం బని యన్ని శాస్త్రము లుద్ఘోషించుచున్నవిగద? పతివ్రతాస్త్రీ కిది నీచం బగుచావు గదా యని దుఃఖించుచున్నా" నని చెప్పుచు నిండరమీఁద వ్రాలి యలసి మూర్ఛఁ జెందెను.

అపు డిందిర తనతల్లి స్థితినిగూర్చి మిక్కిలిదుఃఖించుచు, విసనకఱ్ఱతో విసరుచు, నామెకుంతలంబుల నెత్తి కట్టి ముఖారవిందంబును దుడిచి, పానీయంబుఁ ద్రావించి యామెతలఁ దనతొడమీఁదఁ బెట్టుకొని యామెశరీరం బాలింగనం బొనర్చుకొని, యానందం బనుభవించుచు "నీ వేకాంగినై యిట్లు పరితపించుచున్నావే, నే నేమి సేయుదు? ఇపుడు నీసమీపమం దుండునది నీపుత్త్రి యని చెప్పితినా, తల్లిప్రేమ యపారం బైనది. ఇపుడే యనుమానించుచున్నది. నిజముగాఁ దెలిసిన నిఁక నన్నడుగెత్తి పెట్టనీయదు. ఇది నా భావికార్యసాధనకు హానిఁ గలుగఁజేయును. దుర్మార్గులు మేలుకొని యాక్షణంబే మమ్మీరువురం జంపింతురు. అచట నన్ను నమ్మియున్న నాతండ్రిగతి యేమి?" యని చింతించుచు, తల్లి మేలుకొనువఱకు విసరుచు నారీతిగ కూర్చుండి యుండెను. తల్లి గాఢనిద్రఁ జెందిన దని తెలిసి యామెచెవిలో మెల్లఁగ మీభర్త బ్రతికియున్నాఁడు. మీపుత్త్రియును జీవించియున్నది. మీ రతిశీఘ్రకాలంబున సుఖ మనుభవింపఁగలరు. దుఃఖింపవల" దని చెప్పెను.

దేవి మేలుకొన్నతరువాత "జననీ, తమ రిట్లు దుఃఖింపవలదు తమ భర్త జీవించియున్నారు. నామాట నమ్ముఁడు"

దేవి—ఇంతనిశ్చయముగఁ బలుకుచున్నావే, నాబిడ్డగతి?

ఇందిర—అమ్మా, నేను నిజమునే పలుకుచున్నాను. ఆమెయును జీవించియుండవచ్చును.

దేవి—"నీవై యుండవుగదా? నాముద్దులయిందిరా, నిన్నుఁ జూచిన నాలింగనం బొనర్పవలయునని యాసవొడముచున్న" దనియామె నాలింగనంబుఁ జేసి ముద్దిడుకొనెను.

ఇందిర—అమ్మా, మీ రింతతొందరపడెద రేల? మీ రీసమయమందు మిగులధైర్యంబు పూనియుండవలయును.

దేవి:—ఇందిరా, నేను నేఁ డెంతటియానందము ననుభవించుచున్నానో నీకుఁ దెలియదు. ఇపుడు నీతోఁ డమీఁదఁ బరుండి సుఖముగా నిదురించితిని. నాయత్తగారు స్వప్నమందుఁ గనఁబడి నన్నాశీర్వదించి "బిడ్డా, దుఃఖింపవలదు. నాపుత్రుండు సుఖంబుగా నున్నాఁడు. నీవు సుఖ మనుభవించుకాలము సమీపించినది" యని చెప్పిరి. వెంటనే మఱియెవరో నాచెవిలో "అమ్మా నీభర్త జీవించియున్నా" రనిరి. నాబిడ్డగతి యేమైనది యని యడిగితిని మీబిడ్డకూడ బ్రతికియున్నదని పల్కిరి.. గాఢనిద్ర గనుక నా కేమియుఁ దెలియలేదు. ఈకల నిజమై యుండునా.?

ఇందిర:—గోడలకుఁ జెవు లుండును. గట్టిగా మాటలాడవలదు. సూక్ష్మలోకమందు గొప్పవారు తమవంటివారి దుఃఖమును పోఁగొట్టుటకై గాఢనిద్రలోఁ గనఁబడి యుండిన విషయమును జెప్పుదురు. కనుక మీకిపు డెవరో యట్టివారు చెప్పియుండవచ్చును. ఇది సత్యము! మీ కిట్టియపకారమును జేసినపాపిని గనిపట్టుటకై ప్రయత్నములు జరుగుచున్నవని నేను చెప్పఁగలను. ఇపుడు రాజు మీ కిచ్చియున్న యొకసంవత్సరంబు గడువులో మీకార్యము నెఱవేఱును. అట్లు లేనియెడల మనకు మరణంబే శరణం బని నిశ్చయంబుగదా. అంతవఱకు ధైర్యంబుఁ బూనియుండుఁడు.

దేవి:—ఇందిరా, సీతకు హనుమంతుఁడు శుభవార్త చెప్పినట్లు, ఇన్నాళ్లకు నాకు మేలు కలుగు నని నీవు చెప్పితివి. నీవు చెప్పినట్టే కలలోఁ జెప్పిరి. ఇఁక నీయిష్టము ప్రకారము నడచుకొనియెద. అవంతయు నాదుఃఖమును బైటఁ జూపక యుల్లాసముగా మెలఁగుచుండెద.

ఉదయపూరుమహారాజభవనమునందు మధ్యాహ్నసమయంబున శైత్యగృహంబున మనోహరం బగుశయ్యయందు మురళీదేవి పండుకొని యుండెను. ఆమెద త్తపుత్రుం డగు మదనపాలుఁ డామెశయ్యకుఁ బ్రక్క నమర్చియుండు మఱియొకశయ్యనానుకొని తల్లితో మాటలాడుచుండెను. ఫల్గునుఁడు ప్రక్కను నిలిచి విసరుచుండెను.

మురళి:—ఫల్గునా, యీచిన్న దెవరై యుండును?

ఫల్గునుఁడు:—మహారాజ్ఞీ, ఆచిన్నదానినిఁ జూచి భ్రమించి నిలిచితిని. సౌందర్యము వర్ణింప నలవి కానిది. శరీరచ్ఛాయతప్ప రూప మంతయుఁ జంపకమాలినీదేవిని బోలియున్నది.

మురళి:—కుమారా, నీ విన్నిమాఱులు దానిని జూచితివే, నీకుఁ దెలియలేదా. ఋణశేషము శత్రుశేషము నుండనీయవచ్చునా. నీవు రాజుగా నుండుటకే తగవని నాకుఁ దోఁచుచున్నది. వృద్ధురాలనగు నా కేమి కావలసి యున్నది? నీకై నే నింత శ్రమపడుచున్నానని నీకుఁ దెలియుటలేదా?

రాజు:—వీనిమాట మీరు నమ్ముచున్నారే. వీఁడు బుద్ధిహీనుఁడు. ఆచిన్నది వీఁడు చెప్పినంతసౌందర్యవతి గాదు. అయిన సౌందర్యవతియనియే చెప్పవచ్చును. సందేహము గలవాని కన్నిచోట్లను సందేహంబులే.

మురళి:—ఫల్గునా, హేమ యాచిన్నదానివిషయమునం దెట్లు ప్రవర్తించుచున్నదో కనుఁగొంటివా?

ఫల్గునుఁడు:—తల్లీ, యంతవివరముగాఁ దెలియుట కపట నవకాశంబు లేదు. అయిన దేహచ్ఛాయవలన దేవిగారు కనుఁగొనుట కవకాశము లేదు. ఆమె తన్నుఁ దెలియఁబఱచుకొనలేదని తోఁచుచున్నది.

మురళి:—"ఫల్గునా, చిన్నతనమునుండి మీరాజును బెంచినయభిమానమువలన నితని క్షేమంబునకై నే నిట్లు కష్టపడవలసియున్నది. ఇతనికి దూరాలోచన లేదు. రా జెంత జాగరూకుఁడై యుండి కార్యముల సాధింపవలె ననునది యతనికిఁ దెలియదు. నీ వొకఁడవు నాకు విశ్వాసపాత్రుఁడవు గనుక నిట్టికార్యంబులు నీవలననే నేను సాధింపవలసియున్నది. ఎట్లైన నాచిన్నదాని నీయంతఃపురమునం దుంచుకొని పరీక్షించినఁగాని యది యెవరై యుండునది నిశ్చయించుటకు సాధ్యము కాదు." అని పలుకుచుండఁగఁ బ్రక్కను గంటమ్రోఁగెను. ఫల్గునుఁడు పరుగెత్తికొనిపోయి యొకలేఖనమును బంగారుపళ్లెరంబున నిడుకొని తెచ్చి రాజుసమీపమున కందించెను. రా

జాయుత్తరంబును జూచి తనదేహమే మఱచెను. విప్పిమాచి "అమ్మా, హేమ జాబు వ్రాసియున్నది."

మురళి:—ఏమని?

మదన:—మనయంతఃపురమందు జరుగు దేవీనవరాత్రముల యుత్సవంబునం దొకగొప్పవిందు జరగును. దానికి రమ్మని జాబు వ్రాసియుంటిని. "నీయిష్టప్రకారము వచ్చెద" నని వ్రాసినది.

మురళి:—కుమారా, నీవు తెల్లగా నుండునవెల్లఁ బాలని నమ్ముచున్నావు. హేమ సామాన్యురాలు కాదు. అది నీవు తలఁచినంతత్వరలో నీకు వశం బగు నని యూహింపవలదు. దానితో మిగుల జాగరూకుఁడవై మెలఁగుము. నీ వెంతత్వరలో దానిని వివాహముచేసికొన్న నంత మనకు క్షేమకరం బని యెఱుంగుము. ఇపుడు క్రొత్తగాఁ జేరినచిన్నదానినిఁ జూడవలయు నని యున్నది.

హేమప్రభాదేవి యంతఃపురంబున నెపటఁ జూచినను పచ్చనితోరణంబులచేతను నానావిధపరిమళయుక్తంబు లగుగంధపుష్పంబులవాసనచేతను, నొప్పియుండెను. పూజాగృహంబున బ్రాహ్మణులు శ్రీసూక్తపురుషసూక్తంబులతో, శ్రీచక్రంబును బూజించుచుండిరి. మఱికొందఱు ఆజ్యాదిహోమద్రవ్యంబులచే హోమంబులఁ జేయుచుండిరి. అచట నొకస్థలమందు శృంగారించినమంటపమునందు స్వర్ణసింహాసనంబున సువర్ణంబుచే నిర్మించిన త్రిపురసుందరీవిగ్రహంబు నునిచియుంచిరి. ఆవిగ్రహము జీవకళతో నిండి పదిసంవత్సరముల బాలికవలె ప్రకాశించుచుండెను. ఆవిగ్రహంబును నవరత్నాభరణంబులచే నలంకరించియుంచిరి. బ్రాహ్మణస్త్రీలు భోజనమునకు వచ్చువారికి షడ్రసోపేతంబు లగు పదార్థములను వడ్డించుచుండిరి. విమల పూజకు భక్తితో వచ్చుచున్న రాజస్త్రీలను సన్మానించుచుండెను. ఇందిర తాంబూలాదుల దేవి దగ్గఱ సిద్ధముగా నమర్చుచుండెను. హేమప్రభ భోజనాదుల ముగించుకొని వచ్చినవారికి వస్త్రాలంకారములచేఁ దంపతీపూజల సలిపి పంపుచుండెను. రాజబంధువులకుమాత్రము ప్రత్యేకం బగుస్థలమందు భోజనమునకు సిద్ధపఱచి

యుండిరి. అన్నిపీఁటలమధ్య నొకబంగారుపీఁట నునిచి పానార్థము భృంగారం బుంచియుండిరి. హేమప్రభ రాజురాక నెదురుచూచుచుండెను. ఇంతలో భోజనసమయంబునకుఁ దగువస్త్రంబులు ధరించి యమూల్యంబగు ముత్యాలహారంబులు మెడయందు వ్రేలాడుచుండ, ఫల్గునుఁడు ద్రోవం జూపుచు ముందు నడువ, మదనపాలుఁడు రెండవద్వారము ప్రవేశింపఁగనే విమల యచట నిలిచి యుండెను. ఆమెను జూడఁగనే మదనపాలుని మన స్సుప్పొంగెను. అతనిఁ జూడఁగనే సిగ్గుతో నామె వెడలిపోయెను. మూఁడవద్వారముఁ బ్రవేశించెను. అచట నిందిరనుజూచి రాజు చకితుఁ డాయెను. ఇందిర సామాన్యమైనచీర కట్టి కురులు దువ్వక వికారముగాఁ దైకత్తి కట్టియున్నను దానియందుఁ దగిలిన దృష్టి మరలుట కతనికి సాధ్యము కాలేదు. "చిన్నదానా, నీ వెవరి దాన?" వనుమాట తనయత్నములేకయె నోటినుండి వెడలెను.

ఇందిర:—ప్రభూ, ఆనాఁడు దేవిగారివెంబడి నుద్యానవనంబునకు వచ్చియున్నచెలికత్తెలలో నొకతెను.

రాజు:—అటులా! యని ముందఱికి వెడలెను. అచట రాజబంధువు లంద ఱతనిని సన్మానించిరి. రాజు మిగుల నాహ్లాదంబుతో భుజించి కొంచెము సే పుండి దేవియనుజ్ఞం గొని వెడలిపోయెను.

దశమినాఁడు దేవి యిందిరతోఁగూడ రాజభవనంబునకు వెడలెను. దేవికిఁ గన్నీరు గాఱుచుండెను. హా హతవిధీ! ఏయుదయపూరురాజాంతఃపుర మందు నధికారిణి నై విక్రమసింహునిపట్టమహిషి నై యుంటినో అట్టి నేను నేఁడు మదనపాలునియుంపుడుఁగత్తె యని జనులు మాటాడుచుండ నీవిషయము తెలిసియుండియు వానిగృహంబునకుఁ బోవలసివచ్చె. నా సర్వసుఖవినాశకారిణి యగు మురళీను మరల దర్శించుట, యామెయెదుట నమ్రభావంబున మెలంగుట—యిది యేమివైపరీత్యము! ఇటుల నానానొసట విధాత వ్రాసె." వని తపించుచుండెను.

ఇందిర:—జననీ, యిది దుఃఖించుటకు సమయముగాదు. తమరు వికసితముఖంబు గలిగియుండవలెను.

అంతలో బండి యాఁగెను. అప్పటికి వచ్చినబంధువు లందఱు భుజించి తమతమవసతులకు పోయియుండిరి. రాజమాత దేవితోఁ గూర్చుండి భుజించుట కిష్టములేక యస్వస్థత యనునెపంబునఁ దనగదియందే భుజించెను. రాజు మాత్రము మధ్యాహ్నభోజనంబునకు దేవి రానికారణంబునుగూర్చి ఫల్గుణుని నడిగినదే యడుగుచుఁ గలఁతఁ జెందినమనంబుతో మహాలునం దిటు నటుఁ దిరుగుచుండెను. బండి నిలువఁగానే దిగివచ్చి తలుపు తీసి దేవిని దించుటకుఁ జేయిఁ జాఁచెను. అంతలో దిగులొంది చేయి వెనుకకుందీసికొని ప్రక్కకు నిలిచి, యిందిరను బట్టుకొని బండి దిగెను. రాజును దేవితో మాటలాడుచు లోని కరిగెను. ఫల్గునుఁ డిందిర వెనుక నే నడిచెను. రాజా! "మాయత్తగారెచట నున్నా" రని దేవి యడిగెను."

రాజు:—దేవీ, ఆమెకు నేఁడు మిగులఁ దలనొప్పిగ నున్నందున నామె గదియందే భుజించెను.

దేవి:—అలాగా? నేను ముందుగఁ బోయి యామెదర్శనం బొనరించి పిమ్మట భోజనమునకు వచ్చెద నని పోయెను. వెంబడి నిందిర వెళ్లెను.

రాజమాత శయనగృహంబుసమీపంబునకు రాఁగనే దేవికి దుఃఖమును గోపమును నొకగొప్పయలవలె మనంబున క్షోభింపఁజేయఁగను లోపలి కడుగిడుటకు సాధ్యముకాక వెనుకకు నిలిచెను. ఆమెనుజూచుటకు శంకించుచున్నదని రాజు తలఁచి తాను లోపలికిఁ బోయి 'అమ్మా' యనెను.

రాజమాత:—కుమారా, హేమ వచ్చెనా ?

రాజు:—ఇదిగో ఇచట వచ్చి నిలిచియున్నది.

రాజమాత:—అమ్మా, హేమ, యిటు రమ్మా.

దేవి లోపల ప్రవేశించి తనకోపము నడంచుకొని నమస్కరించెను. ఆ నక్కయుక్తి గల మురళా దేవి కన్నీటిచేతను డగ్గుత్తికతో మాటలాడుటచేఁ

దనదుఃఖమును బయలుపఱచుచు దేవిని దానే లేవనెత్తి తనపడుకమీఁదఁ గూర్చుండ నియోగించి "అమ్మా, హేమా, నీభర్త నాజన్మాంతము మఱవని స్థితి నాకుఁ దెచ్చిపెట్టి యీ మేవారురాజవంశమునకే కళంకంబుఁ గలుగఁ జేసెను. ఇపుడు నీవు నాదుఃఖమును బోఁగొట్టుటకై నాదత్తపుత్రుఁ డగు మదనపాలుని వివాహంబుఁజేసికొని నన్నుఁ దృప్తిఁ బొందింపుము. నేను వ్యర్థపు మాట లాడను. ఈకార్యము శాస్త్రసమ్మతము. వేద మంగీకరించియున్నది. అంతకంటెను నేను వృద్ధురాలను. మీవలన సకలకష్టము లనుభవించినదానను. నన్నుఁ దృప్తిచేసిన, సకలైశ్వర్యంబులు చేకూరు. దేవతలు నిన్ను దీవింతురు. నీవు పరమ మేధావినివి. ఎంతత్వరలో నీకార్యము ముగించిన నంత యుభయులకు మంచిది.

దేవి యిదియంతయు వినుచుండి"అమ్మా, మీహితవచనంబులు గ్రహించితిని. తగురీతి నడచుకొనెద" నని చెప్పి నమస్కరించి బైటికిఁ బోవుట కడుగిడెను. అంతలో రాజమాత "హేమా, నీసమీపమం దొకక్రొత్తచెలికత్తె వచ్చి చేరియున్నదఁట. అది యిపుడు నీతో వచ్చియున్నదా?

దేవి:—ఇందిరా, యిటు రమ్ము. రాజమాతకు నమస్కరింపుము.

ఇందిర నమస్కరించి మిగుల నణఁకువతో నిలిచెను. మురళి యిందిరను జూచినంతనె, గుండెలు జల్లుమనెను. ఇది యేమిచిత్రము! ఇది యొక చెలికత్తె యగునా? కాదు, కాదు. ఇది నిజముగా హేమతనయ. అయిన శరీరచ్ఛాయ యది గాదు. అందువలన సంశయంబుగా నున్నది. ఆచిన్నదైయున్న, తనతల్లి కేల చెప్పలేదు? ఇదియు నొకవింతయే. ఎటులైనను నీచిన్నదానిని నాసమీపమం దుంచుకొని చూచి పరీక్షించి పిమ్మట శత్రుపక్షనిర్మూలనం బొనరించెద. ఫల్గునుఁ డుండఁగ నా కసాధ్య మగుకార్య మేది యుండు నని చింతించుచుఁ "జిన్నదానా, నీకుఁ దలిదండ్రులు గలరా?" యని యడిగెను.

ఇందిర:—మహారాజ్ఞీ, నాకుఁ దల్లి లేదు. తండ్రి యున్నాఁడు.

రాజమాత:—బాలా, నీవు మిక్కిలి బుద్ధిశాలినివని తోఁచుచున్నది. నిన్నుఁ జూచి మిగులఁ దృప్తిఁ జెందితిని. మఱియు రాజస్త్రీలయందే కాక సామాన్యస్త్రీలకుఁ గూడ గాంభీర్యసౌందర్యము లొప్పియుండు నని తెలిసికొంటిని. నీవు మఱియొకసారి నాకోడలితో నిచటికి వచ్చినపుడు నీసంగీతము నినవలయును.

ఇందిర:—'చిత్తము.' అని చెప్పుచు బైటికి వచ్చెను. అందఱు భుజించి విశ్రామశాలయందుఁ గూర్చుండిరి.

రాజు:—దేవీ, నీక్రొత్తచెలి ముందుండినదానికంటె మిగులనందకత్తె. అయినను దేహచ్ఛాయ చక్కఁగా లేదు. సమీపమందు జూచినఁగాని దానియందము దెలియదు. దానివలన నిది యొకసామాన్యస్త్రీ యని యూహింపవలసియున్నది. ఈచిన్నది యెట్లు నీయొద్దఁ జేరినది?

దేవి:—రాజా, యీచిన్నది మనవర్తకులవెంబడి నిచటికి వచ్చెను. అది యొకకాయస్థకుటుంబములోఁ జెరిఁగినదఁట. ఇచటికి వచ్చినపిమ్మట రాజగృహమం దుండవలె నని యాసఁగొన్నదఁట—పూలమ్మదానిసహాయమువలన నంతఃపురంబునకు వచ్చెను. దానిచాతుర్యమును జూచి నేను నాసమీపమం దుంచుకొంటిని. తీర్థయాత్రకుఁ బోయియున్న దానితండ్రి రాఁగానే యీచిన్నది మరలిపోవును.

రాజు:—దేవీ, నీ కనిష్ట మగు మాట నాడితి నని తలంపవలదు. నీ మిత్రులు నాకును మిత్రులు. నీ వంగీకరించినదే నా కంగీకారము. ఆ చిన్నది పరదేశస్థురాలు. నీ వీయంతఃపురంబున నున్నట్లైన నేదేశమువారైన నభయము లేదు. నీ వేకాంగిగా నుండుసమయంబున నీ కెవరైన శత్రువు లహితంబుఁ జేయుదురేమో యని యట్లడిగితిని గాని వేఱొండు గాదు.

దేవి:—రాజేంద్రా, నా కీలోకమందు శత్రువు లుండునది లేవిధి నీకు తెలియదా? నే నెవరి కేమి యపరాధం బొనర్చితిని? "మీవలన నిరంతరదుఃఖ మనుభవించుచున్నాను." అని మీతల్లి యాడినమాట నా హృద

యంబును దహించుచున్నది. ఏల యనఁగా నేను వివాహిత నై మీగృహం బునకు వచ్చిననాఁటనుండియు మీతల్లి ని నా తల్లినిగా భావించి సేవ యొనర్చుచుంటిని. ఆ మెకుమారుఁడు పరమధార్మికుఁడని యాయను చక్కఁగా నెఱింగి యున్నను నా కర్మవశంబుననో లేక వారి పాపఫలం బనుభవించు కాలము సమీపించినందుననో యట్టి యాపద ప్రాప్తించుటయు, నా యప రాధం బనాథుం డగు నా రాజచంద్రునిమీఁద నారోపితం బగుటయు సంభవించె. నేను భర్తను బోగొట్టుకొంటిని. నా ముద్దు లొలుకు నేకపుత్రిని పోఁగొట్టుకొంటిని. ఇట్లు దిక్కులేనిదాన నై యున్నందున నెవ రేమి చెప్పి నను విని యూరకుండవలసినదే.

రాజు:—ఆహా! దేవీ, మన్నింపుము. నిన్ను వేఁడుకొనెద. నీకోమల హృదయం బిటు నొప్పింపఁగూడదు. ఇపుడు నేఁ జేసియున్న యాలోచనము వలన నీకు సకలశుభంబులుఁ జేకూరు. గతించినకార్యంబునకై వగచుట నీ యట్టి ధీర లగు క్షత్రియ వనితలకుఁ దగదు.

దేవి:—మాఱు మా టాడలేదు. తా నింతైనను మించి మాటా డినది తప్పని యెంచెను. రాజా, మన్నింపుము. విధికృత మెట్లున్నదో యట్లు జరుగును. ఇట్టి కష్టమందు నన్నాదరించుటకు నీ వొకండవు నా పక్షమందు నిల్చి యభిమానమును వహించియున్నావు. ఇదియును నీశ్వరాజ్ఞయే రాజేంద్రా, మదీయగృహంబునకుఁ బోయెద నని చెప్పి, యిందిరతోఁ గూడి యంతఃపురంబునకుఁ జనియెను.

మదనపాలుఁడు తన శయ్యయందుఁ గూర్చుండి, "అయ్యో! నాతల్లి యెంత నిష్ఠురంబుగా మాటాడినది. ఆమెమనస్సున కెంతయో బాధ కలిగెను. పాపము! అబల! యేమి చేయఁగలదు. నీ వొకఁడవు నాపక్షమందు నిల్చి యభిమానము వహించి యున్నావనెను. అదియే తనప్రీతిని జూపించు భావము. హేమప్రభ యిపుడే నన్నుఁ బ్రేమించుటకుఁ బ్రారంభించెను. ఇపుడు వచ్చియుండు క్రొత్త చిన్న దేమైనను నాకుఁ జెఱుపు చేయు నని నాతల్లియు ఫల్గునుఁడు ననుమానంబుఁ జెందియున్నారు. అదియును నాలో చింపవలసినదే" యని చింతించుచు నిద్రించెను.

---

# ఏకాదశోఽధ్యాయము



దేవి:—అమ్మా, యిందిరా! అనట నుండు జాబును జదువుము. అది బహుళశ్రీమాళవదేశాధీశుఁ డగు లలితకుమారుఁడు వ్రాసినదై యుండును.

ఆమాట వినఁగనే యిందిర పులకాంకితురాలయ్యె. అపుడు తనమనస్సుయొక్కస్థితి నడంచుకొని పోయి యా జాబు నెత్తి విప్పి చదువం దొడంగెను.

“సౌభాగ్యశాలిని యగు శ్రీమహారాజ్ఞిగారి చరణసన్నిధానంబునకు శిరస్సాష్టాంగనమస్కారములు.

దేవిగారి చరణదర్శనంబునకు రావలె నని యున్నాను. పనులతొందర వలన నుత్తరంబు వ్రాయనియపరాధంబు క్షమింపఁగర్తలు. రేపు తమసన్నిధానంబుఁ జేరెద.

ఇట్లు: తమసేవకుడు,

“లలితకుమారుఁడు”

రాజ్ఞి:—ఇందిరా, యీ రాజపుత్రుఁడు నన్నుఁ దల్లికంటెను నధికముగాఁ బ్రేమించువాఁడు. ఇతని తలిదండ్రులు పోయినప్పటినుండి నే నితనిఁ బెంచితిని. ఈ బాలునియందు నాభర్తకు మిగులఁ బ్రేమ. నేను బ్రసవించిన నాఁడే నా ప్రియుఁడు నా సూతికాగృహంబునకు వచ్చి దేవతవలె ప్రకాశించుచుండు తనబిడ్డను జూచి “ప్రేయసీ, లలితకుమారుఁడు మనకు జామాత యని చెప్పిరి. ఇపు డది తలంచి యుపయోగ మేమి? (కొంతవడి యూరకుండి మరల) ఈసందర్భమున మదనపాలునిఁగూడ భోజనంబునకుం బిలిచెద. లేకున్న నతఁ డన్యథా తలఁచును.”

అది విని “జననీ! మీ యిష్టానుసారము జరపుఁడు.” అని యిందిర వచించెను.

అపుడు దేవియాజ్ఞానుసారంబుగా నంతఃపురాలంకారము జరుపఁబడెను. ఇందిరహృదయమందు సంతోషము భయము ముప్పిరిగొన ననేకాలోచనాపరంపరలలో మునింగియున్నను వంటలు మొదలగు పనుల నతిశ్రద్ధతోఁ జేయించుచుండెను. నా జీవితేశుని దర్శనముఁ దనివి తీరఁ జేయవలయు నన్న వెంటనే నా వంశనాశనమునకుఁ గారకుఁడగు మదనపాలుని దర్శనమా? ఏమి చిత్రము? ఉండనిమ్ము "సమశ్శత్రౌ చ మిత్రేచ" యని పెద్దలు చెప్పినారు. అంతశ్శాంతము నాకెట్లు కలుగును? బలాత్కారముచేతనైనను అంతయు నోపికతో సహించియుండవలయు నని ప్రియుని దర్శనమునకై యెదురుచూచు చుండెను.

రథములశబ్దము విని హేమప్రభ బహిర్ద్వారమునకు వచ్చి నిలువఁగనే మదనపాలుఁడు లలితకుమారుఁడు లోపలికి వచ్చిరి. రాణి 'రాజా విచ్చేయుఁ' డని చెప్పెను. రాజు రాణికి వందనం బాచరించి ముందునకు జనెను. ఆనాఁడు మిగుల నాప్తులగు రాజబంధువులు కొందఱు మాత్రమే వచ్చియుండిరి. అందఱు విశ్రామశాలయం దుపవిష్టులై యుండఁగ, లలితకుమారుఁడు దేవికి నమస్కరించెను. దేవి యతనిని లేవనెత్తి యాశీర్వదించి, కుమారా, నేఁడు నిన్నుఁ జూచి నామనంబున కెంతయేని యుల్లాసంబుగా నున్నది. నీవు దొంగలచేతఁ జిక్కి యెట్లు తప్పించుకొంటివి. నీ యుదంతమును వినవలయు నని యాసఁ గొనియున్నాను.

లలితుఁడు:—జననీ మీ యాశీర్వాద మహిమచేతనే యట్టి యాపదనుండి ముక్తుండనైతిని. హేమప్రభాదేవికోటలో నుండు రాజస్త్రీ లందఱు లలితకుమారునిఁ జూచుటకై వచ్చిరి. దేవి లేచి పోయి వారిని సత్కరించి వారచట మాటలాడు చుండఁగ, దేవి యచట నిలిచియున్న యిందిరను బిలుచుకొని పోయి, "కుమారా! నా క్రొత్తచెలిని జూచితివా? ఈమె మనదేశమునకుఁ జేరినది గాదు. బర్మాదేశమునకుఁ జేరినదఁట. అయిన నీచిన్నది మన హిందూస్త్రీవలె నున్నది. అదియునుం గాక, మిగుల విద్యా

వలె. ఆమాట వినఁగానే, లలితకుమారుఁడు తన్నుఁ దా మఱచెను. తన మనో వికారము నడంచుకొని, దేవీ, ఆలాగా? యనెను. ఇందిరముఖంబు దెల్లఁబారెను. "ఆహా! నే నిచట నుండుటఁ జూచి నా ప్రియుఁ డేమనుకొనునో, నే నేమి చేయఁ గలను? దైవమే గతి" యనుకొనెను.

దేవి:—కుమారా, మీరు బర్మాదేశమందు దొంగలచేతఁ జిక్కియుంటిరే, మీ రెచ్చట నుంటిరి? ఈపిల్ల నెప్పుడైనఁ జూచియున్నారా?

లలితుఁడు:—జననీ, యది బర్మా కాదు. బర్మాకుఁ గ్రిందిభాగంబున ననేక దీవులున్నవి. వానిలో రత్నదీవి యనునది యొకదీవి. ఆదీవిలోనే సముద్రపుకొంగ లుండును. అ కొండలకు రెండుమైళ్ల దూరంబున నీ చిన్నదాని తండ్రి గృహ మున్నది. ఇపుడు మీరు పిలిచిన పేరును విని యీ చిన్నది యామెగా నుండు నని తలంచుచున్నాను.

రాణి:—'ఇందిరా, యిటు రమ్మ' అనఁగానే యామె వచ్చి రాణి యొద్ద నిలిచెను. అమ్మా, యిందిరా, ఈ రాజుగారిని నీ వెఱుంగుదువా? యని రాణి యడిగెను.

ఇందిర:—దేవీ వీరు చండసేనుని కారాగృహమునుండి మిక్కిలి యస్వస్థులై యున్నప్పుడు వీరి సేవకుఁడు వీరినిమాయింటికిఁ దెచ్చెను.వీరారోగ్యముఁ బొందువఱకు మా యింటిలోనే యుండిరి. వీరు వెడలిపోయినపిమ్మట నాతండ్రియును తీర్థయాత్రకు బయలుదేఱెను. ఇది యంతయు శ్రద్ధతో వినుచుండిన లలితుఁడు నిది యేమై యుండు నని యాలోచనాసముద్రమం దీఁదుచు దరిఁ జేరనివానివలె నుండెను.

మదనపాలుఁ డిదియంతయు వినుచు 'ఇది మోసకత్తె' యని చెప్పుటకు వలనుపడదు. ఆచిన్నది చెప్పిన ట్లది సామాన్యస్త్రీగానే యుండును. నాతల్లి వ్యర్థముగా లేనిపోని యాలోచనలఁ జేసి యీ చిన్నదానిమీఁద ననుమానంబు వహించి యున్నది. 'చచ్చునట్టి వాని కన్నుల కగపడిన వారందఱు యమదూతలే' య న్నట్లున్నవి. ఎట్లైనను నామె యేమి చెప్పినను

నేను జేయునది నా విధాయకము. ఎందు కనఁగా నామె యెల్లపుడు నా మేలు గోరుచున్నది యని యనుకొనుచుండెను.

దేవి:—ఇందిరా, యిదివఱ కెన్నఁడును నీ విషయము నాతోఁ జెప్పియుండలేదే? ఇది నాకు మిగుల వింతగా నున్నది.

ఇందిర:— రాజ్ఞీ, ఆ విషయమును గుఱించి మాటలాడు సందర్భ మేమియుఁ గలిగి యుండలేదు. అదియునుం గాక మా యింటి కెందఱో వచ్చుచుందురు. వారిలో వీ రొకరై యుండవచ్చును. వా రందఱ వృత్తాంతము నా తండ్రికిఁ దెలియునే కాని నా కెట్లు తెలియును? అయినను వీరి పేరు పలుమా ఱందఱుఁ జెప్పుకొనుచుండెడివారు. అందువలన వీరే వారై యుందు రని యెంచితిని.

ఈ మాటల వినుచుండిన లలితుఁడు 'ఆహా యిది యెంత సామర్థ్యశాలి! ఇదివఱకు దీని తండ్రి 'నా కొక కళంక మున్నది. అది తీఱు వఱకు నా పుత్రికకు వివాహము జరుగ' దని చెప్పెను. ఆకళంకమును బోఁగొట్టుస్థల మిదియై యుండనోపు. కార్యాసక్తుండ నై యా కార్యమును నే మఱచితిని. నా ప్రాణేశ్వరి మఱవలేదు. మాఱువేసంబుఁ బూని యీ యోధురా లిచటికి వచ్చియున్నది. ఈ సమాచారముఁ దెలియుటకై యీశ్వరుఁడు నన్నిటకుఁ గొనితెచ్చెను. ఇఁకమీఁద నీమెను గుఱించి యతి జాగరూకుఁడనయి యుండవలె నని నిశ్చయించుకొనెను. ఇంతలోఁ బరిచారికలు వంట సిద్ధమైన దని తెలియఁ జేసిరి. అందఱు భోజనశాలఁ బ్రవేశించిరి. అంతట హేమప్రభ రాజును జూచి "మదనా! యట్లు పిలిచిన నీకుఁ గోపంబు కలుగునేమో. ఇదివఱకు ని న్నట్లు పిలిచిన యభ్యాసమువలన నోరు జాఱి మాట వచ్చెను. మన్నింపుము. రాజేంద్రా; నేఁడు నా ప్రియసఖియగు నిందిరను నీ రాజపంక్తిలోఁ గూర్చుండఁ బెట్టెద నీ కేమి కొదవ యుండదు గదా? లలితా! నీ కెట్లు తోఁచుచున్నది. నే నేమి చేసినను మి మ్మిరువు రను మాత్ర మడిగి చేయవలె నని నా మతము. తక్కిన వీరందఱు

నన్నుఁ దండ్రులవలెఁ బెంచి నే నేమి తప్పుఁ జేసినను మన్నించి నాయిష్ట మనుసరించువా రనెను. ఆ మాట వినినంతనే యచటిరాజబంధువుల యానందమునకు మేర లేదు. మదనపాలుఁ డీప్రపంచమందే లేఁడు. ఎందులకనఁగా, నిట్లు తన్నుఁ బిలుచుట నిర్లక్ష్య మని యానూఢుఁడు తలంప లేదు. ఈనాఁ డీమె నోటినుండి యిట్టి సంభాషణ స్వప్నమం దైనను విని యెఱుంగఁ డనుకొనెను. ఈమె యింతచనవుగా మాటలాడు నని యెంచినవాఁడును గాఁడు. ఎట్టకేలకు బలాత్కారముగాఁ దా నుండుస్థలంబు నెఱిఁగినవాఁడై "మహారాజ్ఞీ ! నీ సేవకుఁడ నగు న న్నింత బహూకరించి చెప్పవలయునా? ఒకనీచుని సమీపమందు నీవు కూర్చుండు మని చెప్పినను, నది నీయాజ్ఞ గనుక నానీచుఁడే నాకు వందనీయుఁడు. అట్లుండఁగా నిందిర విద్యావతి, "విద్వాన్ సర్వత్ర పూజయే" త్తని బుధులు చెప్పియుండలేదా? నీయిష్టము ప్రకారము చేయుము. నేనే నీకు విధేయుఁడనై యుండఁగ మనము పెంచిన లలితునిమాట నడుగవలయునా?" యని చెప్పెను. వివిధసంభాషణలతో భోజనములు ముగించి విశ్రామశాలయందు విశ్రమించిరి. అందఱు వారి వారి స్థలంబులకు వెళ్లినపిమ్మట నిందిర యేకాంతముగా నుండుసమాచారము దెలిసి యచటికి మెల్లఁగాఁ బోయి, "ప్రియా, యిందిరా! యిది యేమివింత? పూజ్యుఁడగు నీ తండ్రికి సేమంబే? నీ విచటికి వచ్చు సమాచారము ముందు నాకుఁ దెలుపఁగూడదా? నీవిషయము లేమియుఁ దెలియక తల్లడిల్లుచున్నాను. ఈ దీనునియందు దయ యుంచి సకలవృత్తాంతముఁ దెలుపు మని లలితకుమారుఁ డిందిరను నెమ్మదిగా ప్రస్తావింప మొదలిడెను.

ఇందిర:—ఇటునటు చూచి లలితకుమారునితో మనోహరా, శాంతిఁ జెందియుండుఁడు. మీ వియోగదుఃఖము మా యిరువురిని మిగుల బాధించెను. నా తండ్రిగారు పొందిన దుఃఖమునకు మేర లేదు. ఇట్టి సమయంబున దుష్టుండగు నా చండసేనుఁడు బలాత్కారంబుగ నన్నపహరించుటకు యత్నము చేసెను. ఆ యాపదనుండి తప్పించుకొని కాశీఘట్టమునకు వచ్చి చేరితిమి.

నన్ను జీవితాంతమువఱకు నేకాంగిగా చేయుకళంకమును బోఁగొట్టుటకై ప్రయత్నింపవలదా? దానికిఁ దగినవేషభాష లక్కఱలేదా? 'నేను సాధించెద' నని నాతండ్రితోఁ జెప్పి వచ్చితిరే. ఇదివరకు మీరు సాధించిన దేమి? మీవలె నన్ను మఱచిపొమ్మనెదరా? మనోహరా! మన్నింపుఁడు. మన కపుడే శత్రువు లేర్పడి యున్నా రను విషయమును తెలిసికొనుఁడు. అతిజాగ్రత్తగా మెలఁగవలెను. లేనియెడల మనకుఁ బ్రాణహాని తప్పదు." ఇది యంతయు విని లలితకుమారుఁడు చింతానిమగ్నుఁ డాయెను. ఇంతటి యపాయకర మగుపల మని తెలిసియుండియు నీయబల తనకార్యము సాధించుటకు వచ్చినది. ఈమె తనయం దుంచిన ప్రేమకుఁ దనప్రేమ సాటిగా దని యెంచెను. తన్ను మహాపరాధిగా నెంచి, "యో నాసర్వస్వమా! నేను నిన్ను మఱచునంతటి నీచుఁడను గాను. అయినఁ జేయుకార్య మేదియో తెలియక మూఢుఁడ నై యున్నా" నని లలితుఁడు ప్రత్యుత్తరం బొసంగునంతలో రాజు లలితునిఁ బిలిచెను. లలితుఁడు వచ్చుటఁ జూచి "కుమారా! పోదము రమ్మ"నెను. అంతలో నొకస్త్రీ వచ్చి వారిరువురకు నమస్కరించి నిలిచెను.

రాజు:—లీలా, యెందులకని వచ్చితివి? అమ్మగారేమైనఁ జెప్పినారా?

లీలా:— ప్రభూ! ఇందిరమ్మను కొన్ని దినములు సన్నిధానమం దుంచుకొనవలయునని రాజమాతగారు కోరియున్నారు. ఆమె మరల నిచటికి వచ్చువఱకు నన్ను దేవిగారి సేవయం దుండు మని నియమించిరి. ఆజ్ఞప్రకారము వచ్చితిని.

రాజు:—దేవీ! దీనికి నీ యిష్ట మేమి! ఇందిరనుఁ జూచిన దాదిగా నాతల్లిగారు చిన్నదానియందు మిక్కిలి ప్రేమఁగలిగి యున్నారు. ఆమె కోరిక నెఱవేర్చుట మనకు విధాయకముగదా?

దేవి స్తబ్ధురాలై కొంచెముసేపు మౌనముతో నుండెను. "రాజేంద్రా ఆ చిన్నదానిని విచారించి చెప్పెద. నా యధీనమం దున్నదని దాని కని

ష్టంబగు కార్యముఁ జెప్పి దానిని నొప్పించుటకు నే సమ్మతింపను. ఈస్త్రీ నాయొద్ద నుండనిమ్ము. ఆ చిన్నదానికి విశదముగాఁ దెలియఁ జేసి పంపెద' నని చెప్పెను.

లలితుఁడు తగు సమయము నిరీక్షించి "యిందిరా, నీ ఘనకార్య మెట్టిదో నా యాలోచనాశక్తికి మించి యున్నది. అయ్యో! నీ దేహకాంతిని మార్చుకొంటివే, యది నా మనస్సున కెంత వేదన కలిగించుచున్నదియు నీ వెఱుంగుదువా? ఆ కార్య మేదియో నే నెఱుంగవలదా?" యనెను.

ఇందిర:—నాథా! నా తండ్రిమాత్రము దేహకాంతిని మార్చుకొన లేదని యెంచినారా? దానిని బోఁగొట్టుటకు వేఱుమం దున్నది. తమకుఁ దెలియని రహస్యము నాయొద్ద కలదా? నేను మదనపాలుని యంతఃపురము నకుఁ బోవలయు నని యతనిచెవిలో నేదియో చెప్పి యిఁక నే నిచట నుండి వెడలుట కనుజ్ఞ నొసంగుఁడు.

లలి:—లలితుఁ డేమి చెప్పును? సుందరీ! నే నెంత బుద్ధిహీనుఁడ నైతిని. తలంచిన భయమగుచున్నది. ప్రియా! పోయి రమ్ము. నీవు చిన్ని సంయుక్తాదేవి వగుదువు. నీకు శుభం బగు గాక. ఇఁకమీఁద నిన్నెడఁ బాయక యతి జాగ్రత్తగా బ్రవర్తించెద.

అని యిందిరను బంపివైచి మరల నతఁడు "ఆహా! ఈమె సామాన్య స్త్రీ యగునా? నే నెంత మోసపోతిని! మిగులఁ బసితనంబునఁ జూచిన వస్తువును బెద్దవారైనపిమ్మట గుర్తించుట కష్టము. ఈశ్వరా! నీవే దిక్కు" అని యేమేమో తలపోయుచు దేవిసమీపంబున కరిగెను.

ఇంతసేపు వీరల సంభాషణము వినుచున్న లీల యిందిర యెడల నసూయాగ్రస్తురాలై "ఆహా! ఏమి దీని గర్వము. లలితకుమారుఁ డనఁగా నెట్టివాఁడు? ఆతని స్థితి తెలియక యెంత నిర్భయముగా నతనితో మాటలాడినది. అదియునుం గాక నీ రాణి దగ్గఱజనవుగా నుండి యీ చిన్నదానికి తలకు పొగరెక్కినది. కానిమ్ము. ఇది దాను జేయుకొను నంతటి సామాన్యపు

బిల్ల గాదు. ఈచిన్నది యెవరైనది కనిపెట్టి యీ యుదంతమును హేమప్రభా దేవితో విన్నవించి యామె దయను సంపాదించెద" నని తలపోయుచుండెను.

మదనపాలుఁడు వెడలినపుడు లీలను బిలచి రాణికి మిగుల నణకువతో సేవ జేయుమని చెప్పి పోయెను. లీలయు నటులే తన పనులయందు ప్రమత్తురాలై ప్రవర్తించుచుండెను. ఇందిర తనగదిలోఁ బ్రవేశించి యచట మేజామీఁద నుండుజాబులను జూచెను. అవి యన్నియు రాణిగారికి వచ్చినవి. వానిలోఁ దన తండ్రి వ్రాసిన జాబును విప్పి చదువుకొని యా నిముసమందే యచట జరిగిన విషయమును గుఱించియు నింకను తానుఁ జేయఁదగిన కార్యమేమియు జరుగ లేదనియుఁ బెద్దయంతఃపురమునకుఁ దాను బోవు సందర్భము కలిగినదియు, నచటనే తనకార్యము నెఱవేఱు నను ధైర్యము కలిగియున్న దనియు, వ్రాసెను. పిమ్మట నన్ని యుత్తరంబులఁ దీసికొని రాణిసమీపమున కరిగెను. అప్పుడు దేవి లీలను జూచి,

"లీలా! రాజమాత నీతో నేమిచెప్పెను? ఎందుల కిందిరను బంపవలెనఁట? నే నేవిధముగాను నెమ్మదిగా నుండుట యామె కిష్టము లేనటులున్నది? ఏమి పాప మెఱుంగని యీ చిన్నది యామె కేమి యపరాధం బొనర్చె? దుర్జనులె పుడును సాధువులం బీడించుటే మహాకార్యం బని తలంచెదరు. నన్ను నమ్మియున్న యీ బాల నెట్లు నా పులి గుహకుఁ బంపుదును? ఆమెతంత్రములకు రాజాధిరాజులు నిలువఁజాలరే? ఈ చిన్నది యామె కేపాటి?

లీల:—జననీ, రాజమాతగారి యాలోచనము నాకెట్లు తెలియును? వా రిందిరమ్మను గుఱించి విరోధముగా నేమియు నాతోఁ జెప్పలేదు. లీలా, నా కోడలి యంతఃపురమందుఁ గొన్ని దినములు నీ వుండుము. అచటనుండు నిందిర కొన్ని దినములు నాయొద్ద నుండ ని" మ్మని సెలవిచ్చిరి.

దేవి యేమియో యాలోచించుచుండెను. ఇందిర జాబులకట్టను దీసికొని వచ్చి దేవి కందించెను. వానిని జూచి దేవి 'యిందిరా! యీ యుత్త

తంబుల నన్నిటిని చక్కఁగాఁ జదివి వానికిఁ దగు ప్రత్యుత్తరంబుల వ్రాయు
ము. నేను మఱల వానిఁ జూచి చేవ్రాలు చేసెద. లీలా! నీ పనికిఁ బొ"
మ్మని పంపివేసి యిందిరా, కూర్చుండుము. మహాపాపినగు నన్నాశ్రయించిన
నీకును నిడుమలు ప్రారంభ మైన వని తలంచెద. ధృతరాష్ట్రునిచెల్లెలివంటి
యీమురళికి నీయం దనుమాన ముదయించి యుండును గాఁబోలు. నిన్నుఁ
దనయంతఃపురమున నుండుటకుఁ బ్రేరేపించి యున్నది. ని న్నేమి చేయునో
తెలియదు. మదనపాలుఁ డామాటఁ జెప్పఁగనే భయవిహ్వల నైతిని. నా
మనోగతంబు వాని కెఱుకపడనీక యుల్లాసంబుగ మాటలాడి దానిని మఱపిం
చితిని. ఇపుడు నే నేమి సేయుదును?

ఇందిర:—జననీ, చింత వలదు. నే నపటికిఁ బోయినఁగాని తమకు
సహాయం బొనరించుటకు సాధ్యము గాదు. ఇది యంతయు మన శుభంబునకే
యని నాయంతరాత్మ చెప్పుచున్నది. అమ్మా, ధైర్యము వహించి నా కనుజ్ఞ
నొసంగుఁడు. "ధైర్యం సర్వత్ర సాధన" మ్మను వాక్యము నెఱుంగరా? ఈ
శ్వరుని నమ్మినవారి కెపుడును నపజయము కలుగదు. ధైర్యము వహించి
యుండుఁడని యామెకు బోధించి మఱునాఁడు పోవుట కాజ్ఞఁబొందెను.

ఇందిర తనగదిలో పడుకమీఁద పరుండి యుదయపురికి తా నేగు
టయు, పులిగుహను జొచ్చుటయు నను రెండును సమానములు. మహావీరుఁ
డగు తన తండ్రిని నిలువ స్థలము లేక యన్నియిడుమలఁ గుడిపించి, యడవి
పాలు గావించిన యీ మురళి త న్నూరక విడుచునా? యను చింత యింది
రను బాధించుట కారంభించెను. పట్టినపట్టు విడుచుటకంటెఁ జచ్చుట
మేలు. ఏ మైన నగుంగాక యని తెగించె ధైర్యంబుఁ బూని దైవధ్యానము
సేయుచు నిదురించెను. ఇంకను నిదురపట్టలేదు. తలుపుఁ దట్టినశబ్దము విన
వచ్చెను. వెంటనే యిందిర లేచి తలుపు దీసి తనయెదుట నిలిచియున్న దేవిని
జూచి భ్రమించెను. "దేవీ, యేమి యాజ్ఞ" యనుచుండఁగనే, దేవి యాగదిలోఁ
జేరి తలుపు మూసికొని యిందిరపడుకమీఁదఁ గూర్చుండెను.

ఇందిర:—జననీ, తమరు నాపడుకమీఁద కూర్చుండవచ్చునా?

దేవి:—'ఇందిరా, యిటురమ్మ' అని చెయి పట్టి ప్రక్కను కూర్చుండఁబెట్టుకొని 'యిందిరా, నాజాబులలో నీకొకయుత్తరంబు వచ్చినది. అది నీ తండ్రి వ్రాసినది గాదా?

ఇందిర:— అవునమ్మ.

దేవి:—ఇందిరా! నీతండ్రి నీవలెనే యుండురా? కాళీఘట్టమునకాయన వచ్చినట్లయిన నిచటికేల రాఁగూడదు? నీదేహచ్ఛాయ నిజమైనదా? లేక మార్చియున్నావా? అతనిచేతి యక్షరములు నాభర్త చేతియక్షరములవలె నుండుటకుఁ గారణం బేమి? బాలా! నాభర్త రాజవంశసంబంధమైన పేరు వహించియున్నాఁడే గాని యతఁడు లోకమున నిజముగా మిత్రానందుఁడే! నా ప్రాణనాథుఁ డితఁడై యుండునా? ఆపైవిలాసముఁ జూచినప్పటినుండి నామనస్సెందుల కిట్లు తల్లడిల్లుచున్నది. అమ్మ, అతఁడే నాభర్తయైన నీ వెవరవు? నీరూపమంతయు నా బిడ్డను బోలియున్నది. నిజముఁ జెప్పుము. ఇపుడే బయలుదేఱి నీతోఁగూడ వచ్చెదను. మన మతనిఁ జేరుకొందము.

ఇందిర:—తల్లీ! ఏ మిట్లు మరల నజ్ఞానమునకు లోనై దుఃఖపడుచున్నారు. ఒకవేళ మీ రన్నమాట నిజమైనను మీభర్తమీఁద నొకగొప్ప యపరాధము మోపఁబడి యుండలేదా? మిమ్ముఁ దోడుకొనిపోయి యతఁ డెచట దాఁగియుండును? అట్లు దొంగతనముగా నెన్నిదినములు జీవించి యుపయోగ మేమి? జననీ, యీకార్యము సాధించుట యుద్ధమందు జయ మొందుట గదా? నాలుగుపాయములయందు మన మిపుడు ముందు భేదోపాయము నుపయోగించి యన్నియుఁ గనుఁగొనవలయును. రాజ్ఞీ! ఎటులైన నాయందు నమ్మకముంచి యిట్టిప్రశ్నలచేఁ గాలము వ్యర్థపఱుపక, నన్ను రాజాంతఃపురమునకుఁ బంపుఁడు. మహారాజ్ఞీ! సావిత్రీదేవి మరణం బందిన తనభర్తను దెచ్చుకొని సుఖించెనని పురాణముండఁగా, బ్రతికియుండువారు రారా? వారిని మనము

చూడలేవా? వీరపత్ని, వీరమాత యగు మీరు పలుమా టిట్లు వ్యసనపడక యిట్టిసమయమందు ధైర్యమూనియుండవలె నని వేడుచున్నాను.

దేవి:—ఇందిరా! ఏదిరా రత్నదీవియందుఁ బుట్టినచిన్నది నన్నుఁ జూడఁగనే యింత ప్రేమించుట యేమిటికి? నిన్ను విడిచి యుండఁజాలక యే యిట్లు విలపించు టెందులకు? ఇది యంతయుఁ జూడఁ జిత్రముగా నున్నది. కానిమ్ము. నీవు చెప్పినట్లు ముం దేమి జరుగునో చూచెదను. ఈనాఁడు నీయొద్దనే పండుకొనెద. అది నాకు ప్రియము. అ ట్లొనరించెదవా లేదా?

ఇందిర:—"జననీ! మనరహస్యంబులఁ గనిపట్టుటకై రాజమాత లీల యనుదాసి నిచటికిఁ బంపియున్న దని యెఱుంగరా? తమరు నే నుండుగది యందు శయనించిన, దాని కనుమానము గలుగదా?"

దేవి:—"ఇందిరా, అవును. అటులే కానిమ్ము. నీవియోగముఁ దాళఁదాలక యిట్లు తపించుచున్నాను. నీవు చెప్పిన దంతయు నాకుఁ దెలియకపోలేదు. ఇట్లు తపించుచుండుట నావిధి. నే నేమి చేయుదును? ఇదిగో పోవుచున్నాను. నీవు సుఖముగా నిదురింపు" మని లేచి యిందిర నాలింగనం బొనరించి, దానికి ము ద్దిచ్చి వెడలిపోయెను.

ఇందిర తలుపులు మూసికొని పడుకమీఁదఁ గూర్చుండి తనతల్లి ప్రేమను గుఱించి తలపోయుచు నిదురించెను.

మఱునటి దినము దేవి తనపూజ మొదలగు నిత్యకర్మములం దీర్చికొని వెలికిరాఁగానే యిందిర ప్రయాణమునకు సన్నద్ధురాలై చేతిలోనొకయుత్తరంబును బట్టుకొని వచ్చి దేవి కందిచ్చెను. దేవి దానిని జదువుకొని, యిందిరా! ని న్నొంటరిగాఁ బంపవలె నని చింతించుచుంటిని. ఈనాఁడు మదనపాలుని గురువుగారి వర్ధంతియఁట. వాఁడు చాల వైభవముగా జరుపునఁట. బీదల కన్నము నిడునఁట. అందఱితోఁగూడ నన్నును భోజనమునకుఁ బిలిచియున్నాఁడు. వాఁ డెద్దియేని నెపంబు నేర్పఱచుకొని నన్నుఁ బలుమా ఱచటి కీడ్చు

చున్నాఁడు. కానిమ్ము, అంతకంటె మఱి యేమి సేయఁగలఁడు? నేనును నీతోఁగూడ వచ్చి యచటి స్థితిగతులం జూచి నిన్నచట విడిచి వచ్చెద. నేను ముందు నాభర్తతోఁ గూడి కాఁపురముఁ జేసిన యారాజగృహమునం దుండు నాపడుకటింటిని నాయత్తకుఁ దెలుపక నాకుఁ జూపుమని యడిగితిని. దాని కతఁ డొప్పుకొనియున్నాఁడు, ఈనాఁడు వాని నన్నింటిని జూచి రావలయు నని కుతూహలంబు కలిగియున్నా" నని చెప్పెను.

ఇందిర:—దేవీ, తమ యిష్టముప్రకారమే చేయుఁడు. మీరు రెండు దినంబు లచటనే యుండుపక్షంబున దానికి తగువస్తువుల సిద్ధపఱచెద.

దేవి:—ఇందిరా! అట్లెన్నఁటికిని జరుగదు. అది నాకు పరగృహము గదా? ఒకరాత్రియైన నచట నిలువను. నీవు కావలయు నన్న నిలిచెద.

రథములు సిద్ధమైయున్న వని సకియలు వచ్చి తెలిపిరి.



# ద్వాదశోఽధ్యాయము



'పిఛోల' యను చెఱువు నానికొని మహావైభవంబుగాఁ గట్టియున్న ఉదయపూరునందలి రాజభవన మిప్పటికిని జగద్విఖ్యాతం బైన దని చరిత్రకారులు పొగడుచున్నారు. ఇట్టి యంతఃపురం బానాఁడు మిగుల వినోదకరంబుగ నలంకరింపఁబడి యుండెను. అందు రాజమాత యగు మురళాదేవి యుండు ప్రాసాదము మిగుల నందమైనది. సకలైశ్వర్యము లచట నమరియుండును. మదనపాలుఁడు పేరునకు రాజే కాని సర్వాధికారము నామెయే చూచుకొనును. సామంతరాజులు రాజస్త్రీలు నెల్లకాల మామెనే కొలుచుచుందురు. ఈమెయాజ్ఞ సుగ్రీవాజ్ఞ. ఈమె సౌందర్యవతిగా నున్నను నీమెను జూచిన నందఱు భయపడుదురు. ఆమెకన్ను లతితీక్ష్ణములుగా నుండును. భర్త లేకయున్నను నామె సకలాభరణములు ధరించుకొనును. అందఱితో వైరాగ్య ముట్టిపడునట్లు మాటలాడును. ఆమెమన స్సగాధకూపము. ఏకాలముల కేమియాలోచనముఁ జేయునో, యెవరికినిఁ దెలియదు. ఈమెకు ఫల్గునుఁ డాంతరంగికమంత్రి. వాఁడు చెప్పిన దామెకు వేదవాక్యము. ఈమెకుమారునికిని నటులే ముఖ్యముగా నిప్పటికి రాజాధిరాజు లేలిన యుదయపూరొక సేవకునివశమందుఁ జిక్కియున్న దని చెప్పవచ్చును. ఇట్లుండ, నీనాఁడు రాజగృహ మంతయుఁ దోరణంబులతోను ధ్వజపంక్తులతోను మెఱయుచుండెను. ఎచటఁ జూచినను సుగంధవాసనలు నిండియుండినవి. ఇట్టి శోభాయమానం బగు రాజమందిరమున విశ్రామశాలయందు రాజొంటరిగా నిలిచియుండెను. ఆనాఁ డతఁడు ధరించినవస్త్రములు మిక్కిలి వెల గలవి. తా నెంత యందముగాఁ గనఁబడవలె నని కోరియుండెనో యంత సొగసు చేసుకొని యుండెను. రాజబంధువు లందఱు రాజమాతను సేవించుచుండ,

నితఁడు మాత్ర మిట్లేకాకి యై యుండనేల? ఇది యందరానిపండ్లకఱ్ఱు చాఁచుపద్ధతి. హేమప్రభను వలలో వేసికొనుటకై గురువులవర్ధంతి యని పేరు పెట్టి తన యైశ్వర్యమును నధికారమును నామెకుఁ జూపుటకై ప్రయత్నించెను. రాణి వచ్చుట కాలస్య మైన దని యెంచి యిట్లు తపించుచున్నాఁడు. ఫల్గునా వచ్చెనా? బండ్లజాడ లేమైన వినఁబడుచున్నవా?" యనెను.

ఇట్లుండఁగా మురళాదేవి తనసకియలతో నచటికి వచ్చెను. "అమ్మా! యేమియాజ్ఞ" యని యామె కాసనమును సిద్ధపఱచెను. ఆనాఁడు తనపుత్రుని యలంకారమును జూచి మురళాదేవి మిగుల నానందంబుఁ జెందెను. మదనా! నీప్రియురా లింకను రాలేదేమి?" యనెను.

రాజు:—జననీ, వచ్చుసమయ మాయెనని తోఁచుచున్నది. ఇంతలో ఫల్గునుఁడు పరుగెత్తుకొనివచ్చి "దేవా! దేవిగారు వచ్చుచున్నా రనెను. రాజు తన్నెదురు కొనివచ్చునంతలో దేవిలోపలికి వచ్చి చేరెను. రా జెదుటవచ్చి "దేవీ! ఈ మెట్లెక్క పోవలయుఁగదా! నాచేయి పట్టుకొని యీమె ట్లెక్కుదవా?" యనెను.

దేవి:—రాజా! నే నంతబలహీనురాలనై యుండలేదు. అంతశ్రమ నీ కేందులకు? అని మెట్లెక్కి కాలు లోపలఁ బెట్టుచుండఁగా హేమప్రభకు మురళాదర్శన మాయెను. "ఇది యేమియనిష్టదర్శనం" బనుకొని పోయి యామెకు నమస్కరించెను. రాజమాతయును చిఱునవ్వుతో నామెను సన్మానించి తనప్రక్కనుండు నాసనముందుఁ గూర్చుండ నియమించెను. రాణి యట్లు చేయక క్రిందఁ బఱచియుండు చిత్రకంబళముమీఁదఁ గూర్చుండెను. సకియ లందఱు రాజమాతకు నమస్కరించి యిరుప్రక్కలయందు వరుసగా నిలువఁబడియుండిరి. వారినడుమ నిందిర నక్షత్రమువలె మెఱయుచుండెను. మురళ హేమప్రభ యిందిరవయస్సునం దెట్లుండినదియును, తన సపత్ని

పుత్రుఁడగు విక్రమసింహుఁడు చిన్నతనమం దెట్లుండినదియు నెఱుంగును. వారిద్దఱ జాడలు సంపూర్ణముగా నిందిరయందుఁ గనిపించుచుండెను. రాజమాత రెప్పవాల్పక దానినే చూచుచుండి "యిందిరా! నీవు నాయొద్దనుండుటకై వచ్చి యున్నావా? లేక మరల మీయమ్మగారివెంటఁ బోవుచున్నావా?" యనెను. ఇందిర యామెముఖలక్షణంబుల గమనింపక యుండలేదు. ఆమెమనస్సులోని యాలోచనలు ముఖమందుఁ బ్రతిఫలించుచునేయున్నవి. ఇందిర యిపు డనర్థములలోఁ దా నుండునది బాగుగా నెఱుంగును. ఏమి చేయఁగలదు! దీనికన్నను గొప్పకష్టముల ననుభవించినఁగదా పట్టినకార్యమును సాధింపవలయు. పదియాఱు సంవత్సరములుగా శత్రువులు సంపూర్ణాధికారంబుఁ బొంది రాజ్యము నిష్కంటకముగా నేలుచుండ, నబల యగునిందిర వారి నెదిరించి జయించుటకు సాధ్యమా? ఇపుడు తాను ధర్మంబుమీఁద భారము వైచి సుగుణశీలుఁ డగుతండ్రియొక్క దీనస్థితిని జూడలేక యిట్టి యుపాయకరంబు లగుకార్యములు చేయ యత్నించినది. అపుడు రాజమాతముఖలక్షణంబులఁ జూచి యిందిర భయముఁ జెందలేదు. ఆనిమేషమందే చేతులు జోడించుకొని ముందునకు వచ్చి "మహారాజ్ఞీ! లీలను తమ రానగరునకుఁ బంపిన నాఁడే మాదేవిగారు తమసన్నిధానంబునకుఁ బొమ్మని నాకు సెలవొసంగిరి. నే నీప్రదేశంబులకుఁ గ్రొత్తదానఁ గావున నీనాఁడు వారే నన్నుఁ బిలుచుకొని వచ్చిరి" యనెను.

రాజమాత:—"ఇందిరా! నీవినయవిధేయతలకుఁ జాల సంతసించితిని. నీయట్టివిద్యావతిని గొన్నిదినములు నాసన్నిధానము నుంచుకొనుట నాకు మిగుల నిష్టము. అందువలననే నాకోడలికిఁ జెప్పి పంపితిని. హేమా! యీ చిన్నదానితండ్రి యెపుడు వచ్చునఁట?

రాణి:—అమ్మా, నా కెట్లు తెలియును?

ఇందిర:—నాతండ్రి వచ్చునది రానిది వారి కెట్లు తెలియును? దేవీ! నాతండ్రి యిపటికి వచ్చి నన్నుఁ బిలుచుకొని పోవుదునని వ్రాసియున్నారు.

రాజమాత:—ఆహా! యింతటికా? యిందిరా! నీతండ్రి నిన్నెందులకు యాత్రకుఁ దోడ్కొనిపోలేదు?

ఇందిర:—మహారాజ్ఞీ! మే మంతభాగ్యవంతులము కాము. అదియును గాక అపుడు నా దేహస్థితి జబ్బుగా నుండినది. ఇచ్చటికి వచ్చియున్న నగలవర్తకులు మంచివారు. నాతండ్రికి స్నేహితులు. వారియింటిస్త్రీలుగూడ నాయం దమితప్రీతి. "నీదేహమున కాదేశ మారోగ్యముగా నుండును. మా వెంట రమ్మ"ని నాతండ్రినిగూడ సమ్మతింపఁజేసి నన్నిచటికిఁ బిలుచుకొని వచ్చిరి. ముందీయూర నుండు పూలముసలమ్మయింటిలో దిగితిమి. ఆయవ్వ వలన వ్రాయుటయును జదువుటయును దెలిసినచెలి యొకతె యీదేవిగారికిఁ గావలసియున్న, నాతండ్రి వచ్చువఱకు నేను మీసంస్థానమున నుండవలయు నని యాస గలిగి పత్రికారూపంబుగా దేవిగారికి విన్నవించుకొంటిని. పది దినములు గడచిన పిమ్మట దేవిగారు పిలిపించుకొనిరి. "ధియోపి పుంసాం మలినా భవంతి" అన్నట్లిచట బుద్ధి మలినంబై రాజమాత యామాట నిజ మని నమ్మెను. "ఎట్లైన దీనిని నాయొద్ద నుంచికొని చక్కఁగా దీనికార్యంబులఁ బరిశీలించెద"ననుకొనెను. ఇందిరయును నామెముఖలక్షణములవలననే, యామె మనస్సును గ్రహించి "నిన్నుఁగూడ మోసగించి కార్యము సాధించు ధైర్య మీశ్వరుఁడు నా కిచ్చుఁగాక" యనుకొనెను. భోజనాదులు తీరిన పిమ్మట హేమప్రభ యిదివఱకు తా నున్నయంతఃపురంబును జూచుటకుఁ బోయెను. అపుడు మదనపాలుఁడు దేవిసమీపంబునకు వచ్చి "దేవీ! నీవు నామీఁద దయ గలిగి నేఁ డిచ్చటికి వచ్చినందులకు నావందనంబులు నీకు సమర్పించెద. ముందు నీ వధికారిణివైయున్న యీయంతఃపురమం దున్న వస్తువు లన్నియు నీయవి. ఈరాజ్యమే నీదై యుండఁగా, ఈవస్తువులఁగూర్చి యననేల? నీ విదివఱకుండిన గదు లన్నియుఁ జూచి రమ్మ.

దేవి:—రాజా! వచ్చెద నని చెప్పినపిమ్మట వచ్చితీఱవలయునుగదా? నీయధికారమం దున్నయీయంతఃపురము నా కెట్లు సొంతమగును. నీవు

నాయందు దయ తలంచి పిలిపించితివి. ఇప్పటికిని నే నిచటికి నింతచనవుగా వచ్చినందులకై నీతల్లి యేమనుకొనునో యని సందేహించెద.

రాజు:—"దేవీ, నీ వట్లు తలంప వలదు. నాతల్లి యెన్నఁటికిని నాసుఖంబునకు భంగము కలిగింపదు. నా కెవరు స్నేహితులో వా రామెకును స్నేహితులే. నే నిదివఱకు నీకుఁ జెప్పినప్రకారము నడచుకొన్నట్లయినఁ మన కుభయులకును సుఖము కలుగును. ఆమార్గముతప్ప నీసౌఖ్యమునకు వేఱుత్రోవ లేదు. దీర్ఘాలోచనఁ జేయుము. నేను నీ కొసంగియున్నగడువింకను మించలేదు. మన మిరువుర మైకమత్యము గలిగియున్నతరువాత నాతల్లి ని న్నేమి చేయఁగల" దనెను.

దేవి బదులుచెప్పక భూమిని జూచుచుండెను. ఇపు డేమి యనిష్టము పలుకునో యని రాజునకు భయం బయ్యెను. నాచేతఁ జిక్కినది నన్ను విడిచి యెచటికిఁ బోవును. నిదానముచేఁ బను లన్నియు సమకూరు నని స్థిరపఱచుకొని, "దేవీ! నీ పడుకటింటిని జూచి రమ్మా. కడచిన పనినిగూర్చి వగవనేటికి? ఇందిరను గూడ పిలుచుకొని పొమ్మని చెప్పి యచటనుండి మెల్లఁగ వెడలిపోయెను. దేవియును "కానిమ్మా. ఇన్నిదినములు కాచిన భగవంతుఁడు లేఁడా? "పదినెలలలోపల రాముఁడు రావణునిఁ జంపి నన్నుఁ బిలిచికొని పోనియెడల నగ్నిప్రవేశంబు గావించెద" నని సీత ప్రతిజ్ఞఁ జేసెను. ఆమె పాతివ్రత్య మహిమవలన నట్లులే జరిగెను. ఆ జగజ్జనని యొకవిధముగాఁ గష్టమనుభవించిన, నే నొకవిధముగాఁ గష్టపడుచున్నాను. అంత్యమువఱకుఁ జూచెద. ఏవిధముచేతను నే నపజయమే పొందినట్లైన, నాగుప్త ఖడ్గమునకు నా దేహ మర్పించెద. దీనికై వగవనేల"? యని ధైర్యము వహించి, "అమ్మా, యిందిరా," యని పిలిచెను. ఇందిరయును నతిశీఘ్రముగా వచ్చి నిలిచెను. ఆమె చేయూఁతఁ గొని లేచి, "నాతల్లీ! నీ హస్తస్పర్శచే నీనిమిషమందు నే నెట్టి యానందమును బొందుచున్నాను! ఈ మదనపాలుఁడు స్వకార్యధురంధరుఁడై నా కీ భాగ్యము నంతయుఁ జూపి మోసపుచ్చుచున్నాఁ డని నే

నెఱింగి యున్నను నా పడుకటింటిఁ జూపెద నని యతఁడు చెప్పఁగనే, నా దుఃఖము నంతయు సహించుకొని యాగదులను జూచుటకై వచ్చితిని. నేను వానిని విడిచి పోయిననాఁటినుండి యిదివఱ కెవరును వానియందుఁ బ్రవేశింప లేదఁట. అచట నా బిడ్డజ్ఞాపకమును గలుగఁజేయువస్తువు లనేకములు గలవు. నా బిడ్డకంటెను నధికముగా నేను గొలువఁదగిన వేఱొకరి పూజ్య వస్తువు లచట దొరకును. ఇందిరా! నేను లోపలికిఁ బోయి యుండునప్పు డితరు లెవ్వరిని వినువకుండ బైటిద్వారమునందుఁ గాచియుండుము. నాతనివి తీర వానిని జూచి పూజించి వచ్చెద. నేను జయించితినా యది శుభాగమ నంబై యుండును. లేదా, యిదియే కడపటిదర్శనముగా నుండనిమ్ము. నాపరీక్షదినములు సమీపించియున్నవి. సమయము దొరకినప్పుడు వానిని జూడకుండ నే నుండఁజాల నని చెప్పుచుఁ జంద్రకాంతశిలానిర్మితంబు లగు మెట్ల నెక్కిపోయి యాగదితలుపుఁ దీసి, యిందిరా! నీవు ముందుగాఁ బోయి యాప్రతిమ యెవరై యుందురో యూహించి చెప్పుము. నే నిచట నుండెద" నని ముందు నిందిర నంపెను. ఇందిర లోపలికిఁ బోయి యచటి వైభవములఁ జూచి భ్రమించెను. అచట జలతారుపనిచేఁ జిత్రవిచిత్రములుగాఁ బువ్వులు తీఁగెలు హంసలు మొదలగువానిని కుట్టినపరదాలు వ్రేలాడుచుండెను. అది చిత్రపట మని యిందిర గ్రహించెను. పటమును జూచి "హా జనకా, యని యొకకూఁత వేసెను. బైట దేవికి వినవచ్చునేమో యనుభయముచే నడంచుకొని "యయ్యో! దైవమా! యిది యేమి రూపు! ఏమిగాంభీర్యము! ఇంతటి రూప మెట్లు మాఱిపోయియున్నది! ఈ మహానుభావునికష్టము పాండవుల కష్టమునకంటె నధికముగా నున్నదే! అతఁడు స్వయముగ జూద మాడి యోడినను తమ్ములతో స్వేచ్ఛగాఁ దిరుగుచుండెను." ఇతఁడు పరు లెవ్వరో చేసినహత్యకుఁ దాను గుఱియై హంతకుఁ డను నపవాదముపాలై పదియాఱేండ్లనుండి యొకచేరహస్యవాసము ననుభవించుచు నవయుచున్నాఁ" డని లోలోనఁ గుందుచు బైటికి వచ్చి "జననీ! మీరు లోపల కరుగుఁ" డని

చెప్పెను." ఇందిరా! నీ విచటఁ గూర్చుండుము. నేఁ బోయెద" నని వెడలి పోయెను. ఇందిరకుఁ బట్టరాని దుఃఖము. "ఆహా! గంధర్వాకారుం డగు నా తండ్రిని బాసి యెట్లు జీవించియున్నదో మిక్కిలి యాశ్చర్యము. ఈమెమాత్రము సామాన్యురాలా? ఇట్టి సమానదాంపత్యము నెడఁబాపినవిధి నే మన వచ్చును! ఓదేవా! ఈ విధముగాఁ జెదరియుండు మమ్ముఁ గాపాడుము. నా తండ్రి నిర్దోషి యనియు, నా తాతను జంపినద్రోహి వీఁ డనియు, నాకుఁ జూపెదవా?" యని చేతులు జోడించుకొని ధ్యానించుచుండఁగ, వెనుకఁ గాళ్ల చప్పుడు వినఁబడ, నిందిర తిరిగి చూచెను. అప్పు డా స్థలమునకు ఫల్గునుఁడు వచ్చియుండెను.

ఫల్గునుఁడు:—అమ్మగారు, రాజబంధువు లందఱు క్రింద నుండఁగ, నేకాంగిగా నెందుల కిచటఁ గూర్చుండి యున్నారు? తమ కేదైనఁ గావలయునా?

ఇందిర:—ఇచట హేమప్రభాదేవిగారు తమగదియందుఁ బ్రవేశించుచు లోపల నెవరిని విడువఁగూడ దని చెప్పి వెడలినారు. కనుక నే నిచటఁ గూర్చుండి యున్నాను. నా కేదియు నక్కఱలేదు. రాజబంధువు లెచట నున్న నా కేమి?

ఫల్గునుఁడు:—"అమ్మా, తప్పు మన్నింపుఁడు. మీ వృత్తాంతము నాకుఁ దెలియ" దనుచు వెడలిపోయి మరల రెండడుగులు తిరిగివచ్చి మిక్కిలి యణఁకువతో "అమ్మా, మీరు కాళీఘట్టమునందలి బానర్జియింటివారా?" యని యడిగెను. ఇందిరయును "కాదు కాదు" అనెను. "అమ్మా, మన్నింపుఁడు. తమపేరు నే నడుగవచ్చునా?" యని యడిగెను.

ఇందిర:—నాపే 'రిందిర' యందురు.

ఫల్గునుఁడు:—అమ్మా, ఈ రాజగృహమునం దుండు చిత్రశాలలోఁ దగిలించియుండు పటములలో నొకరిజాడ తమ కుండుటవలన నడిగితిని.

ఇందిర:—ప్రపంచమం దొకరిపోలికను మఱియొక రుండరా? అది నీకు వింత యని తోఁచిన దేమో? నాకుఁ దెలియదు. అనఁగానే, వాఁడును వెడలిపోయెను. దేవి యాగదియం దరగంటసే పుండెను. ఆమె బైటికి వచ్చినపు డామెముఖము తెల్లఁబాఱి కన్నులెఱ్ఱనై యుండినవి. తనమనోవేదన నడంచుకొనెను. అపుడే మంజువాణి, మాధవి యను చెలికత్తెలు దేవికి నమస్కరించిరి. "అమ్మగా రతిశీఘ్రముగా నిచ్చటికి విచ్చేయుదు రని నమ్మియున్నా" మనిరి.

దేవి:—చేడియలారా! నాభాగ్యము ఫలించినట్లయిన నిచటికి వచ్చుట నా కెంతయు సమ్మతము. నావిధి యెట్లున్నదో యెవ రెఱుంగుదు రని చెప్పి వారికి బహుమతి యొసంగి పంపెను. తాను ప్రాసాదము దిగివచ్చుచుండఁగాఁ ద్రోవలో వాసంతిక యను మఱియొక చెలికత్తెను జూచి గుర్తెఱుంగక ముం దొకయడు గిడునంతలో నది దేవికి నమస్కరించి యేడ్చుచు నిలిచెను.

దేవి:—వాసంతికా! నేను నిన్ను మఱచినను నీవు నన్ను మఱవన ట్లున్నది. నా యదృష్టమునకు వగచువారి నొకరి నైన నే నెఱుంగనే. నీవు మాత్ర మిట్లు దుఃఖించుట నా కాశ్చర్యముగా నున్నది.

వాసంతిక:— రాజ్ఞీ, నో రెత్తి మాటలాడుటకు భయ మగుచున్నది. ఈరాజమాతవలననే కదా యింతయనర్థము జరిగిపోయినది. ఈమెప్రభావము చేతనే కదా ఫల్గునుఁ డింతటివాఁ డైనాఁడు. 'ధర్మమే జయ' మను పెద్దలవాక్కడవి చేరినది యని యింక నేమో చెప్పఁబోవుచుండ, నెవరో వచ్చుటఁ గని యదరిపడి పరుగెత్తెను. దేవి క్రిందికి దిగిపోయి రాజునకును రాజమాతకును జెప్పి తనగృహంబునకుఁ బోవు సమయంబునందు "హేమా! నీచెలి నిచ్చట విడిచిపోయెదవా? దానినింగూడఁ బిలుచుకొని పోయెదవా?" యని రాజమాత యడిగెను.

దేవి—అమ్మా! నేఁడు నాకు శిరోవేదనచే మిగులబడలికఁ జెంది యున్నాను. ఇంకొకవారము నాయొద్ద నుంచుకొని మరల నంపెద నని యామెను సమ్మతింపఁజేసెను.

మేనారుకోటలోనుండు నుద్యానవనము మిగుల మనోహరం బైనది. ఆశృంగారవనంబును నెల కొకతూరి రాజును, రాజమాతయును జూచుట వాడుకగా నుండెను. వాడుకప్రకార మొకనాఁడు రాజబంధువులు తమ్మును చుట్టికొని నడువ నతఃపురమం దుండు దాసీ లందఱు వరుసలు దీరి త్రోవఁ జూపువారివలె ముందు నడవ, రాజును రాజమాతయును వచ్చి వనవినోదముఁ జూచుచు నొకస్థలమందు నిలిచిరి. ఆవనమధ్యమందు చౌకముగా నెత్తైన యరుఁగు కట్టఁబడి యుండెను. దానికి నలుదిశలయందుఁ జంద్రకాంతశిలల సోపానంబు లేర్పఱుపఁబడి యరుఁగుమీఁదఁ గూర్చుండుటకుఁ బ్రత్యేకముగా సోపా లమర్పఁబడియుండెను. అచ్చటచ్చటఁ బూలతోట్లు దేశదేశములనుండి తెప్పించి, పెంపఁబడియున్నవి. వివిధఫలవృక్షపంక్తులు లతాగృహంబుల నిర్మించియున్న శృంగారంబును జూపఱ కాహ్లాదము జనింపఁజేయును. మనకథ జరుగుకాలమందుఁగూడ వనము నందనవనంబునకు సమానం బని ప్రసిద్ధి కెక్కి యుండెను. ఆవన మనోహరత్వముఁ జూచి మదనపాలుఁడు హేమప్రభ యచట లే దని చింతాసాగరమగ్నుఁడై యుండెను. అతనిముఖలక్షణంబుఁ బెఱింగిన రాజమాత "కుమారా! ఈయుద్యానవనమును జూచుటకై హేమ నెందులకుఁ బిలిపింపలే" దనెను.

రాజు—"అమ్మా! హేమకు దేహస్థితి బాగుగ లేదు. మొన్న యిచటనుండి పోవునప్పటికే మిక్కిలి యలసియుండెను. ఇప్పటికి నట్టే బల హీనస్థితిలో నున్నది. లేనియెడల నవశ్యముగ వచ్చియుండునని చెప్పెనే కాని యామెపడుకటింటిలో నుండు చిత్రపటంబులఁ జూచి వ్యసనంబుచే నీరీతి నస్వస్థురా లైన దని చెప్పుటకు సాహసింపఁడయ్యె. ఎందుల కనఁగా నిది వఱకే యావస్తువుల నన్నింటిని నశింపఁజేయవలెనని యామెయాజ్ఞ. అయినను

హేమప్రభను మెప్పించుటకై యామెవస్తువులఁ బోఁగొట్టక యవి యుండునది యైన నామెకుఁ దెలియఁజేయక రక్షించుచుండెను. మఱియుఁ దనకై యామె వచ్చు ననునమ్మకము లేదు.

రాజమాత యంతటఁ దిరిగి రాజు మొదలగువా రచట లతాగృహంబులఁ దాఁటి విహరించుచుండఁగఁ నానాసోపానముల నెక్కి పోయి చివర మెట్టు పై కాలు పెట్టి రాజు వచ్చుచున్నాఁడేమో యని తిరిగి చూచుచుండఁగనే కాలు జాఱి దొర్లుచు వచ్చి క్రిందఁ బడెను. సకియ లందరు పరుగెత్తికొని పోయిరి. రాజు వచ్చునంతలో రాజమాత మూర్ఛఁ జెంది యుండెను. మోకాలు విఱిగినట్టు వ్రేలాడుచుండెను. తలనుండియు మోచేతులనుండియు నెత్తురు కాఱుచుండెను. మదనపాలుఁడు బాలునివలె దిక్కు దోఁపక, 'యమ్మా' యని యేడువ నారంభించెను. అపుడే మేనాలో నామెను పరుండఁబెట్టి అంతఃపురంబునకుఁ దీసికొనిపోయిరి. అపుడే రాజవైద్యులు వచ్చి దెబ్బలు తగిలిన స్థలంబుల కెల్లఁ గట్లు కట్టిరి. మృదుశయ్యయందుఁ బరుండఁ బెట్టిరి. దాసీజను లామెకు విసనకఱ్ఱలను పన్నీటితోఁ దడిపి విసరుచుండిరి. రాజు తనతల్లితలను తనతొడయందు నిడుకొని దుఃఖించుచుండెను. అంతలో మెల్లమెల్లఁగాఁ గనులు విచ్చి "ప్రియకుమారా! దుఃఖింపకుము" దైవకృపవల్ల బ్రతికితిని. అయ్యో! నే నేమి చెప్పుదును. పైనుండి నన్నెవరో క్రింది కీడ్చినట్టాయెను. నాయొడ లెఱుంగక క్రిందఁ బడిపోయితిని. శరీరమాద్యంతము మిగుల నొప్పుచున్నది. నా మోఁకాలు విఱిగిపోయినట్టే యున్నది. తక్కినదెబ్బ లంత ప్రమాదకరంబులు గావని తోఁచుచున్నది. రాజ్యకార్యము లతిజాగ్రత్తగాఁ జూచుకొమ్ము. నా కిట్టిసమయమం దెందర నాప్రక్క నుంచిన నామనస్సు నెమ్మదిగా నుండు ననెను. "రాజ్యకార్యము లతిజాగరూకతతోఁ జూచుకొ" మ్మనెను.

రాజు:—"అమ్మా, నీవు దేనికిని వ్యసనపడవలదు. నీయాజ్ఞప్రకారము జూచెద." నని చెప్పి వెడలిపోయెను. బైటికి వచ్చి ఫల్గుననిఁ బిలిచెను. వచ్చి "దేవా! యమ్మగారి కెట్లున్నది?" యని యడిగెను.

రాజు:—ఫల్గునా! నేను మిగుల దిగులు చెందితిని. మూర్ఛ తేఱినది. అమ్మ, యిపుడు మాటలాడుచున్నారు. కాలు విఱిగియున్న దని తోఁచుచున్నది. ఇవట మాయమ్మదేహస్థితి యిట్లున్నది. అచ్చట, హేమప్రభ యివటనుండి పోయినది మొదలు అనారోగ్యముగా నున్నది. ఇట్టి సమయమందామెమన సెఱింగి సేవ చేయునది యిందిర యొకతె. ఇపు డా చిన్నదాని నమ్మగారు తనయొద్ద సేవచేయుట కుంపు మని చెప్పుచున్నది. ఆ చిన్నదాని మీఁద నమ్మగారి కేమోసందేహము. ఈమె యనుమానము పిచ్చుకమీఁద బ్రహ్మాస్త్రము ప్రయోగించినట్లున్నది. పనికిమాలినచిన్నది మనల నేమిచేయఁగలదు?

ఫల్గునుఁడు:— రాజేంద్రా, గ్రుడ్డు పోయి పిల్లను వెక్కిరించిన ట్లున్నది మీమాట. అమ్మగారికి తెలియని దేమున్నది? మీతల్లిగారికి మాత్రమే కాదు. నాకును నాపిల్లమీఁద నెంతయో సందేహము. మన మిపు డుదాసీనముగా నున్నఁ బ్రమాదము సంభవించిన నాఁపువా రెవరు? అందువలన మీరు తామసింపక నాపిల్లను దెచ్చి యమ్మగారివశమందు విడుచుట మన కందఱకును శ్రేయస్కరము. మేము తలంచినట్లు కాకయున్న నా చిన్నది మావలన మిక్కిలిసుఖం బొందును. లేకయున్న దాని గ్రహచారముకొలఁది నది యనుభవించును. అందువలన మీకుఁ గలిగిన నష్ట మేమి? ఎపుడో పెండ్లి చేసికొనఁబోవు రాణికై మీ కొఱకు జీవించియున్న తల్లిని దిరస్కరించుట ధర్మమా?" యని బోధించెను.

మదనపాలుఁ డెపుడును జెప్పుడుమాటలు వినువాఁడు. అపుడు తానే పోయి దేవిదేహస్థితిని విచారించి యటులే యిందిరను బిలుచుకొనివచ్చుటకై వెడలెను.

---

# త్రయోదశాఽధ్యాయము



ఉదయపూరురాజగృహమునకుఁ బోయివచ్చినతరువాత హేమప్రభా దేవియొక్క దేహస్థితి కడు శోచనీయముగా నుండెను. ఇందిర చేయుహిత బోధచేతను నామెయుపచారముచేతను గొంచెము నెమ్మది కలుగుచుండినది. ఆదినము నిత్యకృత్యములం దీర్చికొని దేవి తోఁటలో నొక యరుఁగుమీఁదఁ గూర్చుండి యుండెను. ఆమె యచటఁ దనచుట్టు నున్నపూలచెట్ల సౌందర్యము జూచుచుండెనా? లేదు. నేఁడామె యేదియో యాలోచించు చుండెను. అట్టిసమయమునందు మదనపాలుఁడు దేవియెదుట నిల్చెను. ఆమె యతనిని గమనింపలేదు. "దేవీ, నీ వింకను ననారోగ్యముగా నున్నావని భయపడియుంటిని. అట్లు లేక యారోగ్యముగా నుండుటఁ జూచి సంత సించితిని.

దేవి దిగ్గున లేచి "రాజా, ర"మ్మని కూర్చుండ వేఁడెను. "మదనా! నే నేమో యాలోచించు చుంటిని, నీ వన్నది వినలేదు. ఏ మంటివి?"

రాజు—దేవీ, 'నీవు రాజప్రాసాదమునుండి వచ్చిననాఁటనుండి యనా రోగ్యముగా నున్నావని యెంచియుంటిని. అట్లు లేక సుఖముగా నుండుటఁ జూచి తృప్తిఁజెందితి' నని చెప్పితిని.

దేవి—రాజా! నాయారోగ్యమున కేమి? మీతల్లిగారు క్రిందఁ బడి మిక్కిలి యపాయస్థితిలో నున్నారని వింటిని. దానినిగుఱించి మీకు మిగుల వ్యసనము కలిగి యుండవచ్చును. చేయునదేమి? వచ్చినకష్టముల ననుభవించి తీఱవలయు. దైవకటాక్షమువలనఁ ద్వరలో గుణ మగును. చింతింపకుము.

రాజు—దేవీ! నీదయ యుండిన నా కేయాపదలు రావని నానమ్మకము. నీ వెపుడు నన్ననుగ్రహించెదవో యపుడే నాకు సుఖము. అదివఱకు

నింద్రపదవి లభించినను నాకుఁ దృప్తిలేదు. అది యట్లుండనిమ్ము. ఇట్టి సమయమునందు నాతల్లి కుపచారంబులు సేయుటకు నీ యిందిర నవశ్యముగా నాతల్లి పంపఁ గోరినది.

దేవి—రాజా! అవశ్యమంపెదను. నేను నీ కొకమాటఁ జెప్పవలయునని యున్నాను. అది యేమి యనెదవా? నీవు మిగుల గుణవంతుఁడవు. ఓపికగలవాఁడవు. పాలయందు విషముఁ జేర్చినట్లు దుష్టసహవాసమువలన మానవునిగుణము మాఱుచుండు నని యెఱుంగుము. నీవును వీరక్షత్రియవంశమందు జనించినవాఁడవే. మొదట రాజ్యము లేకపోయినను, దైవాధీనమున నదియును బ్రాప్తించి యున్నది. నీ వేదియో యొకతలంపు మనస్సునం దుంచుకొని వ్యథ పడుచున్నావు. నేను దిక్కు లేని దానను. నాయన్న కూఁతును బెంచి ప్రొద్దుపోగొట్టుకొను చుంటిని. ఆచిన్నది మిగులఁ జక్కనిది. నీవు సత్పురుషుఁడ వని నామనస్సునకుఁ దోఁచినప్పటినుండి యాచిన్నదానిని నీకు వివాహం బొనరింప వలయునని తలంచి యుంటిని. కొన్నిదినములక్రిందట నది నీ కిష్టము లేనట్టు తెలియఁజేసితివి. నీ విపుడు వేఱుమార్గమును ద్రొక్కి యున్నాఁడవు. విమల నిన్నుఁ బ్రేమించి యున్నదో లేదో నే నెఱుంగను. అది యెట్లుండినను దాను కొన్నిదినములు తల్లియొద్ద నుండవలె నని చెప్పి వెడలిపోయినది. ఆచిన్నది యుండినవిధముఁ జూడఁగా దాని మనస్సునకు వ్యథ కలిగియున్న దని నే నూహించితిని. అది యెటులైనను, అట్టి వీరక్షత్రియునిభార్య యైననేను వేఱుమార్గమందుఁ బ్రవేశించుట కెంతయో యాలోచనఁ జేయవలయును. నీమనోగతంబు నే నెఱుంగనా! పలుమాఱు చెప్పిన దానినే చెప్పుచున్నావు. ఏదియో నీ వొకగడువు పెట్టుకొని యున్నావే, అంతవఱకు నోపికతో నుండుము. కాల మన్నిటిని సమకూర్చును.

రాజా—దేవీ! నీచేత గుణవంతుఁడ ననిపించుకొనుట నాభాగ్యమే. ఇఁక నే నామాట నాగడువు తీఱువఱకు నెత్తియే యుండను. నీవు మాయంతఃపురమునకు వచ్చినది చూచిన బంధువు లందఱు మనవివాహము నిశ్చితమైన

దని నమ్మిరి. నాయాప్తస్నేహితులు నన్నడిగినందువలన మరల నీకు జ్ఞాపక ఘటించితిని. దేవీ కోపింపకుము. నిన్ను నొప్పింపవలెనని కలలోనైనఁ దలంప లేదు. అది నీ వెఱింగిన విషయమే. అయినను నీ మనస్సునందలి సందేహము పోఁగొట్టుటకై చెప్పుచున్నాను. నీ భర్త వీరక్షత్రియుఁడైనచో నిజమై వట్టైన నిందాకరం బగు నిట్టి కార్యంబుఁ జేయునా? నీ యంతటియుత్తమ స్త్రీ చేత 'భర్త' యనిపించుకొనుట కతఁ డెట్లర్హుఁ డగును? ఇది యంతయు నే నాలోచించియేకదా పునర్వివాహముఁ జేసికొనుటకు శాస్త్రములు సమ్మతించియున్నవని పెద్దలవలన విని నా తల్లి యనుమతిని బొంది యాసమాచారము నీకుఁ జెప్పితిని? ఈ విషయమందు నా తప్పేమున్నది?

దేవిదేహ మాద్యంతముఁ జెమ్మటించెను. తల తిరుగుట కారంభించెను. రాణి యపుడు తనగుప్తఖడ్గమును దీసి లంఘించి మదనపాలునిఁ జంప నిశ్చయించి తననడుమునందు చేయి వైచెను. అప్పుడెచటనుండియో 'యోపిక యోపిక' యను శబ్దము వినవచ్చెను. ఆక్షణమందే దేవికిఁ గోపము చల్లారెను. తన ప్రసన్నముఖమును గనఁబఱచి, యొక చిఱునవ్వు నవ్వి "రాజా, నీకు నామీఁదఁ గలిగియున్నదయకు సంతసించెద. మహనీయుఁడగు నారాజసింహుని సద్గుణంబుల వర్ణించుటకు నీవును నేనును నెంతటివారము? నీ వపుడు పసివాఁడవు. నేను పసిదాననైనను, నా మహామహుని భార్య ననిపించుకొనినదానివలన నతని సమీపమునుండి యాఘనుని సద్గుణములఁ గనుపెట్టుటకు సమయంబు దొరకెను. ఒకొక్కనాఁడు నీతల్లి యాతనిపట్లఁ జేయుకుట్రలఁ గని యతని తండ్రిగారు కొడుకుతోఁ జెప్పఁగాఁ జేతు లొగ్గి 'తండ్రీ, యెవరో నాతల్లికిఁ గానివా రిట్లు కపటోపాయములఁ బన్ని యామెమీఁద నపవాదము మోపియుందురు. జనకా! తల్లిని క్షమింపుఁడని తండ్రిని వేఁడును. అట్టి తపస్విమీఁద నా యిట్టి యపఖ్యాతి! నాకు సామర్థ్య మున్నచో నతఁడు నిరపరాధి యని నిరూపించియుందును. అప్పు డేమి చేయుటకుఁ దోఁపక మిన్నకుంటిని. ఇపు డాయన ప్రపంచమున నుండు

వదే తెలియలేదు. నా బిడ్డను గూడఁ బోఁగొట్టుకొంటిని. చుక్కానిప్రయత్నంబు లేక గాలిచేఁ గొట్టుకొనిపోవుచున్న నావవలె నేను బ్రతికి కాలము గడపుచున్నాను. నే నేమి విలపించినను నీయెదుటనే కదా! నీ వైనను నతఁడు నిరపరాధి యని లోకులకు విశదీకరింపుము. దీనివలన నతనియాత్మ తృప్తిఁ జెందునుగాక. ఆ ప్రయత్నమునకై నాద్రవ్య మంతయు నీ కప్పగించెద.

హేమప్రభ చెప్పుచున్న ప్రత్యుత్తరమును శ్రద్ధగా వినుచున్న మదనపాలుఁడు మిక్కిలి కలఁతఁ జెందెను. "రాణి చెప్పునది తప్పు గాదు. అయినను రాజును జంపిన దెవఁడు? ఇది యొకవేళఁ దనతల్లి కుతంత్రమై యుండునా? ఛీ! ఛీ! భాగ్య భర్తను జంపించుటయా? అ దెన్నఁటికిని నుండదు. ఒకవేళ నామె స్వైరిణిగా నున్నదా? లేనే లేదు. నా విషయము నేమియు నెఱుఁగదు. రా జెట్లు చచ్చెను? ఈ యాలోచన లన్నియు మదనపాలుని ముంచివైచినవి. ఒకసమయమందుఁ దన సేవకుఁ డగు ఫల్గునుఁడు చేసియున్న నేమి చేయవచ్చును? చిన్నతనమునుండి యుఁ దన్నెత్తికొని సేవఁ జేసినవానిని గాపాడవలదా! జరిగిన దేమో జరిగిపోయినది. ఎటులో తాను రాజాయెను, నయముచేతనో భయముచేతనో రాణిని వశముఁ జేసికొనుట ముఖ్యమైనపని. ఇంతలో నామెను తొందరచేసినది తప్పని తలంచెను. పోయినవాని విషయమును పలుమాఱు తాను ప్రస్తావించునది ధర్మము కాదని యెంచి, "దేవీ! మన్నింపుము. కడచినదానికి వగవ నేల? వివాహము జరిగినపిమ్మట నీయిష్టము ప్రకార మపరాధిని బరీక్షించి వెదకి, రాజ్యమందుఁ బ్రకటింతము. వ్యర్థముగా నిట్టి యాలోచనలచే నీదేహము చెఱుపుకొనవలదు. నేను బోయి వచ్చెదను. నీసఖిని శీఘ్రముగాఁ బంపుమో"మని చెప్పి వెడలిపోయెను.

ఇందిరకు బదులుగా రాణియంతఃపురమందు వచ్చియున్న లీల యెటువంటి నది సందర్భము గలిగినప్పు డెంతయు నిందిరవలన దేవి కనుమానము గలుగ

నట్లు బోధించుటకు తనశక్తిపంచన లేక పోరాడుచుండును. తప్పు దొరకినది గాదు. ఇందిర యేదియో యాలోచించుచుండ, 'ఇందిరా' యని పిలిచెను.

ఇందిర—దేవీ, యెందులకుఁ బిలిచితిరో?

రాణి—ఇందిరా, నీ వింత చింతాక్రాంతురాల వై యుండుట నే నెన్నఁడును జూచియుండలేదు. నేఁ డెందులకో నీవు దుఃఖముతో నున్నట్లున్నది. నీ దుఃఖకారణంబును జెప్పి నామనోవ్యథను బోఁగొట్టుము.

ఇందిర:—జననీ, మీరు నాయం దుంచిన యవ్యాజ కరుణయొక్క మహిమ నాకుఁ దెలియును. దానికి నాదేహ మర్పించినను సాటి కానేరదు. తా మిపుడు రాజుగారితోఁ జెప్పుచున్న విషయమును విని, తమకు నాకార్యమును సాధించి యిచ్చుటకు మార్గంబును వెదకుచుఁ జింతించు చుంటిని. ఆ యంతఃపురంబున దానికి వలయుసాధనంబులు దొరకును. మీరు ధైర్యంబుఁ బూని నన్నచటి కంపుఁడు.

దేవి:—ఇందిరా, యీ విషయమందు నీవు మిక్కిలి జాగరూకురాలవై యుండవలయు. లేకున్న నీప్రాణమునకే వారు హానిఁ గలుగఁజేయుదురు. క్రూరురా అను నామురళి యొకతె చాలును. ఎందఱు లోకకంటకు లగు దుర్మంత్రు లామెయాజ్ఞచేఁ బనులఁ జేయుచున్నారో, నా కెట్లు దెలియును? నాప్రియ మైన యిందిరా, నిన్నచటికిఁ బంపితీఱవలయును. ఇందిరా! మఱి యొకమాట మఱచితిని. లలితకుమారుఁడు రత్నదీవిలో మీ గృహమం దుండు నపుడు నీ విషయమునం దతఁ డెట్లు నడచుకొనెను?

ఇందిర:—ప్రియజననీ, తమరే సాక్షాన్మాత యని భావించి యున్న నాకు మీతోఁ జెప్పని రహస్య మున్నదా? అతని నేను ప్రేమించితిని. వారును నన్నుఁ బ్రేమించియున్నారు. అయిన లోకమహాకార్యము మా యిరువురవివాహంబునకు విఘ్నకారియై యేర్పడియున్నది. అది నెఱవేఱిన మాకు వివాహంబు కాఁగలదు. లేనిచో లేదు. వారును నన్నుఁ జూచి మాటలాడి

నాకు వలయుసహాయము చేయుదు నని చెప్పిరి. వారిసహాయము కావలసి యున్నఁ జెప్పెద నని చెప్పితిని గాని కార్యమిట్టి దని వారి కింకను దెలియదు.

దేవి:—ఇందిరా! రత్నదీవిలో నున్న నీ కిచట సాధింపఁ దగినకార్య మెట్టిది? ఇపు డాయంతఃపురంబునకుఁ బోయి నా కార్యమును సాధించెద నని యంటివే, నా కార్యము సాధించినచో నది నీకును ఫలయుక్తం బగునా?- లేక యా రెండుకార్యంబులు ప్రత్యేకంబులా? అని నాతోఁ జెప్పఁగూడదా?

ఇందిర:—రాజ్ఞీ, యని యేవి రైనను నోరు దెఱచి మాటలాడుటకు నాకు గురువునాజ్ఞ లేదు. అందువలనఁగదా నే నేదియుఁ జెప్పకుండునది.

దేవి:—నీగురు వెవరు?

ఇందిర:—నా తండ్రి.

దేవి:—ఇందిరా, యాలాగా? సుపుత్రి వగు నీవలన నీతండ్రి సుఖ మను భవించుఁగాక! ఈ కార్యము నీతండ్రికిఁగూడ చేరియున్నట్టే భావింపవలయును. అటులైన నీకార్య మేదియో కొన్నిదినములలో నే నే నూహించి చెప్పెద. నీవే నాపుత్త్రివని యిపుడే చెప్పవచ్చును. కార్యంబు నెఱవేఱువఱకు నిదానిం చుటయే మంచిది యని లేచి యాబిడ నాలింగనంబొనర్చి ముద్దిడికొని బైటికిఁ బోయెను. ఇందిర తనతల్లి సుఖస్పర్శవలనఁ జైతన్యము లేనిదానివలె మిన్నక యుండెను. అయ్యో! నాజనయిత్రి నన్ను గుర్తించెను. నా దేహావువర్ణ మునఁ గొంచె మనుమాన మున్నది. అటులే కొన్నిదినము లుండెదని మ్మనుకొ నుచు బైటికి వచ్చెను.

ఇందిర బైటికి వచ్చునప్పటికి నెవరెవరో రాజస్త్రీ లందఱు వచ్చి రాణియొద్ద మాటలాడుచుండిరి. ఇందిరయును వారి కెదుట నున్న హాలును బ్రవేశించి యచట నొకబల్లమీఁదఁ గూర్చుండి కిటికీలద్వారమున యా స్త్రీలసంభాషణను వినుచు నచట నేకాంతముగఁ గూర్చుండెను. లీల కపుడు వందఱమీఁదఁ దప్పు మోపుటయే గొప్పపని. కనుక నిందిరను వెదకుచువచ్చి

కోలుతం దొంటరిగాఁ గూర్చుండియుండునది చూచి వెఱఁగందెను. "ఇందిరా, యేల యిచట నొంటరిగాఁ గూర్చుండియున్నావు? వారి నందఱను జూచుచు నచటనే యుండరాదా?

ఇందిర:—ఇచటఁ గూర్చుండి చూచుచుటయే నాకిష్టముగా నున్నది. గొప్పవారు మాటలాడునపు డేల పోయి వారియెదుట నిలువ వలెను?

లీల:—ఇట్లు నక్కవలెఁ గూర్చుండి పొంచిచూచుచు, వారినడతలను గమనించి తప్పులఁ గనుపెట్టు లక్షణము గాదా!

ఇందిర—లీలా, నీ వెంతవెఱ్ఱిదానవు. వా రెంతగొప్పవారు. వారితప్పులఁగనుపెట్టుటకు నే నెంతటిదానను? ఒకవేళ వారియం దేమితప్పులు కనుపెట్టవచ్చును? నీ వన్నట్లు వారిచెడ్డనడతలు కనుపెట్టితి ననుకొనుము. వారిని నే నేమి చేయఁగలను? అట్టితెరులను నిందించుట పాపము గాదా? ఎందుల కిట్లబద్ధపు మాట లాడెదవు?

లీల—నీవు పాప మనునదే యెఱుఁగక స్వర్గమునుండి దిగివచ్చిన దేవకన్యకవా? రత్నదీవినుండి యింతచిన్నవయస్సునందుఁ దండ్రిని విడిచి యొంటరిగా వచ్చితివే? ఎంతసాహసము లేనిదే యింతపని చేసినావు? ఇచట నా కెవరును లే రంటివే, యది నిజమా?

ఇందిర—లీలా, నిన్ను నీవే మఱచి మాటలాడుచున్నావు. ఇది నీకుఁ దగదు. నే నొకపాప మెఱుంగను. నీ కెందులకు నామీఁద నింతక్రోధము?

లీల—అవును. నిన్నుఁ జూచినట్లైన నీ వేదియో ద్రోహబుద్ధి గలిగి రాణిని సేవించుచున్నా వని తోఁచుచున్నది. ఎల్లప్పుడు నామెకు నొక యాపదయును రానీక మేము కాచియున్నా మనునది తెలిసికొనుము.

ఇందిర:—లీలా, యిచట మీరాణి నతిజాగ్రతగాఁ గాచికొని యుండుము. నే నిప్పుడు రాజమాతసమీపంబునకుఁ బోవుచున్నాను. అచట నే నేమైనఁ దెలుపుఁ జేసినట్టయిన నిచటనుండి యామె నెట్లు కాపాడుదువు! ఈ రెండంతఃపురంబుల రక్షించుభారము నీతలమీఁదనే పడినట్లున్నది.

నీల:— ఆహా! "వగలమారివంకాయ సెగలేక యుడికె" నన్నట్లు నీ వగలమారితనంబు రాజమాతదగ్గఱఁ గిట్టదు. జాగ్రత్తగా మెలఁగుము. ఆమె నేమని తలఁచియున్నావు? నీయం దావగింజంత యేదైన ద్రోహబుద్ధి కనఁగొన్న, నీ వీలోకమం దుండవు. చిత్రవధపా లయ్యెదవు!

ఇందిర:— ఇది యేమి నాగ్రహచారము! అమ్మా, యిపుడు నీదగ్గఱఁ దిట్లు తినవలసిన యవసర మేమియుఁ గనఁబడలేదు. నేనపరాధము చేసిననాఁటికి వా రట్లే చేయుదురుగాక. క్షమింపు" మని చెప్పి యచటినుండి వెడలి యేటియొరగాఁ బోయి యచట కొండలసందులలోఁ గూర్చుండి యాయలలనే చూచుచుఁ బొంగివచ్చుచున్న దుఃఖము నాఁపుకొని కన్నీరు గార్చుచుండెను. ప్రొద్దు గ్రుంకెను. ఇందిరకుఁ దెలియలేదు. చల్లనిగాలి వీవ నారంభించెను. రెండుబండలసందులోఁ గూర్చుండి యున్న యిందిరసమీపమున నెవరో మాటలాడుశబ్దము వినవచ్చెను. చీఁకటి క్రమ్మియుండుటవలన నామె నెవరును జూడలేదు.

ఫల్గునుఁడు:— నీలవేణీ, మనవివాహమునుగూర్చి నీ వేమైనను నిశ్చయించుకొన్నావా?

నీల:— నే నేమియు దానినిగూర్చి యాలోచించుకొనలేదు. నీవు కోపించుకొనవలదు. నీవు క్రూరచిత్తుఁడ వని నే నెంచియున్నాను. నీ వంతఃపురమం దుండుసేవకులమీఁదఁ జూపునధికార మతిక్రూరము. నీవును వారివలె నొకసేవకుఁడవే కదా? అయినను నీ కంతటియహంకార మెందులకు? మఱియును నీవు దరిద్రుఁడవు. నిన్నుఁ బెండ్లాడిన నేమిసుఖము? ఇప్పుడైన మహాసాధ్వి యగుహేమప్రభాదేవిని గొలుచుచు సుఖముగా నున్నాను. అచటఁ బని చేసి కడుపునిండఁ గూడైనఁ దినక నిన్నుఁ గట్టుకొన్నదానికి నాకు లేక నీకుఁబెట్టువదియుంగాక నీయొద్దఁ దిట్లు కొట్లు తినుట మేలా? "దోవలోఁ బోవుశనేశ్వరమా ఇంటిదాఁక వచ్చిపొమ్మనట్లు" లేనిపీడను దెచ్చిపెట్టుకొననేల యని యూరకయున్నాను.

ఫల్గునుఁడు నవ్వి "యోసీ పిచ్చిదానా, యింతేనా నీ తెలివి! నేను రాజుదగ్గఱఁ బనికిమాలిన సేవకుఁ డనియా యెంచియున్నావు? నేను రాజుకు సమానస్థానమం దున్నానని యెఱుంగుము. అట్లు లేనియెడల సామంత రాజు లందఱు నన్నుఁ జూచి వణకుదురా? ఇట్లు నే నిట్టిపదవికి వచ్చి యుండుట యొకరహస్యము. నీవు నాభార్య వైనపిమ్మట నావిషయము నీ కెఱింగించెద. నా కపరిమితధన మున్నది. రాజు హేమప్రభను పెండ్లి యాడినవెంటనే నేను నిన్నుఁ బిలుచుకొని గుజరాతునకుఁ బోయి యచట నొక గొప్పభవనంబును గొని యొకజమీందారునివలెఁ గదా యుందును. నీవు జమీందారిణి వగుట యనిష్టమా?

నీలవేణి:—ఫల్గునా! ఎచటనైన దొంగిలింపకయే నీవు చెప్పునంతటి ద్రవ్యము మనబోఁటివారికి దొరకదు. దొంగసొమ్ము ననుభవించుచు నే నొక గొప్పవాఁడ ననుకొనుటయు నొకగౌరవమా? అంతసొత్తు నీకు దక్కినకాల మునకుఁ జూచుకొందము. హేమప్రభ రాజును పెండ్లాడుట ధర్మమా? ఆమె కిదివఱకే పెండ్లియై యుండలేదా?

ఫల్గునుఁడు:—ఓసీ! వెఱ్ఱిపీనుఁగా! నీ వాధర్మమును జెప్పలేదని యామె కాచియున్నదా? ఇట్లే యామెయెదుటఁ జెప్పుచున్నావా? యేమి?

నీల:—అవి యన్నియు నాకుఁ దెలియదు. ఆమెయెదుట నిట్టిమాట లాడుటకు నాకు ధైర్యమా? ఆమె యెల్లపుడు శాస్త్రములు చదువుచు నేమేమియో పుస్తకములయందు వెదకుచుండఁగ, నేను విలోచన నడిగితిని. పునర్వివాహముఁ జేసికొనుట శాస్త్రమం దున్నదా? యని వెదకుచున్నది యనెను.

ఫల్గునుఁడు:—సరే మనరొట్టె విఱిగి నేతిలోఁ బడినట్టే. ఇట్టి సమాచారములు నీ వేమియు దేవియెద్దుట మాటలాడకుము. నీవు మిక్కిలి యమాయకురాలవు. నిన్నెప్పటికిని నేను మోసపుచ్చను. మఱచితి. నీలా! మీ దేవి

దగ్గఱ నొకక్రొత్తచిన్నది వచ్చియున్నదే, దాని యుదంతము నీ కేమైనఁ దెలి
యునా?

ఈమాట విన్నయిందిర నిలువున నీఱయ్యెను. బండతో బండగా
నక్కియుండెను.

నీల:—ఆమెది రత్నదీవియఁట. చక్కఁగాఁ జదువుకొన్నది. నల్ల
రూపమందు మిగుల నందకత్తె, గుణవతి. ఒకరిప్రస్తాపన రెత్తదు. రాణి
పిలిచినట్టయినఁ బోవునే కాని యనవసరముగఁ బోదు. ఆమెతండ్రి వచ్చి
యామెను బిలుచుకొనిపోవునఁట. ఎందులకో లీలకు నిందిర యన్నఁ గిట్టదు.
లీల మిగులగయ్యాళి. ఎవరిని జూచినను దానికి సందేహమే.

ఫల్గునుఁడు:—ఆమె రాజమాతసన్నిధానంబునకుఁ బోవునఁట, యది
నిజమేనా?

నీల:—అది నీ కెట్లు తెలియును?

ఫల్గునుఁడు:—నీలా! నీ వీప్రపంచమునకుఁ దగినదానవు కావు.
ఇట్లుండుటయు మంచిదే. నీలా! ఈఫల్గునుఁడు సర్వజ్ఞుఁడు. వీనికిఁ దెలి
యక యొకపిట్టకూడఁ గదలదు. ఆయిందిర నన్నెట్లు తప్పించుకొని పోఁగ
లదు? చీఁకటి యెక్కువ యగుచున్నది. పోదము రమ్ము" అని దానిని ముం
దుగవిడిచి తాను వెనుకఁ బోయెను. ఇందిర యింకను గదలలేదు. దూర
ముగా వారిరువురి మాటలు వినవచ్చుచుండెను. అపుడిందిర ధైర్యముగాఁ బైకి
లేచి యింటికి వచ్చెను. పండుకొన్న నిద్రపట్టలేదు. దైవమా, నీ చిత్రమే
చిత్రము! మదీయకార్యపరీక్షకుఁ ద్రోవ నేఁ డారంభించెను. వాఁడు ఫల్గు
నుఁడు. వానిసంభాషణలో నెంతయర్థ మున్నది! వీఁడే గొప్పయపరాధి
యని తోఁచుచున్నది. నీలవేణి వీనిని వరించియుండునా? దానిమాటలను
బట్టి చూడఁగా వానిమీఁదఁ బ్రేమ లేదని తోఁచుచున్నది. ఏపుట్టయం
దెట్టిపా మున్నదో యెవ రెఱుంగుదురు?"రని చింతించుచు నిద్రించెను.

మఱునాఁ డంచెవాఁడు జాబు లన్నియుఁ దెచ్చి విలోచనచేతి కిచ్చెను. అది దెచ్చి యిందిర చేతి కిచ్చెను. ఇందిర విశ్రామశాలలోఁ గూర్చున్న దేవి కిచ్చి యామె యాజ్ఞమేరకు నన్నిజాబులఁ దీసి యామె కిచ్చి యం దొక జాబును దీసి, "అమ్మా, యిది నా తండ్రిజాబు. తీసికొందునా?" యని యడుగ, "ఇందిరా, నీతండ్రిజాబును నీవు దీసికొనుటకు నాయభ్యంతర మేమి?" యని దేవి చెప్పెను. ఇందిర యాజాబును దీసి చదువుకొని, అమ్మా! నాతండ్రి కాశీపట్టణమునకుఁ గొన్నిదినములలో రాఁబోయెదరు. పిమ్మట నిచ టికి వచ్చెదరఁట.

రాణి:—ఇందిరా, మిగులసంతోషము. నేఁడు మదనపాలుఁడు నా యల్లునితో నిచటికివచ్చునఁట. నీవు నిలిచి వంటలు మిగులశ్రద్ధగాఁ జేయింపుము.

ఇందిర:—జననీ, మీయల్లుఁ డెవరు?

రాణి:—ఇందిరా! నీవు నాపుత్రివైన లలితకుమారుఁడు నాయల్లుఁడు కాఁ డందువా?

ఇందిర:—దేవీ, మీరు రహస్యమును రక్షింపవలదా? ఎవరైన విన్నచో నాగతి యే మగును?

దేవి:—ఇందిరా! మఱచితిని. నే నల్పసంతుష్టురాలను. నా కీయాపద కలిగినపిమ్మట నా దేహస్థితి మిగుల మాఱిపోయెను. కొంచెము దుఃఖముగాని యాశ్చర్యముగాని కలిగిన నిమిషమందే యొడ లెఱుంగక పడిపోదును. మీరు మాటలాడుమాట లన్నియు వినుచుందునే కాని మరలఁ బ్రత్యుత్తరం బిచ్చు టకు శక్తి యుండదు. చాలసే పైనతరువాత స్మృతి గలుగును.

ఇందిర:—జననీ, వీరక్షత్రియకులమందు జన్మించి, వీరపత్ని యని పించుకొని, వీరమాత వగు మీ కిట్టి మనోబలహీనత యుండఁదగునా? తమ మనోబలముచేత దానిని బోఁగొట్టుటకు శక్యముగాదా? తల్లీ! మీకు నేను జెప్పునంతటిదాననా?

దేవి:—ఇందిరా! ధైర్యముతో నుండఁబట్టియే యిన్నికష్టముల నోర్చి యుండుట. నే నబలనే కదా? నాకు సుఖము గలుగుచున్న దను ధైర్యమే లేదు. ఈ పదియాఱు సంవత్సరంబులనుండి యెవరు నానువన్నవను ధైర్యముఁ జెప్పినారు? ఇంతకాలమున కిపుడు నీనోటనుండి నాభర్తవృత్తాంతమును గూర్చినముచ్చట వినుచున్నాను. ఇన్ని దినములు నాభర్త జీవించియున్నారని నా యత్తగారు నాకలలోఁ జెప్పుచుండిరి. కలలోనిమాటల నమ్మి కోటలఁ గట్టుచుంటిని. నీవలనఁ గల కల్ల గాదు. నా నాథుఁడు జీవించియున్నాఁ డను ధైర్యము కొంచెము గలిగియున్నది. ఇంతలో వీరక్షత్రియత్వము నెటులు చూపుట? పాండవులు వీరక్షత్రియులై యేమి చేయఁ గలిగియుండిరి? వారు పండ్రెండు సంవత్సరములు వనమం దుండిరి. వారి నెవరు దండించువారు? వారి కజ్ఞాతవాసముగూడ నొకసంవత్సరంబే కద. నాభర్త కటులు గాదే? పదియాఱేండ్లనుండి యొకటే యజ్ఞాతవాసము! బైటికిఁ దలఁ జూపిన, నీచపుఁజావునకు లోఁబడవలసినదే కద? రాజ్యమునుండి వెడలఁగొట్టి యతనిని స్వేచ్ఛగా విడిచియున్న నా కిందుల కింతటిచింత! అపు డతఁడు లేనియీశ్మశానసదృశం బగుగృహమం దుందునా? ఆ నిముసమందే యతనివెంబడిఁ గానల కేగి యతనిసేవ యొనరించుచుండనా? నా దురదృష్ట మట్లు లేదే! అందులకై వగచి వగచి యీగతిఁ జెందితిని. ఇఁక ముందేమి జరగనున్నదో యదియును జూచెద.

రాత్రిభోజనమున కంతయు సిద్ధమాయెను. రాజు లలితకుమారుఁడు రాజబంధువులు వచ్చి చేరిరి. లలితుఁడు దేవికి నమస్కరించి, పుష్పంబుల నర్పించెను. దేవి వానిలోఁ గొన్నిటిని శిరమున ధరించి తక్కినవి యిందిర కిచ్చెను. అపు డాభవనమునం దందఱు దేవిచుట్టును గూర్చుండి నానావిధ గోష్ఠులు పలుకుచుండిరి.

దేవి—రాజేంద్రా, మీతల్లి గారికి దేహస్థితి యెటు లున్నది? జ్వరము నిలిచెనా?

రాజు—దేవీ, బాధ తగ్గలేదు. నొప్పు లధికము. నాతల్లి జ్వరముచేత మిగుల బాధపడుచున్నది. నీ వింకను నిందిరను బంపలేదు. రే పామెను ముఖ్యముగాఁ బంపు మని నాతల్లి చెప్పెను.

దేవి—రాజా, అటులే పంపెదను. నే నచటనుండి వచ్చినప్పటినుండియు నస్వస్థురాలనై యుంటిని. నేఁడే మీరందఱు వచ్చుటఁ దెలిసి లేచితిని. ఆముచ్చటనుండి వేఱువేఱువిషయములఁగూర్చి మాటల కారంభ మాయెను. వీ రిట్లుండఁగా నిందిరయును పవనవిహారంబునకై బైటఁ జనియెను. తన కెదుట నుండువనభూమియందు సంచరింపవలె నని యామెకుఁ దోఁచెను. మెల్ల మెల్లఁగా నడచి చెట్లసందునకుఁ బోవుచుండఁగాఁ దన కుడిమప్రక్కను గానుగుచెట్లగుంపులో మనుష్యచ్ఛాయను జూచి యిందిర భయం బందెను. "ఇందిరా, యిటు ర"మ్మను శబ్దము చెట్లపొదలనుండి వినవచ్చెను. ఇందిర కొంచెము నిలిచి యాకంఠస్వరమును గ్రహించి తత్క్షణమే లేడిపిల్లవలె నెగిరి పోయి 'నాయనా' యని యఱచెను.

మిత్రానందుఁడు 'తల్లీ, నా ముద్దులపట్టీ, రా రమ్మ. భయపడవలదు. 'నేనే'యని చేయిపట్టుకొనెను. ఇందిర తనతండ్రిముఖముఁ జూచి యతనిపాదములపైఁబడి బోరున నేడువసాగెను. మిత్రానందుఁడు దిక్కుతోఁపక బిడ్డ నెత్తి తనయొడిలోఁ గూర్చుండఁబెట్టుకొని, నసుఁ గన్నతల్లీ, నీ కంనుల కింత దుఃఖము? ఏమి జరగినది? ని న్నెవరైన గుర్తించిరా? చెప్పుము.

ఇందిర తనదుఃఖము నణంచుకొని, తండ్రీ, యిపుడు నా కేమియుఁ బ్రమాదము కలుగలేదు. జనకా, అంతఃపురమందుఁ దమపద్మకటింటిలోఁ దమనైజరూపంబును జూచితిని. ఆ రూప మిపు డెంత మాఱిపోయి యున్నదని దుఃఖము కలిగెను. నాయనా, తమ రెపు డిచటికి వచ్చితిరి? మీరు రహస్యంబుగా నుండుటకు స్థల మెచట నున్నది? మనకార్యము నెఱవేఱువఱకు రహస్యముగా నుండవలయునుగదా? మనగతి యేమి?

మిత్రానందుఁడు:—పుత్రీ, భయపడవలదు. దైవమును నమ్మినవారి కన్నఁటికిని భయము లేదు. నీ నెకాంగిఁగా నున్న పక్షమున నితర దేశంబులకుఁ బోయి, రహస్యముగా నుండ నవసరము లేదు. మనపూర్వపురాజులు కోటలో నొక భూగృహమును గట్టి యుంచియున్నారు. ఆ గృహంబునకుఁ బోవుమార్గంబు లనేకస్థలంబులయం దున్నవి. వాని నన్నింటిని నాతండ్రిగారు నాకుఁ జెప్పియున్నారు. నేను బ్రదికియుండువఱకు అష్టయిశ్వర్యముల ననుభవించుచు, రహస్యముగా నచట నుండవచ్చును. అట్టి దొంగబ్రతుకువలన నేమిప్రయోజనము? అదియుంగాక నీవు చిన్నబిడ్డవుగా నున్నసమయంబున నచట నుండుటకు సాధ్యము లేక యంతదూర దేశ మపుడు పోవలసివచ్చెను. ఇపుడు కాలము సమీపించినది. జయమో, యపజయమో పొందవలసినదిగా నున్నది. వాఁడేమైకపాత్రమా, నన్నుగుఱించి యావంత యైన వ్యసనము వలదు. కార్య సాఫల్యమున కేదైన మార్గ మేర్పడి యున్నదా? వివరింపుము.

ఇందిర నీలవేణికిని, ఫల్గుననకును జరిగినసంవాదము, తాను రాజమాత సమీపంబునకుఁ బోవుట, తనతల్లి సమాచారము, యామె మదనపాలునివిషయమందుఁ జేసియున్న తంత్రము ఈవృత్తాంతములన్నియు వివరముగాఁ బూసగ్రుచ్చినట్లు తెలియఁజేసెను. దీని నంతయు నతిశ్రద్ధతో వినుచున్నమిత్రానందుఁడు శిరఃకంపం బొనరించి, 'అమ్మా! యిపుడు నీవు కనుపెట్టిన విషయము మిగులముఖ్యం బైనది. ఇది చీఁకటియందుఁ బోవువానికిఁ గొంచెము వెలుతురుసహాయము దొరకినట్లు. ఇందిరా, నీ వాయంతఃపురంబునకు పోయిన శీఘ్రముగా జయము కలుగు నని ధైర్యముకలదు. చాలఁ బ్రొద్దయినది. నీవిఁకఁ బొమ్మ' అని తనకుఁ బత్రికలు వ్రాయువిధముఁ దెలిపి యిందిర నచటఁ దెచ్చి విడిచి తా నదృశ్యుఁ డాయెను.

# చతుర్దశో౽ధ్యాయము



వైరాగులు ప్రపంచసుఖముల నన్నింటిని బరిత్యజించిన నిస్పృహులు. వారలడవాపల కోర్చి భూమండలము నంతయుఁ దిరుగుచు, సకలశాస్త్రంబులఁ జదువుచు కాలము గడపుస్వభావము గలవారు. వారిలోఁ గొందఱు స్త్రీలు గూడ నట్టి నియమంబులకు లోఁబడి తిరుగుచుందురు. పైని చెప్పిన సమూహమందు గొప్పధనవంతులును మతాధిపతులును గలరు. అట్టి వైరాగి యధికారము క్రింద వేనవేలు వైరాగులు శుశ్రూషఁ జేయుచు వారివలన విద్యను గ్రహించుచు, వారివెంబడిఁ దీర్ఘయాత్రలు సలుపుచుందురు. మఱికొంద ఱడవుల కేగి యోగము సాధించి, బంగారము చేసి విక్రయించి శక్త్యానుసారము వైరాగుల కన్నము పెట్టి తాము భుజించువా రొకవిధమైన వైరాగులు. "స్వాద్వన్న భక్షకామేన వేషోయం యోగినాం ధృతః" అను చందంబున సుఖముగాఁ గడుపు నింపుకొని, దేశములఁ దిరుగుచు సత్రములయందో రాచనగరులయందో యిచ్చు (సదాబరత్ అనఁగా) భోజనసామగ్రిని దెచ్చుకొని బ్రతుకువైరాగులు కొందఱు. ఈ వైరాగిసమూహమునకు భంగు త్రాగుట మిగుల నలవాటు. ఈశ్వరుఁడు 'పరవినాచి' యను వేశ్యకాంత యింటిలో నీళ్లు మోయుచున్నపుడు భంగు త్రాగుచుండెడివాఁ డని యొక కథ కలదు. ఏది యెట్లున్నను మానవు లీశ్వరునికి భంగును శక్తికి సారాయిని దగిలించినారు. కృష్ణుఁడు జారచోరుఁ డనియు, నింద్రుఁడు జారుఁ డనియుఁ జెప్పుట వాడుక. మానవుఁడు తనయందుఁ గల చెడుగుణములను పెద్దలయందారోపించి, తనదుర్గుణముల కొక మన్ననను సంపుచ్చుకొన చూచును. ఇట్టి పుక్కిటిపురాణములు వైరాగిగుంపునకుఁగూడ గలవు. కనుకనే భంగాకు సిద్ధపత్ర మని సేవింతురు. వారుమాత్రము మానవులు కారా? "తిలలు బోడు

లైన, తలఁపులు బోదులా" యన్నట్లు వేషముచేతనే బైరాగు లగుదురో! విస్తారంబైన యీ ప్రపంచమందు బ్రతుకుట కన్నియో వేషములు. వేషము నకుఁ దగిన బాసలు.

మనకథాకాలమం దుదయపూరురాజ్యమందు బైరాగుల కనేకవసతు లేర్పఱచియుండిరి. రాజప్రాసాదముయొక్క కోటగోడ నానుకొని బైట నొకగొప్పసత్రము కట్టఁబడియుండెను వానియందు గొప్పమర్యాదగల బైరాగులు దిగుట యాచారము. కొన్నిదినములకు ముం దొకబైరాగిగుంపు వచ్చి యాసత్రమందు దిగియుండెను. ఆగుంపునకు నాయకుఁ డగు బైరాగి యొక మహానీయుఁ డని వదంతి. అతనికి సంస్కృతమం దపారపాండిత్యము. హిందు స్థానియం దాఱితేఱినవాఁడు. అతనిశిష్యు లంద ఱతనిని విష్ణ్వంశసంభూతుఁ డనియు, అణిమాద్యష్టసిద్ధులఁ బొందినవాఁ డనియుఁ జెప్పుచుందురు. ఏవి యెట్లుండినను పరధనము పరిగ్రహింపఁడు. ప్రతిదినము హోమము చేయు నపుడు బంగారమును జేసి దాని నమ్మి వలయువస్తువులఁ దెప్పించి శిష్యులందఱకు నన్నదానముఁ జేసి తా నొకపూఁటమాత్రము భుజించును. రాత్రి తా నొకగదియందు ధ్యానపరుఁడై యుండును. ఇట్టి మహిమ గల బైరాగి తమరాజగృహప్రాకారముదగ్గఱ నుండు నా గొప్పసత్రమందు దిగియున్నాఁ డని యంతఃపురమం దంతటను ప్రసిద్ధి యాయెను. తొలుత ఫల్గునుఁడు పోయి యతనిని దర్శింపవలె నని యెంచి యుదయము రాజునొద్ద ననుజ్ఞఁ బొంది వలయువస్త్రములం దీసికొని కొందఱు సేవకులు తనవెంట రాఁగా సత్రమునకుఁ బోయెను. అది పూజావసమయము. ఫల్గునుఁడు దూరముగాఁ గూర్చుండెను. అచట నొకపీఠమందు ద్వారకానాథునివిగ్రహము నెలకొల్పఁబడి యుండెను. ఆ విగ్రహ మైదేండ్లబాలునివలె విరాజిల్లుచుండెను. స్వామికి నవరత్నఖచితంబగు నాభరణంబు లలంకరించి యుండిరి. పుష్పమాలికలను తులసీమాలలను ధరించియుండు నా విగ్రహము పండరీపురమం దుండు విఠోబా యీ బైరాగికిఁ బ్రత్యక్షమై యున్నట్లు చూపఱుల మనంబులకుఁ

కూడ దర్శనమాత్రమున భక్తిని గలుగఁజేయుచుండెను. ధూపదీపాద్యర్చనా ద్రవ్యములు మిక్కిలి వైభవముగా నమరియుండెను. అచటి పరిమళద్రవ్యముల వాసన రాజగృహమునకంటె నధికవాసనలు గలిగియుండెను. భక్తిరసము నొలుకుచున్న యాస్థలమహిమవలన నంతక్రూరాత్ముఁడగు ఫల్గునుని మనస్సునందుఁ గూడ భక్తి మొలకయెత్తియుండెను. పూజానంతర మందఱు బైరాగికి నమస్కరించి తీర్థములఁ దీసికొనిరి. ఫల్గునుఁడును భక్తితో సమీపంబున కేగి యతనికి నమస్కరించి తీర్థముఁ బుచ్చుకొనెను. బైరాగి ఫల్గునుని నాశీర్వదించెను. వానివలన వాఁడు రాజసేవకుఁ డని గ్రహించెను.

ఫల్గునుఁడు:—స్వామీ, యీ సత్రమున కెందఱో బైరాగులు వచ్చియుండిరి. తమ యట్టిమహిమ గలవా రెవరును రాలేదు. మా రాజుగారును దముదర్శనమునకు వచ్చెదరు. తమరాకవలన మా దేశము పవిత్ర మాయెను. తాము మాయట్టి పామరజనులకోర్కెలఁ దీర్తురని వింటిని. తమ రట్టి మహనీయులే యని నే నిచటికి వచ్చి గాంచినపిమ్మట జను లాడుకొనుట సత్యం బని తోఁచినది.

బైరాగి:—"పుత్రా! నే నొకరిదయకు నెదురుచూచువాఁడను గాను. రాజును నీవును నీకంటె నతిదీనులును నందఱు నాకు సమానులే. రాజువలన నాకు కాఁదగిన దేమి? ఎవరైన నన్నుఁ జూడవలెనని యున్న సంధ్యాకాలమందు రావచ్చును" అని లోపలి కరిగెను.

మఱునటిదినము రాజు పోయి యతనిని దర్శించి వచ్చెను. ఆ దినము నుండియు రాజునకు ఫల్గునునకు బైరాగియం దత్యధికభక్తి కలిగియుండెను. ఇట్లుండ, నొకనాఁడు ఫల్గునుఁ డొంటరిగా వచ్చి, తనకు భవిష్యత్కాలమందుఁ దనయదృష్టముఁ జెప్పఁ బ్రార్థించెను. బైరాగి యటులే నిమీలితనేత్రుఁడై యుండి 'ఓయీ, నీ చరిత్రము మిగుల గూఢముగా నున్నది. అనఁగానే ఫల్గునుని దేహము కంపించెను. ముఖము వెలవెలఁబోయెను. తనమనోవికారము నడంచుకొని "స్వామీ, తమశిష్యులను గొంచెముదూరముగాఁ బంపరాదా?" యని పలికెను.

బైరాగి:—ఓయీ, నాశిష్యు లట్టివారు కారు. వారేకార్యములఁ జేయుచున్నను, వారిమన స్సీశ్వరధ్యానమందు లీనమై యుండును. ఈశ్వరుఁడు విలాసార్థముగా సృజించిన యీప్రపంచమున దొరుల నొప్పింపక, యొకరికిఁ గీడు సేయక, యున్నదానితోఁ దృప్తి నొందుచు, సుఖముగా జీవితకాలము జరపుట కెఱుంగని పిచ్చివాఁడు మనుష్యులకు భయము జెందవలెను. నీయిష్ట మెందుల కన్యథా జరుపవలె నని శిష్యులఁ బంపివైచెను. ఫల్గునుఁడు నిండుసంతోషముతో బైరాగిసమీపమున కేగి కూర్చుండి తనచేతిని జూపించి ఫలంబునకై వేచియుండెను. ఒకప్రక్క ఫల్గునునకుఁ దనయదృష్టము తెలియవలయు ననునాతురత. మఱియొకప్రక్కఁ దనగుట్టు బైటఁబడు ననుభయము. అట్టిరు దెఱంగులఁ దలంచి భయపడుచుండఁగఁ గన్నులు మూసికొని ధ్యానముఁ జేయుచున్నబైరాగి నేత్రములఁ దెఱచి నీపేరు ఫల్గునుఁడా" యనెను.

ఫల్గునుఁడు:—అవును, స్వామి.

బైరాగి:—ఫల్గునా, నీజీవితము ఎక్కువచిక్కులు గలది. నేనంతగాఁ బరిశోధింపను; ఎందులకనఁగా నొకమానవుని జీవితకాలమందు జరిగిన విషయముల గుఱించియు జరుగఁబోవు విషయములగుఱించియుఁ జెప్పుట యంతసులభమైనపని కాదు. మనుష్యు లెన్నియో మర్మకార్యములు చేసియుందురు. వారియంతరంగవిషయములను వారియుత్తరువు లేనిదే చూడఁగూడదు. అది దివ్యజ్ఞానలక్షణము గాదు. కనుక నే కొన్నివిషయములను మాత్రమే ధ్యానించి చూచితిని. ముందు ద్రవ్యవిషయముఁ జెప్పెద. నీయొద్ద నొకరాజునొద్ద నుండఁదగినంతద్రవ్య మున్నది. దానిని నీవు స్వతంత్రపఱచుకొనుటకుఁ బ్రయాసపడవలసియున్నది. ఇఁక నీగృహకృత్యము, నీకిదివఱకు వివాహము కాలేదు. నీ వొకస్త్రీని వరించియున్నావు. నీమీఁద దానికి మిగుల ననుమాన మున్నది. అది యెందులకో నేను దానిని బరీక్షింపలేదు. ఆచిన్నది నిర్మలహృదయ. దానికిఁ దగినట్టు నీవు నడచుకొన్నట్టయిన నిన్నే యాపె పెండ్లాడును. నీవిషయ మింతయే నేఁజూచినది". అని చెప్పి బైరాగి [illegible]కగ్రం

థము చదువఁ దొడంగెను. ఫల్గునునకు దేహ మాద్యంతము కంప మెత్తెను. తన మనస్సును గొంచెము నెమ్మదిపఱచుకొని భయభక్తులతో బైరాగికి నమస్కరించి యింటికి మరలెను. ఆ నాఁటినుండి బైరాగిని దైవముగా భావించెను. ఇఁక స్వప్నమందైనఁ దనవృత్తాంతమునుగూర్చి యతని నడుగఁగూడ దని నిశ్చయించుకొనెను. ప్రతిదినము పూజాకాలమునకు వలయు వస్తువులు రాజమాత పంపించుచుండును.

ఇందిర వచ్చి నెలదినములు గడచిపోయెను. ఆమె చేయుశుశ్రూష చేత రాజమాత కతిశీఘ్రముగా నారోగ్యము కలుగుచువచ్చెను. ఇంతమట్టున కారోగ్యవతి యైనను కాలుమాత్ర మావిధముననే యుండెను. ఒకయూఁత కట్టెసహాయముచే రెండడుగులు పెట్టి నడచుటకు శక్తి గల దాయెను. ఇట్లారోగ్యము కలుగఁగానే మురళాదేవి యిందిరను బరీక్షించుట కారంభించెను. ఇందిర కీ రాజగృహమునం దన్నిస్థలంబులు పరిచితము లై యుండెను. బైట నుద్యానవనంబులయందు మాత్రము తిరిగి చూచియుండలేదు. ప్రసిద్ధికెక్కిన యాయుదయపూరుకోటలోఁ బ్రాసాదముల పంక్తులాకాలమందుఁ బేరొందినశిల్పులచేఁ గట్టఁబడినవి. ఆ సౌధంబు లతిసుందరంబులు. అచటి యుద్యానవనంబులు, వనములమధ్యమందు శోభిల్లువృక్షవాటికలు, వాటికల మధ్య స్ఫటికశిలానిర్మితంబు లగువేదికలు, అచ్చటచ్చట లతాగృహంబులు—ఇట్లు మహావైభవంబుగా నొప్పు నా సౌధంబులయందు రాజమాతయు దాసదాసీజనులు రాజబంధువులు నివసించుచుండిరే కాని, మదనపాలుఁ డిచట వసించుట లేదు. ఆకాలమం దుండినరాజులు రాజకార్యములు జరుపు సభామంటపము నలంకరించియుండుటయే కాని, మదనపాలుఁడు దానియందుఁ బ్రవేశించుట లేదు. ప్రతాపసింహుఁడు కూర్చుండుసింహాసన మిప్పుడు మూయఁబడి యుండెను. చనిపోయినరాజుయొక్క వనమధ్యమందు పండితులు చేరుటకై యొకమంటప మెత్తుగాఁ గట్టఁబడి యుండెను. దానికి నాలుగుప్రక్కల యందుఁ జలువరాతిసోపానంబు లమర్పఁబడి యుండెను. ఆ మంటపస్తంభ

ములలో దశావతారములు మొదలగు ప్రతిమలు చెక్కఁబడి యుండెను. ఈ మంటపమధ్యమం దొకసింహాసనము నల్లరాతిచే చెక్కఁబడి యుండెను. దానిని భూమిలోనికి దించియుంచుటవలన బైటికిఁ జిన్నదిగాఁ గనఁబడుచుండెను. ఎల్లపుడు ప్రతాపసింహదేవుఁడు దానిమీఁదఁ గూర్చుండుకు. దేశదేశములనుండి వచ్చుపండితులు నానాశాస్త్రవిచారములఁ జేయుచుండునపుడు రాజు కావ్యాలాప రసాస్వాదనసంతుష్టాంతరంగుఁడై యానందించుచుండును. అది జరగినపిమ్మట నామంటపమున కుత్తరముగా నున్న కోటద్వారముగుండ రత్నాదేవీ సమేతుఁడై 'ఆరావలీ' కొండలసమీపమం దున్న మార్గమందు విహరించును. అది రాణివాసపుస్త్రీజనంబు సంచరించుటకు యోగ్య మైనది. ఆ పతివ్రతయగు రత్నాదేవి, ఇంద్రునకు శచీదేవివలె, మన్మథునకు రతివలె దనభర్తకుఁ దోడునీడయై యతనిసకలసుఖంబులనిదాన మై యొప్పుచుండెను. అట్టి పవిత్రంబైన దాంపత్యమున కిట్టికష్టంబు ప్రాప్తించె. విధిని మీఱుట యెవరితరము? ఆకాలమందు లక్ష్మీవిలాసభవనంబో యన్నట్టు అలరారుచుండిన యారాజభవన మిపుడు కళారహితమై యుండెను. ఆవనములనడుమ మధ్యాహ్నమందు వనపాలకులు తిరుగుదురు. సాయంకాలమం దాదిశకు నెవరును బోరు. రాత్రులయందు పహరాయిచ్చువారును రాజు నివసించుచుండునూతన భవనములయొద్ద గస్తీ తిరుగుదురే కాని, ప్రాతభవనములప్రక్క నడుగైనను బెట్టఁజాలకుండిరి. ఎందుల కనఁగా, పండితసభామంటపమునకుఁ బశ్చిమ దిక్కున పెద్దరాజుగారి శయనాగారము గలదు. అచటనే రాజు మరణించిరి. రాజు బలవన్మరణము నొందినవాఁడు గనుక పిశాచంబై తనచచ్చినభార్యతోఁ గూడి యచట సంచరించుచున్నాఁ డని యచటిజనుల నమ్మకము. అట్లు తిరుగుట తాము ప్రత్యక్షముగాఁ జూచితి మని కొందఱు, కావలి కాచుచుఁ బండుకొనువారి నచట నుండవల దని గద్దించి చెప్పినట్టు మఱికొందరు, ఇట్లు తలలు తోఁకలు గల్పించి పెద్దభూతములనే నిర్మించినారు. మురళాదేవి పగటియందే యాదిక్కును దిరిగి చూడదు. సపత్ని త న్నెక్కడ మ్రింగునో యని

యామెకు భయము. తానట్లు మెట్లనుండి క్రిందఁ బడి యిన్ని దినములు వ్యాధిగ్రస్తురాలై యుండుటగూడఁ దనపతి క్రోధముచేతనే యని యామె నమ్మకము. వైరాగి మహానీయుఁ డని విన్నమాత్రముననే యతనిని సౌధము నకు రప్పించి, యాదయ్యములఁ బాఱఁద్రోలుటకై యెదురుచూచుచుండెను. పిచోల యనుచెఱువు మధ్యమం గున్నగట్టుమీఁదఁ గట్టఁబడియుండు క్రీడామం దిరములఁ బడియాండ్లనుండి తిరిగి చూచువారు లేరు. అందలివస్తువు లన్నియు దుమ్ము పట్టి యతిహీనస్థితిలో నుండెను. ఆ కోటలో గొప్ప భూగృహ మున్న దనియు, దానికి నలుగికలందు మార్గము లున్న వనియు, నచటఁ బూర్వపురాజు లపరిమితధనము చేర్చిపెట్టియున్నా రనియు వదంతి గలదు. ఆ రహస్యమార్గములను మాయలమారి యగు నాథల్గునుఁడు పదియాఱు సంవత్సరములనుండి రహస్యముగా వెదకినను దొరకలేదు. ఆ రహస్యము చని పోయినరాజువెంబడిఁ బోయెను. ఒకవేళ నట్టిగృహమే యుండియుండ దను కొని దానిని కనిపట్టుటకై దేవులాడుట మానివైచెను.

రాజపుత్రి కారోగ్యము కలుగుచున్న దని లలితకుమారునికిఁ దెలి సెను. ఇందిర యట్లు తానొంటరిగా నారాజగృహమందు సేవకురాలై యుండుట యతనిమనస్సునకు మిగులఁ గష్టముగా నుండెను. "ఇది యేమి కారణమై యుండును? అంతటిస్త్రీమైకపాత్రం బగు తనబిడ్డ నిటు లొంటి గా విడిచియున్నాఁడే? నా కేమియుఁ దోఁపలేదు. ఆ రహస్య మేదియో యది నాకు సంపూర్ణముగాఁ జెప్పలేదు. నే నడుగుటకును సమయము దొరక లేదు. పని యిట్టి దని నాకుఁ దెలియఁజేయఁగూడదా? నేను తన్ను మన సారఁ బ్రేమించిన పతిని గానా? అట్లు గాక నా యిందిర నన్నుఁ బ్రేమిం పకయే యుండునా? నేనే మూఢుఁడనై నావలె నదియు నన్నుఁ బ్రేమిం చిన దని భ్రమించితినా? అయ్యో! అట్లెన్నఁటికి నుండదు. నావలపుల పంట, నా యిందిర, నాప్రాణపదం బగుప్రేయసి, మహానిర్మలచరిత. దాని విషయమై సందేహించుట మహాపాపము. ఆమె నాకొఱ కింత కష్టపడుచు

దనవివాహానిర్బంధమునకుఁ గారణభూతం బగు రహస్యమును భేదించుటకుఁ గదా యిట్లు సేవకురాలై మెలఁగుచున్నది. ఆ రహస్యమీ సౌధంబునకు సంబంధించి యుండుటకుఁ గారణ మేమి? రాజును జంపిన యపరాధము మోపఁబడిన విక్రమసింహమహారాజే మిత్రానందుఁడా? అట్లగునేని యిందిర చంపకమాలిని యై యుండవలయు. ఆ యపవాదమును బోఁగొట్టుటయే రహస్యభేదన మై యుండవలయు. అట్లు కాదేని, తలలు నఱుకు దొంగలగుంపును రాక్షసునియట్టిచండసేనునిఁ దృణీకరించి వారికన్నులకు దుమ్ము చల్లి యంతర్ధాన యైన వీరకాంత యది కాక సామాన్యస్త్రీకి నంతటిగుండెలా? తొలుత నది సామాన్యస్త్రీయని యెంచి "నీకు సహాయంబుఁ జేసెద"నని చెప్పితిని. ఆసింహకిశోరము నాసహాయము గోరునా? ఇంతటికిని నపట నేఁ జేయున దేమున్నది? పదియాఱేండ్లనుండి గుప్తమై యున్న రహస్యమే చండాలునియందు దాఁగియున్నదో దానిని బైటికిఁ దీయవలయును. అందులకే వారిరువు రట్లు తమరూపులను మార్చుకొని యున్నారు. ఒకవేళ నేఁ దలంచినట్లు గాక యది చంపకమాలిని కాకపోయిన నాకేమి? అది యొక నీచజాతిస్త్రీయై యుండినను నదియే నాభావ్యర్ధాంగి. ఏమి జరగునో వేచి యుండి చూచెద. ఇపు డిందిర మదనపాలునియంతఃపురంబునకుఁ బోయి యున్నదఁట. కార్యము తేలువంతవఱకు నే నింతదూరమున నుండక సమీపమం దుండి కావలసినపుడు సహాయంబు సేయుటకు సంసిద్ధుఁడనై యుండవలయు"నని లలితకుమారుఁ డుదయపూరునకుఁ బ్రయాణ మాయెను.

ఇందిరను జూచినరాజమాతకుఁ బ్రీతి యుండినను, దీనివలనఁ బ్రమాదం బేదేని కలుగునేమో యని మనస్సులో భయము. ఫల్గునుఁ డీబాలికవిషయమం దప్రమత్తుఁడై యున్నాఁ డని యామెకుఁ దెలియును. కనుక తానేమియు నెఱుంగనిదానివలె మిగులఁ బ్రీతిని జూపుచుండెను. ఇందిర రాజమాతముఖముఁ జూచినమాత్రాన నామెహృదయభావము లన్నింటి నద్దమందలి వస్తువునువలెఁ గనుఁగొన సమర్థురాలై యుండెను. ఆనాఁటిమధ్యాహ్నమున

నిందిర రాజమాతసన్నిధానంబునకు వచ్చి, సుగంధతైలమును బూసి యతి మృదువుగాఁ జిక్కు దీసి తల దువ్వి ముడి వైచి, ముఖము కడుగుటకై నీళ్లఁ దెచ్చి యిచ్చి వస్త్ర మందిచ్చి ఫలాహారముఁ దెచ్చిపెట్టి తాను వెలుపట నిలిచి యుండెను. అదేసమయమునకు రాజును నచటికి వచ్చి చేరెను. రాజు తల వంచి నిలిచియున్న యిందిరసొగసును జూచి వెఱఁగందెను. రాజును జూచి యోరగాఁ బోయిన యిందిరనుగూర్చి "ఇందిరా! నన్నుఁ జూచిన నీకు భయమా? లేక సిగ్గా? అది యేల? రమ్ము. నాకును ఫలాహారముఁ దెచ్చి పెట్టు" మనుచు లోపలి కరిగి తల్లిప్రక్కను గూర్చుండెను. ఇందిర ఫలాహారముఁ దెచ్చుటకై లోపలి కరిగెను.

రాజు:—అమ్మా, యీ యిందిర 'నల్లరూపమందుఁ బరమసుందరి' యని నీవు కనుఁగొన్నావా?

మురళి:—"పిచ్చివాఁడా, నాకుఁ గండ్లు లే వనుకొంటివా? అన్నియుఁ దెలియును. నా యభిప్రాయము స్థిరపడినపిమ్మటఁగాని నేను నీకేమియుఁ జెప్పఁదలఁచుకొనలేదు. మాఱు పలుకకు" మని గర్జనచేసెను. మదనపాలుఁడదిరిపడి మిన్నకయుండెను. వేఱువిషయముల మాటలాడుట కారంభించెనుకి "కుమారా! హేమసమాచార మేమి? దానియభిప్రాయముఁ దెలిసికొంటివా? ఎప్పుడు నిన్నది వివాహ మాడునఁట. నీ వచటికిఁ బోయియుంటివా? లేక నీయాటపాటలయందు మగ్నుఁడవై యున్నావా?

రాజు:—లేదమ్మా, హేమ వివాహముచేసికొనుట కట్టి యభ్యంతరము లేదు. ఇపు డామెకు దేహారోగ్యము సరిగా లేదు. ఇదియునుం గాక యిటీవల 'నామెకుఁ గొంచెము దగ్గువ్యాధి కలిగియున్నది' యని లీల చెప్పినది. శీతకాలమం దావ్యాధి మిగులబాధఁ గలుగఁజేయునఁట.

మురళి:—ఓహో! అలాగా? అది చెడ్డవ్యాధి. మిగుల జాగ్రత్తగా నుండవలయును. వైరాగిని విచారించి మంచియౌషధ మిప్పింపుము. వైరా

గులయొద్ద గొప్పమూలిక లుండును. ఆ వ్యాధియే దానివివాహమున కాలస్యమై యుండు నని తలంచెద.

ఇంతలో దాసి వచ్చి 'మాళవరాజుగారు విచ్చేసియున్నా'రని చెప్పెను.

రాజు:—అమ్మా, లలితుఁడు మిమ్ముఁ జూచుటకై వచ్చియుండును.

మురళి:—అవును. అటులే యుండును. అతనికి నామీఁద విశ్వాస మధికము, నాకును నటులే.

అంతలో లలితకుమారుఁడు రాజమాత యుండుభవనమునకుఁ బోవుచు, నిటు నటుఁ జూచుచుఁ బోవుచుండగా, నచట నొకగదియందుఁ గూర్చుండి యున్న యిందిరను జూచెను. అపు డామె యతనికంటి కచ్చురవలెఁ దోఁచెను. "నా ప్రేయసీ" యని బిగ్గరగా నఱచెను. ఇందిర తిరిగి చూచి భ్రాంతిఁ జెంది, "నాథా! యిది యేమి పిచ్చితనము? ఎవరైన విన్న నెంతప్రమాదము?" అనునంతలో "మన్నింపు" మనుచు వెడలిపోయెను. రాజమాతను దర్శించి చాలసేపు రాజ్యవ్యవహారములంగూర్చి ముచ్చటించెను. దాసి యొక కమ్మను దెచ్చి లలితునిచేతి కందిచ్చెను. లలితుఁడు దానిని జదివి రాజున కిచ్చెను. రాజు తల్లి చేతి కిచ్చెను. ఆమె చదువుకొని "కుమారా! పోయి రమ్ము. తన దేహస్థితిని జాగ్రత్తగాఁ జూచుకొ" మ్మని నేను చెప్పినట్టు హేమకుఁ జెప్పుము. ఆమాట నితఁడు మఱచిపోవును. వింటివా లలితా, మన హేమకు దగ్గువ్యాధియఁట. అందువలననే పలుమా ఱామె వ్యాధిపీడితురా లగుట. ఈ మహానుభావుఁ డీ విషయమును నాకుఁ జెప్పనేలేదు. మన యూరి కొకవైరాగి వచ్చియున్నాఁడు. అతనిని నీవును బోయి దర్శనముఁ జేసికొనుము. అతనిమంత్రోదకమువలననే కదా నాకీవ్యాధి యింతశీఘ్రముగఁ గుదిరినది" యని మురళి తనకథను చెప్పి ముగించెను. ఆనాఁడు సాయంకాలము నాల్గుగంటలకే యందఱు వనవిహారమునకుఁ జనిరి. వారల నందఱను ముందు విడిచి తనయుత్తరీయమునకై వెనుదిరిగివచ్చి లలితుఁ డిందిర యుండు

గృహమునకుఁ బోయి, "యిందిరా, నా మీఁద నీ కాగ్రహమా?" యని యడిగెను.

ఇందిర లలితుని జూచి ప్రేమానందరసము లుప్పొంగి పైకుబుక నిన్ని దినములనుండి యెన్నికష్టము లనుభవించుచుండినను దననాథునిదర్శనము సకల దుఃఖనివారణౌషధం బని యెంచి యున్నది గనుక, "ఇందిరానేత్రచకోర చంద్రమా, మీమీఁద నా కెందుల కాగ్రహము? అయిన, మీ మనశ్శాంచల్య మునకై నగచెద.

లలితుఁడు:—"నిజము. ప్రియా, యిఁకముం బతిజాగరూకతతో మెలఁగెద" నని తనయుత్తరీయము నామెచేతఁ దెప్పించుకొని యామెహస్త స్పర్శమువలనఁ బరమానందభరితుఁడై యుద్యానవనమున కేగి వారిని జేరెను. అచట నందఱును నా వృక్షములనీడలయందుండు స్ఫటికశిలావేదికలయందుఁ గూర్చుండి లోకవ్యవహారముల ముచ్చటించుచు సంగీతమునకు దిగిరి. ఆ స్థాన హారములయందు రాజు మనఃపీడనుం దిందిగ నడబడెను. తత్క్షణమే గా జోక చీటి వ్రాసి దానిచేతి కిచ్చెను. ఒకగంటలో నచటి క్రొకపల్లకి వచ్చి నిలిచెను. తత్క్షణమే రాజును లలితుఁడును దిగ్గన లేచి పోయి యామెనుఁ దింపి జాగ్రత్తగాఁ బిలుచుకొని వచ్చి యావేదికమీఁద నొకమృదుశయ్యయందుఁ గూర్చుండఁ బెట్టిరి.

రాజమాత:—యువకులారా, మీ రిట్లు కూర్చుండి యొకగృహస్థుని యింటిబిడ్డను నే నిచట లేనిదే పాడు మనెదరేమో యని భయపడి యిచటి కేతెంచితిని. ఇందిరా, వీరు నీకు సహోదరు లని యెంచి, భేదబుద్ధి విడిచి నీగానామృతముచే మమ్ము నానందింపఁజేయుము.

ఇందిర యచటనుండు వీణియ నందుకొని రాజమాతవెనుకఁ గూర్చుండి యద్భుతముగాఁ బాడెను. మదనపాలుఁడు మిగుల సంతసించెను. లలితుఁడు వంచినతల పైకెత్తలేదు. ఇందిర పాట ముగించి వీణ నెత్తికొని ప్రాసా

దముప్రక్కకుఁ బోవుచుండఁగ; ఫల్గునుఁ డెదురుగా వచ్చెను. వాఁ డిందిరను జూచి స్తంభితుఁడై నిలిచి యామెను ముందు పోవనిచ్చి, "యిది యెవతె? దీనికనులు ముంగురులు మూడఁగా విక్రమసింహునిఁ జూచిన ట్లున్నది. ఏమి యాశ్చర్యము! ఇంకను దెలిసికొనుటకు సమయము దొరకలేదే; కానిమ్ము. ఇఁకమీఁద నైన నతిజాగ్రత్తగా దీనిజాడలు కనుపెట్టెద. ఈ చిన్నది తన సామర్థ్యముచే మురళాదేవిని లోఁబఱచుకొనునేమో. అట్లెన్నఁటికినిఁ గాఁజాలదు. నావలలోఁ జిక్కియున్న మురళాదేవి దీనికిఁ జిక్కునా? ఆ ముసలి దానిని హెచ్చరింపవలెను. పని మించిపోయినఁ బ్రాణాపాయము కలుగు నని మనస్సులోఁ జింతించుచుఁ బోయెను. లలితకుమారుఁడును రాజును బ్రతిదినము బైరాగిదర్శనమునకుఁ బోయి యతనియసాధారణశాస్త్రజ్ఞానమున కచ్చెరు వందుచు, నచట జరిగిన యుదంతముల రాజమాతకుఁ దెలిపి యామెను సంతసింపఁజేయుచుండిరి. మదనపాలుఁడు రాజకార్యములను జూచుటకై లలితునిఁ గొన్నిదినము లచట నుండుటకై తెలియఁజేసెను. అది తనకు భావిశుభసూచక మని యెంచి, యిందిరకు సహాయముఁ జేయుమని దైవము చెప్పినట్లు తలంచుకొనెను.

# పంచదశోఽధ్యాయము



తార మిగుల సద్గుణవతి. తారకుఁ గలసద్గుణములయం దొకటి యైనను మురళాదేవి యందుఁ గానరాదు. తారతల్లి యీయుదయపూరురాజప్రాసాదమునందుఁ బుట్టి పెరిఁగి యారాజులఁ గొలిచి భక్తితో నుండి చనిపోయిన గుణవతి. దానిపుత్త్రి యగు తారగూడ నట్టిదియే. అయినను దారకు విద్య వచ్చును. భారతభాగవతములు బాగుగాఁ జదివి యర్థము చెప్పఁ గలదు. ఈ చిన్నదాని కింకను పెండ్లి కాలేదు. అంతఃపురమందుఁ గల దాసీజనములకు దీనితల్లి యధికారిణి. మురళాదేవి యా యధికారమునే తార కియ్యవలె నని యెంచియుండెను. తార తనతల్లివలన ఆ యంతఃపురమందు జరిగిన వృత్తాంత మంతయు వినియుండెను. అది యెందులకో తారకు నిందిర యన్న మహాప్రేమ. ఎల్లప్పు డామె యడుగకయున్నపుడే సకలోపచారములఁ జేయును. ఆమెవెంట నెప్పుడును నీడవలెఁ దిరుగుచుండును. మాటల సందర్భమున రాజమాతస్వభావమును గూర్చియు ఫల్గుణుని నడతలఁ గూర్చియును చెప్పుట కలదు.

ఒకనాఁడు సంధ్యాకాలమున, తార యిందిర యిరువురును కలిసి యనేకరహస్యములు మాటలాడిరి. తారమీఁద నిందిరకును మిగుల నమ్మకము గలిగినది. అయినను దానివలన విషయములు తెలిసికొనునే కాని తా నతి జాగ్రత్తగా నుండి యేమియుఁ దెలియనిదానివలె నటించును.

తార—అమ్మా, యిందిరా, నిన్నుఁ జూచినప్పటినుండియు, నీ వొక గొప్పవంశమునఁ బుట్టినదాన వనియు, నిన్ను సేవించుట నా పుణ్యఫలంబనియు, నాకుఁ దోఁచుచున్నది. మహారాజ్ఞికిఁ గల సద్గుణములు నీయం దున్నవి. మా రాజమాత మహారాజ్ఞి యైనను సద్గుణములు దూరముగా నున్నవి.

ఇందిర—తారా, మీ తరతరములనుండి మిమ్ముఁ బెంచి పెద్దజేసి యింత సుఖముగా నుంచియున్న రాజమాతయందవగుణంబుల నెన్నవచ్చునా? అది స్వామిద్రోహము గాదా?

తార—నిజమే, అమ్మా! నే నెన్నఁటికిని నామెకు ద్రోహముఁ జేయను. శత్రువులచేతి కామెను జిక్కింపను. ఈ యంతఃపురమున నుండువారి నందఱను విచారింపుము. నీతో మనఃపూర్వకంబుగా మాటలాడునట్లితరులతో మాటలాడుదు ననుకొంటివా? ఇపు డట్టివిషయమై నీతో మాటాడుసందర్భము కలిగినది. ఎండల కానెదవా? ఆమె వెన్నెలను సూర్యకిరణంబు లని భ్రమించినది. తనకల్మషహృదయమువలె నితరులహృదయములని నిశ్చయించుచున్నది. ఇద్ద ఱొకచో నిలిచి మాటాడుచున్నఁ దనవిషయము నే వారు మాటాడుకొందు రని యామెకు సందేహము. సజ్జనులకు భయమేల? తల్లీ, యిందిరా, తరతరములనుండి యని యంటివే? దయామూర్తియుఁ బతివ్రతాశిరోమణియు మహారాజ్ఞియు నగు తారాబాయిగారి యపారకరుణచే నాతల్లి పోషింపఁబడినది. పదియాఱుసంవత్సరములనుండికదా యీమెకీ నిరంకుశాధికారము! దానికి ముందుగ నీ యంతఃపురమందుఁ గొంద ఱనాథలగు నాయట్టి బాలికలు, దశరథునియట్టి ప్రతాపసింహ మహారాజుగారిచేతను రామమూర్తివలె మోహనమూర్తి యగు విక్రమసింహదేవ యని పేరుగాంచిన మాయువరాజుగారిచేతను బోషింపఁబడితిమి. దాసీజనము లని నికృష్టముగాఁ జూడక వారికి సకలవిద్యలను నేర్పి నిర్మలహృదయముగలవారై సంపూర్ణ రాజభక్తితో నంతఃపురస్త్రీలను సేవింపవలెను. రాణివాసమం దెచటఁ జూచినను సంతోషము, శాంతము, భక్తి, విద్య, పరిశుద్ధం బగునడత—ఇన్ని గుణములుం గలది శుద్ధాంతఃపురం బనంబడును. ఈవిధముగాఁ దమయంతఃపురం బుండవలెనని మాయువరాజుగారియభిప్రాయము. ఆమహానుభావుఁడు మమ్ముఁ దన తోడఁబుట్టువులవలెఁ బ్రేమించును. మే మతనివెంటఁ జని వేటాడి మావిలువిద్య నేర్పును జూపించునపు డతఁ డపరిమితానందంబుఁ జెందును. అమ్మా,

నే నేమని చెప్పుదును! మాతండ్రి యకాలమృత్యువువాతం బడిరి. మాయువ రాజుగా రడవులపాలైరి. ఇంక నేమిచెప్పుదును! ఈ దుఃఖమువలన నాకన్న తల్లి మరణించెను. ఇప్పుడు నే నున్నాను నీ దుఃఖ మనుభవించుటకు. నే నీమెను మాత్రము సేవింపనా? ఆమె కెన్నిదుర్గుణము లున్నను నా మహాప్రభుని భార్య యైనది గదా? కనుక నా కామె పూజ్యురాలు. ఆమె తన కున్నంత భాగ్యము మాత్రముచేఁ దృప్తి నొందదు. మఱియొకరు చేసిన యపరాధమును దనసవతికొడుకుమీఁద మోపించి యతని నడవులపాలు సేసిన కైకేయి గదా యీమె? ఈ రాజులు సూర్యవంశపురాజు లని వన్నె కెక్కినవారు. ఆ వంశమందుఁ గైకేయి గలుగుట యాశ్చర్యము గాదు. అయిన నా కైకేయి రామునిఁ బదునాలుగుసంవత్సరంబు లడవుల కంపినది. మరల భరతునిచేఁ బ్రబోధితయై తన హేయకార్యమునకు వగచి రామునిపాదములయందుఁ బడి మన్నన వేఁడెను. ఈమె యట్లు గాదే. ఆ కుమారునిమీఁదఁ దప్పు మోపించి యురి తీయింపవలె నని ప్రతిన పట్టినదే. ఇటీవల నతఁడు చచ్చె నని యొక వదంతి కల్పించినది. అతఁడు బ్రతికియున్నాఁ డని నే నొకమహనీయుని వలనఁ దెలిసికొంటిని. ఇప్పుడు నీమీఁద నీమెకు సందేహము కలిగినది. యువ రాజుగారి కొకబాలిక యుండెను. నీ వామెను బోలియున్నావఁట. అందు వలన నీమె నిన్నచటికి గప్పించియున్నది. నీచర్యలఁ గనుపెట్టు మని నా కాజ్ఞాపించియున్నది. ఈ ఘనుఁ డీమెకు దుర్మంత్రి. ఆపాపకార్యము నీద్రోహియే చేసి యువరాజుగారిమీఁద మోపెనో యదియును దెలియదు. భర్త పోయినచింత యుండినను సవతికొడుకును నాశము పొందించుటకు మంచిసమయము చేకూరె నని యామె తృప్తిఁ జెంది యున్నది. అంతటితోఁ దృప్తిఁ జెందక తనసపత్ని యగు హేమప్రభాదేవిని దనదత్తపుత్రుఁ డగు మదన పాలుఁడు పునర్వివాహము చేసికొను నట్లతనికి బోధించినది. ఇప్పు డాకార్యమునకై వేయిప్రయత్నములు జరుగుచున్నవి. అది వానిజన్మమందు జరుగు పని గాదు. ఛీ! ఛీ! యా సత్యవతి కిట్టి యిడుమలఁ దెచ్చిపెట్టినవిధిని

దూఱవలదా ? ఆ మహనీయుని కష్టములు తొలఁగి మరల నతఁ డిప్పటికి వచ్చి నను నీ వృద్ధురాలిని మన్నించి తల్లివలెఁ బ్రేమించునే కాని యపకారము చేయఁడు. అమ్మాయీ, యొకవేళ మా యువరాజుగారికష్టములఁ దీర్చుటకై నీవు వచ్చియున్నయెడల నాచేత నయినంత నీకు సహాయం బొనరించెద. అందువలన నేఁ జచ్చినను జింత లేదు. నా ప్రభువునకు క్షేమం బగుఁ గాక !

ఇందిర ప్రతిమవలె నిశ్చేష్టితురాలై యది చెప్పిన దంతయును వినెను. "ఇది యొకమాయ యై యుండునా ? లేక యిది నిజ మైనదా ! దీనివలన నాకు మిక్కిలి సహాయము కలుగు" నని మనసులోఁ దలపోయుచు, తారా, వ్యసనపడకుము. నీవు మిగుల రాజభక్తి గలదానవు. దుర్మార్గు లెప్పటికిని జయింపరు._అని మాటలాడుచుఁ బోయి, తారా, యెవరో మనకై వచ్చుచున్నట్టున్నది. పొమ్ము. నీవెంబడి నేను వచ్చెద" ననెను.

తార—"అమ్మా, నేఁబోయెద. సంధ్యాకాలము దొంటరిగా నిక్కడ నిలువఁగూడదు. జాగ్రత్త" యని చెప్పి వెడలిపోయెను. ఇది తగుసమయ మని యెంచి యిందిర యాసింహాసన మున్నచోటికిఁ బోయి దానియందమును జూచుచు క్రింద దాఁగుటకు కన్నాలు నైన స్థల ముండునా యని శోధించుచు దానిని తాఁకి తాఁకి జూచుచు రాఁగా, నచట నొకమీట కనిపించెను. అది త్రుప్పు పట్టి యుండెను. దానిని గట్టిగాఁ ద్రిప్పెను. అట్లు త్రిప్పఁగానే యాసింహాసన మెత్తుగాఁ బైకి లేచెను. మరల దాని నెప్పటివలెఁ ద్రిప్పి తగ్గించెను. ఇందిర దానిలో డగి చూడవలెనని మఱఁ ద్రిప్పి లోపల దిగి నలు దిశలు చూచుచుండఁగ, నిద్దఱు మనుష్యులు వచ్చుచున్నది చూచెను. వారు రాను రాను దనస్థలమునకే వచ్చుచుండిరి. వారిలో నొకఁడు ఫల్గునుఁడు. మఱియొకని నిందిర యెఱుఁగదు. ఆమె వారిరువురిని జూచి కదలక యట్లే నిలిచెను. వారును చుట్టుఁ గలయఁ జూచి "మధుకరా, యిచటఁ గూర్చుండుము. ఇచట మన మెవరికిని భయపడ నవసరము లేదు. ఇఁక

మీఁద నిచట దయ్యములు దప్ప మనుష్యులు తిరుగరు. కానిమ్ము. నీవు కాళీఘట్టమునకుఁ బోయినసమాచార మైనది? ఈ యిందిర యనుచిన్న దెవరు? దీనితండ్రిని జూచితివా ?" యనుచు ఫల్గునుఁ డెదుట నున్న యరుఁగుమీఁదఁ గూర్చుండెను.

మధుకరుఁడు—అయ్యా, నీయాజ్ఞప్రకారము కాళీఘట్ట మంతయు వెదకి నీవు చెప్పినయింటికిఁ బోయి విచారించితిని. అచట నిందిర చెప్పిన ప్రకార మున్నదిగాని వేఱు లేదు. ఆచిన్నదానితండ్రి దేశాంతరమునకుఁ బోయినాఁడు. ఇరుగుపొరుగువారి నందఱను విచారించుకొని నాసంశయముఁ దీర్చుకొంటిని. ఇది నిజము. ఇం కేమి చేయ మనెదవో చెప్పుము.

ఫల్గునుఁడు—అయిన నొకపనిఁ జేయుము. ఈయూరి కొకబైరాగి వచ్చియున్నాఁడు. అతఁడు గొప్పవాఁడు. అతనిసమీపమున కనేకులు వచ్చుచుందురు. ఈపిల్లతండ్రి వచ్చునేమో కను పెట్టియుండవలెను. నేను రాజుతోఁ జెప్పి యాపని నీకిప్పించెద. నేనును నీకు సహాయముఁ జేయుచుండెద. జాగ్రత్తగా నుండుము. తెలిసెనా ? ఆచిన్నదానివిషయము నేను జూచుకొనెద"నని చెప్పి యిద్దఱును లేచిపోయిరి. వా రట్లు పోయినపిమ్మట నిందిర పైకెక్కి వచ్చి చెట్లమధ్యమునఁ దూఱి యంతఃపురంబు చేరెను.

ఇందిర పరుండుగది రాజమాతశయనాగారమున కెదురుగా నున్నది. అది యొకపెద్దభవనము. దానిలో దాసీజనులు నిద్రింతురు. అం దొక ప్రత్యేకమైనగదియం దిందిర పరుండును. ఇందిర పడుకగదియందు నిలువుటద్దములు కుర్చీలు వివిధంబు లగుపటములు సోఫా లమర్పఁబడియుండెను. అందఱకన్న నాచిన్నదానిని రాజమాత యభిమానముతోఁ జూచుచున్న దనుట కిది యొకనిదర్శనము. అయిన నదిబూటకము. హేమప్రభను వంచించుటకును నీచిన్నదానిగుట్టు చక్కఁగాఁ దెలియుటకును జేసినపన్నాగ మిది. తార యెపుడును నిందిరకు తోడుగాఁ బండుకొనును. ఇందిరకు రాత్రి యంతయు నిదుర పట్ట

లేదు. "నేను జూచిన దంతయుఁ గల కాదుగదా? దేవుఁ డిపుడే యొక్కొక నిదర్శనంబుఁ జూపుచున్నాఁడు. ఈ క్రూరుఁడు తార చెప్పినట్లు లాకార్యము తామగానో లేక మఱియెవరిచేతనో చేయించి తా నిట్లు విఱ్ఱవీఁగుచున్నాఁడు. నన్నుఁ జూడఁగనే నాతండ్రిజాడలు నాయందు న్నవని గ్రహించి తనగుట్టు బైటఁబెట్టుటకు వచ్చితి నని యూహించెను. వీఁడు పరమ మేధావి. దుర్మార్గు లెప్పటికిని బుద్ధిశాలులు. అయినను దైవబలముమాత్రము లేదు. కనుక వా రధఃపతనం బొందుదురు. ఇదియే దైవమహిమ. వీఁడును వీనియజమానురా లగు రాజమాతయు నేమి సేయుదురో చూచెదః. నేను బూనినపని కీ సౌధరాజమే తగినస్థలము గాని, నాతల్లి యిల్లు గాదు." అని చింతించుచు నిదురించెను.

మదనపాలుఁడు లలితకుమారునితో హేమప్రభాదేవి యంతఃపురంబునకుఁ బోయి యామె చెప్పి పంపినకారణము తెలిసికొని ర" మ్మనెను.

లలితుఁడు:—రాజేంద్రా, యామె జమీనులవ్యవహార మని యెంచెదను. ముందు దర్బారునకుఁ బోయి కార్యముల ముగించుకొని యచటికిఁ బోయెద.

ఇందిర విడలిపోయిననాఁటినుండియు హేమప్రభ మనః స్థిమితము లేక వ్యథనొందుచుండెను. తనభర్తను బిడ్డను బోఁగొట్టుకొన్నదుఃఖ మామెకుఁ గ్రొత్తదిగాఁ బరిణమించెను. దిక్కు లన్నియు శూన్యము లయ్యెను. అన్నము రుచింపదయ్యెను. తన కేమి కావలసియున్నను 'యిందిరా' యని ముందుగఁ బిలిచినఁగాని వేఱొకచేటిని బిలువదు. ఇట్లసవ్యస్థమనస్కురాలై దాదాపు నాలుగునెలలు గడచెను. ఆమెమనస్సునం దేదియో యాలోచన బాధించుచుండెను. లలితకుమారుఁ డెపుడును దేవి కాంతరాంగికాలోచనాసభకు చేరినవాఁడు, అందులకుఁగాను దేవి యతనిని బిలిపించెను. తాను భుజింపకయే యతనికై వేచియుండెను. బండిశబ్దము వినఁగానే వాకిటికిఁ బోయి నిలిచెను.

లలితకుమారుఁ డేకాకిగా వచ్చినది చూచి మిగుల సంతస మందెను. లలితుఁడు వచ్చి యామెకు నమస్కరింపఁగాఁ దానే యతని లేవనెత్తి, "నాప్రియుమైన లలితా, చిరంజీవివై నీయిష్టమైనసతిని బొంది సుఖింపు" మని యాశీర్వదించెను. కుమారా, నేఁడు నీవు మాత్రము రావలె నని నాకోరిక. భోజనశాలకు ర"మ్మని పిలుచుకొనిపోయి యిరువురును మాటలాడుచు భుజించిరి. పిమ్మట విశ్రామశాలకుఁ బోయి యచట నెన్నియోసమాచారములు మాటాడిరి. ఉన్నట్టుండి దేవి దీర్ఘాలోచనఁ జేసి "కుమారా, మదనపాలుఁడు పిచ్చివాఁడై పునర్వివాహమునుగూర్చి మాటాడుచున్నాఁడే నే నట్లు చేయుదు నని నమ్మితివా" యని ప్రశ్నించెను.

లలితుఁడు—జననీ, నే నంతబుద్ధిహీనుఁడ ననుకొంటిరా? తము కిట్టి కష్టము సంభవించియున్నందులకు లోలోనఁ గుందుచున్నాను. మీరు రోగ మని సాకులఁ జెప్పుచుండునది నే నెఱుంగనా? నేను రత్నదీవికిఁ బోయి వచ్చినపిమ్మట నే యీవిషయము లన్నియు నాలోచించుజ్ఞానము నాకుఁ గలిగినది. అంతియకాక యిందిర నిచటఁ జూచినప్పటినుండి నావ్యసనము ద్విగుణీకృతం బయ్యెను. ఎందుల కనెదరో మీకడ దాఁప నేల? ఇందిర నాభావిసహధర్మచారిణి. దానిని వివాహము చేసికొనెద నని దానితండ్రి నడుగఁగ, ఇందిర పెండ్లి కొక గొప్పకళంక మభ్యంతరముగా నున్నది. అది తీఱినఁగాని వివాహము కానేర" దని వారు చెప్పిరి. అపు డతిదుఃఖముతో నే నిచటికి వచ్చినను దిక్కు తోఁపక వ్యసనాక్రాంతుఁడ నైతిని. అంతలో నిందిర యిచట దర్శన మిచ్చెను. నేను దానితో మాటలాడితిని. "కళంకము గలిగి యెన్నిదినము లి ట్లేకాకినిగ నుండు మనెదరు" అని చెప్పెను. రత్నదీవిలో నండసేనుఁ డిందిర నపహరింప యత్నించెనఁట. అందువలన వీరిరువు రచటనుండి వెడలివచ్చిరి. అదియునుం గాక ఆకళంక మిట్టి దని యిందిర కామెతండ్రి తెలిపినట్లున్నది. ఈచిన్నది పరమధైర్యశాలిని గనుక దానిని భేదించుటకు ప్రయత్నము చేయుటకై వచ్చియున్న దని చక్కఁగా తెలియు

చున్నది. ఆకళంకమును బోఁగొట్టుకొనుపని యీరాజగృహమం దున్నదని కదా, మన మూహింపవలెను? దీనితండ్రిని జూచిన పైన, సామాన్యపురుషులవలె లేరు. అతిగంభీరాకృతి. తొలుత వారిదర్శన మైనపుడే చకితుఁడ నైతిని. ఎటులైన నేమి? ఇందిరకార్యమును బ్రారంభించినది. దానికి కొంచెము సమీపమం దుండి వలయుసహాయము చేయుట కనియే యచటికార్యములు మంత్రి కప్పగించి యిచట నిలిచితిని.

దేవికన్నులలో నశ్రుధారాసంపాత మారంభించెను. దుఃఖము నడంచుకొని, "కుమారా, నే నిపు డానందము, దుఃఖ మను పరస్పరభిన్నములగు రసవాహినులలో మునిఁగియున్నాను. హా! దైవమా, నీచిత్రమే చిత్రము. తండ్రీ, లలితా, నే నిపుడు నాచిట్టితల్లి, ననుఁగన్నతల్లి, నాభాగ్యదేవత కేమి సహాయము చేయవలెనో యాజ్ఞాపింపుము. అనఁగా లలితుని మనస్సునకు మిగుల దుఃఖము గలిగెను. తల్లీ, యిపు డేమాత్రమైన నిందిరమీఁద దయ చూపి యితరుల కనుమానము గలిగించితిరేని మనము నలువురము వినాశమందుదుము. నాయిందిర లేనిప్రపంచము నే నొల్లను. ఇది నిజము. కనుక మీ కోపికతో ధైర్యము వహించి యుండవలయును. ఇందిర యిచటికి వచ్చునపు డామెతో నతిజాగ్రత్తగా మెలఁగవలయును.

దేవి—కుమారా, నే నంతపిచ్చిదాననా? ఆమహానుభావుఁడు కష్టములఁ బాసి యిల్లు చేరవలె నని నాకు లేదా? భయము వలదు. నాబిడ్డసుఖము నాది కాదా? మనము జయ మందిన, సుఖింతము. లేకున్న, స్వర్గమం దందఱముఁ జేరియుందము.

అంతఃపురమందు నేఁడు రాజమాత యభ్యంగస్నాన మాచరించెను. ఇందిర మిగులశ్రద్ధతో నామె కుపచారములు [illegible]రించుచుండెను. పిమ్మట భోజనశాలకుఁ బోయి పీటలు వేసి [illegible], రాజమాత కొంచె మాలస్యముగా భోజనమునకు వచ్చు నని విని, తనగదిఁ బ్రవేశించి పుస్తకము నెత్తు

టకు పెట్టెఁ దెఱచెను. వెంటనే దిగులొంది పెట్టెలోనివస్తువులు తాఱుమాఱై యుండుటం గని వానిని సరిగా నుంచుటకు వస్తువులు తీయుచుండఁగా నచట గుడ్డలయడుగున నొకహారము దొరకెను. దానిని వేఱుగాఁ దీసి యుంచుకొని పెట్టె మూసిపెట్టి రాజమాతసన్నిధానంబున కేగి నిలిచెను.

రాజమాత:—ఇందిరా, నేఁ డేల యొకవిధంబుగాఁ గనఁబడుచున్నావు? నీముఖ మెందులకు వాడియున్నది? ఇంతకుమున్ దెంతయో యుల్లాసంబుగా నుంటివే. ఇంతలో నేమిప్రమాదము వాటిల్లె?

ఇందిర:—జననీ, యీయనర్థము నే నేమని వచింతును? ఇచట నాకెవరును బరిచితులు లేరు. దైవము తోడని యిచటికి వచ్చితిని. నన్ను వెడలఁగొట్టుట కిది యొకయుక్తి కాఁబోలు. అయ్యయో! నాస్వప్నమందైనను నొకరికిని నెట్టియపకారమును జేయలేదే? నే నిచట నందువారందఱును మంచివా రనియే నమ్మియున్నాను. నమ్మించి గొంతు కోయుట తగునా? నన్నిచట ద్వేషించువా రెవరు? ఎందుల కని? ఇది నా కేమియు నర్థము కాలేదు. నా కింతకీడు చేసి తృప్తిఁ జెందుమహానీయు లెవరు? నే నెఱుంగకున్నాను. ఉత్తమసూర్యసంశీకక్షత్రియులచే ఖ్యాతిఁ గన్న మీ మేవారురాజ్యముయొక్క కీర్తినిగుఱించి నాతండ్రి పలుమాఱు తనస్నేహితులతోఁ జెప్పుచుండువాఁడు. అట్టి సంస్థానమును గన్నులారఁ గాంచుభాగ్యము నాకుఁ గలిగెఁగదా యని సంతోషించుచున్నదాని కిది ప్రతిఫలమా? జననీ, జూచితిరా, యీ యేకావళిని? ఇది నాపెట్టెలోనికి నెట్లు వచ్చి చేరినది? దానికిఁ గాళ్లుండెనా? నే నిచటనుండి పోయి పుస్తక మెత్తుటకుఁ బెట్టె మూఁతఁ దీసిన గుడ్డ లన్నియు మనుష్యులు దీసిన ట్లుండెను. మఱల వాని వానిస్థలమందుఁ బెట్టుటకు గుడ్డలను బైకెత్తఁగా నొకగుడ్డక్రింద నీహారము దొరకెను. ఇది మీకంతమం దుండునది. ఇంతలో నది యెట్లు నా పెట్టెకు వచ్చెను.

రాజమాత:—"ఇందిరా! యిది యెవరికృత్యమో తెలియలేదు. నీవింత దనుక నాసమీపమందే యుంటివే; నీ విపుడే తీసి చూచుకొన్నది మంచి దాయెను. లేనియెడల నెదుటివారి కనుమానాస్పదమే గదా? జరగినయం దంతమును నేను విచారించి యెవరు చేసినారో వారికిఁ దగినట్లు శిక్షవిధిం చెద. నీవు చింతింపకుము" అని సమాధానపఱచెను. మరల దానినిగుఱించి రాజగృహమందేదియు విచారణ జరుగలేదు. ఈరాజమాత గోముఖవ్యాఘ్ర మని యిపు డిందిర చక్కఁగాఁ దెలిసికొనెను. ఆ మఱుసటిదినము ఫల్గుననితో నీ వృద్ధవ్యాఘ్రము మాటలాడిన దని యిందిర గ్రహించెను. ఆనాఁటి నుండి యొకవస్తువును బెట్టెలోఁ బెట్టుటలేదు. ఇందిర మిగుల జాగ్రత్తగా నుండెను. ఇందిర కలఁతఁ జెంది తన మనస్సును శాంతిపఱచుకొనుటకై ప్రాఁత కట్టడము లుండు వనప్రదేశములకుఁ బోయి యచట నొకవృక్ష చ్ఛాయయందుఁ గూర్చుండి పుస్తకమును దీసి యుంచుకొని యాలోచించు చుండెను. ఆపు డామార్గముననే ఫల్గునుఁడును బోవుచుండి "అమ్మాయీ, యెందుల కిచట నొంటరిగాఁ గూర్చుండియున్నారు?" అనెను. ఇందిర దిగ్గునఁ దల పైకెత్తి చూచి కన్నీటిని దుడుచుకొని 'నీ కన్న దేమి' యనెను.

ఫల్గునుఁడు—ఎందుల కిట్టి భయంకర మైనస్థలమం దొంటరిగా మీరు కూర్చుండియున్నా రని యడిగితిని.

ఇందిర—"నాకష్టములు నీతోఁ జెప్పవలసినంతపని లేదు. చెప్పినఁ దీఱుటయు లేదు. నీ దారిని నీవు పో వచ్చు" నని చెప్పుచుఁ దాను లేచి వెడలిపోయెను.

ఫల్గునుఁ డిందిర పోవుటను జూచి, "ఆహా! దీని కెంతగర్వము! ఈ నాఁటివఱ కీయుదయపూరుసంస్థానమం దెవరిచేతను నే నింతయవమానము పొందలేదు. ఇన్నిదినములవఱ కిది యెవరో దిక్కుమాలినదని యూరకుంటిని. ఇది మిగుల సాహసికురాలు. నేనే యాపని చేసినవాఁడ నని యిది కనిపట్టి యుండునా? లేదు, లేదు. అది యేడ్చుచుండినది. అటులు నామీఁదఁ

గోపము చూపు టేల? చక్కఁగఁ బరీక్షించినఁగాని యేవిషయమును దెలియదు. ఇది యీయంతఃపురము విడిచి యెచటికిఁ బోవును? విక్రమసింహుఁడు చనిపోయె నని వినియుంటిమి. అతనిబిడ్డగా నున్నను, యుక్తి చేసి దీని నే నెందులకుఁ బెండ్లి జేసికొనఁగూడదు? నాకుఁ గావలసినంతద్రవ్యమున్నది. ఈ చిన్నది నాకు దొరకిన నే నిచట నుండను. అదియును జూచెద. అబ్బా! రాక్షసిముండ నన్ను వరించునా? అది నన్నుజిమిచూడఁగనే నాగుండెలు చెదరిపోయినవి. ఉపాయముచే నన్నికార్యములు సమకూరు" ననుకొని మనోరాజ్యముఁ జేయుచుఁ బోయెను.

లలితకుమారుఁడు దేవితో మాటలాడి పోయినపిమ్మట తమరాణి నిద్రించుచున్న దని సకియలు దూరంబుగాఁ గాంచియుండిరి. దేవి లేచి కూర్చుండి చెదరిపోయిన తనమనస్సును స్థిరపఱచుకొనెను. ఇన్నిదినము లిందిరను విడిచియుండుట యొకప్రళయ మైన ట్లున్నది. "ఇఁకమీఁద నాయిందిరతో నతిసంభాషణ చేయఁగూడదఁట. నే నె ట్లుండఁగలను? దైవమా! నాజీవితమున కిన్నికష్టములా? కానిమ్ము. జయ మైనను, అపజయ మైనను నిఁకఁ గొన్నిదినములే కద?" అని యిట్లు నిశ్చయము చేసికొన్నసమయంబున దేవికి నొకదాసి జాబుఁ దెచ్చియిచ్చెను. "ఇందిరకూడ నిన్నుఁ జూచుటకు వచ్చుచున్నది." యని జాబులో వ్రాసియుండుట చూచి దేవిముఖము వికసిత మాయెను. ఆయాపనుల నందఱకు నుత్తరు విచ్చి తాను స్నానం బాచరించి యెల్లప్పుడు ధరించుచుండు నాభరణములు గాక యొక యేకావళిని ధరించెను. చేతియందుండు నాభరణములకాంతిచేత నానాఁడు హేమప్రభ తననామమును సార్థకం బొనరించు చుండెను.

భృంగరాజివలె నున్న తన వినీలకుంతలములఁ బైకెత్తి కట్టి యొకపుష్పంబు ధరించుకొని యుండెను. అపుడామెముఖము శర్వరీకాంతుని ధిక్కరించునంతటి తేజముతోఁ గూడి విరాజిల్లుచుండెను. ఇట్లు దేవి యలంకరించుకొని విశ్రామశాలయందుఁ దిరుగుచుండఁగా, బండ్లశబ్దము విని యచటనే

నిలిచెను. వచ్చినరాజునకు స్వాగతం బొసంగెను. రాజువెంబడి వచ్చినబంధువు లందఱను మన్నించి వారిని దృప్తిఁ బొందించెను "రాజేంద్రా, నీ వెంత దయాహీనుఁడవు. నీవు వచ్చునపు డిందిరను బిలుచుకొనిరావలదా? దానినిఁ జూచి యెన్ని దినము లాయెను! మీతల్లి కోరినట్లయిన నది యచటనే యుండ నిమ్ము. నీతోఁగూడ వచ్చిపోఁగూడదా?" యనెను.

రాణి తనయెదుట నిలిచి మాటలాడినసొగసుఁ జూచి రాజు ముగ్ధుఁడాయెను. తనయంతటి పుణ్యపురుషుఁ డీప్రపంచమందు లేఁ డని తలంచెను. ఆమె యింటిసేవకత్వము దొరకిన నదిస్వర్గతుల్యంబని భావించెను. "దేవీ, వన్నట్లు నీవు తలపఁగూడదు. స్వప్నమం దైనను నీయిష్టమున కన్యథా నడచువాఁడను గాను. ఇందిర యిపుడే వచ్చును. నే నమ్మతోఁ జెప్పివచ్చితిని. అయిన నీకుఁ గొన్ని దినములు మాయమ్మకు సహాయముగా నుండనిమ్ము. ఆ చిన్నదానివలన నమ్మ కెంతో సుఖము. నీడవలె నామె ననుసరించి సేవించుచున్నది.

దేవి—అవును. దానిస్వభావము నే నెఱుంగుదును. లోకుల కా చిన్నదానిసేవయే మందువంటిది. కనుక నే దానియందు నాకుఁ బ్రేమ. దానిసద్గుణములఁ జూచి మనవలెనే యందఱు నాచిన్నదానిని బ్రేమింతురు. అది క్రొత్తగా నాయంతఃపురంబునకు వచ్చిననాఁడు, ఆభరణముల నమ్మువారు మాకు "విధిలేక యీచిన్నదానిని విడిచిపోవుచున్నాము. ఇంతమంచిపిల్ల దొరకుట యరుదు" అని చెప్పి పోయిరి.

ఇంతలో నిందిరవచ్చి దేవికి నమస్కరించి తనచెలికత్తెలతో మాటలాడుటకై యరిగెను. ఇది యంతయు ఫల్గునుఁడు దూరముగా నుండి యతిజాగ్రత్తగా గమనించుచుండెను. లీలను బిలిచి యిందిరవిషయము నిపు డతిజాగ్రత్తగాఁ గనిపెట్టవలె నని చెప్పెను. సంధ్యాకాలము. దేవియంతఃపురంబున నెచటఁ జూచినను దీపకాంతులు ప్రకాశించుచుండినవి. ఎచటఁ జూచినను సుగంధపువత్తులు మొదలగువానివాసనలు వ్యాపించియుండెను. వీ రందఱుఁ

చల్లనిగాలికై యుద్యానసమీపమం దున్న మందిరమును బ్రవేశించిరి. అచట నుద్యానమందలి వివిధపుష్పంబులవాసనను గ్రహించినగంధవహుఁ డందఱ యుల్లంబుల కాహ్లాదకరం బగునట్లు వీచుచుండెను. అట్టిరమణీయం బగు మందిరంబున వారివారి కుచితాసనములయందు విశ్రమించి యెన్నియో వ్యవహారంబులఁగూర్చి మాటలాడుచుండిరి. దాసదాసీజనంబులు వారివారిపనుల యందు మగ్నులై యుండిరి. ఇందిర తనతండ్రిని దలంచుచు బైట నిలిచి తన దృష్టి నుద్యానవనపార్శ్వంబులఁ బ్రసరింపఁజేసెను. అచట నేదియో యిందిరకు గోచరింపఁగనే తత్క్షణమే యావృక్షంబులసందులలోఁ దూఱి మాయ మయ్యెను. అట్టిసమయంబున నచట ఫల్గునుఁ డుండియుండెనేని యనర్థము కలిగి యుండును. దైవగతి యిందిర కనుకూలంబై యున్నది గనుక వాఁ డచట లేఁడు. వివాహము నిశ్చయించుకొనుటకై నీలవేణివెంబడిఁ బోయి యుండెను. ఇందిర పోయి చెఱువుగట్టున నుండు బండలనడుమ నుండు ప్రదేశము నందు దిగెను.

మిత్రానందుఁడు—"ఇందిరా, భయమా?"

ఇందిర—తండ్రిపాదములయందుఁ దనతల నిడి నమస్కరించెను. అప్పు డొకటి రెం డశ్రుబిందువు లాతనిపాదంబులమీఁదఁ బడినవి. మిత్రానందుఁ డదరిపడి బిడ్డ నెత్తి కూర్చుండఁబెట్టుకొని "నాచిట్టితల్లీ, ఎందుల కేడ్చెదవు? ఏమి సమాచార" మని యడిగెను.

ఇందిర—జనకా, యట్టిప్రమాద మేమియు లేదు. కొంచెము దైవము కన్ను దెఱచిన ట్లున్నది. అయిన, మహావిపత్తులనుగూడ నెదుర్కొనవలసి యున్నది." యని జరిగిన వృత్తాంతము లన్నియుఁ జెప్పెను.

మిత్రానందుఁడు—నాకన్నతల్లీ, నిన్ను వాఁడుకని పెట్టియున్నాఁడు. ఏల నీతల్లియొద్ద నుండఁగూడదు?

ఇందిర—నాయనా, ఫల్గునునిచర్యలు పెద్దప్రాసాదముననుండి కదా, కనుపెట్టవలయును. మఱియు తారవిషయమును జెప్పుచు నది నాకు సహాయ

ముఁ జేయును. తాతగారిపడుకటింటిని బరీక్షింపవలె నని యేర్పాటుచేసి తిని. జనకా, తమ రిట్లు భయపడెద రేల? వీరశిఖామణుల రగు మా కిది యంతయు నొక లెక్కయా?

మిత్రానందుఁడు—అమ్మా, నే నిపు డపరాధి ననిపించుకొనియున్నా నుగద? అట్లు లేకున్న నే నెందులకు భయపడవలెను? ఆ యపవాదమును బోఁగొట్టుటకై కదా నారత్నముల బొమ్మను దాసివలె బైట విడిచి దొంగ వలెఁ దలదాఁచుకొని యున్నాను. అమ్మా, రాజ్య మనుభవింపవలె ననునాస నాకు లేదు. నీతల్లి యీపదియేండ్లనుండి యనుభవించినకష్టమునకు మేర లేదు. నీవు ప్రపంచసుఖ మెఱుఁగనిబాలవు. నేను జీవించియుండియు మీ యిరువురను గష్టములపాలు నేసి తపం బొనరించుటకుం బోయిన, నాతపంబే దైవమునకుఁ బ్రీతి గాఁగలదు? మానవుఁడు తాను జేయఁదగిన ధర్మములను సరిగాఁ జేయనిచో, నతఁడు ఋషివిముక్తుఁడు కాఁజాలఁడు. కుమారీ, నే నీ ప్రపంచమునందుఁ గృతకృత్యుఁడనై యీసంసారసముద్రము దాఁటుటకు నిన్ను నాకర్థమం దీశ్వరుఁడు పుట్టించినాఁడు. నిన్నొకనావగా నేర్పఱచుకొన వలయు నని యతనిసంకల్పము గాఁబోలు. తనయా, నే నిపుడు నీతల్లిని జూచితిని. దానిశరీరమునం దాభరణములు లేకున్నను సద్గుణాభరణభూషిత యై యచట నుండువారందఱమనంబుల నాకర్షించుచున్నది. అమ్మా, నీతల్లి మిగుల కృశించియున్నది. దానిహృదయవేదన ముఖమునందుఁ జక్కఁగాఁ దాండవ మాడుచుండఁగా, ఆ మూఢుఁడు దానిని గుర్తింపక యేదియో భ్రమఁ జెంది మనస్సు పోయినదోవలోఁ బడి పోవుచున్నాఁడు. మదన పాలుఁడు మొన్న యొకయాపదనుండి తప్పినాఁడు.

ఇందిర—అది యేమి?

మిత్రానందుఁడు—మొన్నటిదినము తొమ్మిదిగంటల సమయంబున భూగృహమార్గమునందే యీయుద్యానవనంబునకు వచ్చితిని. లోభాగము చూడఁగ నీతల్లి యచట వేదికపైఁ గూర్చుండియుండెను. మదనపాలుఁడు

మాటాడుచుఁ దల వంచుకొని యుండెను. వానిసంభాషణయందు నన్నుఁ దిరస్కరించినట్లు నాకు వినఁబడెను. అంతలో నీజనని తనకు ప్తఖడ్గమును దీసెను. నే నింతలో "ఓపిక, ఓపిక" యని యఱచితిని. అది నలువంకలఁ దిరిగి చూచి మిన్నక యుండి యపుడే వానిని బంపివైచెను. మదనపాలుఁడు మిగుల యోగ్యుఁడు. ఓపిక గలవాఁడు. వాని యక్కఱమాటలను విని వాఁ డీ దురాలోచనకుఁ బాల్పడినాఁడు.

ఇందిర—జనకా, తమ యౌదార్యగుణము నే నేమని వర్ణింతును. ఆనీచుఁడు నాతల్లిని బునర్వివాహము చేసికొనవలె నని యోచించియుండఁగా, వాఁ డెట్లు గుణవంతుఁ డగును? మాయమ్మను జూచిన, మిక్కిలి భయము. అయినను బట్టు వదలక నక్కయుక్తులు పన్నుచున్నాఁడు. ఇట్టి దుర్మార్గుని మీరు పొగడుచున్నారే. నేనును నెన్నియోసార్లు వానిని జంపవలె నని యోచించితిని.

మిత్రానందుఁడు—అమ్మా! అది తగనిపని. అమ్మను జూచి భయ పడుటయే సత్పురుషలక్షణము గదా? దుర్మార్గుని కేమిభయము? నీతల్లి చెప్పిన దంతయు నమ్మియుండుటచేతనే యతఁడు సత్పురుషుఁడు. నేనును గార్యసిద్ధికై పూనుకొనుట కవకాశము కల్గినది. వాఁ డట్లు దుష్టుఁడై యుండిన నీతల్లి యెపుడో పరమపద మొందియుండును. నీకు వివాహముఁ జేసి నే నడ వులపాలై పోవలసినదే కదా? నీతల్లి లేని స్వర్గ మైన నాకు రుచించునా? మురళాదేవీఫల్గునుల దురాలోచనలకు వాఁడు లోఁబడియున్నను, నీ తల్లి యి ష్టము నెదురుచూచుచు, దాని నొప్పింపక యుండవలె ననుదయ వానియెద యుం దున్నది. కనుక వాఁడు సద్గుణవంతుఁ డని నమ్మము. 'వేధా ద్వేధా భ్రమం చక్రే కాంతాసు కనకేషుచ, తాసు తేష్వ ప్యనాసక్తో సాక్షాద్భర్గో నరాకృతిః' అని శాస్త్రము. ఇందిరా, లోకమందు నీతల్లివలె దిక్కులేక యనాథగా నున్న స్త్రీని వలలో వేసికొనుటకుఁ బ్రయత్నించుట సామాన్య మానవునిస్వభావము. యుక్తిచేతనో సాహసముచేతనో తనపాతివ్రత్యమును

రక్షించుకొనుట రూపవతి యగుస్త్రీస్వభావము. కనుక వాని నెందులకు నిందించుట? పుత్రీ! ప్రొద్దైనది. నిన్ను వెదకుదురు. నిన్నచట విడిచి పోయెద రమ్మని యిద్దఱు మెల్లఁగా నడచుచుఁ "దనయా, నాకై యేమాత్రము వగవకు" మని యామెచెవిలో నేదియో చెప్పి, యామెను ప్రాసాదముద్వారము నొద్ద చెట్లసమీపమందు విడిచి మరలెను. ఇందిర లోపలి కరిగెను. మిత్రానందుఁడు కొంతదూరము పోవుచుండఁగా, ఫల్గునుఁడు వచ్చి యతనిని దొంగిమాచి గట్టిగ చెయ్యిపట్టుకొనెను. మిత్రానందుఁ డాచేతి నటులే నులిమి యొకతన్ను తన్నఁగానే క్రింద దొర్లి ప్రాసాదద్వారమునొద్దఁ బడి యచట నుండి మెల్లఁగా లేచి వణఁకుచున్న శరీరముతోను, బెదరినగుండెలతోను లోపలి కరిగి రాజునగ్గఱఁ గూర్చుండెను. రాజు ఫల్గునునిఁ జూచి సగము ప్రాణ మెగిరిపోయినవానివలె హీనస్వరముతో "ఫల్గునా! ఎందుల కిట్లున్నావు? ఏమి జరిగెను? త్వరగాఁ జెప్పు" మనెను.

ఫల్గునుఁడు 'దాహ' మని సంజ్ఞఁ జేసెను. ఆక్షణమందు నీళ్లు దెచ్చి యిచ్చిరి. దాసీజనులు విసరుచుండిరి. కొంచెమాయాసము తగ్గెను. గుండెలింకను గొట్టుకొనుచుండినవి. మెల్లఁగ లేచి చేతులు జోడించుకొని "రాజచంద్రమా, నే నేమని చెప్పుదును? ఇపటికి నూటిగా నుండుచెట్లసందులలో నిందిరమ్మగా రెవనితోనో మాటలాడుచుండిరి. ఆమె ప్రాసాదమున కరిగెను. నేను వాని కెదురుగాఁ బోయి వానినిఁ బట్టుటకై యత్నించి తుదకు వానిచే తిని బట్టుకొంటిని. వాఁడు నాచేతిని బట్టి నులిమెను. వాఁడు నులుముటచేత నాచేయి యింకను స్వాధీనమునకు రాకయున్నది. అంతటితో నూరకయుండక యొగసి తన్నెను. అచటనుండి దొర్లి ప్రాసాదద్వారమునొద్దఁ బడితిని. నేను జేసికొన్న పుణ్యఫలమువలనఁ జావక బ్రతికితిని. మన కేమి యనర్థము రానున్నదో దేవుఁ డెఱుంగు" ననెను.

రాజు—ఏమి యీ వైపరీత్యము! దేవీ, యిది యెంతసాహసము? ఇందిర యింతకపటి యని నాకలయందైన నేఁ దలఁపలేదు. నీ వామెను విచారింపుము. ఇది మిగులఁ బ్రమాదంబు గదా!

దేవి—తత్క్షణమే యిందిరను బిలిపించెను. ఆమెయు వచ్చి నిలిచెను. "ఇందిరా! నేను వృక్షములచాటున నీతో మాటలాడినమనుష్యుఁ డెవఁడు! ఇదివఱకెన్నఁడైన నతఁ డిచటికి వచ్చియుండెనా? నీ వింతసేపెచట నుంటివి?" యని యడుగుచుండఁగాఁ దార వచ్చి దేవియెదుట నిలిచెను. "దేవి తారను జూచి యిపుడేల వచ్చి నిలిచితి" వనెను.

తార—ఇపుడొకగంటకుముందు భోజనశాలయందుఁ బాత్రలు, పీఁటలు మొదలుగువానిని సిద్ధపఱచుచుంటిమి. తరువాత మేమిరువురము ఏటిగట్టునకుఁ బోయి కూర్చుండియుంటిమి. లేచివచ్చునపు డెవరో "అమ్మా, యిందిరా! నీకై రెండుదినములనుండియు నిచట వేచియున్నాను. ఇదిగో" అని చేయి చాఁచెను. నేను లోపలికి వచ్చితిని. తరువాత నేమి జరిగెనో నే నెఱుంగను.

దేవి—ఇందిరా! తార చెప్పినది నిజమేనా?

ఇందిర—దేవీ, నిజమే. ఇదివఱలో వర్తకు లచటికి వచ్చి "నీతో మాటలాడఁగలరు" అని నాతండ్రి జాబు వ్రాసియుండిరి. ఈనాఁడు నేను వచ్చుచుండఁగ ద్రోవలో నామనుష్యునిఁ జూచి మాటాడితిని. అతఁడు నాకుఁ గొన్ని మొహరీల నిచ్చినాఁడు. అవి నాతండ్రి పంపినవి. వాని నింకను నేనెచటనైనఁ బెట్టలేదు. ఇవియే" యని నాలుగైదుమొహరీలను దీసి దేవియెదుటఁ బెట్టెను. దైవాధీనంబుగ మిత్రానందుఁడు తని బిడ్డకర్చుల కని యీ మొహరీల నిచ్చియుండెను. అది యిందిరమానసంరక్షణకుఁ గారణంబైనది. దేవీ, వీనిని దీసికొని లోపలికి వచ్చితిని. బైట జరిగినవిషయము నాకుఁ దెలియదు.

దేవి వానిని రాజుచేతి కందిచ్చెను. అవి రత్నదీనిమొహరీలు. వానిని జూచి రాజునకు మన స్త్రిమిత మాయెను. ఫల్గునా, ఏమితప్పు లేనిదే వానిని విచారింపక యెందులకుఁ బట్టుకొంటివి?

ఫల్గునుఁడు—రాజా! దొంగ యని పట్టుకొంటిని. వాఁ డేమియుఁ జెప్పకయే నన్ను నిష్కారణముగఁ దన్నవచ్చునా? వానిని బట్టి తెప్పించి శిక్షింపక నామీఁదనే కోపించెదరే. ఇది యేమిన్యాయము?

రాజు—లెమ్ము, నీయిష్టముప్రకారము వానిం బట్టి తెప్పించెద. వేళ యతిక్రమించుచున్నది. అని యందఱు భోజనాదులు ముగించిరి. రాజు తన ప్రాసాదంబునకు జనెను. ఇందిరయును రాజుతోఁగూడ వెడలి పోయెను.

దేవి యీ కార్యమునుచేసినది తనభర్తయే యని లోలోన నవ్వుకొనెను. అనంతరము గొంతవడికి మరల తనపుత్త్రునిఁ బిలిపించి యతఁడురా,

రాజమాత—కుమారా! ఫల్గునుఁడు విక్రమునిఁ జూచితి నని చెప్పుచున్నాఁడే. ఇది యేమియాపద?

రాజు—అమ్మా! 'ఏచ్చువారికంటెఁ బడినవా రందఱు యమదూత' లన్నట్లు మన ఫల్గునుని కందఱు విక్రమసింహులె. ఇఁక నాపిల్ల చంపకమాలిని యైనది. ఏమి వీనిబుద్ధి? వాఁడు చెప్పినదంతయు మీకు వేదవాక్యము. మీరు వానికి మిక్కిలి చనవిచ్చియుండుటంబట్టి, మీదయ సంపాదించుటకై యున్నది. లేనిది కల్పించి కథగాఁ జెప్పి మిమ్ము మెప్పించును. ఈనాఁ డంత జాగ్రత్తగాఁ గనుపెట్టియుండెనే, ఇందిర దేవితో స్నేహమైన మర్మముగా మాటలాడెనా? విచారింపుఁడు. ఇవి యున్నియు వట్టిభ్రాంతులు, లేనిపోని వికల్పవల నూహించుకొని మనస్సును జింతలపా లొనరింపకుఁడు.

ఫల్గునుఁడు మాఱు పలుకలేదు. "ఓహో! యీతనికి రోగముపుట్టిన ట్లున్నది. దీనికిఁ దగుమందు నూఱవలసినదే, ఇపు డేమైనఁ జెప్పితినా, కుమారునిమాటలకు లోఁబడి నన్నే తిట్టును గాని ఫల మేమియుఁ గలుగదు. ఈ

వృద్ధ బక మూరకుండిన నాగతి యేమి? నీచురాలగు నిందరను నాకోపాగ్నికి నాహుతిఁ జేసుకొనవలదా? ఒకవేళ నన్నుఁ దన్నినవాఁడు దానితండ్రి యై యున్న, వీనిరాజ్యమునకే భంగము కలుగును. ఈమూఢుఁడు-ఆవృద్ధురాలు వీరెట్లు చచ్చిన నాకేమి? డిల్లీచక్రవర్తి యనంగపాలుఁడై యున్న భయము లేదు. ఇఖు డుండునది పృథ్వీరాజుగదా! అతనికి నామీఁద ననుమానము గల్గినట్లైన బ్రతుకఁగలనా? భూమియం దుండుజంతువుల కైనఁ దెలియనీకయుంచిన్న దానిని జంపవలెను. తొలుత రాజును జంపిన హంతకుడు దొరకెనని డిల్లీశ్వరునకుఁ దెలియఁజేసి యచటనుండి సిఫాయిలఁ దెప్పించి యామూర్ఖునిఁ బట్టించి తీరవలయు"నని తనలో యోజించుకొనుచుండెను. రాజనట నుండి లేచి విహారమున కుద్యానవనంబునకు వెడలె. అది సమయం బని రాజమాతసమీపంబున కరిగి ఫల్గునుఁడు నమస్కరించి నిలిచెను.

రాజమాత:—ఏమిరా ఫల్గునా! ఎందుల కిట్లు చింతాక్రాంతుఁడవై యున్నాఁడవు? నిజమైనవృత్తాంత మేమి? నాయందు దాఁపక యెఱింగింపుము.

ఫల్గునుఁడు—"కన్నతల్లి, నీయనుగ్రహములనవే కదా నిన్నిదినములు బ్రతికియున్నాను. మీకు ద్రోహం బొనర్చి నే బ్రదుకగలనా?" యని ఘోరున నేడ్చెను. రాజమాతను దనయుఁ జేతిలో నుంచికొని గంటలకొలఁది మాటాడెను. ఇందిరవిషయమందు మిగుల జాగరూకతతోఁ బ్రవర్తింపవలయు ననునదియే ముఖ్యమైన విషయము.

# షోడశోఽధ్యాయము



కార్తీకమాసమునందు వనభోజనంబునకుఁ బోయివచ్చిన, నారోఁడంతయు నేపీడలు లేక సుఖముగా నుందు రని జనులనమ్మకము. మేవారు సంస్థానమం దొకనాఁడు ప్రాతఃకాలమందు గుంపులుగుంపులుగాఁ గొందఱు కాలినడకతోను, గొందఱుబండ్లమీఁదను, నాయూరిచుట్టు నుండువనంబుల కేగుచుండిరి రాజప్రాసాదమం దుండువారుమాత్రము బాణనదీతీరమం దున్నయుద్యానవనంబునకు నంతఃపుర దాసదాసీజనములు బండ్లలో సామానులతోఁ గూడఁ బోవుచుండిరి. కొందఱురాజభటు లుత్తమాశ్వంబుల నెక్కి ముందుగాఁ బోయి రాజస్త్రీలు దిగుటకై తగువసతుల నేర్పఱచుచుండిరి. ఉదయపూరులోఁ బ్రతియింటివాకిటియందును ముగ్గులఁ బెట్టి తోరణంబులఁ గట్టి యలంకరించియుండిరి. ఇఁక రాజప్రాసాదమునం దలంకారమున కేమికొదవ? ఇండ్లయం దుండువారు ఏముసలవ్వలనో, లేక సేవకులనో కావలియుంచి తమభార్యలతోఁడను బిడ్డలతోడను గూడి వనవిహారంబునకుఁ బోవుచుండిరి. బాణనదీసమీపమం దున్నయుపవనము లన్నియు జనులచే నిండియుండెను. అన్నిజాతులవారును వారివారి వైభవములకుఁ దగినట్టు చెట్లనీడలయందు వసతుల నేర్పఱచుకొనియుండిరి. రాజు దిగుటకుఁ బటమండపముల నమర్చియుండిరి. వంటకుఁ దగుపందిళ్లను వేసియుండిరి. దాసదాసీజనులలంకృతులై యచట నొకపని చేయకయున్నను బనులుచేయుచున్నవారివలె నిటు నటు తిరుగుచుండిరి. కావలివారలు తమకై వేసియున్న డేరాలలో వారివారి యాయుధముల సవరించుకొనుచుండిరి. యోధులు గుఱ్ఱములమీఁద గస్తీతిరుగుచు, జనానాస్త్రీ లుండుస్థలంబుల కొరు లెవ్వరును రాకయున్నను, నాపని తమవలననే జరుగునటులెంచియుండిరి. ఇది రాజు దిగియుండు

బటమండప మని చెప్పకయే, మిగుల శృంగారముతో నొప్పియుండె. ఒకడేరాలో మదనపాలుఁడు తనతల్లితో మాటలాడుచుండెను.

రాజమాత—కుమారా, మన హేమ యేల రాలేదు? ఆమెకు నీవు చెప్పి పంపలేదా?

రాజు—అమ్మా, నే నట్లు చేయుదునా? వివాహము కానిది యామె యట్లు విహరించుట కిష్టపడదు. అదియునుం గాక యీవలిగాలి యామెశరీర మునకు సరిపడదు. దగ్గు మిక్కుటమగును.

మురళి—కుమారా, నీవు పిచ్చివాఁడవు. వివాహమున కామె సమ్మతించియున్న, స్వేచ్ఛగా నెందుల కిచటికి రాఁగూడదు? నే నీక్షణమే రప్పించితీఱుదును. అయినను దగ్గని నీవు చెప్పియున్నందున వెనుదీయుచున్నాను. కుమారా, యామె కౌషధ మిప్పించుచున్నావా! ఆవగ్గుస్వభావ మెట్టిదో వైరాగికిఁ జూపింపవలెను.

ఆమెగర్జనకు మదనపాలుఁ డేమియుఁ బ్రత్యుత్తరం బొసంగఁడాయెను. లలితుఁడు మొదలగు రాజబంధువు లందఱు వినోదముగ విహరించుచు వచ్చిన శాస్త్రులవారితో శాస్త్రవాదము లాడుచుండిరి. అందొకపటకుటీరంబునందు రత్నకంబళముఁ బఱచి చుట్టు మఖమల్ దిండ్లు వేయఁబడియుండెను. పూర్వాచారపరాయణు లగుకొందఱు వృద్ధక్షత్రియు లచటఁ గూర్చుండియుండిరి. ఇట్టి వినోదకాలములందు వేశ్యానర్తనము లేనిది రాణింపదనుతాత్పర్యము గలవారు గనుక నచటికి వచ్చినవేశ్యలను బిలిపించి వారు నర్తించుచుండ నానందమునందు నోలలాడుచుండిరి. అట్టిసమయమందు నవనాగరికుఁడును, శోచనీయంబగు వేశ్యావృత్తిని బోఁగొట్టి వారి నుద్ధరించుటకై యాకాలమందే బద్ధకంకణుఁడైనవాఁడును, మానధనుఁడు నగు లలితుఁడు గ్రహచారవశమున వారికంటి కగపడెను. ఈ గుంపునకుఁ బెద్ద యగు నారాయణసింగటువైపు చూచి, “ఓయీ లలితా! ఇటు ర”మ్మని యదే

పనిగా లేచిపోయి యతనిని బిలుచుకొనివచ్చి యందఱనడుమఁ గూర్చుండఁ బెట్టెను. అనట నర్తించుచున్న చంద్రవదనను జూచి నారాయణసింగు "నాయికా ఇతఁడు మాళవరాజు. ఇతనికిఁ బాటయం దమితప్రీతి. ఒక చక్కనిపాట పాడు" మనెను. లలితుఁడు విధిలేక తల వంచుకొని కూర్చుండ వలసినవాఁ డాయెను. ఆనాయికయును మనోహరం బగు తనగొంతెత్తి పాడుచు అభినయము పట్టుచుండెను. అయిదు నిమిషము లుండి లలితుఁడు "తాతగారూ! రాజుగారు నాకై కాచియుందురు. అచ్చటికిఁ బోయెద" నని చెప్పి తప్పించుకొనిపోయెను. ఇట్లావన మంతయు సరస్వతీనర్తనశాల యన, వాద్యముల చేతను సంగీతములచేతను, దనరారుచుండెను.

సంధ్యాకాల మగుచుండెను పక్షు లన్నియుఁ గలకలారావంబులచేఁ గాలంబు దప్పక తమకులాయంబుల కరుగుచుండినవి. ప్రజ లంతయు వేడుకలు ముగించుకొని ప్రయాణసన్నాహంబులఁ జేయుచుండిరి. అదివఱకే యనేకు లిండ్ల కేగియు, నేగుచు నుండిరి. అపుడే సరస్సులయందలి పద్మములకాంతి వ్యసన మొందినవానివిద్యవలెఁ గాంతి దగ్గుచుండెను. దుర్మార్గులహృదయము నువలె నలుదిశలయం దంధకారము ప్రవేశించెను. దుర్జనులనడుమ నుండినను, సజ్జనులు వారిసద్గుణములచేఁ బ్రకాశించుచున్నట్లు లంత గాఢాంధకారమును గూడ ధిక్కరించి నక్షత్రము లచ్చటచ్చటఁ దమకాంతిని బ్రసరింపఁజేయఁ జొచ్చెను. అట్టి సంధ్యాకాలమందును వనవిహారమం దనురాగిణి యగు నిందిర యావనమందుఁ దనయిష్టముప్రకారము సంచరించుచు నలుగురు సఖియలతో నదీతీరమం దున్న యిసుకదిబ్బలయం దాడుకొనుచుండెను. కొంచెమునే పట్లు విహరించి యందఱును వెడలిపోయిరి. ఇందిర తార—యీయిరువురును నాపలమును విడిచి తమయెదుట నున్న చిన్నచిన్న పడవలను జూచుచుఁ బోయి యం దొకపడవ నెక్కి కూర్చుండిరి. ఇందిరా! యందఱుఁ బ్రయాణమైన ట్లున్నది. చీఁకటి యధికమాయెను. రాజమాత మనల వెదకుచుండును. పోదము రమ్మని తార పిలువగా, "తారా! నేఁడు మారత్నదీవియం దున్నంత

యుత్సాహముతో నున్నాను. అచట మాకు రాత్రి యను భయము లేదు. నీవు పోయి మనకు బండ్లు సిద్ధమై యున్న వేమో చూచి రమ్ము. నీ విచటికి వచ్చు వఱకు నిచటనే కూర్చుండెద నని యిందిర చెప్పెను.

తార:—పాప మిందిర మిగుల నలసియున్నది. పోయివచ్చెద' నని తార వీడ్కొనుచు ఇందిరా, యిచట నది మిక్కిలి వడిగాఁ బ్రవహించును. ఇచట నెవరును దిగి స్నానముచేయఁగూడదని యమ్మగారియాజ్ఞ. జాగ్రత్త. ఈపడవలోనే యుండుమని చెప్పి పోయెను. వీరిసంభాషణ నంతయుఁ జెట్లపొదలో దాఁగివినుచుండిన ఫల్గునుఁడు 'అవును. దానికి నేఁ గాయుర్దాయము తీఱినది. లేకయున్న నింతచీఁకటిలోఁ దా నొక్కతె యిచట నుండి వారిని బంపునా? ఇది తగు సమయమని ముందుగావచ్చి పడవకుఁ గట్టియున్న త్రాటిని తనచేతిలోనున్న కత్తితోఁగోసి మరల నాపొదరింటిలో దాఁగి మెల్లఁగ సాగిపోయెను. ఫల్గునుఁడచటికి వచ్చినపు డంతఃపురస్త్రీలు బండ్ల నెక్కుచుండిరి. తార పరుగెత్తుచుండెను. ఫల్గునుఁడు దానిని బిలిచి 'యిందిర బండి నెక్కిపోయెను. నీవు బండియెక్కు' మనెను. తార వానిని జూచి ముందడుగుఁ బెట్టుటకైన ధైర్యము చాలక బండి యెక్కెను. అందఱు నిండ్లకుఁ బోయిరి. ఏటిగట్టుననున్న యిందిర పడవ యెందులకో జరుగుచున్నదని లేచి యొరగా నిలువఁగానే, పడవ నీళ్ల మధ్యమందుఁ దలక్రిందులై కొట్టుకొని పోయెను. ఇందిర నీళ్లలో మునిఁగిపోయెను. మునుఁగుచున్న సమయంబున "రాక్షసిముండా! చావు" మని యెవరో గట్టునుండి చెప్పినట్లు వినఁబడెను. ఈఁదుటయందిందిర నేర్పరి. ఆమూఢున కావిషయము తెలియదు. ఇందిర యుల్లాపముగా లోపలనే యీఁదుచుఁ బోయి జాలరులు నీళ్లయందు విడిచియున్న యీఁతకట్టెలను సహాయముగా నందికొని, రాజభవనమునకుఁ గొంచెము దూరముగా గట్టెక్కి తడిగుడ్డలతో నంతఃపురంబునకుఁ జని తనపనులఁ జేసికొనుచుండెను. బండ్లు వచ్చినవి. అందఱు వారివారి స్థానంబులఁ జేరిరి. రా జావాఁ డలసటచేఁ దల్లితోఁ గూడ భోజనమునకు

రాలేగు. మఱుసటిదిన మెప్పటివలె మదనపాలుఁడు తల్లి యంతఃపురంబునకు వచ్చెను. పిమ్మట ఫల్గునుఁడు వచ్చెను. అచట రాజమాత సమీపమం దున్న యిందిరను చూచి చకితుఁడాయెను. ఇది స్వప్నమా? లేక నిజముగా నిందిర యేనా? ఏమి యాశ్చర్యము! అచ్చట నుండి యీప్రాసాదమువఱకు నీరాతని యీఁదుచు వచ్చినది. దైవాధీనము. నేనే యాపని చేసితి నని దీని కెఱుంగుట కవకాశము లేదు ఇఁకమీఁద దీనిచావుకొఱకు చేయు ప్రయత్న మతిజాగ్రత్తగాఁ జేయవలయునని తనలోఁ దానే గొణఁగుకొనెను. సమయము కని పెట్టి రాజమాతసమీపమునకుఁ బోయి యామెతో నేమో చెప్పెను. అది విని మురళాదేవి యులికిపడి "అటులా? ఏమి యాశ్చర్య" మనెను. కాళ్లకుఁ దైలము రాచుటకై యిందిర వచ్చెను.

మురళ—ఇందిరా! నిన్న మా కందరికంటె ముందే యెట్లు వచ్చి చేరితివి?

ఇందిర—అమ్మా! నిన్న యావనంబును జూచినంతనే నారత్నదీవి నాకు జ్ఞాపకమునకు వచ్చెను. అల్లే యచట నేటియొడ్డునఁ గట్టియున్న చిన్న పడవలోఁ గూర్చుండి యలసటఁ దీర్చుకొనుటకై కొంతసేపు పండుకొంటిని. తిమ్మప్రయాణము సిద్ధమైన సమాచారమును తెలుపు మని వారకుఁ జెప్పితిని. పదినిమిషము లటులే పండుకొనియుందును అంతలో నేను బరుండినపడవ నీళ్లలో తేలుచున్నట్లు తెలిసి లేచి యొకప్రక్కగా నిలిచినంతనే యాపడవ నీళ్లలో మునిఁగెను. నేను పడవను త్రోసివైచి సులభముగా నీఁదుకొనివచ్చి యచట గట్టెక్కితిని. ఇదియే జరిగిన వృత్తాంతము.

మురళ—అయ్యో! యిందిరా, నీ కీఁదుటకు వచ్చునా యేమి?

ఇందిర—అమ్మా! నాచిన్నతనమునందె యీ విద్యను నా తండ్రి గారు నేర్పించినారు. నేను సముద్రమందుఁగూడ నీఁదఁగలను.

మురళి—అలాగా! అందువలననే బ్రతుకఁ గలిగితివి. నిన్న నీకు గండదిన మని యెంచెద. ఇందిరా! యీవిషయము నాకేల చెప్పలేదు!

ఇందిర—అమ్మా! ఇది యేమి విశేష మని? నా కది యొకకష్టమా? తమరు వచ్చుచుండఁగనే యిది యొకగొప్పవిషయ మని మీతోఁ జెప్పవల యునా? ఇపుడు తమ రడుగకయుండినఁ జెప్పియే యుందును.

ఆనాఁ డన్నిన్యవహారంబులు యథావిధిగనే జరుగుచుండెను. లలిత కుమారుఁ డిందిర యుంతు నంతఃపురమునందే యున్నను వారిరువురి విషయమం దితరు లనుమానించుట కాస్పదము లేక యతిజాగరూకతతో మెలఁగుచుం డెను. భోజనానంతరంబున, రాజమాతకును రాజునకును లలితకుమారునకును దాంబూలము మిక్కిలి యందముగా మడిచి యిచ్చుట యిందిరయొక్క ముఖ్యకార్యము. ఆనాఁ డెప్పటివలె నందఱకును దాంబూలంబు నిచ్చి యిందిర వెడలిపోయెను. తాంబూలమం దొకపత్రిక యున్నట్టు లలితుఁడు గ్రహించి తత్క్షణమే దానిని దీసి భద్రపఱచెను. ఆనాఁడు లలితుఁ డతికష్టముగా నాస్థానస్థ బునకుఁ బోయి కార్యములు ముగించుకొని వచ్చి యతిశీఘ్రముగా భోజనా దులు ముగించి శయనగృహంబునకుఁ జని చక్కఁగాఁ దలుపులు బంధించి, జాబును దీసి చదువ నారంభించెను. "ప్రాణనాథా! ఈదీనురాలికథ నాలకిం పు"డని, ఫల్గునుఁడు చేసినకార్యంబులను, తాను వానిని దప్పించుకొని మెలఁ గుటయును వ్రాసియుండెను. ఇఁక ననేక విషయములు వ్రాసి కడపట "ఇట్లు మీచరణసేవకురాలు, ఇందిర" యని యుండెను. లలితకుమారుఁడు నిశ్చలమనస్కుఁడై శాంతముగా జాబు నంతయుఁ జదివెను. మూమ్మాఱు చది వెను. ఆజాబును కన్నుల కద్దుకొనియెను. హృదయముమీఁద నుంచుకొనెను. దానినే ధ్యానించుచుండఁగా నతనికంటిమండి యశ్రుధారలు కాఱుచుండెను. "ఆహా! ఆ మహానుభావుఁడా యితఁడు? ఈమె యాత్రిపురసుందరి. నాయూహ సరిపోయినది." యనుమాటలు నోటినుండి వెడలినవి. మరల జాబు చదివి భద్రపఱచి నిదురించెను.

తెల్లవాఱకమునుపే నీలవేణి యొకజాబును దీసికొని పెద్దభవనమునకు వచ్చెను. అది పోయి రాజమాతను దర్శించి హేమప్రభాదేవిగారిచ్చినజాబు నామె సమీపమం దుంచెను.

“ఇందిరను బిలువు”మని యాజ్ఞాపింపఁగ, నీలవేణి పోయి యిందిరను జూచి మాటలాడి రాజమాతయొద్దకుఁ బిలిచికొని వచ్చెను.

రాజమాత—ఇందిరా! ఆజాబు నెత్తి చదువుము. మీరాణి నీ కేదియో వృత్తాంతము వ్రాసియున్నది.

ఇందిర—(జాబు తీసి చదివి) “రాజ్ఞీ! నే చేటిలోఁ బడితి ననువిషయ మంతఃపురమం దంతటను దెలిసెనఁట. నే నస్వస్థగా నున్న పక్షమునఁ గొన్ని దినము లచట నుండి పోనిమ్ము” అని వ్రాసియున్నారు.

రాజమాత—ఇందిరా, నీజాబు నన్నుఁ జూపనిత్తువా? నాకోడలిచేతి యక్షరములం జూచి యెంతో కాలము గడచి పోయెను. ఆమె వ్రాసిన దనఁగాఁ జూడ నపేక్ష గలిగెను.

ఇందిర తత్క్షణంబ యాయుత్తరమును రాజమాతకు నందిచ్చెను. ఆమె యాజాబును శాంతముగాఁ జదువు కొనెను. అట్లు చేయుట తనగౌరవమునకుఁ దగదని కూడ నామె యాలోచించుకొనలేదు. ఆమె “యెవరిని నమ్మదు? దుర్మార్గుల కీభ్రాంతి సహజము. పుట్టుకతోఁ బుట్టినది పుడకలతోఁ గాని పోదు” అన్నట్లు వారిభ్రాంతిని పోఁగొట్టి వారిని తృప్తిపఱచుటకు వారివలె వంకరబుద్ధులు గలవారే సమర్థులుగాని సహజమార్గమం దుండువారికి సాధ్యముకాదు కనుక రాజమాతను నమ్మించుటకు నామెబోఁటి కుటిలాత్ముఁ డగు ఫల్గునుఁడు తగినవాఁడు.

ఇందిర తన కేమియు గాయము తగులలే దనియు, తన కీఁత బాగుగ వచ్చును గనుక నాయాసముగూడఁ గలుగలే దనియు, నామె తనమీఁద నంతదయ గలిగి వ్రాసినందులకు తనభక్తి వెలిపుచ్చుచు జాబు వ్రాసి యిచ్చెను. నీలవేణి మరలిపోయెను.

దేవి మిక్కిలి కలవరపడి విశ్రామశాలయం దారకకూర్చుండి యాలోచించుచుండెను. దేవి వ్యసనకారణ మెవరికిని జెప్పలేదు. దాసీజనము గుమి గూడి "ఈవ్యసన మెందులకో" యని యొకతె మఱియొకతెను బొడిచి యడిగెను. "వృద్ధభల్లూకము వీరిపెండ్లి కొప్పుకొనలే దేమో" యని యొకతె యనెను. "ఏమే, మూఢురాలా! ఇందిర యేటిలోఁ గొట్టుకొనిపోయినదటే? ఆవిషయము దెలియుటకై దేవి తత్తఱపడుచున్నారు. అంతమంచి పిల్లకాపద గలిగిన నెవరు చింతింపకయుందు?" రని మఱియొకతె చెప్పెను. ఇంతలో నీలవేణి వచ్చెను. దేవి తానే లేచిపోయి యాజాబు నందుకొని విప్పి చదువుకొని తృప్తి చెందెను దానిలో మఱియొకచీటి యున్నది. దానిని దేవి దాఁచియుంచుకొని లోపలికి బోయి తలుపులు మూసి జాబు నిచ్చెను.

"ప్రియజననీ! యిపుడు నాకార్యమునకు ఫల్గునుఁడు విరోధి. ముఖ్యముగా నిపుడు వాఁడెచటికైనఁ బోవలయును. వాని నెచటికైనఁ బంపుటకు నే నొకప్రయత్నముఁ జేసియున్నాను. దేహారోగ్యమునకై కాళీఘట్టమునకు మీరు ప్రయాణముచేయుఁడు. మందును దెచ్చుటకై ఫల్గునునిఁ బంపుటకైన యత్నింపుఁడు. నాయత్నముచే వాఁడు పోయెనేని, మీప్రయత్నము నిలిపి వేయుఁడు.

ఇట్లు: మీసేవకురాలు,

"ఇందిర".

దేవి జాబును జదివి యగ్గిలోవైచెను. అరగంటలో రా జొంటరిగా వచ్చి రాణిని దర్శించెను.

రాణి—రాజా, కాళీఘట్టమందు ఘనవైద్యుఁ డున్నాఁడఁట. పత్తికునింటిస్త్రీ లతనియొద్దనుండి యౌషధముఁ దెప్పించి యిచ్చిరి. దానిని దీసికొంటిని. నే నొకవేళ నచటికిఁ బోవలసియుండిన, మీరును వచ్చి నాకచట సహాయము చేయవలసియుండునేమో, మీ రచట నొకసాధంబు వేఱుగా నేర్పఱచికొని యుండవలెను. మీకుఁ దోడుగ ఫల్గునుఁ డుండిన నా కంతో సహాయుఁడై యుండును. దీనికి మీయాలోచన యేమి?

రాజు తనలోఁ దా నేకాకిగా వచ్చినను నింతచన విచ్చి మాటలాడుట కలవడి యుండుట, నా కీమె లోఁబడుట కిది యొకమార్గమయ్యెను. ఇన్ని దినములు బంధువులలో వసించియుండినది. తనభర్తను బోఁగొట్టుకొని బిడ్డ లేక యీరీతిలో నున్నదానికి వివాహ మేమియని లోకులు నిందింతురు. అట్టి వారియెదుట స్వేచ్ఛగా మాటాడుటకు దేవి సిగ్గుఁ జెందియున్నదేమో, కనుకఁ గొన్ని దినములు మఱుఁగుగానుండి యదియును సహజమైనపిమ్మట రావచ్చునని యీమె యాలోచనముఁ జేసియుండవచ్చును. అదియునుంగాక యానాఁడు దానిభర్తరూపమునుజూచిన దాదిగా గలఁతఁ జెందినతనమనస్సును నెమ్మదిపఱచుకొనుటకును నీప్రయాణము మిగుల ననుకూలము. అయిన నన్ను నిర్దాక్షిణ్యముగా వేఱొకగృహమందు నివసింపవలయునని చెప్పుచున్నది. ఎట్లైనను గానిమ్ము. దానియిష్టము ననుసరించెద." ఇట్లులా కాళిహార్క్యమును నిర్మించుచుండి, "దేవీ, నియాలోచనకు వ్యతిరేకముగా నేదియు జరుగదు. రాజ్యకార్యముల తొందర విశేషముగా నున్నది. అమ్మగారికిఁ దెలియఁజేసి ప్రయాణము నిశ్చయించెద"నని చెప్పి రాజు వీడ్కొనినపిమ్మట నిందిర వ్రాసినప్రకారము దేవి తనప్రయాణమునకుఁ దగువస్తువుల సిద్ధపఱుప నుత్తరు విచ్చెను. ఒకసమయమునఁ దాను లేనపుడు గృహకృత్యముల నెఱవేర్చుటకుఁ దగు నేర్పాటుఁ జేసెను. ఈప్రయాణ మెందుల కని యడుగుట కెవరికిని ధైర్యము చాలదు. అయిన నీమెవశమం దుండు కొందఱు రాజకుటుంబమువారికి మాత్ర మీమె గొప్పయోధురాలని తెలియును. కనుకఁ బ్రయాణమున కేయాతంకము చేయులేదు. ఈవృద్ధులగు రాజబంధువు లెందులకో పదియాఱుసంవత్సరంబులైనను మదనపాలునిఁ దమకు రాజుగా నంగీకరింపలేదు. ఇట్టివృద్ధసింహములు హేమప్రభవశమం దున్నారని మురళికిఁ దెలియును. కనుక నేమష్టకార్యముచేసినను మిగులరహస్యముగను జాగ్రత్తగను జరుపుచుండును. మనదేవి హిరితోఁ జెప్పక యొకచిన్నపనియైనను చేయదు. రాత్రి దేవి తనబంధువులతో భుజించి రహస్యాలోచనసభలో మాటలాడుచుండి తనపడు

దేవి మిక్కిలి కలవరపడి విశ్రామశాలయం దూరకకూర్చుండి యాలోచించుచుండెను. దేవి వ్యసనకారణ మెవరికిని జెప్పలేదు. దాసీజనము గుమిగూడి "ఈవ్యసన మెందులకో" యని యొకతె మఱియొకతెను బొడిచి యడిగెను. "వృద్ధభల్లూకము వీరిపెండ్లి కొప్పుకొనలే దేమో" యని యొకతె యనెను. "ఏమే, మూఢురాలా! ఇందిర యేటిలోఁ గొట్టుకొనిపోయిన దటే? ఆవిషయము తెలియుటకై దేవి తత్తఱపడుచున్నారు. అంతమంచి పిల్ల కాపద గలిగిన నెవరు చింతింపకయుందు?" రని మఱియొకతె చెప్పెను. ఇంతలో నీలవేణి వచ్చెను. దేవి తానే లేచిపోయి యాజాబు నందుకొని విప్పి చదువుకొని తృప్తి చెందెను దానిలో మఱియొకచీటి యున్నది. దానిని దేవి దాఁచియుంచుకొని లోపలికి బోయి తలుపులు మూసి జాబు నిచ్చెను.

"ప్రియజననీ! యిప్పుడు నాకార్యమునకు ఫల్గునుఁడు విరోధి. ముఖ్యముగా నిపుడు వాఁడెచటికైనఁ బోవలయును. వాని నెచటికైనఁ బంపుటకు నే నొకప్రయత్నముఁ జేసియున్నాను. దేహారోగ్యమునకై కాళీఘట్టమునకు మీరు ప్రయాణముచేయుఁడు. మందును దెచ్చుటకై ఫల్గుననిఁ బంపుటకైన యత్నింపుఁడు. నాయత్నముచే వాఁడు పోయెనేని, మీప్రయత్నము నిలిపి వేయుఁడు. ఇట్లు: మీ సేవకురాలు,

"ఇందిర".

దేవి జాబును జదివి యగ్గిలోవైచెను. అరగంటలో రాజొంటరిగా వచ్చి రాణిని దర్శించెను.

రాణి—రాజా, కాళీఘట్టమందు ఘనవైద్యుఁ డున్నాఁడఁట. వర్తకునింటిస్త్రీ లతనియొద్దనుండి యౌషధముఁ దెప్పించి యిచ్చిరి. దానిని దీసికొంటిని. నే నొకవేళ నచటికిఁ బోవలసియుండిన, మీరును వచ్చి నాకచట సహాయము చేయవలసియుండునేమో, మీ రచట నొకసౌధంబు వేఱుగా నేర్పఱచికొని యుండవలెను. మీకుఁ దోడుగ ఫల్గునుఁ డుండిన నాకెంతో సహాయుఁడై యుండును. దీనికి మీయాలోచన యేమి?

రాజు తనతోఁ దా నేకాకిగా వచ్చినను నింతచన విచ్చి మాటలాడుట కలవడి యుండుట, నాకీమె లోఁబడుట కిది యొకమార్గమయ్యెను. ఇన్ని దినములు బంధువులలో వసించియుండినది. తనభర్తను బోఁగొట్టుకొని బిడ్డ లేక యీరీతిలో నున్నదానికి వివాహ మేమియని లోకులు నిందింతురు. అట్టి వారియెదుట స్వేచ్ఛగా మాటాడుటకు దేవి సిగ్గుఁ జెందియున్నదేమో, కనుకఁ గొన్ని దినములు మఱుఁగుగానుండి యదియును సహజమైనపిమ్మట రావచ్చునని యీమె యాలోచనముఁ జేసియుండవచ్చును. అదియునుంగాక యానాఁడు దానిభర్తరూపమునుజూచిన దాదిగా గలఁతఁ జెందినతనమనస్సును నెమ్మదిపఱచుకొనుటకును నీప్రయాణము మిగుల ననుకూలము. అయిన నన్ను నిర్దాక్షిణ్యముగా వేఱొకగృహమందు నివసింపవలయునని చెప్పుచున్నది. ఎట్లైననుగానిమ్ము. దానియిష్టము ననుసరించెద." ఇట్టులాకాశహార్మ్యమును నిర్మించుచుండి, "దేవీ, నియాలోచనకు వ్యతిరేకముగా నేదియు జరుగదు. రాజ్యకార్యముల తొందర విశేషముగా నున్నది. అమ్మగారికిఁ దెలియఁజేసి ప్రయాణము నిశ్చయించెద"నని చెప్పి రాజు వీడ్కొనినపిమ్మట నిందిర వ్రాసినప్రకారము దేవి తనప్రయాణమునకుఁ దగువస్తువుల సిద్ధపఱుప నుత్తరు విచ్చెను. ఒకసమయమునఁ దాను లేనపుడు గృహకృత్యముల నెఱవేర్చుటకుఁ దగు నేర్పాటుఁ జేసెను. ఈప్రయాణ మెందులకని యడుగుట కెవరికిని ధైర్యము చాలదు. అయిన నీమెవశమం దుండు కొందఱు రాజకుటుంబమువారికి మాత్ర మీమె గొప్పయోధురాలని తెలియును. కనుకఁ బ్రయాణమున కేయాతంకము చేయలేదు. ఈవృద్ధులగు రాజబంధువు లెందులకో పదియాఱుసంవత్సరంబులైనను మదనపాలునిఁ దమకు రాజుగా నంగీకరింపలేదు. ఇట్టివృద్ధసింహములు హేమప్రభవశమం దున్నారని మురళికుఁ దెలియును. కనుక నేమిష్టకార్యముచేసినను మిగులరహస్యముగను జాగ్రత్తగను జరుపుచుండును. మనదేవి వీరితోఁ జెప్పక యొకచిన్నపనియైనను చేయదు. రాత్రి దేవి తనబంధువులతో భుజించి రహస్యాలోచనసభలో మాటలాడుచుండి తనపడు

కటింటికిఁ బోయి ప్రార్థనాదుల ముగించి పడుకమీఁద నెంతసేపు పరుండినను నిదురపట్టలేదు. గంటలు పండ్రెండు కొట్టెను. దేవి లేచి దాసి నొకతెను బిలిచెను. నీలవేణి పరుగెత్తుకొని వచ్చెను. "నీలా! యాతలుపు తెఱవుము. నీల తెఱవఁగానే యామె యం దొకభవనంబును బ్రవేశించెను. ఆ భవనము యొక్క తలుపు లినుపకమ్ములచే నిర్మింపఁబడినవి. ఆభవనమునం దేటిగాలి స్వర్గసుఖము నిచ్చుదానివలె సుఖముగా వీచుచుండెను. ఆప్రాసాదము సుఖములకు నునికిపట్టని చెప్పఁ జాలును. ఆతలుపు తెఱవఁగానే యేటికి దిగుటకు స్ఫటికపురాళ్లతో మెట్లు కట్టఁబడియున్నవి. ఇరుప్రక్కల శుభ్రమగు బండలు. వానిమీఁద నడచుటకు మార్గమున్నది. అటువైపు ప్రహరిచుట్టు వృక్షములు పెరిఁగియున్నవి. మనదేవి యచటికిఁబోయి విశాలమైనయొకబండ మీఁదఁ గూర్చుండి "నీలా! యీవెన్నెలలో నీస్థల మెంతమనోహరంబుగ నున్నదో చూచితివా! నిద్రవచ్చువఱకు నే నీస్థలమందు విశ్రమించెద, నీవును నటుప్రక్కను బరుండుమని చెప్పెను.

దేవి యుత్తరువు నొసంగిన మఱునిముసమందే నీలవేణి పోయి యొక బండమఱుంగునఁ బండుకొనెను. మిగుల జాగ్రత్తగాఁ గాచియుండుదు నని యెంచి పండుకొన్న నీల స్మృతిలేక నిద్రాదేవికి స్వాధీనయై పోయెను. దేవి యచటఁ బ్రకృతిసౌందర్యమును జూచుచు నేదియో తలంచుకొని యట్లు తిరిగి చూడఁగఁ దన కెదుట నొకవ్యక్తి వచ్చుచుండుటఁ గనెను. దేవి యతిధీరురాలు. కనుక భయపడలేదు. ఆవ్యక్తి యెచటికిఁ బోవుచున్నదని కొంచెము ముందునకు వచ్చి నిలిచెను. అది యొకపురుషవ్యక్తి యని తెలిసెను. అంతలో నతఁడును సమీపమునకే వచ్చుచున్నట్లు తోఁచెను. తనకును వానికిని నొక బారెఁడుదూర ముండుటఁ గని "నిలువుము. నీవెవఁడ" వని గద్దించి యడిగెను.

ఒకానొకఁడు:—మహారాజ్ఞీ, నే నొకసన్యాసిని. ఈయేటిగట్టున జపము చేయుచుంటిని. త్రోవతప్పి యిటు వచ్చితిని.

దేవి యాకంఠస్వరము తనకుఁ జిరపరిచిత మైనది గనుక 'మంచిది' యని ముందువచ్చి యతనిముఖముఁ జూచి "హా, నాథా! యని మూర్ఛనొంది బండమీఁదఁ బడునంతలో నాసన్న్యాసి యామెబండపైఁ బడకుండునటులు పట్టుకొని పరుండఁబెట్టి దేహ మంతయు నిమిరి యామె యరకాలియందలి దుమ్మును దుడిచి యామెచెవులదగ్గఱఁ "ప్రేయసీ! ఇంతటిధైర్యశాలిని వై యుండి యిట్లు స్మృతిదప్పిపోవచ్చునా? ప్రాణేశ్వరీ! యీదీనుని జీవితము నీసుఖముపై నాధారపడి యున్నదిగదా! త్వరలో నీకష్టము దీఱును. ధైర్యము గలిగి యుండుము. నీమధురవచనామృతమును గ్రోల నిచ్ఛ గలవాఁడనై వచ్చితినే. నీవిట్లు స్మృతి తప్పియున్నావు. ఇదియును విధికృతమే" యను కొనుచు శీఘ్రముగా లేచి, తనపేరువేసియున్న యొకచేతిగుడ్డను దేవి-మీఁదనుంచి తన్నెవరైనను జూచెదరనుభయముచేత దూరముగాఁ బోయి యొకపొదలో నిలిచి చూచుచుండెను. అతఁడు పోయిన కొన్నినిమిషములకు దేవి లేచి కనులు విచ్చి చూచి నేఁడుగదా ధన్యురాలను! నాకష్టము తీఱిపోవుకాలము వచ్చినది. అయ్యో! నా రేమి చెప్పుటకు వచ్చిరో, క్షత్రియధర్మోచితం బగు ధైర్యమును విడనాడి మూర్ఛఁ జెందితినే. నే నెంతపాపి నని వ్యథఁ జెంది "నీలా!" యని పిలువఁగానే నీలపరుగెత్తి వచ్చెను.

దేవి—"ఇచటఁ జాల సుఖముగా నిద్రపోతిని. పోదము ర" మ్మని దానికరముఁ బట్టుకొని లోపలఁ బ్రవేశించి తలుపులు భద్రపఱచి పడుకటింటికిఁ బోయి నీలవేణిని బంపివైచి తననాథుఁడు తనపాదము లొత్తుచుఁ "జిగురుటాకుల ధిక్కరించు నీపాదములు ఱాతిమీఁద నడచుటచే నెంత నొచ్చెనో" యని చెప్పినమాట యామెమనస్సునకు జ్ఞప్తికి వచ్చి పులకాంకితురా లయ్యెను. అయ్యో! నాథా! యిన్నిదినములు కాఱడవులయందు నానా కష్టములు మీ రనుభవించుచుండ నీపాపాత్మురాలు మీకష్టముల నెంచక ప్రాసాదమం దున్నయపరాధము నైన నెంచక నాకై యిట్లు పరితపించు చున్నారే? దయామయా, మీ రెంతశాంతస్వరూపులు. మీరు నాచెవిలోఁ

చెప్పినమాట లన్నియు వినుచున్నను బదులు చెప్పుటకు శక్తి లేకపోయెనే. అదియును నాపాపఫలమే కదా ? మీరు వచ్చియుంటి రని తెలియఁగలందు లకుఁ జిహ్వ మూగ మీచేతిగుడ్డను వదలిపోయితిరి. ఇది యొక సుకృతఫలమే యనియెంచెద నని విలపించుచు రాత్రిని గడపెను.

హేమప్రభ గ్వాలియరురాజతనయ. ఈమె తనయత్తగారి యింటికి వచ్చుటకు మునుపే యీమెతండ్రి యుదయపూరురాజగుప్రతాపసింహుని యాజ్ఞఁ బొంది బాణనదీసమీపమున నొకదివ్యసౌధరాజమును గట్టి తన కుమారి కిచ్చెను. ఈమెకిట్టికష్టము ప్రాప్తించినప్పటినుండియు నీమె తండ్రికిఁ బరమాప్తు లగు పదిరాజకుటుంబములవా రినటికి వచ్చి రాణి యుండుకోటలోనే నివసించుచుండిరి. ఈకుటుంబములకుఁ బ్రధానపురుషులగు జయసింగ్, కుమారసింగ్, నారాయణసింగ్, మొదలగువారు గొప్పరాజభక్తులు. ఎన్నియో యుద్ధములను జేసి బిరుదములు గొన్నయోధులు. ఇచటఁ దనభర్త కాలమునుండి చేరియుండినవారు గనుక వీ రెందుల కిపు డిచట నున్నా రని యడుగుటకు మురళికు ధైర్యము చాలదు. మఱియును వారు రాజమాతకును బంధువర్గములోఁ జేరినవారు. వీరియందు దేవికి మిగుల గౌరవము. విశ్వాస ములు మెండు. వారికిఁ దెలుపక యీమె యేకార్యమును జేయదు. ముఖ్యా దేవికి వీరు గుండెలోనిబల్లెములు. అందువలననే హేమప్రభను నయములో వశపఱచుకొనుటకు యత్నము జరుపుచుండెను. ఏమాత్రము వారికి తనవిరోధ భావముఁ జూపినను మదనపాలుఁడు కోటలోనే భస్మము కాఁగలఁ డని యామెకుఁ దెలియును. మదనపాలుఁడు హేమప్రభను పునర్వివాహము చేసి కొనుటకై జరపుయత్నములు వీరికిఁ దెలియును. ఎందులకో వారును వను మతిని సూచించుచుండిరి. కాని విరోధ మేమియుఁ జూపించి యుండలేదు, కనుకనే మదనపాలుఁడు వా రందఱుఁ దనకు లోఁబడినా రని యెంచి విఱ్ఱ వీఁగుచుండెను. ఆనాఁడు ప్రాతఃకాలకృత్యంబులఁ దీర్చి యాలోచనామందిర మునకు వెళ్లెను. ఆసభకుఁ జేరినప్పుడు లందఱు నచటఁ జేరిరి. దేవి రాత్రి

జరిగినసమాచార మంతయుఁ దెలిపెను. ఇఁకమీఁద జరపవలసినకార్యములఁ గూర్చి యతిరహస్యముగా వారు ముచ్చటించుకొనిరి.

మరళాదేవి యింకను గట్టియూఁతచేతనే నడుచుచుండెను. అయిన నిపు డామె మొదటికంటె నారోగ్యవతిగా నుండెను. ఆనాఁడు నృసింహజయంతి. మిగులఁ బుణ్యదినంబు. రాజగృహమందుఁ బూజ లతిశయంబుగా జరుగుచుండెను. బైరాగి దిగియుండు సత్రమునందు జనులు క్రిక్కిరిసి యుండిరి. తీర్థప్రసాదము లిచ్చుటయందే బైరాగికిని నతనిశిష్యులకును నూపిరి యాడకుండెను. రాజును లలితకుమారుఁడును జేరి బ్రాహ్మణులకు వివిధదానము లిప్పించుచుండిరి. రాత్రిభోజనమునకు దేవిని బలిపించి మీ రాజ్ఞికి దేనియం దిష్టమో యాపదార్థముఁ జేయుఁ డని పాచకులతోఁ జెప్ప మనెను. ఇందిర యానాఁ డన్నిపనుల ముగించి, ప్రాసాదప్రాకారములోని కట్టడములను జూచుటకై రాజమాతయనుజ్ఞ వడయుటకై పోయి యచట నిలిచెను.

రాజమాత——ఇందిరా! యేమి? వికసితవదనారవిందంబుతో నిలిచి యున్నావు? నీమనంబున నేదియో కోరిక యున్నట్టున్నది? నాయూహ సరియైనదా?

ఇందిర——జననీ, నేఁడు రాజభవన మంతయుఁ జక్కఁగ నలంకరించి యున్నారు. సఖియ లందఱు వేడుకఁ జూచుటకై పోవుచున్నారు నేనును వారితోఁగూడి పోయి యాస్థలంబులఁ జూడవలె నని యాశగా నున్నది.

రాజమాత——మంచిది. వారివెంబడిఁ బొమ్ము. అయిన నాప్రాఁతకట్టడంబులయొద్దకుఁ బోవలదు. అచట సాయంకాలమందు జనులు సంచరింపరు. ఆస్థలంబులు మిగుల భయజనకంబులు. తారను నీవెంబడిఁ బిలుచుకొని పొమ్మని చెప్పెను. తార మురళాదేవికి విశ్వసనీయ యగు దాసి. 'అది యిందిరవిషయమం దతిజాగరూకురాలై యుండు' నని యామెనమ్మకము. ఆమె యీముసలిగృధ్రము తలఁచినట్లు లేదని యెఱుఁగదు. ఇందిర నిండ సంతోష

ముతోఁ దారను వెంటఁ బిలుచుకొని ప్రతివనంబును దూఱుచు, నందలివింతల జూచుచు, నందుఁ గట్టియున్న సౌధమందలి చిత్రముల కచ్చెరు వొందుచుండెను. ఇట్లు పోవుచు, రాజు చనిపోవునప్పుడు పండుకొనియున్న భవనమును జేరిరి. ఆ భవనముచుట్టును వివిధవృక్షజాతులు పెరిఁగియుండినవి. అంతకాల మాస్థల మలంకరింపకయున్నను చూపఱకంతయు నానందమును, దుఃఖమును గలుగఁజేయుచుండెను. పూలచెట్లు ప్రకృతికి లోఁబడి కాలమునకుఁ దగినట్లుద్భవించిన మొగ్గలను ప్రతిప్రాతఃకాలమునందు వికసించిన తమహృదయములను సూర్యభగవానున కర్పించుచుండినవి. ఆచట నిదివఱకు మనుష్యులు తిరుగుచున్నమార్గములు కంటకావృతములై యుండెను. ఆస్థలమునకు రాఁగానే తార కొంచెము దిగులు చెందెను. దానికిఁ దోడుగా సూర్యుఁ డస్తమించుచుండెను. ఆసౌధమందలిగవాక్షద్వారములఁ జూచినఁ జచ్చినరా జచట నిలిచియుండునేమో యని జను లనుకొందురు "ఇందిరా, యింతచీఁకటియం దచటికి పోఁగలమా ?" యని తార యనెను.

ఇందిర—తారా, యేమిట్లనెదవు? ఇది యే సమయము. నామీఁద దయయుంచి యాబీగముచెవి నిటు తెమ్ము. కాలమును వ్యర్థపుచ్చక నే నచటికిఁ బోవుటకు ధైర్యమున్నది. నేను బోయి చూచి వచ్చువఱకు నీ విచటనే యుండుము.

తార—"ఇందిరా, యీసమాచారము ఫల్గునునకు తెలిసిన, నాతల పోవును. నీ కీపనివలన నేదేని యుపయోగంబు గలిగెనా నేఁ జచ్చినను జింతింపను. దైవాధీనముగ వాఁడు రాజుగారివెంబడిఁ బోయినాఁడు. నే నిచటఁ గాచియుండెద. ఎవరైన నీదోవ వచ్చిన నీల వేసెద. తత్క్షణము నీవు తలుపు మూసికొని యుండుము. తరువాత నీపాడలోఁ దూఱిపోవచ్చును. అనట నీ కేమియు దొరకదనియే నాయూహ. ముందే యచట నెందఱో పరిశోధకులు పరీక్షించియున్నారు. అయినను నీయాశను వ్యర్థముఁ జేయుటకు నా కిష్టము లేదు. పోయి ర"మ్మని బీగముచెవి యిందిరచేతి కందిచ్చెను.

తత్క్షణమే యిందిర పోయి తలుపులఁ దీసి గది యంతయుఁగలయఁజూచెను. ఏమియుఁ గనఁబడలేదు. లోపలికిఁ బోయెను. ఇల్లంతయుఁ దిరిగి తిరిగి చూచెను. నేలయంతయుఁ బరీక్షించెను. చలువరాలు పాదిగించి యున్నవి. వేఱుదిక్కు తోఁపక ప్రవేశించుటకుఁ ద్రోవ నిమ్మని భూదేవిని వేఁడుచున్న సీతాదేవివలె తానింత శ్రమపడి ప్రయత్నించుకార్యము వ్యర్థమగుచున్నదే యని వేఱుతలంపు లేక భూమిని తీవ్రదృష్టితో చూచుచుండఁగ, నచట నొక చలువరాయి, పాదిగించినరాలకంటెఁ గొంచె మెత్తుగానున్నట్లిందిరకుఁ గనఁబడెను. అది యేమై యుండు నని సమీపంబునకుఁ బోయి చూచెను. నిజముగా నది యెత్తుగానే యుండెను. అపుడే తనగుప్త ఖడ్గము నొఱనుండి తీసి యారాతిని పెల్లగింపఁగ నది యతిసులభముగఁ బైకి వచ్చెను. దానిక్రింద పోగచుట్టలఁ జెట్టు నిడికిరియైన యొకడబ్బి కనఁబడెను. అది యిత్తడిది. త్రుప్పు పట్టి యున్నది. ఇందిర దాని నెత్తి తనరొంటిలోఁ జెక్కుకొని బైటికి వచ్చి మునుపటివలె బీగము వైచి తారదగ్గఱకు వచ్చి చేరెను. ఇందిర యింతశీఘ్రముగా వచ్చెనే, యచట నేమియు దీనికి దొరకి యుండ దని యెంచెను. ఇందిర హృదయమందు దానిలోఁ దనయదృష్టమును సఫలముఁ జేయువస్తు వుండితీరు నని తోఁచుచుండ, మాటాడుటకైనఁ దోఁపక తారవెంబడిఁ బోయి యంతఃపురంబును జేరి తానొకగదిలోఁ జీర కట్టుకొనుట కనుమిష వెట్టుకొని పోయి తలుపుమూసికొని దీపపువెలుతురులో నాడబ్బిని దెఱచెను. ఆడబ్బిలో నున్న యొకజాబును పైకెత్తెను. దానిని విప్పి చూడఁగా నిందిరశరీర మంతయు జల్లుమనెను. గది యంతయుఁ జీఁకటి క్రమ్మినట్టు లాయెను. కొంచెము సేద దీర్చుకొని దానిని బరీక్షించి చూడఁగ, "కుమారా, యెవరో నన్నుఁ జంపునట్టు కలగంటిని. ఎందులకో భయ మగుచున్నది. తొమ్మునొప్పి భరింప నశక్యంబై యున్నది. శీఘ్రముగా రమ్ము. "నీతండ్రిప్రతాపుఁడు." అని చదువుకొనెను. పరమశివా! యిన్నాళ్లు నీదయ గలిగెనా? నాతాత నాతండ్రికిఁ దనయాపత్సమయమందు వ్రాసినజాబిది యని

యిందిర దానినతిజాగ్రత్తగాఁ బదిలపఱచి బైటికివచ్చి యందఱవలెఁబనులలోఁ బ్రవేశించెను. అంతలో రథములచప్పుడు వినవచ్చెను. రాజును లలితుఁడును బ్రవేశించిరి. వెంటనే హేమప్రభరథమును ద్వారమందు నిలిచెను. లలితుని కరంబుఁ బట్టుకొని దేవి బండి దిగి యంతఃపురమందుఁబ్రవేశించి రాజమాతను దర్శించి, బంధువుల విచారించు నెపంబుతో నిందిర యుండుస్థలంబునకుఁ బోయెను. ఇందిర నలుదిశలు పరికించిచూచి తల్లికి నమస్కరించెను. ఆమెను గాఢాలింగనం బొనర్చికొని, "నాముద్దులతల్లీ, నీయాజ్ఞ ప్రకారము ప్రయాణ సన్నాహం బొనరించియున్నా" ననెను.

ఇందిర—జననీ, వలదు. ప్రయాణము నిలిపివేయుఁడు. మీకు నెల్ల విషయము విశదము కాఁగల దని చెప్పుచుండఁగనే, తార వచ్చుటను జూచి యిందిర వెడలిపోయెను. హరికథ జరిగినపిమ్మట, దేవి యంతఃపురంబున కరిగెను. మఱునాటి దినంబునఁ దాంబూలము నిచ్చుటకై లలితకుమారునిచెంత కిందిర పోయి యాడబ్బి నిచ్చి మరలిపోయెను. అతఁడును దానిని బదిలముగా దనపడుకటింటికిఁ దీసికొనిపోయి యచట దానిని జనువుకొని యానందమగ్నుఁడై యాడబ్బిని బాగుగాఁ ద్రిప్పిచూచి ఇది భూమియందుఁబూడ్చియుండినది కాఁబోలును. దీని నెటులో నాభాగ్యలక్ష్మి తీసికొనివచ్చినది. ఆనాఁడు మహానీయుఁడగు బైరాగిని దర్శించితిని. సాక్షికిఁ బ్రయోజనకరం బైనవస్తువు దొరకినపిమ్మట ఢిల్లీశ్వరునిఁ జూడుమని యానతిచ్చెను. ఇపుడు ఢిల్లీప్రయాణ మేర్పడిన దని యాలోచించెను.

ఆలోచనామందిరమునందు మదనపాలుఁడును మురళాదేవియు లలితకుమారుఁడునుఁ గూర్చుండియుండిరి. ఫల్గునుఁడు వీవనతో విసరుచుండెను.

మురళి—కుమారా, నిర్భాగ్యుఁ డావిక్రముఁడు తండ్రిని జంపి చట్టము ప్రకారము మరణదండన విధింపఁబడియుండినను మరల నెట్లిచటికి రాఁగలిగెను?

రాజు—అమ్మా యతఁ డగునో, కాఁడో. ఫల్గుణుఁడు చెప్పినమాత్ర మున నే, సమాచారము బాగుగా తెలియంగక ఢిల్లీనగరమున కేగి ఢిల్లీశ్వరుని కేమని చెప్పుట? అది యొకవేళ నిజము కాదేని, జనులు మనల గేలిసేయరా? ఇంతకు నతఁడు చచ్చినాఁ డని మనము వినియుండలేదా? ఒకవేళ నతఁడు బ్రతికియున్నను మనల నేమి సేయఁగలడు? ఇంతనిర్దయగా నడచుట నా కిష్టము లేదు. ఇఁక మీయిష్టము.

మురళి—కుమారా, నీకుఁ బ్రపంచజ్ఞాన మావంతయును లేదు. వాఁడు వచ్చిన నేమి, చచ్చిన నేమి? మన కాపద రాకుండునట్లాత్మరక్షణము చేసికొనవలదా? వానిభార్యను నీవు వివాహము చేసికొనవలెనని యున్నావే. దానిని విన్న వాఁ డూరకయుండునా? తండ్రిని జంపినవానికి నిన్నుఁ జంపుట యొక కష్టమా? తరువాత నాగతి యేమి? అట్టినీచుని మన మూరక విడిచి పెట్టవచ్చునా? ఎంతప్రజ్ఞ? ఢిల్లీశ్వరుని రహస్యభటులు వచ్చి యిచట నుండి రేని వారిచేత వాఁడు పట్టుపడవచ్చును. ఈదేశమువారిచే యుంచిన, వానికి లోఁబడుదురేమో యని నాకు సందేహము. వాఁడు దొరకిన, ఢిల్లీశ్వరుఁ డింతకుముందుఁ దాతడు స్థిరపఱచినశిక్ష నిపుడు స్థిరపఱుపవచ్చును. అపు డిందిర యెవ రైనది తనంతట బైటఁ బడును. ఆచిన్న దిదివఱ కేమియు నపరాధము చేయలేదు. ఆనాఁటిరాత్రి పరపురుషునితో మాటాడిన దన్నయనుమాన మొకటి యున్నది. వాఁడే విక్రముఁడై యుండఁగూడదా? ఎటు లైనను ఢిల్లీశ్వరున కీయుదంతము తెలుపవలెనని నిశ్చయ మైనది.

రాజు—లలితా! నీ వేమి చెప్పుచున్నావు!

లలితుఁడు—రాజేంద్రా! నే నపుడు బాలుఁడనుగద. ఈ వ్యవహారము చెప్పుకొనఁగా విన్నాను. అది ఘోరవిషయము గనుక దానిని వినుటకైన నా కిష్టము లేదు. ఇపుడు మీయాజ్ఞ ననుసరించి నడచుకొనుటకు బద్ధుఁడనే కాని, దానినిగురించి న్యాయాన్యాయవిచక్షణ చేయునంతటిసామర్థ్యము నాకు లేదు. అయినను మామయ్యగారు చెప్పినట్లు ఢిల్లీశ్వరుని సేవకులఁ దెచ్చి

యుంచిన, నన్నివిధంబులను శ్రేయస్కరమే. నన్ను పొమ్మని చెప్పిన, నేనే పోయెద. వైరాగిసన్నిధానంబునకుఁ జనియుంటిని. ఈ సమాచారము ఫల్గునుఁడు వారితోఁ జెప్పినట్టు నాతో వారు చెప్పియట్లు చేయ ననుజ్ఞ నొసంగిరి. నేను బోవునపుడు ఫల్గునునిఁ బిలిచికొనిపోయెద. నాకుఁ దోఁచిన దింతియే !

అందఱును నామోదించిరి. లలితకుమారుఁడు తన్నింతగాఁ బ్రేమించి యున్నందులకు ఫల్గునుఁడు సంతోషభరితుఁ డాయెను.

లలితుఁడు—రాజేంద్రా? కాళీఘట్టమునకు మీ ప్రయాణ మెప్పుడు?

రాజు—కుమారా, వైద్యుఁ డొకనెల సేవించుటకుఁ దగిన యౌషధము నంపెనఁట. అటులు సేవించి దానివలన గుణము లేనిపక్షంబున నచ్చటికిఁ బోవచ్చు నని దేవి చెప్పిపంపినది.

లలితుఁడు—సంతోషమే! ఏల యనఁగా, నేను నిచట లేక మీరును బోవుట యంతసరిగాలేదు. మీ రిచట నుండుటయే మంచిది.

# సప్తదశోఽధ్యాయము



ఆ కాలమునం దిప్పటివలె బాటలు సరిగా లేవు. అడవిమార్గములు మిక్కిలి దుర్గమములు, దుష్టమృగభూయిష్ఠంబులు, అత్యంతకంటకావృతంబులు. ఇట్టిమార్గమందుఁ గొందఱు గుఱ్ఱపురౌతులు సామానులు నిండినకొన్ని బండ్లతో ఢిల్లికిఁ బోవుమార్గంబునఁ బోవుచుండిరి. వీరిలోఁ గొందఱుఁ రాజపుత్రులు. కొందఱు యుద్ధవీరులగు యోధులు. కొందఱు గుఱ్ఱపురౌతులు. ఆ రాజపుత్రులలో నందఱు సమానవయస్కులు. వారినందఱును నక్షత్రముల మధ్య నుండు చంద్రునివలె నుండునొక రాజపుత్రుఁడు తనగంభీరతచేతను సౌందర్యముచేతను వీరి నందఱిను మించియుండెను. ఇతఁడు వీరందఱకు నధికారి యని యతనిముఖముఁ జూచినంతనే సులభముగాఁ దెలిసికొనవచ్చును. ఆయువకుని నల్లని ముంగురులు గాలిచేఁ జెదరి సుందరమగు నతనిఫాలభాగమందుఁ బడి యతనిముఖమున కొకవింతసొగసు నిచ్చుచుండెను. అతఁడు పోవుమార్గమందుఁ దనసామంతరాజులతో భారత, భాగవత కథాప్రసంగములఁ జేయుచు నుదయపూరువం గుండుబైరాగియొక్క విద్యాప్రభావమును గురించి కొంచెము ముచ్చటించుచుఁ బోవుచుండెను. ఇతఁడే మన లలితకుమారుఁడు. వీరు క్రమముగా ఢిల్లీనగరముఁ జేరిరి. వీరి యాగమనమునుగూర్చి ముందే తెలిసియున్న ఢిల్లీశ్వరుడు వారికిఁ డగువసతుల నేర్పఱుచుట కాజ్ఞనొసంగియుండెను. లలితకుమారునకు మాత్రము ఢిల్లీశ్వరుని యంతఃపురమునందే బస యేర్పాటుచేయబడెను. లలితుఁడు రాణిసంయుక్తను దర్శించెను. ఆమె యతనికి యక్కవరుస. ఆమె యతనిని తనసహోదరునికంటె నతిశయముగ నాదరించెను. పృథ్వీరాజునకుఁగూడ లలితకుమారునియందు మిగుల నభిమానము. సజ్జనులఁ బ్రేమింపనివా రెవరు? సమయము నిరీక్షించి సంయుక్తాదేవితో ముచ్చ

టించుచు, ప్రస్తావవశంబున నుదయపురిరాజవంశమం దదివఱకుఁ గడచిన వృత్తాంత మంతయును సవిస్తారముగఁ జెప్పెను. వీరిరువురసంభాషణ మిగుల రహస్యముగ జరిగెను. సార్వభౌముఁ డంతఃపురంబు ప్రవేశించి యతని నెచట వెదకినను గనఁబడలేదు. సంయుక్తాదేవియును లలితకుమారుఁడును విశ్రాంతి మందిరంబున రహస్యంబుగ మాటలాడుటను గనుఁగొనెను. మహారాజ్ఞి యొక్క నేత్రములనుండి యశ్రువులు కాఱుచుండెను. సార్వభౌముఁడు చకితుఁడయ్యెను. "లలితా, యేమి జడచెను? నా దేవి దుఃఖించుటకుఁ గారణ మేమి?" యని యడిగెను. వారిసంభాషణలోఁ దానును జేరెను. సంయుక్తాదేవి హేమప్రభాదేవికిఁ గలిగిన కష్టమును వివరించుచు, "నాథా, మనము బ్రతికియుండియు నావదినెగారి కిట్టియిడుములుగలిగియున్న వని విని యూరకుండు టెట్లు? ఆమెకష్టములు వినినమాత్రంబుననే హృదయవిదారణం బగుచున్నదే. ఆ సాధ్వి యింతకాల మెట్లు జీవించియున్నదో నే నెఱుంగ. మీ రింతకుమున్ను నాకుఁ జెప్పియున్న దానికిని నిపుడు నాతమ్ముఁడు చెప్పినదానికిని చాల భేద మున్నది" యని పలికెను.

పృథ్వీరాజు—లలితా, మన మిప్పుడే యాలోచనాసభకు పోవుదమా?

లలితుఁడు—బావాగారూ, అంతతొందర పడవలసినపని యేమియు లేదు. తమయాశ్రయమం దున్నవారి కేమికొదవ? ఆ కార్యమునకే నేను వచ్చియున్నాను. అది యత్యంతరహస్య మైనపని. అక్కగారు తము కంతయు విశదీకరింతురు.

లలితకుమారుని వినయమును జూచి పృథ్వీరాజుహృదయము వెన్నవలె కరఁగెను. "లలితా నాప్రాణము నర్పించి నాసోదరిని రక్షింతును. వ్యసన మొందకుము. నీవు నా యందు చనవుగా ప్రవర్తింపవలెను గాని నే నన్యుఁడ నని భావింపకుము. భోజనకాలం బతిక్రమించెను. రమ్ము-జీవితేశ్వరీ, [illegible] నీ సహోదరుఁడు జీవించియుండు వఱకు నీకును నీవారికిని నెట్టికష్టము రాఁజాలదు "ప్రమాదో ధీమతా మపి" యనునట్లు నిశ్చయమగుసంగతిని దెలి

యొక మూర్ఖుఁడ నైతిని. ఇఁకమీఁద నట్లు జరుగ దని యామెను సమాధానపఱచెను.

లలితయుఁ డామాటవిని మనంబున నుప్పొంగెను. చక్రవర్తి మాటలచేతఁ గార్యసిద్ధి యైన దని తలంచెను. భోజనకాలమందు లోకాభిరాముం బగుమాట లాడుచు, మేవారు సంస్థానమునకు సంబంధించిన వ్యవహారమును గుఱించి సంభాషించుచు "లలితా, నా మేనత్త యగు మురళాదేవి మిగులఁ జతురరాలు. స్త్రీ యైనను రాజ్యమును మంచిస్థితియం దుంచి యున్న దని వింటిని. రాజ్యమున కనర్హుఁ డైనను ఒకవిధంబుగా మదనపాలుని రాజ్యాధిపతిని జేసెను రాజ్యమున కధికారి పేరులేక నశించెను. వారందఱును నా బంధువర్గములోఁ జేరినవారు ఆసంస్థానమునకు రాజ్యలక్ష్మివలె నున్న నాసహోదరి హేమప్రభను దలఁచిన నామనంబు గుందుచున్నది. నా కేమియుఁ దోఁప లేదు. దైవసంకల్పం బెటు లున్నదో యటులు జరుగును. ఇపు డామె వేఱు మార్గమును ప్రవేశించి యున్నట్టు వింటిని. మన మేమి చేయఁగల" మని మాటలాడుచు భుజించిరి. ఫల్గునుఁ డొకమూలనుండి వారిసంభాషణము నాలకించుచుండెను. అయిన నామూర్ఖుఁ డిదియే వారి ప్రథమసంభాషణ మని నమ్మెను.

మఱుసటిదినమున సార్వభౌముఁడు మంత్రాలోచనసభ కేగ లలితనిఁ బిలిపించెను. ఆసభామందిరము భూలోకస్వర్గ మన్న నతిశయోక్తి కాదు. అచట ననర్ఘంబు లగురత్నకంబళంబులఁ బఱచియుండిరి. వివిధంబు లగు నాసనములు వానిమీఁదఁ జీనాంబరములతోఁ గూడినదిండ్లు శోభాయమానంబులై యుండెను. అదివఱ కింద్రప్రస్థము నేలిన చక్రవర్తుల పటములు మౌక్తికతోరణంబులచే నలంకరించి యామందిరమునందలి గోడల కమర్పఁబడి యుండినవి. ఈ పటములమధ్యమందు పృథ్వీరాజపితామహుం డగు ననంగపాలునిపటము నానావిధరత్నంబులు పొదిగించినపనితనముచే నలంకరింపఁబడి గోడయం దమర్పఁబడి యుండెను. దానిప్రక్కను మఱియొక రాజుచి[illegible] పటము వ్రేలాడుచుండెను. ఆపటమందుఁ బదియాఱు సంవత్సరముల వయ[illegible]

గల యొక్కయుయువరాజుప్రతిమయును నమరియుండెను. లలితుఁడాసభా సౌంద ర్యమున కచ్చెరు వొంది నిశ్చేష్టితుండై చూచుచు నిలిచెను.

పృథ్వీ—"లలితా, నీవిచటికి వచ్చిన సమాచారమును జెప్పుము. దానిని విడిచిపుచ్చి యాశ్చర్యంబు నొందినవానివలె నిలిచి యున్నాఁడవు. ఇటు రమ్ము." అని మహారా జతని హస్తంబుఁ బట్టి తనప్రక్కను గూర్చుండఁ బెట్టుకొనెను. అచట వారిరువురు గంటలకొలఁది ముచ్చటించిరి. సార్వభౌ ముఁడు సావధానంబుగా నంతయు నాలకించెను. పరమాశ్చర్యభరితుఁడై "కుమారా, గతించినదానికిఁ జింతించి ప్రయోజనంబు లేదు. భవిష్యత్కా ర్యంబుల న్యాయంబుగా జరిపి ప్రజలకు సంతోషంబు గలిగించి బంధువులకు సుఖంబు గూర్చుటయే నాముఖ్యకర్తవ్యము. అల్లదె యచట నాతాతగారి చిత్రపటంబునకు ప్రక్క నుండు పటంబునఁ గనఁబడురూపంబు లెవరివో గుర్తించితివా?

లలితుఁడు—బావగారూ, యీపూజ్యులను నేను బాల్యమందు చూచి యుందు నని తోఁచుచున్నది. గంధర్వాకారుఁ డగునీయువకుని చూచియుం డినట్లు తోఁపలేదు.

పృథ్వీ—కుమారా, రాక్షసిని వివాహంబు చేసికొని యపమృత్యువు వాతఁబడిన మేవారుదేశాధీశ్వరుఁ డగు ప్రతాపసింహుని చిత్రపట మది. అతని యేకపుత్రుఁ డగు విక్రమసింహుఁడే యీ యువకుఁడు. ఇతనికై యెంతకష్టమైనను పడి యితని సింహాసనాధిరూఢునిఁగాఁ జేసి సోదరి ముఖంబు చూచెద. అదివఱకు నామెను చూడను. ఈనాశపథంబు నామెకుఁ దెలియఁజేయుము. ఈ రెండుచిత్రములను సార్వభౌమునిపటముప్రక్క నుంచు టకుఁ గారణం బరసితివా? ఉదయపురిరాజులు ఢిల్లీ చక్రవర్తులకు హృదయ ప్రాయులు. వారివిషయమం దభేదంబుగాఁ బ్రవర్తింపవలె నని నామాతా మహునియాజ్ఞ. మోసముచేఁ గలిగినయపవాదమును పరిహరించుటకుఁ బ్రయ త్నించెద. నీవు జాగ్రత్తగా వెడలుము. గూఢచారులఁ బంపెద. పను లతి

రహస్యముగా జరుప వలయును. నేను వచ్చెద" నని చెప్పి, లలితకుమారుఁ డిచ్చినవస్తువుల నతిజాగ్రత్తగా నుంచునట్లు చేసెను.

ఈప్రకార మిచట ఢిల్లీలో విక్రమసింహుని యపనిందను దొలఁగించు నిమిత్తము లలితుఁడు యత్నము లొనరించుచుండ నుదయపురమునఁగూడ నా ప్రయత్నమే మఱియొకవిధమున జరుగుచుండెను.

మదనపాలుఁడు తనపడుకటింటికి ప్రక్క నుండుగదిని ఫల్గునునకుఁ బడుకటిల్లుగా నిచ్చియుండెను. అదియును రాజు వసించుగృహమువలె నలంకరింపఁబడియుండెను. ఒకసేవకున కింతయధికార మెందుల కిచ్చియున్నాఁ డని రాజు నడుగువా రెవరు? ఆ ప్రదేశమం దుండు బీరువలం దతనిసామానులు సుగంధద్రవ్యములపెట్టెలు నిండియుండెను. రాజు విహారమునకు వెడలఁగనే తారను వెంటఁబెట్టుకొని యిందిర మెల్లఁగ ఫల్గునుని గదిని బ్రవేశించెను. "ఇందిరా, యిపుడు మనము చేయునది ప్రాణాపాయకరం బైనకార్యము. జాగ్రత్త సుమీ! త్వరగా బైటకు ర"మ్మని తార యిందిరకుఁ జెప్పిపంపెను. ఇందిర యొకనిముసముననే పోయి వాని బీరువను దీసి చూచెను. జాబు పెట్టియుండిన పొగచుట్టపెట్టెవంటిపెట్టెలు కొన్నియున్నవి. వానిని నచట నుండు నాభరణములు వస్త్రములు మున్నగువాని నన్నిటిని లెక్క వ్రాసికొని బైటికివచ్చెను.

రాత్రి తొమ్మిదిగంటలకు గుఱ్ఱపురౌతు లిరువు రుదయపూరు రాజసౌధమును బ్రవేశించి యొకలేఖను సేవకులచే రాజునకుఁ బంపిరి. వారు ఢిల్లీ నగరమునుండి వచ్చినవా రని చూపఱులకు చెప్పకయే తెలియుచుండెను. ఏమి ప్రాణాపద సంభవించెనో లలితకుమారుఁ డింకను రాలేదు. అతనికి మార్గమం దెట్టియిడుములు కలిగెనో యని యంతఃపుర మందలిజనులు మిగులఁ గలవర మందుచుండిరి. వా రిచ్చిన పత్రికను సేవకుఁ డాతురతతోఁ దీసికొని పోయి రాజుచేతి కిచ్చెను. రాజు తల్లితో మాటలాడు చుండెను. అశ్రద్ధ మిగ్గ ద తటపాటుతో జాబును విప్పి చూచి, మనసు నెమ్మదిపఱచుకొని, సేవ

ఈక్షణమే వారికి సుఖమైనభోజనాదులు జరుపుటకుఁ దగు వసతుల నేర్పఱచి బైట బజారములో వారు కోరిన గదులను సిద్ధపఱచి యిమ్ము. వారు మాసౌధమును రక్షించుటకై వచ్చియుండుయోధులు. ఢిల్లీశ్వరునియాజ్ఞ వలన నిచటి కేతెంచియున్నా" రని మదనపాలుఁ డాజ్ఞాపించెను.

మాళవదేశాధీశ్వరుఁ డగు లలితకుమారుని యాగమనమును సూచించు తుతూరశబ్దము వినినంతనే యిందిర సంతోషపరవశ యయ్యెను. రాజగృహ మం దంఱుఁ బరుగిడివచ్చి చేరిరి. లలితకుమారుఁడు సింహద్వారమును దాఁటి వచ్చి గుఱ్ఱమునుండి దిగి రాజగృహమును బ్రవేశించి, రాజమాతను రాజును దర్శించి విశ్రాంతికై మరలెను. రాజమాతకు ఢిల్లీయందు జరిగిన యుదంత మంతయుఁ దెలియఁజేసెను. తన ప్రియురా లగునిందిరకు రహస్యముగా వ్రాసి యిచ్చెను. "ఏకక్రియా ద్వ్యర్థకగీ" యని లలితకుమారుని ప్రయాణ ముభయులకును మనఃస్థిమితముఁ గలుగఁజేసెను.

ఢిల్లీనగరమునుండి వచ్చియున్నభటు లిరువురలో నొకఁడు బైటఁ గావలియుండువాఁడు. మఱియొకఁ డంతఃపురమందుఁ దిరుగువాఁడు. వీని కీయంతఃపురమందు నిరంకుశాధికారము కలదు. వాఁ డొకసేవకునివలె వస్త్రములు ధరించి యుండెను. అయిన నతనిరూపము గంభీరముగా నుండును. కావున నతనిఁ జూచిన నందఱు భయపడుదురు. అతఁ డెవరితోడను గార్యము లేనిది మాటాడువాఁడు కాఁడు. రాజు చెప్పినపను లన్నియు శ్రద్ధతోఁ జేయును. కొన్నిదినములు గడవఁగానే యంతఃపురమం దుండువాఁడు కొంచెము మందబుద్ధి గలవాఁ డని ఫల్గునుఁడు రాజుతోఁ జెప్పెను. ఆనాఁటి నుండి తానును నతనికి సూచనములఁ జెప్పుటకుఁ బ్రారంభించెను. ఆ భటుఁడు ఫల్గునుఁడు చెప్పినపనినికూడఁ జేయుచుండెను. బైటఁ గావలి యుండువాఁడు గుఱ్ఱముమీఁదనే ప్రాకారము నంతయుఁ దిరుగుచు నేయేవస్తువు లెక్కడెక్కడ నున్నవో వానినన్నిటిని దెలిసికొనఁగలిగెను. వీరిరువురు రాత్రులయందు మాఱి మాఱి కావలియుందురు.

ఒకనాఁటిసంధ్యాకాలంబున నిందిర ప్రాంతసౌధంబులయొద్ద నుండు వనంబులయందు సంచరించుచుండెను. క్రమముగాఁ బక్షులు తమ కులాయంబుల కేగుచుండినవి. సూర్యుడు పశ్చిమదిశలో నున్న మనుజులకుఁ దనకిరణంబులఁ బ్రసరింపఁజేయుటకై యరుగుచుండెను. సంధ్యారాగముగూడఁ దగ్గి నలుదిశలయందు నంధకారము వ్యాపించెను. ఇట్టిసమయంబున నిందిర ధైర్యముతో దక్షిణదిక్కునం దుండు ప్రాసాదమహాద్వారంబునొద్దకుఁ బోయి ద్వారము దాఁటి మతికొంచెముదూర మరిగెను. ఆమె యట్లుపోవుటకుఁ గారణమేదని యుండిరుందును. సాయంకాలమందు ఫల్గునుఁడు చేతిలో లాంతరును బట్టుకొని పోవుచుండెను. ఇందిర సౌదరింటిలోనుండి చూచుచుండెను. దీనికి మున్నొకసారి వీఁడిటులే పోవుచుండఁగ, నిందిర ప్రాసాదమునుండి చూచియుండెను. అంతఃపురప్రాకారపువెనుకటిభాగమందు వరుసగా వృక్షపంక్తులు గలవు. వానినడుమఁ బెద్దపెద్దగుట్టలు గలవు. అచటికి వీఁ డేమికారణమునఁ బోవుచున్నాఁడని యామెకు సంశయము గలిగినది. కనుక నాఁ డీవిషయమును బరీక్షించుటకు నిశ్చయించుకొనెను. అట్లు చెట్లుచాటున దాఁగి పోవుచుండి యచట నొకగొప్పవృక్షంబు నెక్కెను. ఇందిర యాయాకులసందులలోఁ దానొకయాకువలె నణఁగియుండెను. కొంచెమునే పేమియుఁ గనబడలేదు. ఏ మిది? ఈద్వారమందు పోయినవాఁ డెచటికిఁ బోయెను? మరలఁ దిరిగి రాలేదు. పిచ్చిదానివలె నిచటికి వచ్చికూర్చుంటినే! ప్రొద్దుపోవుచున్నది. రాజమాతకు సందేహము కలుగునేమో, దైవమా!" యని నానావిధములగు తలంపులతో మనస్సు చెదరి యుండఁగఁ దన కెదుట నొకదీపము కానవచ్చెను. "ఇదిగో వీఁడు వాఁడై యుండునా?" యనుకొనునంతలో నావెలుతురు గుట్టకుఁ బ్రక్కగాఁ బోవుచుండెను. వాఁడే వీఁ డిచట నేమి చేయుచున్నాఁడో చూచెదఁగాక", యని మెల్ల మెల్లఁగా జరిగి పైకొమ్మ నెక్కిపోయి చూచుచుండెను. ఫల్గునుఁ డొకబండసందున దిగెను. అచటనుండి యొకసారి లాంతరు నెత్తి నలుప్రక్కలఁ జూచె[illegible] నాదీపము నొక

స్థలమం దుంచి యచటఁ బొదిగించి యుండినయొకబండ నెత్తెను. ఆక్షణ మందు దీపప్రకాశమందు మెఱయు రత్నాభరణములను విడివిడిగా నుండు రత్నములను జూచి యిందిర భ్రమించెను. వాఁడు దానిని బైకెత్తి త్రిప్పి త్రిప్పి చూచుచుఁ బిచ్చివానివలె నవ్వుచు, 'నీసంపద నపహరించుటకుఁ గదా యీయిందిర ప్రయత్నించుచున్నది. నీచురాలా, యిందిరా, నిన్నూపిరితో విడుతునా? నిన్నేమి చేసెదనో చూడుము. అర్జునున కుండుపదిపేళ్లలో నాపే రొకటి. ఆపేరు వహించి నందువలన నతనియం దుండుసాహసమునందు సగ మైనను నాకు లేకపోవునా? అట్టిపరాక్రమము నాయం దున్నది. కను కనే యీయుదయపూరుసంస్థానమును నాయఱచేతిలో నుంచుకొనియున్నాను. మం దీయిందిరను, దీనితండ్రినిఁ దెగటార్చినపిమ్మట నాబుద్ధిప్రభావ మవిచ్ఛిన్నంబుగా నడచిన నీమేవారురాజ్యలక్ష్మిని గూడ వశపఱచుకొనఁ బ్రయత్నముఁ జేసెద' నని పిచ్చిపట్టినవానివలెఁ దనకుఁదాను మాటాడుకొనుచుండు సమయమునందే యిందిర చెట్టు దిగి ప్రాసాదముఁ జేరి తారను వెదకెను. "ఇందిరా! బైట షికారు పోయియుంటివా? దిగు లొందకుము. అమ్మగారు భోజనమునకు లేవలేదు. రాజుగా రింకను మాటలాడుచున్నారని తార చెప్పఁగనే యిందిర నెమ్మదిఁ జెందెను. అంతలో ఫల్గునుఁడు నంతఃపురంబుఁ జేరెను.

విద్యుచ్ఛక్తితో నీకాలమందుఁ దిరుగువీవన లాకాలంబున లేవు. రాజగృహములయందును నైశ్వర్యవంతులగృహంబులయందును, వారి యిష్టమైనస్థలములయందును పంఖాల నమర్చియుందురు. బైట నేర్పఱచియుండు యంత్రసహాయంబుచేత నైనను లేక, సేవకులు రాత్రులయందు మార్చిమార్చి పంఖా లీడ్చుచుండుట యలవాటు. రాజు చనిపోయినప్పటికాలమందు పంఖావేయుచుండినవారల నిందిర తనచాతుర్యమువలనఁ దెలిసికొనెను. వానిపేరు పద్మనాభుఁడు. వానిభార్య విమల. ఈవిమల నెటులో మనయిందిర తనకుఁ లోఁబఱచుకొనెను. పద్మనాభుఁ డిపుడు ముం దుండినంత బీదవాఁడుగాఁ గనఁ

బడలేదు. ఇపుడు విమలయును రాజగృహమందుఁ బని చేయుచున్నది. పద్మనాభుఁడును ముఖ్యసేవకసమూహమం దొకఁడుగా నుండెను. ఇందిర పద్మనాభుని మిగులననురాగముతో మాటలాడించును. వాఁడును నిందిరయందు భక్తి గలిగి మెలఁగుచుండెను. విమలయు నిందిరతోఁ జెప్పనివృత్తాంతములే లేవు. విమల కిరువు రాఁడుబిడ్డ లున్నను, మగబిడ్డలకై యెన్నియో వ్రతంబు లొనర్చి యొకకుమారునిఁ గనెను. వానిపేరు విశ్వనాథుఁడు. ఆ చిన్నవానిజన్మదినోత్సవమునకు నిందిర మూఁడుబంగారుమొహరీలను బహుమానముగా నిచ్చెను. అట్టి బహుమానము నొందినవిమల స్వర్గము తనచేత నున్నట్టే తలఁచెను. ఈ విమలవలన నేదియో సహాయము కలుగు నని యిందిరమనసున నొకక్రొత్తయూహ పొడమెను. అయినను విమలతో నేమని మాటలాడును? ఏమియుఁ దోఁప లేదు. విమలపుత్రి యగుసరళ చదువుచున్న దని యిందిరకుఁ దెలియును. అది యాధారముగాఁ జేసికొని, "విమలా! నీయొద్దఁ బూలు పత్తులు వేసినగుడ్డ లేమైనఁ గలవా? నే నొకమేజాగుడ్డను గుట్టుచున్నాను. నూతనముగా నున్నదేమో చూడవలయును. నీబిడ్డ కుట్టుచుండఁగాఁ జూచితి" నని చెప్పెను.

విమల—నాతల్లీ, యిది యేమి యొకభాగ్యమా? మేము ముందు మిక్కిలి బీదవారము. నా పెద్దబిడ్డ పుట్టఁగనే దైవాధీనముగా మాకు ధనము చేరినది. కనుక నాబిడ్డకుఁ జదువు నేర్పితిని. నాబిడ్డ కిపుడు పదియాఱుసంవత్సరములు నిండినవి. దానికిఁ గుట్టుపనియందు మిగులఁ బ్రీతి.

ఇందిర—విమలా, నీకుఁ జదువురాకున్నను నీబిడ్డకుఁ జదువు నేర్పించితివి. నా కిట్టివారిని జూచిన మిగుల సంతోషము. రాజగృహములయందు రాజభార్యలు సకలశాస్త్రములఁ దెలిసినవారుగా నుందురు. కనుక వారిని సేవించువారుసహితము విద్యావతులుగను ధర్మము నెఱింగినవారుగను నుండవలయును. అంతఃపురరాజ్ఞీమణులు, వీరపత్నులు, వీరమాతలు, ధర్మము తప్పనివారు, నిర్మలహృదయులు. అట్టివారిని సేవించు సఖులును దాసీజనులును పరి

శుద్ధలై, కళంకరహితలై యుండవలయును. అట్టివా రుండుస్థలమునకే శుద్ధాంతమని పేరు. అట్లున్న నచట నేకుట్రలు మొదలగుదుష్కార్యములు జరగవు. ఆతలంపు లన్నియు నిపుడు శశవిషాణంబు లైనవి. నీబిడ్డల నైనఁ జదువరులనుగాఁ జేయుము. కాని విమలా! నీబిడ్డ కొన్నిదినములుగా నిచటికి రాలేదేల?

విమల—అమ్మా, యది చాలరహస్యము. అది వెల్లడియైన, మాతలలు పోవును తల్లీ; నే నేమి చేయుదును? మాకష్టములు విచారించువా రెవరు? ఇపుడు మా కొకకష్టము సంభవించినది. నాబిడ్డ సరళ యౌవనవతిగా నున్నది. ఫల్గునుఁడు దానిని దన కిచ్చి వివాహము చేయు మనుచున్నాఁడు.

ఇందిర—విమలా, యట్లు చేయుట నీకు మంచిదే కదా? రాజాశ్రయమువలన వాఁడిపుడు ధనముసంపాదించి యున్నాఁడు. యౌవనవంతుఁడు. ఎందులకుఁ జేయఁగూడదు?

విమల—అమ్మా! యది నాయిష్టమా! నా బిడ్డ వాని సేవగించుకొనునే? వాఁడతిదుర్మార్గుఁడు. ఆపిల్లను బలాత్కారము చేసి వాని కిచ్చుటకు దానితండ్రి కిష్టము లేదు. అమ్మా! దయ యుంచి మీ రొకనాఁడు మాయింటికి రాఁగూడదా? తమకుఁ గావలసిన పూలవస్త్రములను గూడ దేవచ్చును. నాబిడ్డ వినయమునుగూడ మీరు తెలిసికొనవచ్చును.

ఇందిర—విమలా, నే నెచటి కైనఁ బోయినది తెలిసిన, ఫల్గునుఁడు రాజమాతతోఁ జెప్పునేమో యని భయమగుచున్నది. లేకున్న నట్టిసుగుణవతి యగునీబిడ్డను జూడవలయు ననియే నాయిష్టము.

విమల—తల్లీ, నాయిల్లు దూరముగా లేదు. ప్రాకారము నానుకొని యున్నసత్రమం దున్నాము. దానియం దొకభాగము మా కిచ్చినారు. రాజుగారు వేఁటకు వెడలుదు రని నాభర్త చెప్పినారు. వారు పోయినపిమ్మట మీరు రావచ్చును. రాజమాత మిమ్ము వెదకకుండునటులు చూచుకొ మ్మని తారకు నేఁ జెప్పెద.

ఇందిరకుఁ గావలసిన దిదియే. 'తప్పక వచ్చెద' నని చెప్పెను దైవమా, నాతాతబొక్కస మంతయును వాఁడు కొంచెముకొంచెముగా నపహరించి యాయిలుకుబండలనడుమఁ జేర్చియున్న దానిని గనిపట్టితిని. విమలయింటిలో నేమియో యున్న దని నా యంతరాత్మ చెప్పుచున్నది. ఓసర్వవ్యాపకా, యిది నీచిద్విలాస మని ధ్యానించుచు మఱునటిదిన మెపుడు వచ్చునా యని యువ్విళ్లూరుచుండెను.

వేఁటతుతూరా వినవచ్చెను. బండ్లమీఁద వంటపాత్రలు వంటవస్తువులు పోవుచుండెను. ఈఁటెలతోను, బల్లెములతోను, వేఁటకాండ్రును, వేఁటకుక్కలు, బైలుదేఱినవి వేఁటకుఁ దగినయలంకారముతో రాజును లలితకుమారుఁడును నుత్తమాశ్వంబులమీఁద వెడలిరి వెంబడి గుఱ్ఱపురౌతులు, సేవకులు, ఫల్గునుఁడు మున్నగునారందఱును బోయిరి. ఆనాఁడు రాజమాత శీఘ్రముగా శయనగృహంబునకు జనియెను. ఇందిర విమలతో బయలుదేఱి సత్రము చేరెను. అపుడు సత్రములోనివైరాగి బైటికిఁ జనియుండెను విమల యచ్చట నుండినవైరాగిమహిమను జెప్పుచుఁ బోవుచుండెను. విమల వసించునది సత్రముయొక్క వెనుకటిభాగము. ఇల్లు చక్కఁగ నలంకరింపఁబడి యున్నది. వివిధము లగుచిత్రపటములు గోడలమీఁద వ్రేలాడుచుండినవి. వంటయిల్లు శుభ్రముగా నున్నది. మఱియొకగది సరళది. దానియం దొకచిన్న మంచము రెండుకుర్చీలు నుండినవి. అందుఁ గొన్ని పెట్టె లున్నవి. చిన్నచిన్నపుస్తకంబు లమరికగా బల్లమీఁద బెట్టఁబడియున్నవి. ఆగది యంతశుభ్రముగా నుండుటఁ జూచి యిందిర సంతసించెను సరళ కొంచె మందకత్తె యని చెప్పవచ్చునే కాని రూపహీన గాదు అయిన దానివిద్యయు వినయభావములును దానికి మఱియు నతిశయముగాఁ గాంతి నిచ్చుచుండెను. ఇందిర రాఁగానే సరళ యతిభక్తితో నామెకు నమస్కరించెను. విమల యిందిరను జూచి, "అమ్మాయీ, యీకమీయిష్టముకొలంది మాటలాడుఁ" డని తనపనికి వెడలిపోయెను. సరళ యిందిరను తనగదికిఁ దోడ్కొనిపోయి తనకుట్టుపనుల

నంతయుఁ జూపెను. ఇందిర సరళతో నెన్నియోవిషయములఁగూర్చి మాటలాడి పెండ్లిమంచ టకు దిగెను. సరళ ఫల్గునునివలనఁ గలిగియున్న సంకటములన్నియు నిందిరతోఁ జెప్పెను. తనతండ్రి వానివిషయమై చెప్పియున్న దంతయుఁ జెప్పుచు, "అమ్మా! మానాయన యొకమహాపరాధముఁ జేసెను. అయిన నతనికిఁ జదువు రాదు. ఆలేఖయందేమి వ్రాసియున్నదియు నాతనికిఁ దెలియదు. మానాయన దానిని తీసికొని పోవుచుండఁగ ఫల్గునుఁడు దానిని దీసికొన్నాఁడఁట. పెద్దరాజుగారు చనిపోయినపిమ్మట ఫల్గునుఁడు నాతండ్రి కొకపత్రిక వ్రాసి పంపెను. అది ఫల్గునుని హస్తాక్షరములతో నుండినది. నాతండ్రి చదువు లేకున్నను బుద్ధిగలవాఁడు. ఆకమ్మను బదిలపఱచియున్నాఁడు. ఆపత్రికవలన నిప్పటివఱకుఁ బ్రయోజన మేమియుఁ గనఁబడలే" దనెను.

ఇందిర—సరళా! యాజాబును నేను జూడవచ్చునా?

సరళ—"అమ్మా, మీయందు నాకుఁ గలిగియున్న నమ్మకమునకు నాప్రాణము నిమ్మన్నను సంతోషముతో నర్పించుటకు సిద్ధముగా నున్నా నని చెప్పి తత్క్షణమే యొకపెట్టెఁ దెఱచి జాబునెత్తుకొని వచ్చెను. అది యొక చిన్న సంచిలో నుంపఁబడియున్నది. సరళ దాని నాసంచినుండి తీసి యిందిర చేతి కిచ్చెను. ఇందిర దానిని జదువుకొని యానందమగ్నురాలై కన్నీరు కాఱుచుండ, "సరళా, యీపత్రికను నాచేతి కిచ్చెదవేని నీకు సకలసౌఖ్యములఁ గలుగఁజేసెద నని చెప్పెను.

సరళ—"అమ్మా, ఫల్గునునివలన మాకుటుంబమునకు సంకటములు రానియెడల మీ రేమి చెప్పినను జేయుటకు సంసిద్ధురాల నై యున్నా" ననెను. ఇందిర దానిచెవిలో నేదియో చెప్పెను. సరళ యపుడే జాబును మడచి యిందిరచేతి కిచ్చెను. దానిని భద్రపఱచుకొని యిందిర యంతఃపురముఁ జేరెను.

# ఏకోనవింశత్యధ్యాయము



అంతఃపురమునందుఁ గావలి యుండుభటుఁడు ఫల్గునుఁడు వెడలిపోవఁగానే, వానిపెట్టె లన్నియుఁ దీసి యం దుండువస్తువుల నన్నిటిని వ్రాసి యుంచుకొనెను. ఇందిర తనసంతోషవార్తను దండ్రికిఁ జెప్పవలెనని మిగులఁ గుతూహలంబుతో నుండెను. ఇందిర యాదారిని బోవుచుండఁగ, ఢిల్లీరాజభటుఁ డేదియో చెప్పెను. దాని నామె వినివినన ట్టూరక యుండెను. ఈ భటుఁడు కొంచెము మూఢుఁడుగా నున్నందున వీనిని ఫల్గునుఁడు దామోదరుఁ డని పిలుచుచుండెను. ఆపేరిటనే వాని నంతఃపురమువా రందఱును బిలువఁ జొచ్చిరి. వీని నెల్లప్పుడు ఫల్గునుఁడు హాస్యము చేయును. ఏల యనఁగా మనదామోదరుఁడు మాఱుపలుకఁడు.

పిచోల యనుచెఱువు మిగులవిస్తృతమును నగాధము నైనది. ఆచెఱువు నానుకొని యుదయపూరురాజభవనము కట్టఁబడి యున్నది. మహావిభవముచే మేవారుసంస్థాన మొప్పియుండి ఢిల్లీకి సమానం బైన దని ప్రసిద్ధిఁ జెందియుండెను. ఈరాజ్యము ఢిల్లీశ్వరునకు లోఁబడియుండినను మనకథాకాలమునాఁటికి నీయిరువురు రాజులును సంబంధబాంధవ్యములు గలవారు గనుక మిగులమైత్రితో మెలఁగుచుండిరి. ఈమైత్రీభావమహిమయే, కర్లాసింగ్ షాజహానుకాలమువఱకవిచ్ఛిన్నముగ నుండియుండె నని చరిత్రకారులు వ్రాయుచున్నారు.

తిలమాత్రము కుష్ఠ మున్న, శరీర మంతయుఁ జెఱచుచందంబున నీర్ష్యాపూరితురా లగుమురళాదేవివలనఁ బ్రఖ్యాతి కెక్కిన మేవారురాజ్యమీకాలమం దిట్టియిడుములఁ గలిగియుండెను.

పైఁ జెప్పిన పిచోలచెఱువుమధ్య నొకచిన్నకొండ గలదు. ఆ కొండ మూఁడుదిశలయందును జెక్కఁబడి సోపానంబులు కట్టఁబడి యుండెను. అయినను మనకథజరుగుకాలమునందు వానిమీఁద నంతటను ముండ్లచెట్లు పెద్ద తీఁగ లల్లుకొన్నపాదపములు గలిగి చెఱువులో దిగుటకు సాధ్యము కాక యుండెను. ఆకొండమీఁద రెండుదివ్యహర్మ్యంబులు నిర్మింపఁబడియుండినవి. వేలకొలఁది దీనారంబులను వ్యయపఱచిన యీసౌధము లిపుడు చూపఱకు దుఃఖము కలుగఁజేయుస్థితిలో నుండినవి. రాజాంతఃపురమునుండి యీచెఱువుమధ్య నుండుప్రాసాదంబులకుఁ బోవుటకుఁ జెఱువునకు వంతెన కట్టి యతిసుందరంబుగా మార్గము నేర్పఱచి యుండిరి. ఇపు డాపథము మనుష్యులు తిరుగుటకుమాత్ర మున్నదేకాని, చెట్లవరుసతీరు, తీఁగెలసౌందర్యము, పూలవికాసము, మొదలగునవి యదృశ్యమై యుండెను. ఇపు డచటికిఁ బోవువారే లేరు. దయ్యములు పగలే సంచరించుచున్న వని మనుష్యులకు భయము. పదియాఱుసంవత్సరములుగా నలంకారము లేనిప్రాసాదం బెట్లుండును? అట్టి నిర్జనస్థలమం దీనాఁ డొకబాలిక తిరుగుచుండెను. ఆమె యెవరు? మనయిందిరయే. తనతండ్రికొఱ కింతనిర్భయముగా నాచీఁకటియం దాబాలిక యిటునటు పచారుచేయుచుండెను. కొంతసేపటికి వంతెన కట్టియున్నస్థలమునుండి యొకమనుష్యుఁడు వచ్చుచుండెను. 'జనకా' యని పిలువఁగానే మిత్రానందుఁడు పుత్రి దిగులొందియున్న దని తెలిసి, 'అమ్మా! భయం బందకుము, నేనే' యని చెప్పెను.

ఇందిర—జనకా, మీ రిచటికి వత్తు రని నే నెఱుంగుదును.

మిత్రానందుఁడు తనపుత్రిక నొకప్రదేశంబునకుఁ చుకొని పోయెను బిలు అన్నివిషయములు మాటాడుకొనిరి. ఇందిర సరళవృత్తాంతమును జెప్పి "నాయనా యిఁక మన మేల యాలస్యము చేయవలెను? తగినయాధారమునకంటె నధికముగానే దొరికినది. ఢిల్లీశ్వరునకుఁ జెప్పిపంపుద" మని చెప్పెను.

మిత్రానందుఁడు—నాజీవనాధారమా, యిన్నిదినములకు నీవలనఁగదా నాకు విమోచనము కలుగు ననుధైర్యము కలిగినది. నాజనయిత్రి యగురత్నాదేవి తనపుత్రుని రక్షించుట కని స్వర్గమునుండి పంపినయొకదేవతయే నాపుత్రికగ జన్మించితివి గాని సామాన్యమైన బిడ్డవు కావు. అమ్మా, యాపను లన్నియు జరపుటకు లలితుఁ డేర్పడియున్నాఁడు. అదియును త్వరలో జరగును. నీవు జాగరూకతతో నుండుము. నీఋణ మెన్నిజన్మంబులకుఁ దీర్చుకొనగలనో యెఱుంగను.

ఇందిర—జనకా, మీ రిట్లు చెప్పఁదగునా? జననీజనకులసేవఁ జేయుభాగ్యము కొంచెమైనను నాకబ్బినదికదా యని తృప్తిఁ జెంది పరమాత్ముని ధ్యానించెన. ధర్మవ్యాధుఁడు తల్లిదండ్రులసేవామహిమచేత నేకదా ధర్మనిష్ఠుఁ డాయెను. నాతల్లి తమరు చెప్పినట్లు దేవతాస్వరూపిణి. జనకా, యామెదుఃఖమును జూచినఁ గొండలు కరఁగును. నేను పాషాణహృదయను గనుక నాతల్లికి కొంతవఱకు నాయుదంతము తెలియఁజేయక యుంటిని. ఇటీవలఁగదా ఆమెకుఁ గొంచెముగా మనవిషయము తెలిసియున్నది. పదియేండ్లనుండి యెంత దుఃఖపడినదో దైవమున కెఱుక. ఇఁక దను రష్టకష్టములు పడి నన్నుఁ బెంచి పెద్దచేసితిరి. దైవస్వరూపు లగునాతలిదండ్రు లొకటిగాఁ జేరి సౌఖ్యముగా నుండుటఁ జూచి నేను ధన్యురాల నగుదును.

మిత్రానందుఁడు—కుమారీ, నీ వనునది నిజమే. నీతల్లిదుఃఖ మతిశయ మైనదే. దైవము దానిదుఃఖమును బోఁగొట్టుటకై సహాయము చేసియున్నాఁడు. మన మిఁక నిచట నిలువఁగూడ దని యిద్దఱు మాటలాడుచువచ్చి మిత్రానందుఁ డిందిర నచట విడిచి తాను మాయమాయెను.

వేఁటకుఁ బోయినవారు మరలఁ దిరిగివచ్చుటకు రెండువారములదినములు పట్టెను. సేవకు లానాఁ డొకచో గుమిగూడి గుసగుస లాడుచుండిరి. ఫల్గునుఁ డది చూచెను. వారిసమీపమునకుఁ బోయి నిలిచెను. వీఁడు సేవకులందఱకుఁ బెద్ద గనుక నందఱును వానికి మర్యాదచేసిరి.

ఫల్గునుఁడు—నేఁడు మీరందఱు రహస్యముగాఁ జేరి మాటలాడు చున్నారు. ఆసమాచారము నే నడుగవచ్చునా ?

సేవకులు—కాదయ్యా, మఱి యేమియు లేదు. మాయొద్ద నీకుఁ దెలియని రహస్య మేమియు లేదు. నీవు రెండువారములుగా వేఁటకుఁ బోయి యుంటివిగదా ? ఇటీవల రాత్రులయందు భూతములబాధ యధికమై యున్నది. ఇన్నిదినములనుండి దానికిఁదగిన మంత్రతంత్రములు చేయనిదానివలన నిపు డింతప్రమాదమునకు వచ్చినది. ఒక పెనుభూతము చెఱువునడుమ నున్న ప్రాసాదములయొద్దఁ దిరుగుచున్నది. అది వంతెలమీఁదుగా వచ్చి మరల చెఱువునొద్దకుఁ బోయి నీళ్లలోఁ బడిపోయినది. నామాట నీకు నమ్మకము లేకున్న, ఢిల్లీనుండి వచ్చియున్న దామోదరుని నడుగుము. ఒకనాఁ డాభూతము కొండమీఁదినుండి దిగి చెఱువుగట్టునఁ దిరుగుచుండెను. మేము దానిని జూచుచుండి మెల్లఁగాఁ బోయి దామోదరునితోఁ జెప్పితిమి. వాఁడును గ్రొత్తప్రాసాదములయొద్ద గస్తీతిరుగుచుండినవల్ల భునిఁ బిలుచుకొని వచ్చెను. అతఁడు ధైర్యముతో దానిసమీపమునకుఁ బోయి నిలిచినాఁడు. వానికి దానికి నొకబారెఁడుదూర మైనను లేదు. అది నిలిచినస్థలమందే మాయ మాయెను. మేమందఱము నారాత్రియంతయు నచటనే తిరుగుచుంటిమి. అది మరలఁ గనఁబడలేదు. దీని కే మనియెదవు ? మీరు మామాట నమ్ముట లేదే కాని చాలదినములనుండి దానిని జూచుచునే యున్నాము. మానిసి యైన, రాత్రి యంతయు నీటిలో దాఁగియుండుట కగునా ?

ఫల్గునుఁడు—ఇది యే మై యుండును ? ఇన్నిదినములు లేనిభూతమిపు డెచటినుండి వచ్చెను ? విక్రమసింహుఁడు చనిపోయినాఁ డన్నది యబద్ధమే కావలయు. ఈచిన్నది యెవరు ? రాజకుమారియగు చంపకమాలిని యై యుండునా ? అ ట్లై యున్నఁ దనతల్లి కేల తెలియజేయలేదు ? వారే వీరు కానిచో, నీచిన్నది కుట్రలు చేయుట యెందులకు ? చీ యది యేమి చేసెను ? నాగుట్టు బైటఁ బడు నని నేనుగదా దానిని సందేహించుచున్నాను. విక్రమ

సింహుఁడపరాధి గదా! వాఁడిచటికి వచ్చి యేమి చేయఁగలఁడు? బహుశః రాత్రులయందుఁ దిరుగుచుండి సమయము కనుపెట్టి రాజును జంపవచ్చును. రాజును జంపినవాఁడు నన్నూరక విడుచునా? అరికులకగికుంభ భేదనసమర్థుం డగు నావిక్రమసింహునకు నేనొకదోమతో సమానము. ఏనుఁగునకుఁ దలు పోకయప్పడమువంటిదఁట. మమ్ముఁ జంపి పిమ్మట వానినిర్దోషత్వమును వెల్లడిపఱచుకొనఁగలఁడు. అతఁ డెట్లు దోషి యగును? విక్రమసింహుఁడు తనకు శత్రువు కలఁడన్నమాటకూడ నెఱుంగఁడే; వానిమీఁదిదోషారోపణము నామహిమ గదా; నేను బట్టినకార్యమును జయింపవలదా? వాఁడెట్టివాఁడైన నా కేమి! నన్ను నేను సంరక్షించుకొనవలదా? హేమప్రభ ఢిల్లీశ్వరునికిఁ జెల్లెలివరుస. ఆమెను దనసొంతచెల్లెలికంటె నెక్కుడుగఁ బ్రేమించుచున్నాఁడు. ఆమె మనకు విరోధముగాఁ జెప్పిన, నతఁడు నాతల నాకు ణమే తీయింపఁడా? కనుక నేదియో యాపద రానున్నది. ఈవిషయమును నే నిదిపఱకూరక విడిచి యుండఁగూడదు. ఇఁక నాలస్యము సేయక వానిని ఖైదిగాఁ బట్టింప వలయును. ఇదియే నాకు క్షేమకరము. ఈకార్యమునకు ముందు దానిని జంపవలయును. ఇట్లాలోచించుకొని యిందిరను సంహరించుటకు బద్ధకంకణుఁ డయ్యెను.

ఢిల్లీశ్వరుఁ డుదయపూరునకు విచ్చేయుచున్నాఁడని యొకవదంతి జనులలో వ్యాపించి యుండెను. "అతఁ డెందులకిపుడు రావలె" నని కొందఱు, "వా రిరువురును స్నేహితులు గనుకఁ జూచుటకై వచ్చు" నని మఱికొందఱు, "అది కాదురా! ఏమోవిచారణ యఁట. మిగుల రహస్యముగా జరుగునఁట." యని యొకఁడు. అది కాదన్నా, పదియాఱు సంవత్సరములకు ముందుఁ దప్పించుకొని పోయిన విక్రమసింహరా జిచటి కేతెంచియున్నాఁడఁట. అతనిని బట్టుటకై యాగ్రొత్తసిపాయిలు వచ్చియున్నారఁట. నేఁడో, రేపో యతనిని బట్టుబట్టి విచారించి, వెనుక నుత్తరువుచేసియున్న యురిశిక్షను స్థిరపఱచి యతనిఁ జంపింతురఁట. ఈవిషయము రాణికిఁ దెలియకుండునట్లు మిగుల రహ

స్యముగ జరుపుచుండఁట. భద్రము. తలలెగురును. నోటిమాట జారెనా, యనర్థము సంభవించును. ఫల్గునుఁడు సామాన్యుఁడు కాఁడుసుమా.” యని మఱియొకఁ డనెను.

సేవకుఁడు—అయ్యో! పాపము! అతఁడు మహానుభావుఁడే. అతనికే యిట్టికష్టములు రావలెనా? ధర్మ మెక్కడికిఁ బోయెను? మదనపాలుఁ డీవంశమునఁ బుట్టకయే రాజ్య మపహరించినాఁడు. తనరాజ్యముమీఁదికి వచ్చునేమో యని మదనపాలుఁ డతనిమీఁద మాత్సర్యము సాధింపవలె. ఫల్గునుఁ డెందుఁ కతనిమీఁద మాత్సర్యము సాధింపవలె. ఏమేమి యన్యాయములు జరగవలయునో, యీరాజ్యమున కింకను నేమేమి యాపదలు రానున్నవో, యివి యన్నియు మనము చూచుచుండవలె నని మనను దుట బ్రహ్మ వ్రాసినాఁడు. పలుకవలదు. ఎవరైనను వినెద” రని రహస్యముగ మాటాడుకొనుచుండిరి.

పిచోలచెఱువుమధ్య నుండుకొండమీఁదఁ గలరెండుప్రాసాదములను మార్గకొలఁదిపనివారు శుభ్రపఱచుచుండిరి. ఈకథ జరిగినయనేకసంవత్సరంబులకుఁ బిమ్మటఁ జక్రవర్తి యగు షాజిహాన్, ముంటాజిమహాల్, ఈదంపతులు ఢిల్లీకిఁ బోవునఱకు నీసుందరహర్మ్యములం దుండిరని చరిత్రకారులు వ్రాసియున్నారు. అంతటిమనోహరం బగు నాసౌధములు ధూళిధూసరంబులై చూచువారి మనస్సులను దుఃఖమందు ముంచుచుండినవి. వానిని నేఁడు పరిశుభ్రపఱిచి వివిధము లగురంగులఁ బూయుచుండిరి. గదులన్నింటి నవసుధా విలేపితంబులఁ జేసి యచ్చటివస్తువులఁ దీసివేసి వానిస్థలంబులందు గొప్పవెలగల మంచములు సింహాసనములు మున్నగు విలువగు వస్తువులచే నలంకరించుచుండిరి ఇంకను ప్రాసాదాలంకారము పూర్తి కాలేదు. ఆపని యంతయుఁ జేయించుటకు ఫల్గునుని రాజాజ్ఞాపించెను. చక్రవర్తి దిగుటకుఁ దగినట్లు లలంకారము చేయించుటకు వానికే తెలియు నని రాజానమ్మకము. ఆనాఁటిసాయంకాల మందఱుభోజనాదులు దీరినపిమ్మట, ఫల్గునుఁడు తనప

దుకటింటియందుఁ బరుండక పరులెవరు నెఱుఁగనట్లు బైటికిఁ బోయెను. మనదామోదరుఁడు మాత్రము వానిని గమనింపకపోలేదు. నాఁటిరాత్రి యిందిరకు నిదురపట్టలేదు. కొండమీఁదిప్రాసాదములయొద్దకు రమ్మని తండ్రి చెప్పియుండెను. అతనియాజ్ఞప్రకార మచటికిఁ బోవవలయునే నని నిశ్చయించి యిందిర పక్కనుండి లేచి మెల్లఁగ బైటికి వచ్చి నలుదిక్కులు బరికించి చూచెను. దామోదరుఁడు వచ్చి యామెను జూచి తలుపులు దీసి యుంచి పోయెను. గాఢాంధకారము క్రమ్మియున్నది. ఎచటఁ జూచినను నిశ్శబ్దము. అచ్చటచ్చట వృక్షములయందుఁ బురుగుల కీచుకీచు మనుశబ్దము తప్ప మఱేమియు వినఁబడలేదు. ఇందిర మిగుల ధైర్యశాలిని. ఆచీఁకటిలోఁ జెట్ల సందులలోఁ దూఱి చెఱువు నొద్దకుఁ జేరెను. ఆగొప్పతటాకముమధ్యమం దున్నయాసౌధరాజంబులు సముద్రమధ్యమందలి ద్వారకాపురియందు గల సౌధంబులో యన్నట్లు లలంకృతములై చూపఱుల కానందజనకంబులై యుండెను. ఆయర్ధరాత్రియందుఁగూడ నాప్రాసాదంబులఁ జూచి యిందిర యానందంబు నొందెను. నూతనంబుగా నావంతెనమీఁద వరుసలు దీర్పఁబడి పూలచెట్లతో నలంకరింపఁబడియుండెను. ఇందిర వానినన్నిటిని జూచుచు సోపానంబుల నెక్కి పోయి సౌధంబుచెంత నిలిచి చుట్టును గలయఁ జూచెను. "అయ్యో! నాతండ్రి యింకను రాలేదు. ఇచట నే నొంటరిగాఁ జిక్కితినే. ఒకనాఁడైనను భయం బనునది నే నెఱుంగ. నేఁడేలొకో హృదయమం దొకవిధం బైనభయము కలుగుచున్నది. నా కేదైన నాపద రానున్నదా? దైవము గలఁడు. భయముఁ జెందనేల? ఈసౌధముయొక్క వెనుకటిభాగమం దుండుమనికదా నాతండ్రి చెప్పియుండె" ననుకొనుచుఁ బోయి యచటనుండు పొట్టిగోడ నానుకొని నిలిచి యాచెఱువువైపుఁ జూచుచు నాలోచనానిమగ్నురాలై యుండెను. గ్రహచారవశంబున మిత్రానందుని వెదకుటకై ఫల్గునుఁ డంతకు ముందే యచటికేగి యాసౌధమందు దాఁగియుండెను. వాఁడు గవాక్షములనుండి యిందిరను జూచి భయచకితుఁ డాయెను. పిమ్మటఁ బర

మానందభరితుఁడై యీసమయమును వ్యర్థపఱుపఁగూడ దని తలంచి యా నిమిషమందే మెల్లఁగాఁ దలుపు దీసికొని వచ్చి, యాచెఱువునందలి తరంగములను జూచుచున్న యిందిరను నఱుకుటకై వెనుకనుండి తనచేతికత్తిని గుఱి చూచి వ్రేయుటకై పైకెత్తెను. అటు లెత్తినకత్తి యేలాగో పైభాగమందే తగులుకొన్నట్టు తెలిసెను. ఎవరో కత్తిని చేతినుండి పెఱికిన ట్లుండెను. ఫల్గునుఁడు మహాధైర్యశాలి. ఇంతమాత్రమునకు భయపడువాఁడు గాఁడు. ఆకత్తి ముండ్లకంపలలో నిఱుకుకొన్న దని వాఁడు తలంచెను. ఏల యనిన నిందిర నిలిచియున్న మొండిగోడదగ్గఱ నొకముండ్లచెట్టు కంపలతో నిండియుండెను. ఫల్గునుఁడు కాలము వ్యర్థముచేయక తనరెండుచేతులతో నిందిరను బైకెత్తి "చావు ముండా" యనుచు నాకంపలలో విసరివైచెను. "అయ్యో!" యనుశబ్దము తప్ప మఱేమియు వినఁబడలేదు. ఫల్గునుఁడు కొంచెముసే పచటనే నిలిచియుండెను. అంతయు నిశ్శబ్దముగా నుండెను. "ఇఁక వాఁ డొకఁడున్నాఁడు. వాఁడును నాలుగైదుదినములలో నురితీయఁబడును. ఇపుడు నే నిచట నుండఁగూడదు. రేపు వచ్చి కత్తి తీసికొనవచ్చు." ననుకొని మెల్లఁగా మరలిపోయెను.

ఇందిర యపుడే కనులు విచ్చి చూచెను. తా నొకమృదుశయ్యయందున్నట్టు తోఁచెను. ప్రక్క నెవరో విసరుచున్నారు. చల్లనిదీపము వెలుఁగుచుండెను. మరలఁ గన్నులు మూసెను. దేహ మాద్యంతము నొప్పు లని యపుడామెకుఁ దోఁచెను. మూలుగుచుండెను. ఆపురుషుఁడు వేడిపాల నిందిరనోటిలోఁ గొంచెము కొంచెముగాఁ బోయుచుండెను. ఆపాలు కుక్షియందుఁ బడఁగనే కొంచెము శక్తి కలిగినదై పాలఁ బోయుచున్న చేతిని మెల్లఁగాఁ దాఁకి చూచి 'నాతండ్రి' యనుమాట లామెనోటినుండి వెలువడ, నాచేతి నెత్తి యతఁడు కనుల కద్దికొనెను.

మిత్రానందుఁడు—నను గన్నతల్లీ, నేను నిర్భాగ్యుఁ డను నీతండ్రినే. భయపడవలదు. ఇచట ని న్నెవరును గనుఁగొనఁజాలరు. అట్టి నిర్భయస్థానమం దున్నావు.

ఇందిరకుఁ జక్కఁగా జ్ఞానము కలిగెను. జనకా, మీరా! భగవంతునిమహిమ యెంతచిత్రంబు! "జనకా, కొంచెము విశ్రమించి పిదప సమాచారము తెలిపెద. మీరును బండుకొనఁగూడదా?"

మిత్రానందుఁడు—అమ్మా, నీ కిపుడు కలిగినయాపదను జూచి గుండెలు చెదరియున్న నా కెట్లు నిదుర రాఁగలదు? నీవు పరుండుము. నీసమీపమందే కూర్చుండెద నని లేచి పోయి యొకయౌషధంబుఁ దెచ్చి యిందిర నోటిలోఁ బోసెను. దీపముఁ దెచ్చి యామెశరీరమం దున్నముండ్ల నన్నిటిని దీసివైచి, కాలికి భుజములకుఁ దలకును దగిలియున్నగాయముల కన్నిటిని మందు పూసెను. తత్సమీపగృహమందు మిగులవెలగల బీరువాలు, పెట్టెలు, సోఫాలు, మంచములు, కుర్చీలు, నిలువుటద్దములు మున్నగునవి యన్నియు కొఱంతలేక యుండినవి. మిత్రానందుఁ డచట నొకపెట్టెను దీసి దానిలో నొకచీరను దెచ్చి యిందిర కిచ్చెను. ఇందిర మెల్లఁగా లేచి యాచీరను గట్టుకొని తనచీరను బ్రక్కకుఁ ద్రోసిపెట్టఁగనే మిత్రానందుఁ డాచీర నుదికి యచట నాఱఁగట్టెను. ఇది యంతయుఁ జూచుచున్నయిందిర మిక్కిలి దుఃఖము నొందెను. తండ్రి తనచెంతకు రాఁగా, "అయ్యో! జనకా, తమ రిట్టి కార్యముఁ జేయవచ్చునా? నే నెంతపాపిని. తమచేత నాచీర నుదికించుకొంటినే" యని పరితపించెను.

మిత్రానందుఁడు—పిచ్చిబిడ్డా, ఇది యేమి తెలివితక్కువైనయాలోచన. నేను రత్నదీవిని జేరినపిమ్మట సేవకు లుండిరి. కనుక నిట్టిపని నామీఁదఁ బడలేదు. రెండేండ్లబిడ్డను నే నెత్తుకొనివచ్చితినే? మలమూత్రంబుల నెత్తువాఁడను నేను. గుడ్డ లుతుకువాఁడను నేను. నాచిట్టితల్లికి జడవేయువాఁడను నేను. నాతల్లీ, యపుడు నీపనులవలనఁగదా నాకాలము సుఖముగాఁ గడచెను.

ఇందిర లేచిపోయి తనతండ్రిపాదంబులపైఁ బడి యేడువఁదొడఁగెను.

మిత్రానందుఁడు—అమ్మా, యిది యేమియజ్ఞానము? "దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః" అను భగవద్వాక్యంబు మఱవవలదు.

ఇఁక నీవిచటఁ దామసింపవలదు. రమ్ము. అంతఃపురంబుచెంత విడిచిపెట్టి వచ్చెద.

ఇందిర—తండ్రీ, నిన్న రాత్రి మీతో మాటాడుటకై యిచటికి వచ్చి సౌధమునకుఁ బశ్చాద్భాగమం దున్న గోడయొద్ద నిలిచి యాలోచించుచుంటిని. అచటనుండి నే నిచట నున్నది కనుంగొనెనో, నన్నొక్కతె చెఱువులోకి విసరివైచెను. వానిస్పర్శ కాఁగానే తెలివి తప్పుచుండెనది. 'అయ్యో' యని యఱచితిని. చూచితిరా? ఎంతయాపద? ఇచటి కెట్లు వచ్చితినో నే నెఱుంగ.

మిత్రానందుఁడు—కుమారీ, నేను నీకుఁ జెప్పియుండినప్రకారము కాలము మించక యిచటి కేతెంచితిని. సౌధగవాక్షమం దొకమనుష్యుఁడు సంచరించుచున్నట్టుండెను. వాఁ డెవఁడైయుండునో యనుసందేహముతోఁ బొదలో దాఁగియుంటిని. కొంతసేపటికిఁ దలుపు తెఱవఁబడి యొకఁడు వెలుపలికి వచ్చెను. వాఁడు పశ్చాద్భాగమునకుఁ బోవుటయును గంటిని. ఆకాఱు చీఁకటియందు వాఁడు ఫల్గునుఁడని నాకుఁ దెలియలేదు. మఱునిముసమందే 'అయ్యో' యనునఱపు వినవచ్చెను. అది నీకంఠ మని యెంచితిని. ఇందిరా, యపుడు నామన సెట్లుండెనో నీవే యూహించుకొనుము. వెలిటికి వచ్చునంతలో నేను నిలిచియున్న పొదదగ్గఱనుండియే ఫల్గునుఁడు పోవుట గంటిని. అపుడు నీ కేదియో యపర్థము గలిగిన దని నిశ్చయించితిని. అయినను వాఁడు పోవువఱకు నిలిచియుండక తప్పదాయెను. పిమ్మట దీపము వెలిఁగించి యాస్థలమును జక్కఁగాఁ బరీక్షించితిని. అచట దీఁగె లల్లుకొని యున్న యొకపొద విఱిగి క్రిందికి జాఱిపడియుండెను. దానిమీఁద నీవు స్పృహ తప్పి పడియుంటివి. అం దొకచెట్టుకొమ్మ నీభుజమునకుఁ దగిలి నెత్తురు కాఱుచుండెను. కాళ్లక్రింద నొకచెట్టుమొక్క దగిలి యచటను గాయమై యుండెను. ఆమొక్క యచట లేకయున్న నీ వాకలుకుబండలమీఁదఁ బడి తునాతును కలై చెఱువులోఁ బడియుందువు. నీశరీరము దొరకె నని యాసఁగొంటినే కాని నీవు బ్రతికియున్నా వని యెంచలేదు. కరదీపిక నార్పి యాచీఁకటి

యందు మెల్లఁగా నిన్నెత్తి నాభుజముమీఁద వైచికొని ప్రకృతివెలుతురునే యాధారముగాఁ గొని పైకెక్కితిని. నీగుండెలు కొట్టుకొనుచున్నట్టు తోఁచెను. అప్పుడు నీజీవితముపై నాకు ధైర్యము నిచ్చెను. ఆవంతెన నెక్కి యిచటఁ జేరితిని. ఇచట నీకుఁ జికిత్సలు చేయ నారంభించితిని. క్రమముగా నీకుఁ జైతన్యము గలిగెను. తనయా, నన్నీశ్వరుఁడు రక్షించుననుట కింతటి కంటె గొప్పనిదర్శన మేమున్నది? కుమారీ, లెమ్ము. చీరగట్టుకొనుము. నిన్ను బైటవిడిచివచ్చెద. మనకతిశీఘ్రముగనే కష్టములుతీఱునని నమ్మియున్నాను.

ఇందిర—జనకా, యీభూగృహ మింతసుందరంబుగను శుభ్రముగను నున్నదే, యిది యంతయు నేఁ జూడవలదా?

మిత్రానందుఁడు—ఇందిరా, పదియాఱుసంవత్సరములుగా మూయఁబడి, మనుష్యసంచారము లేనియీస్థలము వాసయోగ్యముగా నుండుటకుఁ గారణం బరయలేవా? నీవు నీతల్లియిల్లు చేరినప్పటినుండి నేనిచటనే వసించుచు నీస్థలము నంతయుఁ గ్రమముగ శుభ్రపఱచుచున్నాను. ఈభూగృహము రెండు మైళ్లదూరము వ్యాపించియున్నది. ఆకానలీకొండలలోయలలోను దీనికి మార్గమున్నది. ఈనగరమందలిసత్రమువెనుక నొకమార్గము కలదు. చెఱువుపంతెన ప్రక్కను దీనికి మార్గము లున్నవి. మనపూర్వు లిచట సకలైశ్వర్యములఁ జేర్చియుంతురు. ఆహారవస్తువు లుండును. ఇప్పుడు దీనిని జూచుటకు సమయముకాదని యిందిరతోఁ దెలిపి యామెను బిలుచుకొనివచ్చి సత్రమువెనుక విడిచిపెట్టెను. అప్పటి కింకను దెల్లవాఱలేదు. ఇందిర మెల్లఁగా వచ్చి యంతఃపురముఁ జేరెను. ఈమె రాఁగనే తలుపు తెఱవఁబడెను. ఇందిర భయముఁ జెందెను. దామోదరుఁడు మందహాసముతో నామెకు నమస్కరించెను. అతఁడు దామోదరుఁ డని తెలిసి పోయి తెరచెంతఁ గూర్చుండెను. అప్పుడు నాలుగుగంటలు కొట్టెను. ఇందిర తనపడుకమీఁదఁ గొంతసేపు నిదురించెను. తెల్లవాఱఁగనే తనకార్యములఁ దీర్చికొని, రాజమాతకుఁ జేయఁదగిన శుశ్రూషలను ముగించి "అమ్మా! నేఁడు నాకు జలుబుచేసి శరీర మంతయు నేలాకో నొప్పులుగ నున్నది. కొంచెము విశ్రమించెద నని యనుజ్ఞ నడిగెను.

రాజమాత—ఇందిరా, నీ కేమిజబ్బు? ఈనాఁడెందులకో యొకవిధముగా నున్నావు?

ఇందిర—అమ్మా, చీఁకటిలోఁ బోయి క్రిందఁబడితిని. తలకు, భుజములకు, దెబ్బలు తగిలినవి. మ రేమియు లేదు.

రాజమాత—"ఇందిరా, భోజనం బొనరించి నిద్రింపుము. ఆగాయంబులకు మందు దెప్పించి పూయుము."

తరువాత నిది యేమై యుండు నని ఫల్గుని విచారించెను. ఈసారి వాఁడు రాజమాతతో సన్మత మాడ నిశ్చయించుకొని, నా కది తెలియ దనెను. ఎందుల కనఁగా, ఇపుడు ఢిల్లీశ్వరుఁడు వచ్చుచున్నాఁడు. తనపని జరిగిన పిమ్మట "వీఁడు హంతకుఁ" డని సార్వభౌమునితోఁ జెప్పిన తన కది అనర్థదాయకమని యెంచెను.

# వింశత్యధ్యాయము



ఢిల్లీశ్వరుఁడు వచ్చుమార్గమం దచ్చటచ్చట నతనికి వలయు వసతు లన్నియు మదనపాలుఁడు మిగుల శ్రద్ధగాఁ జేయించుచుండెను. ఆకార్యము లన్నియు లలితకుమారునియాజ్ఞ కనుసరణముగా జరుగుచుండెను. అపు డూరంతయు, ధ్వజపతాకలచే నొప్పారుచుండెను. రాజభవనశృంగార మంతయు ముగిసెను. అందఱు రాజు నెదుర్కొనుటకై తగుప్రయత్నంబుల నొనర్చుచుండిరి.

పృథ్వీరాజు కొలఁది సైన్యముతో వచ్చుచుండెను. మార్గమునందు వివిధములగుపంటలచేఁ గనుల కింపొనరించుచు, నిరుప్రక్కలయం దెంతవఱకుఁ జూచిన, నంతవఱకుఁ బచ్చనిపైరులచేఁ గనఁబడు కేదారంబులును, నచ్చటచ్చట పచ్చిక బయళ్లయందు మేయుచున్న కామధేనువులతోఁ దులదూఁగు గోసమూహములను, వానివెంబడి ఱంకెలు వైచుచు గోపురములవంటి మూఁపురములచే శోభితంబు లగువృషభములను జూచి కనులకు విందొనరించుచుఁ, గ్రూరసత్వంబులచే భీకరంబు లగు నడవిసీమలను దాఁటి, యామార్గమందలిపల్లెలయం దుండుముగ్ధ లగు కృషీవలులకాంతలు, జాగ్రత్తగా పేరఁబెట్టిన తియ్యని పెరుఁగుకుండలఁ దెచ్చి యవ్యాజప్రేమతో నతని కర్పించి వందనంబుల నాచరించిరి. మఱికొందఱు చిక్కనిపాలకడవలను దెచ్చి సమర్పించిరి. ఆగ్రామము లందలిబ్రాహ్మణులు వేదఘోషణములచేఁ బృథ్వీమహారాజు నాశీర్వదించి మంత్రాక్షతల నిచ్చిరి. సార్వభౌముఁడు మిగుల నుత్సాహముతో నుదయపూరు సమీపమునకు రాఁగనే మదనపాలుఁడు రాజు నెదుర్కొనుటకై బంధుసహితుఁడై యరిగెను. లలితకుమారుఁ డంతఃపురంబునందే నిల్చి సార్వభౌమునకు వలయుపరికరముల నాయత్తపఱచుచుండెను. ఆనాఁడు మధ్యాహ్నము భగ్గు

నుఁడు రాజమాతను దర్శించుటకై లోపలఁ బ్రవేశింపఁగనే యచట నిందిరను జూచి స్తంభితుఁ డాయెను. "ఇది భూతము గాదుకదా" యని ముందటికి వచ్చి యోరగంటితోఁ జూచెను. ఇందిర వానిని జూచినను నేమియుఁ దెలియనిదానివలెఁ దనపనులఁ జూచుకొనుచుండెను. ఫల్గునుఁడు దానినే గమనించి చూచెను. ఆమెముఖలక్షణములు మాఱలేదు. "నేనని యిది గుర్తించియుండదు. ఇది యెట్లు బ్రదుకఁగలిగెను? దీనినిగుఱించి మాధవునితో మాటాడుదునా? అట్లు చేసిన, వానికి నామీఁద సందేహం బొదవును. లేనిపీడను నే నెందులకుఁ దెచ్చుకొనవలయును? ఎట్టులైనను రేపు సార్వభౌముఁడు రాజ్యమునఁ కేతెంచును. మాధవునిమాటలవలన విక్రమసింహుని నేఁటిరాత్రికే పట్టునట్లు వివిధము లగునేర్పాటులు జరుగుచున్నట్లు వింటిని. ఇట్టిసమయమందు నేనతిజాగ్రత్తగా నుండవలయును. ఇంతలోఁ బుట్టి మునుఁగునదేమున్నది?" యని చింతించుచు రాజమాతను దర్శించి పోయెను.

వివిధవాద్యఘోషములు వినఁగానే, గుఱ్ఱపురౌతులతోను, నేనుఁగులతోను, పదాతులతోను, లలితకుమారుఁడు వెడలెను. రాజు రాజ్యము ప్రవేశింపఁగనే గుండ్లు ప్రేల్చిరి. హేమప్రభామందిరమునుండి కుమారసింగు మొదలగువీరులందఱు లలితకుమారునితోఁ జేరి వెడలిరి. చక్రవర్తిపురబహిర్ద్వారము ప్రవేశింపఁగానే జయధ్వానంబులచే స్వాగతం బొసంగఁ దన్నుఁ జూడవచ్చిన రాజబంధువుల నందఱను నుచితరీతిని సత్కరించి పురంబుఁ బ్రవేశించి, కుమారసింగును జేరఁ బిలిచి, తనరథమునందే కూర్చుండఁ బెట్టుకొని, హేమప్రభకుఁ జెప్పఁదగినమాటలు చెప్పి పంపెను. దానిని జూచి మదనపాలుఁడు మిక్కిలి సంతసించెను. ఎందులకనఁగా, విచారణ జరుగుసంగతి హేమప్రభకుఁ దెలియఁగూడ దని సార్వభౌముఁ డింతరహస్యముగాఁ గార్యములు జరుపుచున్నాఁడని మదనపాలుఁడు నమ్మెను. దైవసంకల్ప మన్యథా నడచు నని యతనికిఁ దెలియదు. మహారాజు రాజ్యమందలి గృహంబులసౌందర్యమును వీక్షించుచు, సకలసంపదల కునికపట్టయినయారాజప్రాసాదంబు, బంగరుకలశంబులతో వెలయు

గోపురములచేఁ దనయొప్పుఁ బ్రకాశింపఁ బురస్త్రీలు పాటలఁ బాడి, పుష్పంబులతో మిశ్రితంబులైన మంగళాక్షతంబులను మహారాజుపై వెదఁజల్లుచుండ, వందఱ నభినందింపఁజేయు కృపాదృష్టుల వారిమీఁద నెఱపుచు రాజగృహంబుఁ బ్రవేశించెను. చెఱువునడుమఁ గట్టియున్న హార్మ్యంబునందే మహారాజు బసచేసెను మఱుసటిదినంబు ప్రాతఃకాలమున సహచరులు లేచి తమ కార్యంబులు చేయుటకుఁ బోవగా, నంతట మహారాజు దిగియున్న ప్రాసాదంబునకుఁ బ్రక్కనున్న ప్రాసాదముకవాటముల బంధింపఁబడియుండెను. అది యెందులకో యెవరికిని తెలియదు. సిపాయిలు కావలియుండిరి. అంతఃపురంబున సేవకులు గుసగుస లాడుచుండిరి. ఫల్గునుఁ డిద్దఱొకచోట నిలిచి మాటలాడకుండునట్లు నిర్బంధించుచుండెను. ఆనాలైదుదినములలో రాజుగారు విశ్రాంతిఁ జెందియుండిరి. మఱుసటిదినమున సరిగాఁ బదిగంటలకుఁ జక్రవర్తిగారు సభ నలంకరింతు రని ప్రకటించిరి. రాజ్యమందలిజను లందఱు రాజసౌధద్వారమందుఁ గ్రిక్కిఱిసియుండిరి. కొన్నినిమేషంబులలో నొక ప్రకటనపత్రంబును దెచ్చి పైటఁ గట్టిరి. దానిలో "ఈ నాఁటిసభయందు సామంతరాజులు రాజబంధువులు ప్రధానసేనాపతులు మావిచారణకాలమందుండవలసినది. కాని సామాన్యప్రజ లుండఁగూడ" దని వ్రాయఁబడియుండినది. సభాద్వారము తెఱవఁబడెను. సిపాయిలాయుధపాణులై బారులు దీరి నిలుచుండిరి. ఇంతజనసమూహము నిండియున్నను నిర్జనస్థలంబువలె నిశ్శబ్దముగా నుండెను. పదిగంటలు కొట్టుచుండఁగనే వారివారిదేశచిహ్నంబుల సూచించు టెక్కెములు ధరించి నడుములయందు దీర్ఘంబు లగు కత్తులు వ్రేలాడుచుండ, అనర్ఘంబు లగుగుఱ్ఱంబుల నెక్కి రాజపుత్రులు మెల్లమెల్లఁగాఁ దమయశ్వంబుల నడుపుచు నిద్దఱిద్దఱుగా వచ్చుచుండిరి. వారు సభాస్థానంబునొద్ద వరుసలు దీరి నిలువఁగనే నాలుగు గుఱ్ఱంబులు గట్టఁబడి రైదుస్వర్ణకలశంబులచే నలంకృతంబైనరథంబునందుఁ బృథ్వీమహీపాలుఁడు దిగెను. అతనివెంబడి మదనపాలుఁడు లలితకుమారుఁడు వచ్చి దిగిరి. సభలోఁ

చక్రవర్తి సింహాసనాసీనుం డైనపిమ్మట నందఱు వారివారిస్థలములయందు నాసీనులైరి. మహారాజునకుఁ గుడివైపున రెం డాసనము లుండెను. వానిం జూచి యం దెవరిని గూర్చుండ నియమించునో యని మదనపాలుఁ డాలోచించుకొనెను. ఫలము లేదు. ఆరెం డట్లే యుండినవి. మదనపాలుఁడు కూర్చుండిన చోటునకు వెనుకటిభాగమందుఁ బ్రధానసేవకులవరుసలో ఫల్గునుఁడు చేరియుండెను. దామోదరుఁడు మాధవుఁ డీయిద్దఱు ఫల్గునునివెనుకభాగమందు నిలిచియుండిరి. వా రిరువురు ధరించియున్న వస్త్రములను వారికవచములయందు వ్రేలాడుచున్న బిరుదాంకితపతకంబులను జూచి ఫల్గునుఁడు కలఁతఁ జెందెను. తా నెంచినట్లు దామోదరుఁడు మాధవుఁడు కాఁడు 'నన్ను మోసగించెను. నేను జెడితి ననుకొనెను. అపుడు విమలసింగు సభకు వచ్చి, చక్రవర్తికి నమస్కరించి, యోమహానుభావా నేను మంత్రిపదవినుండి తొలఁగింపఁబడి పదియాఱుసంవత్సరంబు లైనవి. తమ రీనాఁడు రాజకార్యముల విచారించుటకై విచ్చేసియున్న యుదంతమును విని తమదర్శనమును జేసికొని కృతార్థుఁడఁ గావలె ననుతలంపుతో నిచటికి వచ్చితిని. ఈ సేవకుఁ డిచట నుండుట కనుజ్ఞ నొసంగిన నుండెద. లేనిచోఁ జనియెద.

పృథ్వీ—విమలసింగ్, నీసచ్చరిత్రంబును నే నెఱుంగ నని తలఁపకుము. నీవే యీమంత్రిపదవికిఁ దగినవాఁడవు. ఈ కార్యభారము లన్నియుఁ బరిష్కరించుటకే నే నిచటకి వచ్చుట. కూర్చుండు మని యుచితరీతి నతనిం గౌరవించెను. అపు డాసభ యలలు లేనిసముద్రంబువలె నిశ్శబ్దముగా నుండెను. రా జందఱను గలయఁ జూచి గంభీరస్వరముతో "సామంతరాజులారా! రాజబంధువులారా! నేఁటిదినము నే నిచట సభచేసియుండుట కొందఱకుఁ దప్ప ననేకులకుఁ దెలియదు. ఇపు డాకారణమును మీకందఱకుఁ దెలియఁజేయవలసి యున్నది. పదునైదుసంవత్సరంబులకు ముందు తండ్రిని హత్య చేసినా రను నపరాధము మోపఁబడి, నాతాతగా రగు అనంగపాలచక్రవర్తిచే మరణశిక్ష విధింపఁబడి, కారాగారమునుండి తప్పించుకొనిపోయిన

విక్రమసింహమహారాజుగారు నాసమీపమం దున్నారు. వారీసౌధభాగంబులలో రాత్రులయందు తిరుగుచున్నా రనియుఁ దనరాజ్యము నపహరించి యున్న తన్ను (అనఁగా మదనపాలుని)ఁ జంపు నుద్దేశముతో రహస్యముగా దాఁగియున్నా రనియు నిపు డతనిం బట్టి నాతాతగారు విధించినశిక్షను స్థిరపఱుపవలె ననియుఁ బ్రకృత మీమేనారురాష్ట్రమునకు రాజని యేలుచున్న మదనపాలుఁడు మాళవదేశాధీశ్వరుఁ డగులలితకుమారునిచే నొకయభియోగపత్రమును వ్రాసి పంపెను. కావున నితఁ డీవ్యవహారమునకు వాదిగా నేర్పడెను. మఱియు విక్రమసింహమహారాజుగారు నిర్దోషి యని స్థిరపఱచుటకుఁ గొన్నిపత్రికలు నా కందినవి. ముందు నాతాతగా రీవ్యవహారమును విచారించినకాలమందు విక్రమసింహమహారాజు తనతండ్రిని జంపినాఁ డని యాతనిసవతితల్లి యగుమురళాదేవి వాదిగా నేర్పడి వ్యవహారముఁ దెచ్చెను. అతఁడు చంపెనా? లేదా? యను సమాచారము ప్రతివాదిని విచారింపకయే మాతాతగారు మురళాదేవి తనబంధువర్గమందుఁ జేరిన దనియుఁ బ్రతాపసింహమహారాజుగారు పత్నీవియోగమం దుండినపుడు, నతఁడు తనకుఁ బరమమిత్రుఁ డైనందున నతనిని బిలిపించి, తానే యామురళాదేవిని బ్రతాపసింహమహారాజుగారికి వివాహము చేసినయభిమానమువలనను, జక్రవర్తిగారు పక్షపాతముచేత విక్రమసింహమహారాజుగారికి నురిశిక్ష విధించిరి. కాఁబట్టి యాతీర్పిపుడు చెల్లదు. దానిని బునర్విచారణ చేయవలసియు నని మదనపాలుఁడు చెప్పియుండుటవలన నిపుడు విచారణ చేయవలసియున్నది. నాతాతగారు స్థిరపఱచినవ్యవహారమును బదియాఱుసంవత్సరంబులు గడచిన పిమ్మట నామనసార సమాచారముఁ దెలిసికొనక యంధునివలెఁ దీర్పు చెప్పువాఁడను గాను. ఇపుడు విక్రమసింహమహారాజుగారి నిర్దోషిత్వమును స్థిరపఱచుటకు నొకన్యాయవాది బైలుదేఱియుండుట మీకుఁ దెలిసియున్నది. అన్యాయవాది యొకస్త్రీ. తొలుత విక్రమసింహమహారాజుగారిని బిలిపింపవలెను” అని యటువైపు తిరిగిచూచునంతలో మాధవసింగు మహారాజు ముందు నిలిచి నమస్కరించెను.

పృథ్వీ—సేనానీ, మాధవసింగ్, నీవు పోయి మర్యాదతో విక్రమసింహమహారాజుగారిని బిలిచికొని రమ్ము.

మాధవసింగ్—చిత్తము మహాప్రభూ.

అయిదునిమిషములలో రథము సభాద్వారమందు నిలిచెను. మాధవుఁడు తలుపుదీసి కైదండనియ్యఁగా విక్రమసింహుఁడు రథమును దిగఁగానే "జయ జయ విక్రమసింహదేవ్." అను జయధ్వానంబులును, ఓతండ్రీ! యిఁక మిమ్ము విడువము. మాప్రాణముల నైన నిచ్చి దుర్మార్గులబారినుండి మిమ్ముఁ దప్పించెదము." అని యఱచుచున్న ప్రజలరోదనధ్వని దశదిశల వ్యాపించెను. సేనాని మాధవసింగ్ చేసన్నచేఁ గలకలమును నివారించెను. ప్రజలు శాంతిఁ జెందిరి. మహారాజు శుభ్రవస్త్రంబుల ధరించి ధర్మదేవతవలె నాసభను ప్రవేశించెను. సభలోనివా రందఱు లేచిరి. వందనములును హాహాకారశబ్దములును బైలువెడలినవి. సార్వభౌమునిహస్తసంజ్ఞచే నంతయు నిశ్శబ్ద మాయెను. పిమ్మటఁ జక్రవర్తికి నమస్కరించి తల వంచి నమ్రుఁడై నిలిచియున్న మిత్రానంగుఁ డని పేరుఁవడసిన విక్రమసింహమహారాజును జూచి, చక్రవర్తి సంతాపమనస్కుఁడై "ఓమహానుభావా, యీయాసనంబు నలంకరింపుఁ" డనెను.

విక్రమ—దేవా ! నే నపరాధి నన్నుమాట మఱచితిరే ?.

పృథ్వీ—అది య ట్లుండనిండు. నేను జెప్పినరీతిని మీ రిచట విశ్రమింపవలయును.

విక్రమసింహుఁడు రాజాజ్ఞవలనఁ గూర్చుండెను. దీనినిజూచుచున్న మదనపాలుఁడు మూర్ఛఁ జెందుస్థితిలో నుండెను. అతనిముఖంబు కళాహీనంబై యుండుటఁ జూచి "ఇతఁడే వంచకుఁడై యుండునా" యను సంశయము ప్రేక్షకులకుఁ గలుగుచుండెను. ఇఁక ఫల్గునునిగుఱించి చెప్ప నవసరమే లేకుండెను.

పృథ్వీ—సభికులారా! యిపుడు ప్రతివాదితరపున్యాయవాదిని రప్పింపవలెను. కుమారసింహా, అందులకు మీ రే మనెదరు?

కుమార—సార్వభౌమునియభిప్రాయ మెఱింగిన కుమారసింగు, "దేవా, కన్యలు దృష్టిదోషరహితలు. అదియునుంగాక యిట్టిసమయమం దామె వచ్చి తీఱవలయును గద?

ఫల్గునుఁడు సార్వభౌమునిమాటలకే తత్తఱపాటొందెను. ఇపుడు కుమారసింగుమాటను విని "యాస్త్రీ యెవరై యుండు" నని, ముఖము నల్లఁబాఱ దిగ్భ్రమఁ జెంది యుండెను. మదనపాలుఁ డేమిప్రమాదము రానున్నదో యని ప్రాణములయం దాశ వదలియుండెను. సార్వభౌముఁడు "సేనానీ, కేశవసింగ్" అనఁగనే దామోదరుఁ డెదుటకు వచ్చి నిలిచి "ప్రభూ! నా పేరు దామోదరుఁ డందు" రనెను.

పృథ్వీ—ఇట్టిసమయములయందుఁగూడ నీకు హాస్యమేనా? కేశవసింగని పే రుండఁగ, దామోదరుఁడ వెట్లయితివి?

కేశవ—దేవా! అది విష్ణునామ మైనను లోకమందలియజ్ఞానులు తిండి తిని సోమరిగాఁ దిరుగువానిని దామోదరుఁ డందురు. నా కీఫల్గునుఁడు దామోదరుఁ డని పేరు పెట్టె నని చెప్పుచు, వెడలిపోయెను.

పృథ్వీ—మంచిది.

ఇంతలో బండితలుపు తెఱచుకొని యొక లేఁబ్రాయపు టెలనాఁగ రథముదిగి చూపఱ కప్సరసయో యను సందేహము గలిగించుచు, లోపలి కరిగి, చక్రవర్తికి నమస్కరించి నిలిచెను. రథము సభాద్వారమందు నిలిచెను. అది యుత్తమాశ్వచతుష్టయంబుచేఁ గట్టఁబడి సువర్ణకలశంబులచే నలంకరింపఁబడి యున్న హేమప్రభాదేవిరథము. సభాసదులదృష్టి యటువైపున స్తంభించినట్లు నిలిచెను.

చక్రవర్తి యామెను జూచి "ఆహా! ఏమి దీనియందము! ఆభరణము లీమె దేహస్పర్శచేఁ గాంతియుక్తంబు లగును గాని యాభరణంబు లీమె కలంకారంబులు గావు. సర్వాంగసుందరి కలంకారం బేల?" యని చింతించి,

రాయన్నలమిన్నా! నిన్నీరీతి నిండినసభకుఁ బిలిపించిన యీగ్రామీణుని మన్నింపుము. తల్లీ, ఆయాసన మలంకరింపు" మనెను. ఇందిరయును దనతండ్రికిఁ బ్రక్కనున్న పీఠమందుఁ గూర్చుండెను. లలితకుమారునకు స్మృతి లేదు అపాంగ వీక్షణంబులచే నామెను జూచుచు ముగ్ధుఁడాయెను. ఏల యనఁగా, నిందిర దేహకాంతి యిట్టి దని యెంచఁగలేదు.

పృథ్వీ.—మహారాజా! మీప్రతాపమును మీవినయసౌందర్యములను వినియుంటిని. ఇపుడు ప్రత్యక్షముగఁ జూచుభాగ్య మబ్బినది. ఓసయామూర్తీ, మీ కెందుల కింతటియపఖ్యాతి గలిగె?

మిత్రా.—ప్రభూ! యిప్పటికిఁ బదియాఱుసంవత్సరంబులకు వెనుక నాతండ్రి యగుప్రతాపసింహదేవుఁడీమేవారురాజ్యమునకు యువరాజుగా నన్నుఁ బట్టాభిషిక్తునిగాఁ జేసెను. గ్వాలియరుప్రభు వగు నమరసింహుని యనుంగుఁబుత్రిక యగుహేమప్రభ నాసహధర్మచారిణి. అప్పటికి నాకు రెండుసంవత్సరంబులు గల యొకపుత్రి యుండెను. ఇట్టిస్థితిలో నాతండ్రిగారొకదినంబునఁ దమకుఁ దలనొప్పి, గుండెలయందును నొప్పి యని చెప్పిరి. ఆక్షణమందే నేను వారిని శయనమందిరమునకుఁ దీసికొనిపోయితిని. అచట సకలచికిత్సలు జరుగుచుండెను. నేను సమీపమందేయుండి నాప్రియజనకున కాహారమిచ్చి వారు శయనించినపిమ్మటఁ బాదము లొత్తుచుఁ గూర్చుండియుంటిని. అపుడు వారికి నిదురపట్టెను. నే నచటనే కాచుకొనియుంటిని. పదునొకండుగంట లాయెను. అపుడు నాజనకుఁడు మేల్కొని నన్నుఁ జూచి "ప్రియపుత్రకా! భోజన మాయెనా?" యనెను. నే నూరకయుంటిని. "నీ విట్లు నిద్రింపక, భోజనము లేకయుండుట నాకు దుస్సహముగా నున్నది. కుమారా! నా కిపుడు కొంచెము స్వస్థముగా నున్నది."యని తా లేచి నన్నాలింగనం బొనర్చి నాఫాలభాగమం దొకము ద్దిడి, "కుమారా! పోయి భోజనంబు గావించి నిదురింపుము. నాకుఁ గావలసియున్న నిముసమందే నీకుఁ జెప్పి పంపెద" నని చెప్పి నన్నుఁ బంపిరి. రాజేంద్రా! యదియే నాప్రియజనకునితో

నే నాడినకడపటిమాట. అంతిమదర్శనము. పిమ్మట నాతండ్రిని నేను జూడ లేదు. గృహంబునకుఁ బోయి భోజనంబునకుఁ గూర్చుంటిని గాని రుచింప లేదు. సోఫాయందే కూర్చుండి వారియుత్తరువు నిరీక్షించుచు నాదిశ యందే దృష్టి నిలిపియుంటిని. రెండుగంట లాయెను. ఎవరును రాలేదు. నామనస్సునట నిలువలేదు. నాజనకుని చెంత కరిగితిని నే నచటికిఁ బోవు నప్పటి కచట నాతల్లి కూర్చుండి యుండెను. ఫల్గునుఁడు వాకిట నిలిచి యుండెను. నన్నుఁ జూచి నాతల్లి "వారు నిదురించుచున్నారు. నీవును బోయి నిదురింపు" మని చెప్పెను. నాశయనగృహంబునకుఁ బోయి నిదురిం చితిని. చెడుకలలు, దుఃఖము—వీనితో నానిదుర యంతయు నిండెను. ప్రాతః కాల మాఱుగంటలు కొట్టకముందే, నాతండ్రిమరణవార్త తెలిసెను. దుఃఖ పడుచున్నంతలోఁ బదిమందిభటులు వచ్చి, "నీవు తండ్రిని వధించిననేరమున కై చక్రవర్తియాజ్ఞచే నిన్ను బంధించితి" మని చెప్పుచు నన్ను శృంఖలా బద్ధునిగాఁ జేసి కారాగృహమం దుంచిరి. సార్వభౌమా! నాకుఁ గలిగినదశకై దుఃఖింతునా? సతీసుతులకై దుఃఖింతునా? దివి కేగిన నాప్రియజనకునికై దుఃఖింతునా? రానున్నది రానిమ్మని ధైర్యముగా నుంటిని. పిమ్మట విచారణ జరగెను. నేను నాతండ్రిని కత్తితోఁ బొడిచి చంపినట్లు సాక్షులచే నిశ్చ యింపఁబడెను. "నీవు చెప్పుకొనవలసిన దేదియైన నున్నదా?"యని వన్నడి గిరి. "నే నేదియు లే"దంటిని. పిమ్మట మీ తాతగారు నా మరణశిక్ష విధిం చినట్లుత్తరువు వచ్చె. నన్నుకారాగృహమందే యుంచియుండిరి. మరల నన్నిరిదీయుట కేమి యాలస్యమని యచటిసేవకులను నే నడుగఁగ, నన్ను ఢిల్లీకిఁ దీసికొని పోయి యచట నాపని జరుపుటకు నిశ్చయించినట్లు తెలి సెను. ఆస్థితియందు భార్యమీఁదను బిడ్డమీఁదను నామనంబు పోలేదు. నా తండ్రిత్రోవ ననుసరించుటకే స్థిరనిశ్చయుఁడనై యుంటిని. నే నచట మైమఱచి పడియుంటిని. "లెమ్ము వత్సా, లెమ్ము. ఆలస్యము వలదు. బ్రతికి యుండిన సుఖ మనుభవింపవచ్చును. అద్వారము తీసి వెడలిపొ"మ్మని యెవరో

చెప్పిన ట్లుండెను. ఆశబ్దము ఘంటానాదమువలె నా చెవిని బడినంతనే నా కొకయుత్సాహము జనించి "ఏద్వార" మని యాలోచించుకొని భూగృహ మంతయుఁ బరీక్షించి, యచట నున్న ద్వారంబును దీసి బైటికి వచ్చి మరల జాగ్రత్తగ దానిని బంధించి యచట నుండినకంబళిఁ గప్పుకొని పోయి భూ గృహంబుఁ జేరితిని. ఆనాఁటినుండి మూఁడుమాసంబు లచటనే యుంటిని. నాతల్లి తనతమ్ముఁడగు మదనపాలుని దత్తస్వీకారంబుఁ జేసికొని యతనిచేత నాతండ్రి కుత్తరక్రియలు గావించె ననియు, రాజ్యమునకును బట్టాభిషిక్తుని జేసినట్లు సమాచారము తెలిసికొంటిని. మరలఁ గొన్నిదినంబులకే హేమప్రభ వసించియున్న యంతఃపురంబునకుఁ బలుమాఱు మదనపాలుఁడు పోవుచుం డుటయును, శాస్త్రములు పునర్వివాహ మంగీకరించి యున్నందున నాతల్లి, తనకుమారునకు నా భార్యను బునర్వివాహము చేయుతలంపు గలిగియున్నదని యీఫల్గునుఁడే చెప్పుకొనుచుండ విని, నాబిడ్డను దీసికొనిపోయితిని. పిమ్మట మే మిరువురము క్రమముగా రత్నదీవిఁ జేరి సుఖముగా నుంటిమి. నాకూరిమి తనయయొక్క సహవాసముచే నాప్రాణ మొకింత శాంతిఁ బొందియున్నను, ముందు నాబిడ్డగతి యేమి యనుచింత నామనంబు వేధింపకయుండలేదు. లలితకుమారుఁడు నాయింటికి వచ్చిన పిమ్మట నీరాజ్యమందలి యభిమాన మావిర్భవించెను. నాపుత్రిక కిపుడు షష్టాదశవర్షంబుల ప్రాయము. ఈకన్య నాహృ దయవేదనయందుఁ బాల్గొని నన్ను నిరపరాధి యని నిరూపించుటకు బద్ధకంకణ యై నేను నివారించినను వినక, యిచటికి వచ్చెను. నేనును నా భూగృహమం దున్నాను. ఆనాఁడు ఫల్గునుఁడు నాతండ్రిపడుకటింటివాకిట నిలిచియుం డెను. నేను లోపలి కరిగితినా? మరల నే నచటికి వచ్చియుంటినా యను వృత్తాంతము ఫల్గునునిఁ దమరు విచారించిన, వాఁడు చెప్పు నని నమ్మెద.

మహారాజు ఫల్గునునివంకఁ జూచెను. దామోదరుఁడు వానిని వీఁపు మీఁదఁ దట్టి "ప్రభువుగా రడిగినదానికిఁ బ్రత్యుత్తరముఁ జెప్పు" మనెను.

గారముప్రక్కనే యున్నది. అదియు నొక రాజపుత్రుకటి ల్లనియే చెప్పఁ దగి యున్నది. వీనిపెట్టెలో దాఁచి యుండిన చిట్టీలవంటి చిట్టీ లనేకము లున్నవి. దానిని మీరు విచారింపవచ్చును. ఇది యంతయు వినుచుండిన ఫల్గునుఁడు నిర్ఘాంతపోయెను. ప్రక్కనుండువారికైనఁ గ్ర్యపచారంబులచేఁ బ్రబుద్ధుఁడై పిచ్చిపట్టినవానివలె నలుదిశలఁ జూచుచుండెను. వీని పెట్టెయందు నాచీటి యుంచియున్న చిట్టీకి సమానంబైన కొన్ని చిట్టీ లున్నవి. రత్నాభరణము లున్నవి. ఆ విషయము లేశమైన మీకేఁ దెలియునా? లేదు. ప్రసిద్ధవారి వలె నొకసేవకుని చేతికొమ్మలవలె నుంచుకొని శోధనీయుఁగా దే? తాము వానిని బరీక్షింపవచ్చును. ఇదిగో అచ్చట నుండువస్తువుల లేఖయేయని యొక జాబును రాజునుంచుటఁ బెట్టెను. మే మిరువురము పాటుపడి సాధించు కార్య మొకటేమై యున్నను, దేవా! నే సాధించుచు న్నాము. దానిని జయించుట నాపని. వాఁడు చేయునది పరద్రవ్యాపహరణము, రాజద్రోహము. ప్రభూ! ఇవి యన్నియు నాతండ్రి నిరపరాధి యని తెలియుటకుఁ జాలియుండలేదా? ఇదియునుం గాక నీయంతఃపుర సంరక్షకుఁ బన్నినాథుఁ డనునొక సేవకుఁ డున్నాఁడు. వానిని దమరు విచారించినయెడల నింకొక నిదర్శనము మీకు దొరకును. నాకుఁ దెలిసిన దింతియు.

కేశవ—మహాప్రభూ! యింతట రాజకుమారి చెప్పినది అతిస్వల్పము. ఆవిషయము వారికి విశేషము తెలియ లేదు. నేను మనవిచేసి కొనుచున్నాను.

పృథ్వీ—కేశవసింగ్! రాజపుత్రి యింకను వాఁడు నిరపరాధి యగు నేమో యని సందేహించుచున్నది. వాఁడామెను జంపుటకై చెఱువులో విసరివేయుట యొకటియే చాలును. వానిదుర్బుద్ధి యెంతవఱకుఁ బోవుచున్నదో మాకు తెలియ నని విచారించుచున్నాను. నీకుఁ దెలిసియున్న విషయముఁ జెప్పుము.

కేశవసింగ్—దేవా! ఫల్గునుఁడు రాత్రి పదిగంటలకుఁ బిమ్మట బైట వెడలెను. అప్పుడు నే నాతనిముఖవైఖరిఁ జూచి, నేఁ డేదియో యనర్థము

జరుగఁబోవు నని తలంచి, వెంటనే పోయితిని. అతఁడు తను రిపుఁడు నివసించు ప్రాసాదమునకుఁ బోయెను. నేను బోయి వెనుకభాగమునందుఁ బొదలో నిలిచి యుంటిని. ఆనాఁ డాగంబు చేపు జరిగెను. పిమ్మట రాజకుమారి యనతి కేళించెను. ఆమె గోడ నానుకొని నిలిచి యుండినది నేఁ జూచితిని. పదినిమిషము లామె నిలిచియుండెనో లేదో, యితఁడు వెనుకనుండి మెల్లఁగఁ బోయి కత్తి పైకెత్తెను. వాఁడు గుటీమాడుచున్నంతలోఁ బైకెత్తిన కత్తిని పైనాకసమునకు నడుమనే నిలిచియుంచిన నేనపహరించితిని. నన్ను దామోదరుఁడనియు, నాముఁడనియుఁ బరిహసించుచున్న యీమూర్ఖుఁడు తనకత్తి నాచేతఁ జిక్కియున్న దని యెఱింగి, యామెను పైకెత్తి "చావు ముండా" యని విసరివేసెను. నే నపుడేమిచేయుటకుఁ దోఁపక యూరక నే విడచిపెట్టితిని. వాఁడు మరలిపోయెను. ఇదిగో అతనికత్తి యని యొరనుండి తీసి రాజసన్నిధానమునందుఁ బెట్టెను. అది బంగారుపిడి గలిగినది. దానిపై నున్న యక్షరంబులు రాచిహ్నపు క్రొత్తయక్షరంబులు చెక్కఁబడి యుండెను.

పృథ్వీ—పద్మనాభునిఁ బిలువ నుత్తరు వొసంగెను. అపుడు పద్మనాభుఁడు వణఁకుచువచ్చి నిలిచి, దండప్రణామంబు లాచరించి "మహాప్రభూ, నే నొకతప్పునుగూడఁ జేయలేదు. భయ మగుచున్నది. నే నిపు డేమి చెప్పవలయునో తెలియదే" యనెను.

మాధవుఁడు—పద్మనాభా! నీవు భయపడవలసినవిషయ మేమంతయును లేదు. ఇపుడు సుమారుపదివారాలక్రింద వెనుక, అనఁగా పెద్దరాజుగా రస్వస్థులై పండుకొనియున్ననాఁడు నీవేకదా పంకా నీడ్చుచుండినది? జ్ఞాపక మున్నదా?

పద్మనాభుఁడు—ప్రభూ! యానాఁడు జరిగిన సమాచారము కొంచెమైనను నేను మఱచిపోలేదు. ప్రజ లెవరును మఱచియుండరని నమ్ముచున్నాను. ఆనాఁటిరాత్రి మహారాజుగారికి పంకా నీడ్చుచుండినవాఁడను నేనే.

మాధవుఁడు—అయిన నాపనుపునందు రాజుగా రొకజాబును నీ చేతికిచ్చి యువరాజుగారి కిమ్మని చెప్పినారా? అట్లు వా రిచ్చినజాబును నీ వేమి చేసితివి? దానిని జ్ఞాపకపఱచుకొని చెప్పఁగలవా?

పద్మనాభుఁడు—స్వామీ, మిగుల భయమగుచున్నది. దీనివలన నేను జచ్చెద నని భయము లేనేలేదు. నాభాగ్యము బిడ్డలునుఁ గష్టంబులపాలు గాకుండఁ దపురు చూచుకొనవలయును. నాయింద్రుడికి సమానులగుయువరాజుగారు మరణించిరి. వారిధర్మపత్ని బ్రతికియున్నది. ఆమెకు నే నిపుడు చెప్పఁబోవుమాటవలన నేనేని సహాయం బగునేని, నాజన్మము సార్థకం బగును. రాజుసేవ ధర్మముగా నేఁ జేసినవాఁడ నగుదును. ప్రభూ, ఆనాఁడు నేను పంకా వీచుచుండఁగా పెద్దరాజుగారు నన్నుఁ బిలిచిరి. నేను బరుగెత్తి లోపలఁ దూఱితిని. “పద్మనాభా! శీఘ్రముగాఁ బొమ్ము. కుమారునిఁ బిలువుము. ఈజాబు వానికి” మ్మని యొకజాబు నాచేతి కిచ్చిరి. నేను దానిని దీసికొనిపోవుచుండఁగ, [illegible] తీసికొని నన్ను నాలోకపనికిఁ బంపివైచెను. “నేనుపోయి దానిని యిచ్చివైచి పోవుదునా” ననఁగా, నే నమ్మితిని. అయిదారు దినములు జరిగినపిమ్మట నతఁడే నా కొకజాబు వ్రాసెను. నాకుఁ జదువఁ దెలియదు. దానిని భద్రముగా నుంచవలె నని నాకుఁ దోఁచెను. యువరాజుగారి విచారకాలమునందు నే నిచట లేను. నాప్రభువున కురిశిక్ష విధించినా రని నే నిటకి వచ్చినపిమ్మటఁ దెలిసెను. ఈవృత్తాంతము నే నెవరితోఁ జెప్పఁగలను? నన్ను విచారించువా రెవరు? “నక్క యెక్కడ, నాకలోక మెక్కడ?” యనురీతి నైపోయినది. అంతలో నాయేలినవాఁడు తప్పించుకొని పోయెనని వింటిని. ఆయన యెచటనైనఁ జల్లఁగా నుండవలె నని యెల్ల దేవతలకు మ్రొక్కితిని. కొన్నిదినముల కాయన చనిపోయె నని యొకవదంతి పుట్టించిరి. అది నిజమో, యబద్ధమో యెవ రెఱుంగుదురు? ఆపత్రికను నాబిడ్డ యుంచి యమ్మగారిచేతి కిచ్చెను. ఇదియే నాయుదంతము.

పృథ్వీ—పద్మనాభా, నీరాజభక్తికి మిగుల సంతసించితిని. వీరే నీ యేలికవారు. వారిని గుర్తింపలేవా! నీకుఁ జావు లేదు. నీవు పోయినరాజునకై వగవవలదు. నేఁటినుండి నీ దుఃఖము నశించినది.

ఇందిర—"దేవా! యిదియే సరకు నాచేతి కిచ్చినజాబని మహారాజసమీపము నుంచెను. చక్రవర్తి యాజాబు నెత్తి కేశవసింగును "చదువు" మనెను.

"పద్మనాభా! నీవు పెద్దరాజుగారు వ్రాసినజాబు నాచేతి కిచ్చితి వని పరులకుఁ జెప్పితివేని, నీతల యెగిరిపోవు నని నమ్ముము. జాగ్రత్తగా నుండుము. అట్లు లేక తెలియునట్లు రహస్యమును దాఁచియుంటివేని నీ దారిద్ర్యము నిన్నుఁ బాసిపోవును."

ఇట్లు: నీక్షేమముఁ గోరు,

ఫల్గునుఁడు.

అని సభవారలందఱు వినునటులు చదివెను. పృథ్వీమహీపాలుఁ డది విని, ఓరీ ఫల్గునా! నీ కింతటికండకావరము? ఇంతటిద్రోహము దాఁగి యుండు నని యెంచితివా? నీవు మహాపరాధి వని నిరూపించుట కనేకనిదర్శనము లున్నవి. నీ వురిశిక్ష కర్హుఁడ వని చెప్పకతీఱదు. వీని కన్నిటికిని బదులు నీ వేమి చెప్పుచున్నావు? ప్రతాపసింహ మహారాజుగారిమృతియు వీరి వలన జరగెను. 'కేశవసింగ్! వానిని దెచ్చి నిలుపు'మని సంజ్ఞ చేయు నంతలో ఫల్గునునిచేతికి సంకెళ్లను దగిలించి, సార్వభౌమునియెదుట నిలువఁ బెట్టెను.

ఫల్గునుఁడు—సంకెళ్లతోఁ గూడ ముందునకు వచ్చి నిలిచి "ప్రభూ! మీరు చెప్పినసంగతు లన్నియు సత్యము. ఆకార్యము లన్నియు నేను జేసినవే. నామరణ మాసన్నం బైన దని నే నెఱింగితి. ఇఁక నేను దాఁచునదే మున్నది

దేవా! సేవకునిఁ బెట్టవలసినస్థానమం దుంచక వాని కత్యున్నతస్థాన మిచ్చిరి. అందువలన వానికీనస్వభావమునకుఁ దగినట్లు గర్విష్ఠుఁడై కన్నుఁ దెలియక, ముందు వచ్చు అనర్థము నాలోచింపక దానికన్న నుగొప్పస్థానము పొందవలెనని వాఁడు కోరెను. ఇట్లు చేయుట ప్రభువునకుఁ దప్పుగదా? ఎటులైన సవతికుమారునిఁ దుదముట్టింపవలె నని పట్టుదలతో మొదటినుండి రాజమాతగారు సాధించు చుండి నన్నందుల కాప్తసేవకునిగా గ్రహించి రహస్యములు జరపుచుండిరి. నేను సేవకుఁడను. ద్రవ్యాశకు లోఁబడి యామెకుఁ దెలియనిపను లన్నియుఁ జేయుచుంటిని. నే నిపుడు సత్యము పలుకుచున్నాను. పెద్దరాజుగారిని నేను జంపలేదు. ఆయినను యువరాజుగారిని దుదముట్టించుట కవు డొక యాధారము దొరకెను. అది యేది యన, అమ్మగా రగట నన్నపుడు రాజు గారు నిద్రించుచుండిరి. రాణిగారు లేచిపోవునపుడు "ఫల్గునా! విక్రముని లోపలికి విడువకుము. ఇట్టిసమయమందు నామీఁది క్రోధముచే నతఁడే దైన రాజుగారికి హానిఁ జేయును. జాగ్రత్త" యని చెప్పిపోయిరి. భవిష్యద్రా జ్యాధిపతిని నమ్మక కొవ్వఁడో యొక సేవకునియొద్ద నిట్లు చెప్పుట యెవరి తప్పు? ప్రభూ! ఆమాట నాధారముగాఁ జేసికొని దీని కేమి చేయవలె నని యాలోచించుచుంటిని. దైవాధీనంబుగా నర గంటలోపల రాజుగారికి ఱొమ్మునొప్పి కలిగెను. ఆనొప్పికిఁ దాళఁజాలక యొకజాబు వ్రాసి పద్మ నాభునిచేతి కిచ్చిరి. వాఁడు బైటికి వచ్చెను. అది యే మని నే నడిగితిని. వాఁడు నడచినవృత్తాంతమును జెప్పెను. అంతలో, లోపల "రామరామా" యను శబ్దము వినవచ్చెను. నేను వాని నచటనే నిలువఁబెట్టి లోపలికిఁ బోయి చూచునంతలో, రాజుగారు స్వర్గస్థులై యుండిరి. దుఃఖపడుటకు మాఱుగా మిగుల నానందముతో బైటికివచ్చి నే నాజాబును గొనిపోయెద నని వానిని వేఱుపనికిఁ బంపివైచి, యాజాబును భద్రపఱచి, యాయపరాధమును యువ రాజుగారిమీఁద వైవవలయు నని యుక్తి తోఁచెను. రాజమాత వచ్చునంత లో నాశరీరమందుఁ గత్తిదెబ్బ గలుగఁజేసితిని. పిమ్మట నిదివఱకు జరిగిన

సమాచారము లన్నియు జరిపితిని. ఎన్నిదినము లైనను నేఁ జేసినపాపము బైటికి వచ్చి నాప్రాణమునకు ముప్పైనది. చెడుతలంపు లున్నవారిని సేవించి వారి చెడుకార్యంబులకుఁ దోడై చెడితిని. మంచివారిని నమ్మినపద్మనాభుఁడు సుఖము జెందుచున్నాఁడు. ఎంతగొప్పవా రైనను దుర్మార్గుల నాశ్రయించిన వారికి సుఖము కలుగనేరదని యిప్పుడే తెలిసికొనఁగలిగితిని. ఇఁక దమ రేమి చేసినను సిద్ధముగా నున్నాను. ఆనాఁటి నపుడే చంపినఁ గూడదా? అది యొకకష్టమా? యాదవులు తమవినాశంబుకొఱకు ముసలంబును దాఁచి యుంచినట్లు నాచీటిని భూమియందు దాఁచితిని.

విక్రమసింహుఁడు—సార్వభౌమా! ఇంతగొప్పరహస్యము బయటపడి నందున, మహావీరుం డగు నాజనకుం డిప్పుడుఁ జావు చావలేదని తెలిసి నామనం బందుచున్న యానందంబునకు మేర లేదు. ఇప్పుడు ఫల్గునుఁడు చెప్పినమాట య శనిపాతంబులవలె నాహృదయమును గలఁచివైచెను. అజ్ఞానవశంబుచేత నాచేఁ జేసిన యపరాధంబు మన్నింపవలెను. ఒకానొక సేవకుఁడు 'దుర్మార్గుల సేవించి నేను జెడితి' నని చెప్పినాఁడే. అట్టియుపవాదముఁ బడయఁజాలను. వానికి నురిశిక్ష విధించినట్లైనఁ జచ్చువాఁడు మానంబును శపించును. ఇదియునుం గాక, వాఁడు నాతండ్రిని జంపలేదు. నాకుమారియును వానిచేఁ జావలేదు. కనుక రాజచంద్రమా! వీనికి బ్రాణహాని చేయఁగూడదని విన్నవించెను.

పృథ్వి—రాజేంద్రా! మీయుదారస్వభావము లోకవిదితంబు. నా తాతగా రెన్నికష్టములు జరిగియున్నను దేనిని విచారింపక తనస్నేహితుని జంపినవానిని జంపవలె నని యొకపట్టు పట్టిన ట్లున్నది. మురళాదేవిగా రాయనకు పుత్రీవర్గమందుఁ జేరినది గనుకను, మఱియును చక్రవర్తిమనమ్ము నెఱింగి యామెయును దనక్రోధము సాధించుట కిదియే సమయంబని యాయ నకు బోధించియుండును. అందులకై వారేవియు విచారింపకయే తనస్నేహి

తునిమరణమున కలిగి యిట్లు యువరాజుగారికి మరణశిక్షను విధించిరి. దైవాధీనంబున నన్నియుం క్షేమకరముగా నడచినవి. లేనియెడల, ఢిల్లీ సంస్థానంబున నొకరాజర్షిని జంపినమహాపాతకంబు సంప్రాప్తించియుండును. రాజచంద్రమా! ఘల్గునివిషయమందు మీరు చెప్పినదియు సమంజసముగా నున్నది. ఘల్గునివంకఁ దిరిగి "ఘల్గునా! దుర్మార్గులయాలోచనలకు దుర్మార్గులే లోఁబడుదురు. గాని సన్మార్గు లెప్పటికిని లోఁబడరు. దీనికి నీకుఁ బద్మనాభుఁడే నిదర్శనము. నీవు చేసిన దంతయు రాజద్రోహము. నీవు లోకకంటకుఁడవు. ఢిల్లీనగరమందు జలమధ్యమున నీయట్టి రాజద్రోహుల కని నిర్మించియున్న కారాగారమందుండ యావజ్జీవ శిక్ష విధించితినని చక్రవర్తి చెప్పుచుండఁగనే, సిపాయిలు ఘల్గుని విచ్చుకత్తుల పహరాతోఁ దీసికొనిపోయిరి. అపుడు సభయందుండువా రందఱు పృథ్వీమహీపాలుని యుదారగుణంబును మిగుల స్తుతించిరి. అపుడు మదనపాలుఁడు లేచి తనరాజాంగుళీయకమును దీసి పృథ్వీరాజున కర్పించెను.

పృథ్వీ—మదనపాలా! గొప్పక్షత్రియవంశమునఁ జనించి, విద్యావంతుండ వై వినయ సౌశీల్యాదిగుణంబుల నొప్పుచున్న నీ యట్టిపురుషుఁ డొక యాఁడుదానిమాట విని, మహాపతివ్రతను బునర్వివాహము చేసికొనవలయు నను తలంపు గలుగుట నీకు ధర్మమం టే? నీ దత్తుతల్లి చేసిన కార్యంబులు గర్హ్యంబులు గావా? అటులైనను నా మె యీవివాహంబునకు సమ్మతించి యుండె నా? ఏ యాధారంబుచే నట్లాలోచించితివి? ఒకసంవత్సర మామెకు గడు వొసంగితివఁట. అపుడు నీకు రావణునివాక్యంబు జ్ఞాపకంబునకు వచ్చెఁగాఁబోలు. అంత మందారావణుఁ డేమాయె నని యేల స్మరించుకొనలేదు? నీదత్తుతల్లి చేసిన కార్యము లవమానభాజనంబులు గావా? ఏధర్మశాస్త్రము ననుసరించి నీతల్లి నిన్ను దత్తస్వీకారం బొనర్చె. అపినుండియు నీ మహనీయుఁడు నీ విషయమునం దత్యంతవిశ్వాసము గల్గియున్నాఁడని వినియున్నాను. అంతటి మహనీయునికి నీ వింతటి గొప్పద్రోహము తలంపవచ్చునా! నీ వాలోచిం

చిన ద్రోహముచే నామె మృతిఁ జెందియున్న, నీ సత్పురుషుఁ డెంతదుఃఖము జెందియుండును! దీని కేమిసమాధానము?

కుమారసింగ్—మదనపాలా! మన్నింపుము. తొలుత నా విన్నపము విని సార్వభౌమునకు విన్నవించెద.

పృథ్వీరాజు—కుమారసింగ్! నీ వృత్తాంత మెద్దియో యెఱిఁగింపుము.

కుమారసింగ్—మహాప్రభూ! మా మదనపాలుఁడు నిజముగా రావణుఁడై యున్న, రామాయణము జరగియే యుండును. మన మదనపాలుఁడు తనయక్కగారి యాజ్ఞప్రకారము నడవవలె నన్న యభిప్రాయము తప్ప నితనికి స్వబుద్ధి లేదనియే చెప్పవచ్చును. ఇతఁడు సత్యోత్తమపురుషుఁడు. ఓర్పు గలవాఁడు. ఒక సంవత్సరము గడువు నేర్పఱిచినదిగూడ ఫల్గుని కుట్రయే. మహారాణిగారికిఁ గలిగినదుఃఖ ముపశమింపఁజేయుటకై యుపచారముఁ జెప్పు వ్యాజముచే నతఁడు మాకోటఁ బ్రవేశించెను. అతని విషమవిధేయతలను జూచి మేమేమియుఁ జేయునది లేక వగానంబుతో నుంటిమి. కొన్నిదినములు గడచినపిమ్మట, రాణిగారి జాగీరుగ్రామముల వ్యవహారంబులను విచారించెద నని పలుమాఱు చెప్పుట కభ్యాసము చేసికొనెను. మే మాతనిప్రజలము. వశవర్తులముగా నున్నపు డేమి చేయఁగలము? చక్రవర్తి చండశాసనుఁడు. కనుక దిక్కు తోఁపక యుంటిమి. ఏనాఁడు విమలసింగును మంత్రిపదవినుండి తొలఁగించిరో, ఆనాఁడే రహస్యాలోచనాసభ నేర్పఱిచి, మా రాణిగారె రాజ్ఞీస్థానమం దుంచి, విమలసింగు నామెకు ప్రధానిగా నుంచి మేమంతఱము మాసభయందుఁ జేరితిమి. ఆసభయొక్క ముఖ్యోద్దేశ మేమనఁగా, మదనపాలుని మేము రాజుగా నంగీకరింపక యుండుటయే మా ప్రథమోద్దేశ్యము. యువరాజుగారిని వెదకుట, సమయముఁ జూచి సార్వభౌమునకు యథార్థవృత్తాంతమును విన్నవించుట, మదనపాలుఁడు మీఱ తప్పకుండువఱకు నోర్పుతో నుండుట—ఇవి మా యుద్దేశములు. ఆకాలమం దిట్టివిపర్యాసము లెవ్వియును దొరకియుండలేదు. విమలసింగు నుత్తరువుప్రకారము కార్య

తునిమరణమున కలిగి యిట్లు యువరాజుగారికి మరణశిక్షను విధించిరి. దైవా ధీనంబున నన్నియు క్షేమకరముగా నడచినవి. లేనియెడల, ఢిల్లీ సంస్థానం బున కొకరాజర్షిని జంపినమహాపాతకంబు సంప్రాప్తించియుండును. రాజచం ద్రమా! ఫల్గునునివిషయమందు మీరు చెప్పినదియు సమంజసముగా నున్నది. ఫల్గునునివంకఁ దిరిగి "ఫల్గునా! దుర్మార్గుల యాలోచనలకు దుర్మార్గులే లోఁబడుదురు. గాని సన్మార్గు లెప్పటికిని లోఁబడరు. దీనికి నీకుఁ బద్మ నాభుఁడే నిదర్శనము. నీవు చేసిన దంతయు రాజద్రోహము. నీవు లోకకంట కుఁడవు. ఢిల్లీనగరమందు జలమధ్యమున నీయట్టి రాజద్రోహుల కని నిర్మించి యున్న కారాగారమందుండ యావజ్జీవశిక్ష విధించితినని చక్రవర్తి చెప్పుచుండఁ గనే, సిపాయిలు ఫల్గునుని విచ్చుకత్తుల పహరాతోఁ దీసికొనిపోయిరి. అపుడు సభయందుండువా రందఱు పృథ్వీమహీపాలుని యుదారగుణంబును మిగుల స్తుతించిరి. అపుడు మదనపాలుఁడు లేచి తనరాజాంగుళీయకమును దీసి పృథ్వీరాజున కర్పించెను.

పృథ్వీ—మదనపాలా! గొప్పక్షత్రియవంశమునఁ జనించి, విద్యా వంతుండవై వినయ శౌశీల్యాదిగుణంబుల నొప్పుచున్న నీయట్టిపురుషుఁ డొక యాఁడుదానిమాట విని, మహాపతివ్రతను బునర్వివాహము చేసికొనవలయు ననుతలంపు గలుగుట నీకు ధర్మంబే? నీ దత్తుతల్లి చేసిన కార్యంబులు గర్హ్యంబులు గావా? అటులైనను నామె యీవివాహంబునకు సమ్మతించియుండెనా? ఏ యాధారంబుచే నట్లాలోచించితివి? ఒకసంవత్సర మామెకు గడు వొసంగితివఁట. అపుడు నీకు రావణునివాక్యంబు జ్ఞాపకంబునకు వచ్చెఁగాఁబోలు. అంత మం దారావణుఁ డేమాయె నని యేల స్మరించుకొనలేదు? నీదత్తుతల్లి చేసిన కార్యము లవమానభాజనంబులు గావా? ఏధర్మశాస్త్రము ననుసరించి నీతల్లి నిన్ను దత్తస్వీకారం బొనర్చె. అదినుండియు నీ మహనీయుఁడు నీ విషయ మునం దత్యంతవిశ్వాసము గల్గియున్నాఁడని వినియున్నాను. అంతటి మహనీయునికి నీ వింతటి గొప్పద్రోహము తలంపవచ్చునా! నీ వాలోచిం

చిన ద్రోహముచే నామె మృతిఁ జెందియున్న, నీ సత్పురుషుఁ డెంతదుఃఖము జెందియుండును! దీని కేమిసమాధానము?

కుమారసింగ్ — మదనపాలా! మన్నింపుము. తొలుత నా విన్నపమున విని సార్వభౌమునకు విన్నవించెద.

పృథ్వీరాజు — కుమారసింగ్! నీ వృత్తాంత మెద్దియో యెఱిఁగింపుము.

కుమారసింగ్ — మహాప్రభూ! మా మదనపాలుఁడు నిజముగా రావణుఁడై యున్న, రామాయణము జరగియే యుండును. మనమదనపాలుఁడు తనయక్కగారి యాజ్ఞప్రకారము నడచినచో నన్న యభిప్రాయము తప్ప నితనికి స్వబుద్ధి లేదనియే చెప్పవచ్చును. ఐన నత్యుత్తమపురుషుఁడు. ఓర్పు గలవాఁడు. ఒకసంవత్సరముగడువు నేర్పఱచినదిగూడ ఫల్గుని కుట్రయే. మహారాణిగారికిఁ గలిగినదుఃఖ ముపశమించుటకై యుపచారముఁ జెప్పు వ్యాజముచే నతఁడు మా కోటఁ బ్రవేశించెను. అతని వినయవిధేయతలను జూచి మే మపుడు చేయునది లేక మౌనంబుతో నుంటిమి. కొన్నిదినములు గడచినపిమ్మట, రాణిగారి జాగీరుగ్రామముల వ్యవహారంబులను విచారించెదనని పలుమాఱు వచ్చుట కభ్యాసము చేసికొనెను. మే మాతనిప్రజలము. వశవర్తులముగా నున్నపు డేమి చేయఁగలము? చక్రవర్తి చండశాసనుఁడు. కనుక దిక్కు తోఁపక యుంటిమి. ఏ నాఁడు విమలసింగును మంత్రిపదవినుండి తొలఁగించిరో, యా నాఁడే రహస్యాలోచనాసభ నేర్పఱచి, మా రాణిగారి రాజ్ఞీస్థానమం దుంచి, విమలసింగు నామెకు ప్రధానిగా నుంచి మే మంతయు మా సభయందుఁ జేరితిమి. ఆసభయొక్క ముఖ్యోద్దేశ మేమనఁగా, మదనపాలుని మేము రాజుగా నంగీకరింపక యుండుటయు మా ప్రథమోద్దేశ్యము. యువరాజుగారిని వెదకుట, సమయముఁ జూచి సార్వభౌమునకు యథార్థవృత్తాంతమును విన్నవించుట, మదనపాలుఁడు మేర తప్పకుండు వఱకు నోర్పుతో నుండుట — ఇవి మా యుద్దేశములు. ఆకాలమం దిట్టినిదర్శనము లెవ్వియును దొరకియుండలేదు. విమలసింగు నుత్తరువుప్రకారము కార్య

ములు జరుపుచుఁ జక్రవర్తికోపాపళిమనమునకు నెదురుచూచుచుఁ గాలము గడపుచుంటిమి. మా యిష్టార్థము ఫలింపక యంత్యమునఁకు విఘ్నములే ప్రాప్తించుచు, మదనపాలుఁడు మమ్ము నతిక్రమించియుండిన, యుద్ధసన్నద్ధులమై, రాజును సంహరించి యుందుము. అప్పుడు కోటలో రాజస్త్రీలందఱు జోహారు జరుపుటకు సంసిద్ధలై యుండిరి. గ్వాలియరు రాణిగారు మా మహారాజ్ఞిగారికై సైన్యము సిద్ధముఁ జేసియుంచియుండిరి. ఇంతకార్యదక్షులమై మేము ముందుబలలనే మదనపాలుఁడు మా కోటలోనికి వచ్చిపోవుట కేయభ్యంతరముఁ జేయకయుంటిమి. విమలాదేవిని మదనపాలునకు వివాహం బొనరించినపక్షమున నొకవేళ మాకార్యంబులు సామోపాయముచేతనే జరుగవచ్చునని మాసభయం దొకయాలోచన జనగెను. అప్పటికిఁ బునర్వివాహప్రస్తావనయేమియు మాకుఁ దెలిసియుండలేదు. అది యాదుర్మార్గుని ప్రచారమై యుండవచ్చును. మదనపాలుఁడు దేవిగారిసమీపమందు మిగుల భయభక్తులతో మెలఁగుచుండును. వెదకిచూచినను వానియం దొక దుర్గుణము చూడలేము. యువరాజుగారు గతించిరను నొకవదంతి గలిగెను. అదియు నా నీచుని కార్యమనియే చెప్పవలెను. దానికిఁ దోడుగ రాజమాతగారి సహాయము నుండియుండును. ఆ వార్తను విని రాజభక్తులగు కొందఱు మరణనిశ్చయులై యుండిరి. యువరాజు కాశీపట్టణం దీశ్వరదాసునింట నున్నారనియు, భర్తృదారిక విద్యాభ్యాసము చేయుచున్నట్లు విమలసింగుగారు తెలిపి మా మనుష్యులఁ దృప్తిపఱచిరి. ఈ విషయము లేవియు దేవిగారికిఁ జెప్పుటలేదు. ఆమె నోదార్చుట విమలసింగుగారికార్యమై యుండెను. లలితకుమారుఁడు రత్నదీవికిఁ బోయి వచ్చిన పిమ్మట యువరాజుగారి క్షేమసమాచారంబు కనుఁగొంటిమి. శింబరుఁడు సభ్యులకుఁ జెప్పెను. వాఁడు విమలసింగుగారి యాప్తసేవకవర్గమందుఁ జేరినవాఁడు. కాలము గడుచుచుండ, మదనపాలుఁడు తనమనోగతంబును దేవిగారికిఁ దెలిపెను. ఆ వృత్తాంతము సభకు దేవిగారు తెలిపిరి. భవిష్యత్కార్యభారము నాలోచింపఁగా, సి

కిశోరికి సమానం బైనమనరాజపుత్రి యెక్కడఁగూడఁ దా నెట్టిదని తెలియనిక కార్యము జరుప వచ్చియున్నా నని విమలసింహుగారు చెప్పిరి. దేవా! ఇత నుఁడు, పరమసాధువు, బంధువర్గమునకుఁ జేరినవాఁడు. మఱియొకరహస్యం బేమనఁగా, గ్వాలియరురాణిగారికి జామాత కాఁదగినవాఁడు గనుకఁ దయ తను మన్నింప నర్హుఁడు.

సుమన—మహాప్రభూ! తౌతపాదు లగు భవారసింగు విమలసింగు మొదలసమాన్యు లినీచుని నపుడే సంహరింపక యుంచినదియు నాపాపఫలమే. పితృసమానుఁ డగు నోభ్రాతృదైవమా! రాజభక్తు లగు సామంతప్రభువు లారా! దుర్బోధనచేత, దుష్టసంకల్పములకు లోఁబడిన యీపాపాత్ముని నే విధంబైనశిక్షకు గుఱి చేసినను, ఆశిక్షకుఁ బాత్రుఁడ నగుదును మనఃపూర్వక ముగా లోఁబడెద నని యందఱకు నమస్కరించి బద్ధాంజలియై నిలిచెను.

విక్రమసింహుఁడు—ప్రియసోదరా! నీవిట్లు చింతించుటఁ జూచి నే నోర్వఁజాల. "పశ్చాత్తాపేన శుద్ధ్యతి" యనుపెద్దలవాక్యంబు వినవే? గతించినదానికై వగవవలదు. ముం దితరాగ గూడకుండునటులై ప్రవర్తించుట యుత్తములలక్షణంబు. సామాన్యమానవునకుఁ బ్రమాదంబులేక నడచుకొనుట మిగులఁ గష్టమే. సర్వథా నీవు దోషివి గావు ప్రభూ! నాసహోదరుని మన్నింపవలె నని వేఁడెద.

పృథ్వీరాజు—పుణ్యస్వరూపా! నీ వెవరిని మన్నింపలేదు? నీ వజాత శత్రుఁడవు. మీయంతటివారికిఁగూడ శత్రువు లేర్పడి మిమ్ము నిన్నివిధము లుగా బాధించిరిగదా? ఏమియాశ్చర్యము! సభాసదులారా, నేఁడు పుణ్య దినంబు. ఈ నాఁటినుండి నాసహోదరీపతి యగువిక్రమసింహదేవుఁ డీ మేవారురాజ్యాధిపతి యని ప్రకటించి ముద్రాంగుళీయకము నాతనివ్రేలఁ బెట్టిసింహాసనాసీనుఁ డగుట కాజ్ఞ నొసంగుచున్నాను. విక్రమసింహుఁడు —సార్వభౌమా! ఇట్టియనేకసింహాసనంబుల కధికారి వగుమీ రిచట నుండు

ములు జరుపుచుఁ జక్రవర్తికోశాపహరణమునకు నెదురుచూచుచుఁ గాలము గడపుచుంటిమి. మా యిష్టార్థము ఫలింపక యుండుటకు విఘ్నములే ప్రాప్తించుచు, మదనపాలుఁడు సమ్మనతిక్రమించియుండిన, యుద్ధసన్నద్ధులమై, రాణాను సంహరించి యుందుము. అప్పుడు కోటలో రాజస్త్రీలందఱు జోహారు జరుపుటకు సంసిద్ధలై యుండిరి. గ్వాలియరు రాణిగారు మా మహారాజ్ఞిగారికై సైన్యము సిద్ధముఁ జేసియుంచియుండిరి. ఇంతకార్యదక్షులమై మేము ముండుటవలననే మదనపాలుఁడు మా కోటలోనికి వచ్చి పోవుట కేయాభ్యంతరముఁ జేయకయుంటిమి. విశాలాదేవిని మదనపాలునకు వివాహం బొనరించినపక్షమున నొకవేళ మాకార్యంబులు నామోపాయముచేతనే జరుగవచ్చునని మాసభయం దొకయాలోచన జనగెను. అప్పటికిఁ బునర్వివాహప్రస్తావనయేమియు మాకుఁ దెలిసియుండలేదు. అది యూహమాత్రగ్గుని ప్రచారమై యుండవచ్చును. మదనపాలుఁడు దేవిగారిసమీపమందు మిగుల భయభక్తులతో మెలఁగుచుండును. వెదకిచూచినను నాతనియం దొక దుర్గుణము చూడలేము. యువరాజుగారు గతించిరను నొకవదంతి గలిగెను. అదియు నా నీచనికార్యమనియే చెప్పవలెను. దానికిఁ దోడుగ రాజమాతగారి సహాయము నుండియుండును. ఆ వార్తను విని రాజభక్తులగు కొందఱు మరణనిశ్చయులై యుండిరి. యువరాజు కాళీఘట్టమున త్యాగదాసునింట నున్నారనియు, భర్తృదారిక విద్యాభ్యాసము చేయుచున్నట్లు విమలసింగుగారు తెలిసి మా మనుష్యులఁ దృప్తిపఱచిరి. ఈ విషయము లేవియు దేవిగారికిఁ జెప్పుటలేదు. ఆమె నోదార్చుట విమలసింగుగారికార్యమై యుండెను. లలితకుమారుఁడు రత్నదీవికిఁ బోయి వచ్చిన పిమ్మట యువరాజుగారి క్షేమసమాచారంబు కనుఁగొంటిమి. శంబరుఁడు సభ్యులకుఁ జెప్పెను. వాఁడు విమలసింగుగారి యాప్తసేవకవర్గమందుఁ జేరినవాఁడు. కాలము గడుచుచుండ, మదనపాలుఁడు తనమనోగతంబును దేవిగారికిఁ దెలిపెను. ఆ వృత్తాంతము సభకు దేవిగారు తెలిపిరి. భవిష్యత్కార్యభారము నాలోచింపఁగా, సింహ

కిశోరికి సమానంబైనసుందరరాజపుత్రి లేక్కింగూడఁ దా నిట్టిపని తెలియనీక కార్యము జరుప వచ్చియున్నాఁ డని విమలసింహుగారు చెప్పిరి. దేవా! మన నుఁడు, పరమసాధువు, బంధువర్గమునకుఁ జేరినవాఁడు. మఱియొకరహస్యం జేమనఁగా, గ్వాలియరురాణిగారికి జామాత కాఁదగినవాఁడు గనుకఁ దనుకును మన్నింప నర్హుఁడు.

మనసు—మహాప్రభూ! తొత్తిపాను లగు ఘనారసింగు విమలసింగు మొదలసమాన్యులినీచుని నపుడే సంహరింపక యుంచినదియు నాపాపఫలమే. పితృసమానుఁ డగు నోభ్రాతృదైవమా! రాజభక్తులగు సామంతప్రభువులారా! దుర్బుద్ధిచేత, దుష్టసంకల్పములకు లోఁబడిన యీపాపాత్ముని నే విధంబైనశిక్షకు గుఱి చేసినను, ఆశిక్షకుఁ బాత్రుఁడ నగుటకు మనఃపూర్వకముగా లోఁబడెద నని యందఱికి నమస్కరించి బద్ధాంజలియై నిలిచెను.

విక్రమసింహుఁడు.—ప్రియసోదరా! నీవిట్లు చింతించుటఁ జూచి నే నోర్వఁజాల. "పశ్చాత్తాపేన శుద్ధ్యతి" యనుపెద్దలవాక్యంబు వినవే? గతించినదానికై వగవవలదు. ముందఱిజాగరూకుఁడవై ప్రవర్తించుట యుత్తములక్షణంబు. సామాన్యమానవునకుఁ బ్రమాదంబులేక నడచుకొనుట మిగులఁ గష్టమే. సర్వథా నీవు దోషివి గావు. ప్రభూ! నాసహోదరుని మన్నింపవలె నని వేఁడెద.

పృథ్వీరాజు—పుణ్యస్వరూపా! నీ వెవరిని మన్నింపలేదు? నీ వజాతశత్రుఁడవు. మీయంతటివారికిఁగూడ శత్రువు లేర్పడి మిమ్ము నిన్నివిధములుగా బాధించిరిగదా? ఏమియాశ్చర్యము! సభాసదులారా, నేఁడు పుణ్యదినంబు. ఈ నాఁటినుండి నాసహోదరీపతి యగువిక్రమసింహదేవుఁ డీ మేవారురాజ్యాధిపతి యని ప్రకటించి ముద్రాంగుళీయకము నాతనివ్రేలఁ బెట్టిసింహాసనాసీనుఁ డగుట కాజ్ఞనొసంగుచున్నాఁడను. విక్రమసింహుఁడు సార్వభౌమా! ఇట్టియనేకసింహాసనంబుల కధికారి వగుమీ రిచట నుండు

నపుడు నే నాస్థానమందుఁ గూర్చుండఁదగదు. మీరే సింహాసనమునఁ గూర్చుండు డని తనస్థానమందుఁ గూర్చుండెను.

పృథ్వీరాజు—మహీపాలా! బహిఃప్రపంచమందు నేను సార్వభౌముండ ననియు మీరు తక్కువ యనునదియు నజ్ఞాన మని నే నెఱుంగుదు. సద్గుణగణ్యుఁడవగు నీవే మాన్యుఁడవని నమ్మెద. నేఁటినుండియు నన్ను నీ సహోదరునిగా భావింపవలె నని నాకోరిక. నీఘనత కనేకానేకవందనంబు" లని కూర్చుండెను. సభాసదులు జయశబ్దంబులచే వారి నిరువురను స్తుతించిరి. వందిమాగధుల స్తుతివాక్యములతో సభ ముగిసెను.

అంతఃపురమం దొకగదియం దాభరణరహితురాలై ధారాసంపాతము వలెఁ గన్నీరు గార్చుచు మురళాదేవి పండుకొనియుండెను. సుఖము గలిగినపు డుబ్బుటయు, దుఃఖము ప్రాప్తించినపుడు పాతాళమునకుఁ జేరుటయు,—యివి యజ్ఞానులకు స్వభావజనితంబు లగుగుణములు. కనుకనే "దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః" యని భగవంతునియుపదేశము. పులి యని తలంచియున్న తనసపత్నీకుమారుఁడు రాజాయె ననువార్త విన్నమాత్రాన నశనితాడితురాలైనట్టు మూర్ఛితురాలాయెను. దాసులయుపచారంబులచే నేదఁ దేఱినది. తనప్రాణంబుమీఁదియాశ విడిచెను. అంతఁ డంతఃపురంబు ప్రవేశించినంతనే తనగతి యేమగునో యని కంపితశరీర యయ్యెను. తా నింతకాలమునుండి సంరక్షించి దాసిగాఁ జేసినయాసపత్నీపుత్రుఁ డేమనునో యని యంగలార్చెను. వాచకులారా, చూచితిరే! సజ్జనులస్వభావము లజ్ఞానులకగోచరము. ఇట్టిసమయమందు విక్రమసింహుఁడు తన సహోదరునితోఁ గోటను ప్రవేశించినపుడు జయశబ్దంబులచే శుద్ధాంతము నిండియుండెను. వేనవేలు దాసదాసీజనులు వచ్చి నమస్కరించి యతని యాశీర్వాదంబులను బొంది కృతార్థులై సంతసమందిరి. విక్రముఁడు తల్లిసమీపంబునకుఁ బోయి యామెకు నమస్కారం బొనర్చి "అమ్మా, యెందుల కిట్లు దుఃఖించెదరు! విధికృతంబును దప్పించుకొనువా రెవరు! జననీజనకులను బోఁగొట్టుకొన్న

విక్రముఁడు—మీ కెందుల కిట్టివట్టి భ్రాంతి. ప్రాయశ్చిత్త మనఁగ నేమి? తలఁచుగా ననేకవిధములుగా, చిత్తము (మనస్సు) సరియగుస్థితియం దుంచుకొని ప్రవర్తింపవలెననికదా యర్థము. ఆయర్థమును విడిచి యజ్ఞానులు స్థూలశరీరమునకు మాత్రము చేసినసంస్కారము ప్రాయశ్చిత్తమా? అజ్ఞాన మధికంబుగా నుండుటచేతఁ బ్రాణులు తాము చేయుకార్యంబు లెల్ల సరియైన వని నమ్మి వ్యవహరింతురు. సత్యాసత్యజ్ఞానమును దెలిసి, యసత్యంబు లగు కార్యములు, మాటలు త్యజించి సత్యముననే ప్రవర్తించుచు నిఁక దుష్కార్యంబులను దలంపక యుండుటయే ప్రాయశ్చిత్తము చేసికొన్నట్లు. దుర్మార్గుల కట్టిగుణంబులు లభించునా? జననీ, సజ్జనులకుఁ బ్రమాదవశంబునఁ గలుగుదుర్గుణంబులు స్థిరంబులు కావు కైకేయిని మాత్రము మనము దుష్టురాలని చెప్పఁ దగదు. భర్తకుఁ దానుమాత్రమే ప్రీతిపాత్రురా లగుభార్య యనుస్వార్థపరత్వం బగుదుర్గుణ మామెయం దుండెను. అదియునుంగాక శ్రీరాముఁ డడవికిఁ బోవలసియున్నది. రావణుఁడు దుర్గుణస్వరూపి. సత్యముచే నసత్యము జయింపఁబడవలసి యున్నది. శ్రీరాములను రాజ్యమునుండి వెడలఁగొట్టు నంతటివా రెవరు? మనుష్యుల కగోచరులై ప్రపంచస్థితిగతులను నడుపుదేవతలు స్వార్థపరురాలగు కైకేయిని గనిపెట్టి యామెమనంబును బ్రవేశించిరి. అట్టిసమయమం దామె కట్టిబుద్ధి గలిగెను. లోకమందపకీర్తి పాలాయెను. మఱల తానుజేసినతప్పు నెఱింగి పుత్రునితోఁ జెప్పి లోపంబుఁ జక్కఁబఱచుకొని ధన్యురాలాయెను. కనుక నే చెడుగుణంబులకు మనస్సునందు అవకాశంబియ్యఁగూడదు. దేవతలు మనలఁ బరీక్షింతురు. స్థిరచిత్తులకు నెట్టివారివలనను జలనంబు లేదు. అమ్మా, నే నింతకర్మ మనుభవింపవలసి యున్నది. దానికనుకూలంబుగా మీహృదయమందు నావిషయమం దేదియో సందేహము కలిగియుండును. ఆసమయమును నిరీక్షించి, దుష్టదేవతలతలంపులు మిమ్ము నావరించిన కారణమున మీబుద్ధి చెడియుండును. జననీ, గతించిన దానిని మఱచి స్వస్థచిత్తలై యుండవలెనని వేఁడెద.

మురళి పుత్రునిశిరంబును స్పృశించి తనపార్శ్వమందుఁ గూర్చుండఁ బెట్టుకొని, "నా ప్రియపుత్రా! నీవే నాకు జ్ఞానదాతవు. నన్నుద్ధరించుకులదీపకుఁడవు. నన్ను మన్నింపుము. తొలుత నీభార్యను జూచితి ధర్మప్రకారము నామనోదుఃఖమును బోఁగొట్టుట కిపుడే కేతెంచితివి. తండ్రీ! హేమప్రభ నాగృహలక్ష్మి. ఆమె వయస్సునఁ జిన్నదైనను జ్ఞానాధికురాలు గనుక తనకు నమస్కరించితి నని చెప్పుము. నీగుణాతిశయంబులను దెలియక వెంగలినై యిట్లు వ్యవహరించితిని. ఇఁకముందు నామనోవిరుద్ధం బగుకార్య మాచరింపనని చెప్పితి నమ్ము. ఇపుడు నాసకలాపరాధములను మన్నించి యీవార్ధక్యమున రక్షింపుము. పతివ్రతాశిరోమణి యగు నాయక్కగారు పొందినసద్గతి నొందుట కిచ్ఛించిననాకు సహాయం బొనర్పశక్తి గలనీవు ఉభయకులములను పవిత్రముచేయుదానవని నమ్మితి నని తెలుపుము. కుమారా, నీవంశమునకుఁ జేరనివాఁడవైనను, అజ్ఞానముచే నేఁ దెచ్చి పెంచి పెద్ద చేసిన మదనపాలుని యపరాధంబులను మన్నించి మీ రిరువురు నతనిఁ భ్రాతునివలె భావింపవలె నని పుత్రునకు నమస్కరించెను.

విక్రముఁడు తల్లి నెత్తి యామెపాదంబులు స్పృశించుచు, "నా ప్రియజననీ, సర్వదా మీ రిట్లు చింతింపవలదు. మదనుఁడు మదీయపుత్రసమానుఁడు. అన్నికార్యములు శుభముగానే జరుగును. ఈనాఁటినుండియు మీరు నా సమీపమునందే యుండవలె" నని ప్రార్థించి మదనా, అమ్మకుఁ బల్లకి సిద్ధపఱుపుము. మన మందఱము సార్వభౌమునితోఁ గూడ నీవదినయంతఃపురంబునకుఁ బోవునంతలో అమ్మ యచటనే యుండవలెను. మన మందఱము నొక పంక్తియందే భోజనాదులు జరుపవలయు" నని యాజ్ఞాపించి, మదనపాలసమేతుఁడై సార్వభౌమునితోఁ గూడ హేమప్రభాంతఃపురాభిముఖుఁడై వెళ్లెను. మురళాదేవి రాణిగారియంతఃపురంబును బ్రవేశించినతోడుతనే మహారాణి వచ్చి యామెను నమస్కరించి తోడ్కొనిపోయి యుచితాసనాదిసత్కారంబులచే సత్కరించెను. చంపకమాలిని నమస్కరించెను. రాజమాత వారిరు

పుర నాలింగనం బొనర్చి, యానందపులకాంకితురాలై దేవియొక్క మన్న నకుం బాత్రురా లయ్యెను. "నాముద్దులపౌత్రీ! యీపాపాత్మురాలు చేసినయపరాధంబుల మన్నింపు" మని యున్మత్తురాలివలెఁ బ్రార్థించెను. చంపకమాలిని వినయముతో "పితామహీ! మీ రిట్లు వ్యసన మొందవలదు. మీరు మాకు వందనీయులు. ప్రమాదమువలన జరిగిన కార్యమున కింత దుఃఖింపవలెనా?" యని యామెను సమాధానపఱచి, విభులనుఁ బిలిచి వా రిరువురును రాజమాతతో నిష్టాగోష్ఠి నుండిరి. కోటలోని రాజస్త్రీ లందఱు నామెను దర్శించి యామెయాగమనంబునకు దమకుఁ గలిగిన యానందము వెల్లడి యగునట్లుపచరించిరి. వారిసత్కారములచే రాజమాత ప్రపంచమునే మఱచెను. సద్గుణవంతులు పరులచేఁ బొందు నుపచారసుఖముయొక్క మూల్య మిట్టి దని యపుడే గ్రహించెను. అయినను పృథ్వీశుఁడు వచ్చి స్నుషరా లను తన్నుఁ జూచి యుపచరింపలే దనుకొఱంత యామెమనంబున వేధించుచుండెను.

అంతలో వివిధవాద్యఘోషము లంతఃపురమును సమీపించెను. విక్రమసింహుఁడు పృథ్వీశునితో ద్వారమునందుఁ బ్రవేశించుచునుండ బ్రాహ్మణులు వేదఘోషములచే మంత్రాక్షతముల నిచ్చిరి. స్త్రీలలో లాజలను పుష్పములను బట్టుకొని వరుసలుగా నిల్చియున్నసఖులు వారిపై వెదఁజల్లిరి. వృద్ధాంగనలు హారతుల నెత్తిరి. వారి నందఱను తగురీతి నుపచరించి విశ్రామశాలను బ్రవేశించునపుడు "రాజేంద్రా, రాజమాత నాసమీపబంధువు. నా తాతగారిచే నధిక మగుమన్ననలు వడసి యుండెను. వినుటకు మీరే నిర్భయముగా నున్నారుగద? నే నింతసమీపమునం గూర్చుండి యామెను జూచి సంభాషింపకుండుట యుక్తంబు గాదనుచుఁ బృథ్వీశుఁ డామెసమీపంబున కరిగెను. విక్రమసింహుఁడుమాత్రము పోవుచుండఁగ నచట నుండుగదిద్వారమందు దేవి నిలిచియుండెను. రా జామెదీనభావంబును జూచి గదిలోఁ బ్రవేశించెను. వెనుక నుండువా రందఱు విశ్రామశాలను బ్రవేశించిరి. అవనీనాథుఁడు ప్రవేశింపఁగనే "హా నాథా! ఆర్యపుత్ర! యెంతకాలంబునకు దైవము దయ

యుంచి నిన్ను నాకు నొసంగె నని యతనిపాదంబులపై వ్రాలెను. రాజామెను బైకెత్తి యొడిలో నామె శిరస్సు నుంచుకొని, 'నాప్రాణపదమా, హేమా, నీప్రేమాతిశయమహిమచేతనే యిన్నికష్టంబులు తీఱి సుఖం బందితి. నీ దివ్యోపచారంబుల కీశ్వరుఁడు నన్ను పాత్రునిగాఁ జేసెను. లెమ్ము దేవీ. ఎందుల కింత దీనురాలవై యున్నావు!

హేమ.—ఆర్యపుత్రా, మీరన్నివిధంబులఁ గష్టంబులపాలై నవయుచుండ, నేను సుఖముగా నీయంతఃపురంబున వసించియుండినది మొదటి యపరాధము. రెండవది మదనపాలుఁడు పునర్వివాహమును చెడుతలంపు కలవాఁ డని తెలిసియున్నను, అతనితోఁ జనవుగా మాటలాడిన మహాపరాధంబు నే నెట్లు పాపుకొందు నని చింతించుచుంటిని. దేవా, యిపుడు నే నేమి చేయుటకును దోఁపక వివేకశూన్యరాలనై యుంటిని.

విక్రముఁడు.—ప్రేయసీ! వీరక్షత్రియస్త్రీ యనఁగా నీకే చెల్లును. ఆకాలమందుఁ గలిగిన దుఃఖమునకు మనసు కలఁతఁ జెంది పుత్రీ దుఃఖంబుచేఁ బ్రపంచంబే రోసి మాఱువేసంబుచే నీ వడవుల కేగియున్న, నే నపు డేమి చేయుదును? నిన్ను రక్షించుటకై నేను రావలసియుండును. అపరాధినై యున్న నే నపుడు శత్రువులచేఁ జిక్కి యురిశిక్షకు లోఁబడియుందును. నీ వష్టకష్టంబులపాలై మరణించియుందువు. నీబిడ్డకూడఁ గష్టజీవిగా నుండు ననియే చెప్పవలెను. పరమమేధావు లగు విమలసింగు మొదలగువారియాజ్ఞ లనువర్తినివై ధైర్యంబు పూనియుంటివి. కావుననే యిపుడు నీకు సుఖంబు చేకూరె. రెండవది, అట్టిస్థితియం దున్న నీ వట్లుపాయంబుచేఁ బరులను జెఱుపక నీధర్మమును, గాపాడుటకై తగునట్లు ప్రవర్తించుటయే తగినయుక్తి. నీవు క్షత్రియస్త్రీవి. ఆధర్మంబును విడువక నిన్ను జయించి లోఁబఱచు

కొనుటకు వచ్చినవానిబలమును కాలమును గుర్తించి వానికిఁ దగునట్లు సామం బుచే మంచిమాట లాడితివి. విమల నిచ్చి పెండ్లిచేసెద నని దానోపాయంబుఁ జూపితివి. దైవగతిచే నంతలో నీపుత్రి యిచటి కేతెంచెను. అవాఁ డుద్యాన వనంబున భేదోపాయంబుచే మాటలాడుచు వానిమాటలకుఁ గుపితవై యొరుల సహాయంబులేకయే నామూర్ఖుఁ డగుప్రియసోదరునిఁ జంపుటకు మహిషా సురమర్దనివలె నుఱికి ఖడ్గంబు పైకెత్తితివి. ఈశ్వరుఁడు న న్నచ్చటికిఁ బిలుచుకొనివచ్చినట్లు లాకస్మికముగా భూగృహమందుండి నేను నిన్నుఁ జూచుచుండి, 'దీపిక, రూపిక' యని యఱచినందున, మదనుఁడు బ్రతికెను. కాంతామణీ, యీమదపరాధమునుగూడ నీవు నా కొనరింపలేదు. నీభర్త నిన్నన్యథా తలంచువాఁడు కాఁడు. పునర్వివాహసమాచారంబు విన్న రెండు నిమిషంబు లది నిజమై యుండునా' యని నీమీఁద శంకాకులుఁడ నైనయపరాధము నీవు మన్నింపవలెను. ప్రియా! నాతల్లిని జూచుటకు సార్వభౌముఁ డేతెంచియున్నాఁడు. అతనితోఁ గూడి భోజనశాలకు వచ్చునంతలో నలంకారభూషితం బగు నీసుందరముఖారవిందం బీనీసహచరుఁ డానందంబుతో దర్శించుగాక.

దేవి—"నాథా—తాముమాత్ర మిటులే సన్న్యాసివలె భోజనశాలకు వచ్చెదరా? మీయిష్ట మున్నట్టుగదా, నాకు గోరిక యుండు నని మీ రాలోచింపవలదా?" యని యిరువు రుల్లాసంబుగా మాటలాడుచు బైటికి రాఁగాఁ, చంపకమాలిని ద్వారమందుఁ దల్లిదండ్రుల కిద్దఱకును నమస్కరించెను. కుమారి నాలింగనం బొనర్చుకొని "నాథా, మీపుత్రిక్రూరత్వంబును వింటిరే? నేనెంత దుఃఖించుచున్నను, నాచారోపచారంబులఁ జేయునే కాని యేసమాచారమును దెలుపదు.

రాజా — ప్రేయసీ! అది నాబిడ్డ, నీవలె దుఃఖించుచున్నఁ బని యెట్లగును? నీస్థితికి మనస్సునఁ గుందుచున్నాను, ధైర్యంబు గనఁబఱుపక తనసాహసంబును జూపి కార్యంబు సాధించె. ఇట్లు మాటాడుచున్నంతలో లలితుఁడు ప్రవేశించి యుభయులకు నమస్కరించెను. రా జతని శిరంబు నాఘ్రాణించి "నాబహిఃప్రాణమా, తండ్రీ, లలితా, నాకుఁ బ్రాప్తించినకళంకము నివృత్తి యాయెను. నాకుమారి నీయర్ధాంగి యని వ్రాసియిచ్చితిని. ఆమె ముందే తనహృదయము నీ కొసంగియున్న దని నే నెఱుంగుదు. బహిఃప్రపంచమునందు జరుగనున్నశుభకార్యంబులకు మేమిరువురము నిమిత్తమాత్రులము. నామతమే నాశివశేఖరిమతం బని నీ వెఱుంగుదు" అని పలుకుచున్నంతలో మదనపాలుఁ డేగి దంపతులకు నమస్కరించెను.

హేమ — బాలకా, మదనపాలా, నానాథుఁడు నిన్ను మన్నించిన కారణంబున నీవు నామన్ననకు నర్హుఁడవే. నిన్ను మన్నించితి. నీ వేమి చేయఁగలవు. ఆమిషంబుఁ జూచి మూపగొన్నగృధ్రంబువలె, దుర్మార్గుల సహవాసంబుచే, ననాథురాల నగునన్నుఁ బరీక్షించితివి. నీవు స్వభావము చేత సత్పురుషుఁడవే. పితృసమానంబుగా నీయన్నను సేవించుచు భక్తిపరాయణుఁడవై యుండుము. నీకు సకలసుఖంబులు చేకూఱును.

అందఱును భోజనశాలఁ బ్రవేశించిరి. దంపతులు స్నానాదికంబులు దీర్చి, యుచితాభరణాలంకృతులై, బంధుజనులు క్రిక్కిఱిసియున్న భోజనశాలయందుఁ బ్రవేశించి రతిమన్మథులుంబోలెఁ గులుకుచు రాజమాతకు వందనం బాచరించిరి. ఆమె యానందబాష్పములతోఁ గూడిన యాశీర్వాదంబులచే వారిని మన్నించెను. విక్రముఁడును భార్యాసమేతుండై విమలసింగు సమీపమునకుం జని "పితృతుల్యుండవగు నోమాన్యుఁడా! కారాగృహమునుండి

కొనుటకు వచ్చినవానిబలమును కాలమును గుర్తించి వానికిఁ దగునట్లు సామం బుచే మంచిమాట లాడితివి. విమల నిచ్చి పెండ్లిచేసెద నని దానోపాయంబుఁ జూపితివి. దైవగతిచే నంతలో నీపుత్రి యిచటి కేతెంచెను. ఆనాఁ డుద్యాన వనంబున భేదోపాయంబుచే మాటలాడుచు వానిమాటలకుఁ గుపితవై ఘోరుల సహాయంబులేకయే నామూర్ఖుఁ డగుప్రియసోదరునిఁ జంపుటకు మహిషా సురమర్దనివలె నుతికి ఖడ్గంబు పైకెత్తితివి. ఈశ్వరుఁడు న న్నచ్చటికిఁ బిలుచుకొనివచ్చినట్లు లాకస్మికముగా భూగృహమందుండి నేను నిన్నుఁ జూచుచుండి, 'ఓపిక, యోపిక' యని యఱచినందున, మదనుఁడు బ్రతికెను. కాంతామణీ, యీవదపరాధమునుగూడ నీవు నా కొనరింపలేదు. నీభర్త ని న్నన్యథా తలంచువాఁడు కాఁడు. పునర్వివాహసమాచారంబు విన్న రెండు నిమిషంబు లది నిజమై యుండునా' యని నీమీఁద శంకాకులుఁడ నైనయప రాధము నీవు మన్నింపవలెను. ప్రియా! నాతల్లిని జూచుటకు సార్వభౌముఁ డేతెంచియున్నాఁడు. అతనితోఁ గూడి భోజనశాలకు వచ్చునంతలో నలంకారభూషితం బగు నీసుందరముఖారవిందం బీనీసహచరుఁ డానందంబుతో దర్శించుగాక.

దేవి—"నాథా—తాముమాత్ర మిటులే సన్న్యాసివలె భోజనశాలకు వచ్చెదరా? మీయిష్ట మున్నట్లుగదా, నాకు గోరిక యుండునని మీ రాలోచింపవలదా?" యని యిరువు రుల్లాసంబుగా మాటలాడుచు బైటికిరాఁగాఁ, చంపకమాలిని ద్వారమందుఁ దల్లిదండ్రుల కిద్దఱకును నమస్కరించెను. కుమారి నాలింగనం బొనర్చుకొని "నాథా, మీపుత్రిక్రూరత్వంబును వింటిరే? నే నెంత దుఃఖించుచున్నను, నాచారోపచారంబులఁ జేయునే కాని యేసమాచారమును దెలుపదు.

రాజు—ప్రేయసీ! అది నాబిడ్డ, నీవలె దుఃఖించుచున్నఁ బని యెట్లగును? నీస్థితికి మనస్సునఁ గుందుచున్నాను, నైటఁ గనఁబఱుపక తనసాహసంబును జూపి కార్యంబు సాధించె. ఇట్లు మాటాడుచున్నంతలో లలితుఁడు ప్రవేశించి యుభయులకు నమస్కరించెను. రాజతని నెత్తిశిరంబు నాఘ్రాణించి "నాబహిఃప్రాణమా, తండ్రీ, లలితా, నాకుఁ బ్రాప్తించినకళంకము నివృత్తి యాయెను. నాకుమారి నీయర్ధాంగి యని బాసయిచ్చితిని. ఆమె ముందే తనహృదయము నీకొసంగియున్నదని నే నెఱుంగుదు. బహిఃప్రపంచమునందు జరుగనున్నశుభకార్యంబులకు మేమిరువురము నిమిత్తమాత్రులము. నామతమే నాశివికేశ్వరిమతం బని నీ వెఱుంగుము" అని పలుకుచున్నంతలో మదనపాలుఁ డేగి దంపతులకు నమస్కరించెను.

హేము—బాలకా, మదనపాలా, నానాథుఁడు నిన్ను మన్నించిన కారణంబున నీవు నామన్ననకు నర్హుఁడవే. నిన్ను మన్నించితి. నీ వేమి చేయఁగలవు. ఆమిషంబుఁ జూచి పాప కొన్నగృధ్రంబునలె, దుర్మార్గుల సహవాసంబుచే, ననాథురాల నగునన్నుఁ బరీక్షించితివి. నీవు స్వభావము చేత సత్పురుషుఁడవే. పితృసమానంబుగా నీయన్నను సేవించుచు భక్తిపరాయణుఁడవై యుండుము. నీకు సకలసుఖంబులు చేకుఱును.

అందఱును భోజనశాలఁ బ్రవేశించిరి. దంపతులు స్నానాదికంబులు దీర్చి, యుచితాభరణాలంకృతులై, బంధుజనులు ప్రక్కఁజేసియున్న భోజనశాలయందుఁ బ్రవేశించి రతిమన్మథులుం బోలెఁ దులకించుచు రాజమాతకు వందనం బాచరించిరి. ఆమె యానందబాష్పములతోఁ గూడిన యాశీర్వాదంబులచ్చే వారిని మన్నించెను. విక్రముఁడును భార్యాసమేతుం డై విమలసింగు సమీపమునకుం జని "పితృతుల్యుం డవగు నోమాన్యుఁడా! కారాగృహమునుండి

నన్నుఁ దప్పించునపుడు, "కుమారా, జీవించియుండి సుఖంబుఁ బడయుము" మని యుచ్చరించినపవిత్రం బగు కంఠస్వరము నాస్మృతిపథంబును బొందె. మీ యాశీర్వాదంబుచేతనే మేము సుఖంబుఁ జెందితి మని, యిరువురుఁ బ్రణమిల్లిరి. అతనియాశీర్వాదములం బడసి మహారాజ్ఞి పృథ్వీశునిసమీపమునఁ కేతెంచి "ప్రియసహోదరా! యనాథగా నుండిన నాకుఁ బతిభిక్షం బొసఁగినపూజ్యుఁడా! నీ కనేకవందనంబు" లనెను.

పృథ్వీరాజు—అమ్మా, సహోదరీ, మీయిరువురదర్శనంబుచే నే బవిత్రుండనైతి నని నమ్ముచున్నాను. దీర్ఘసుమంగలివై సకలసుఖంబుల ననుభవింపు మని యాశీర్వదించెను. వివిధగోష్ఠులచే భోజనాదులం దీర్చి, విశ్రాంతశాలను బ్రవేశించి గంధమాల్యతాంబూలంబుల సేవించుచున్నసమయమంఁ! విక్రమసింహుఁడు "సార్వభౌమా, నాకుమారి లలితుని వరియించియుండు శుభవృత్తాంతము తమకుఁ దెలిసియున్న దని నమ్మెద. వారిరువురకు వివాహంబు జరుగవలయును. గ్వాలియరురాజును నాభార్యయన్నయు నగు విమలసింగుతనయ విమలాదేవి నాతమ్ముని వరించియున్న దని వింటిని. ఆమె కోరిక యీడేరునట్లు వారిరువురకు వివాహములు నిశ్చయించినాను. మీ సోదరిసంకల్పము నైత మిదియే.

పృథ్వీరాజు—మహారాజా, మీసత్సంకల్పము లెన్నటికిని వ్యర్థంబులు కావు. మదనుఁ డెటులైనను పుణ్యాత్ముఁడే.

మదనుఁడు—దేవా! ఆపవిత్రవంశంబునఁ బుట్టినయాక లంక యగు విమల నన్ను వరించియుండఁబట్టియే నేను బుణ్యాత్ముఁడ నని యెంచెద.

రాజమాత—సార్వభౌమా, నేను ధన్యురాల నైతిని. అంధకారంబు వాసె, జ్ఞానోదయం బగుటకు మార్గంబు గలిగె. నాపుత్రుఁ డేమి చెప్పిన

ది నాకు గురువాక్యము. తనువు, మనంబు, ధనంబులు గురువున కర్పించిన చందంబున, నాకుమారునియిష్టము నెఱింగి యనువర్తించెద. అతఁ డెట్లు జరిపినది నా కిష్టమే. అయిన నా కొకకోరిక కలిగియున్నది. ఆ దేదన, [illegible]రాజ్యంబునకు సంభవించినపీడను బరిహరించుకొఱకును, మఱియు గతించిన మహామహులకు గయాశ్రాద్ధాదులను నిజకుమారుఁడు చేసి వచ్చినపిదప నిశ్చయాదిశుభకార్యంబులు జరిపిన బాగుండు నని తోఁచుచున్నది.

ము

చ: విక్రమసింహుఁడు—నాతల్లియాలోచన యత్యుత్తమం బైనది యని నాఁడే కాశీప్రయాణంబునకు శుభదినంబు నిశ్చయింపఁబడెను. సార్వభౌముఁడు బంధువర్గంబుచేఁ బూజింపఁబడి స్వస్థానప్రయాణోన్ముఖుం డాయెను. విక్రమసింహుఁడు తనరాజ్యమందుఁ దొలఁత సైన్యంబు నంతయుఁ బరీక్షించి వారి కుచితబహుమానంబు లొసఁగి, యోధులను గౌరవించి వారివారికార్యంబుల స్థిరపఱచెను. కొలదినంబులు రాజ్యమం దన్నవస్త్రదానంబు లద్భుతంబుగా జరిగెను. అంతఃపురము నంతయు సరియైనవ్యవస్థలో నుంచెను. కాశీప్రయాణంబునుగుఱించిన శుభలేఖలు బంధువుల కందఱకుఁ బంపఁబడెను. మాధవునికుటుంబ మంతఃపురమం దుచితకార్యంబులకు నియమించెను. చంపకమాలిని తనకు సహాయం బొనరించినవారల కందఱకు జీవితాంతమువఱకు సుఖముగా నుండునట్లు లేర్పఱచెను. తాము తిరిగి వచ్చునంతలో వివాహసన్నాహంబులు సిద్ధపఱచునట్లు మంత్రి కొప్పగించి బంధుమిత్రవర్గంబులతోఁగూడి కాశికిఁ బోయి యచట భూరిదానంబులను దల్లిచే నిప్పించి తాను జేయఁదగినవిధుల నెఱవేర్చి శుభలగ్నమం దీశ్వరదాసప్రహితుం డై పురప్రవేశంబుఁ జేసెను. అతివైభవంబుగా నీరెండువివాహంబులు జరిగినవి. పుడు చాలదినములకు ముందు మొలకెత్తిన ప్రేమబీజంబు వృద్ధి యై విమ

లను మదనపాలుఁడు తనప్రాణంబులకంటె నధికముగాఁ బ్రేమిం
సుఖంబు ననుభవించుచు, హేమప్రభావిక్రమసింహులను జన
బూజించి వారియాజ్ఞలను శిరమున వహించి మాన్యుఁడై తనదే
బును సుఖంబుగాఁ గడపెను. ఇఁక లలితుఁడును చంపకమాలినియు
ప్రవర్తించిరనునది పతిప్రాణు లగునుత్తమలలనామణులును, పత్నీప్ర
ప్రేమించునుత్తమపురుషులకే వేద్యంబగు ననుటయతిశయోక్తి గాఁ
మాతకు సదా నివసించుటకు స్థానము ప్రతాపసింహమహారాజుగారిచి
చేతను రత్నాదేవిగారిచిత్రపటంబుచేతను నలంకృతం బగువారి
బడుకటిల్లు. ప్రతిదినము స్నానమాచరించి యారెండుచిత్రపటంబుల
పుష్పంబులచే నలంకరించుచుండెను. స్వార్థత్యాగం బైనప్రీతిచేఁ
లినీదేవిని, విమలాదేవిని ప్రేమించుచు వారు చేయుసేవాసత్కారంబు
దించుచు, నిరువురు కుమారులతోడను, కోడలితోడను రాజకార్యవ
బుల కాలోచనలు చెప్పుచు అధ్యాత్మవిచారముఁ జేయుచు, లలితక
దనస్వకీయపుత్రునివలె భావించుచుఁ గాలము గడపుచుండెను.
యను భూతమిప్పు డదృశ్యమాయెను. కనుకఁ బరులలోపంబుల వెం
తమలోపంబులను గనిపెట్టి సవరించుకొన్న, బైటిలోపంబులు క
ఇదియే మానవుల జీవితకాలమునందు సంపాదింపఁదగిన పరమోత్కృష్ట

సంపూర్ణము

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు.—1929.

# ప్రకటన

శ్రీమతి, ఆ. రాజమ్మగారిచే రచియింపఁబడిన

## సంస్కృతాంధ్ర కన్నడ గ్రంథములు



| | |
|---|---|
| [illegible]దవాళి (సంస్కృతగ్రంథము) వచనము | 1 8 |
| గీర్వాణభాషాబోధిని (సంస్కృతము) | 0 8 |
| సంస్కృతత్వరితబోధిని (సంస్కృతము) వచనము | 0 4 |
| చంపకమాలిని (నవ[illegible]) | 1 0 |
| డిటో - కన్నడ[illegible] | 1 0 |

మధువనప్రాసాదము (తెనుఁగువచనము)
ముద్రణయం దున్నది.

సుబంధుక[illegible]వృత్త (తెనుఁగువచనము)
ముద్రణయం దున్నది.

**ఏ. యస్. శివ అండు కో.,**
అడయారు, మద్రాసు

